# కాశీ మజిలీ కథలు

(AN EVERGREEN CLASSIC IN TREDITIONAL PROSE)

ఒకే సంపుటముగా

**5, 6 భాగములు**

ఇయ్యది గోదావరీ తీర స్థితంబైన
రాజమహేంద్రవరపురంబున నివశించియున్న
బ్రహ్మశ్రీ మధిర సుబ్బన్న దీక్షిత కవిచే
రచింపబడినది

---

**(ఇది తృతీయ సంపుటము)**

సరళ సుమధుర వచనం:

శ్రీ భాగవతుల సుబ్రహ్మణ్యం
భాషా ప్రవీణ

ప్రకాశకులు


ఫోన్: 2465253
గొల్లపూడి వీరాస్వామిసన్
పబ్లిషర్స్ & బుక్‌సెల్లర్స్
కోటగుమ్మం-రాజమండ్రి- 533 101

# కాశీ మజిలీ కథలు-తృతీయ సంపుటము

# కాశీ మజిలీ కథలు

## 5 వ భాగము

### 48 వ మజిలీ

శ్రీ విద్యాతీర్థకా
రావిర్భూతుం బరాత్మ నాత్మం బ్రణుతుల్
గావింతు శంకర గురు
శ్రీ విజయము గురుకటాక్ష సిద్ధి వహింపన్

(నేను జన్మసాఫల్యం చెందేలా శ్రీశంకరాచార్య చరిత్ర రచించాలని సంకల్పించాను. తత్కథాక్రమం ఎట్టిదనిన....)

గోపాలుడు వెంటరాగా, మణిసిద్ధ యతీంద్రుడు నలభై ఎనిమిదో మజిలీ చేరి, అక్కడ కాలకృత్యాలు -నిత్యానుష్ఠానం పూర్తయిన తర్వాత తనను చూడవచ్చిన చిదానంద యోగితో చాలా సేపు అద్వైతజ్ఞానాన్ని గురించి ముచ్చటించాడు. వాళ్ల సంభాషణనంతా దగ్గర కూర్చున్న గోపాలుడు వింటూన్నాడు.

వారి సంభాషణ ముగిశాక, మణిసిద్ధుడు శిష్యుని ముఖం చూసి నవ్వుతూ "వత్సా! మా ప్రసంగం నీకేమైనా అర్థమైందా? అంతా శ్రద్ధగా విన్నావు కదా!" అని అడిగాడు.

గోపాలుడు "స్వామీ! నాకేమీ తెలియలేదు. తర్వాత మీద్వారా తెలుసుకోవచ్చుననే అభిలాషతో ఇక్కడ కూర్చున్నాను. దయ ఉంచి నాకు ఆ వైనం అంతా వివరంగా చెప్పండి" అని కోరగా, ఆ యతిశేఖరుడు ఇలా అన్నాడు-

"వత్సా! ఎన్నో రోజులుగా నీకీ పుణ్యచరిత్రం చెప్పాలనుకుంటున్నాను" అనే సరికి, గోపాలుడు "స్వామీ! శంకరాచార్యులు పరకాయ ప్రవేశం

చేశారనీ, ఎవరితోనో వాదించారనీ ఒకప్పుడు నాకు మాట మాత్రంగా చెప్పారు. అప్పుడు ఆ కథకు సందర్భము అది కాదు గనుక చెప్పలేదు కాబోలు! ఇన్నాళ్లకి మళ్లీ ఆ మహాత్ముని పేరు ప్రస్తావనకు వచ్చింది కనుక ఇప్పుడైనా ఆ శంకరాచార్యుని కథ సాంతంగా చెప్పండి" అని కోరాడు.

"నువ్వన్నది నిజమే! నీకీ పుణ్యచరిత్రం చెప్పాలన్న సంకల్పం నాకు ఉంది. ఎప్పటి కప్పుడు మరేదో ప్రస్తావన వచ్చి, అది దాటవేస్తున్నాను. ఈ రోజు ఆ వృత్తాంతం చెప్తాను. సావధానంగా విను" అంటూ శంకరులకు నమస్కరించి, ప్రారంభించాడా కథ.

# శ్రీ శంకరాచార్య చరిత్రము
## ప్రథమోల్లాసము

'అధ్యాయములు' అనుటకు బదులుగా 'ఉల్లాసములు' అని మూలరచయిత వాడారు.

కథా ప్రారంభం:

**శ్రీరమణీయమై విబుధ సేవితమై ఫలపుష్ప సమధా**
**త్రీ రుహ కల్పితోపవన దీపితమై సుమనోజ్ఞ గేహ శృం**
**గార తరాం తరంబగుచుఁ గాలడి నాజను నగ్రహారమ**
**క్కేరళ దేశ మందమరుఁ గేవల మయ్యమరాలయంబనన్.**

కేరళ దేశంలో 'కాలడి' అనే అగ్రహార పరిసరాలలో 'పూర్ణ' అనే పేరు గల మహానది ప్రవహిస్తూండేది. దాని పక్కనే వృషాచలం అనే పర్వతం మీద శివుడు జ్యోతిర్లింగరూపంలో వెలసివున్నాడు. ఒకనాడు పరమశివుడు ఆ దేశపు రాజైన రాజశేఖరుడికి కలలో కనిపించి, తనకు ఆలయం –

ప్రాకారం – మంటపం నిర్మించవలసిందని ఆనతిచ్చాడు. రాజు ఆ విధంగానే నిర్మాణాలు చేశాడు. అప్పట్నుంచీ కాలడి గొప్ప పుణ్యక్షేత్రం అయింది.

ఆ అగ్రహారంలో సకల విద్యాప్రవీణుడైన విద్యాధిరాజు అనే బ్రాహ్మణుడుండేవాడు. ఆయన ప్రతిరోజు ఆ నదిలో స్నానం చేసి భక్తిగా శివుణ్ణి అర్చించేవాడు. కొంతకాలానికి ఆయనకు ఒక కుమారుడు జన్మించాడు. ఆ పిల్లవాడికి 'శివగురు'వని పేరు పెట్టారు.

## శివగురుని కథ

దివ్య తేజస్సంపన్నుడైన ఆ బాలుడు, బాల చంద్రునిలా దినదినాభివృద్ధిచెంది, ఎనిమిదేళ్ల వాడయ్యాడు. అప్పుడా విద్యాధిరాజు తన పుత్రునికి ఉపనయనం జరిపించి దగ్గర్లో ఉన్న గ్రామంలో నివశించే ఒక పండితుని దగ్గర విద్యాభ్యాసం కోసం పంపించాడు.

శివ గురుడు తన గురువును శివునిగా భావించి, బ్రహ్మచర్యదీక్ష పాటిస్తూ గురుశుశ్రూష చేస్తూ, 'జ్ఞానంలో శివుడితడేనా?' అన్నట్లుగా విద్యాభ్యాసం కొనసాగిస్తున్నాడు. ఏకసంథాగ్రాహి కావడంతో, అతి కొద్ది కాలంలోనే వేదశాస్త్రాలలో పాండిత్యం సంపాదించాడు శివగురుడు.

ఒకరోజు గురువు శిష్యులందరికీ వేదంలోని అర్థాలను విశదం చేసిన తరువాత, శివగురుడు ఆచార్యునితో "అయ్యా! వేదాల్లో మొదట కర్మ ప్రాధాన్యత చెప్పారు. చివరికి కర్మవలన ప్రయోజనం ఏమీ లేదని – అది మోక్ష సాధనం కాదని అన్నారు. చివరకు జ్ఞానం వల్లనే మోక్షం ప్రాప్తిస్తుందీ అంటే– కర్మవల్ల పొందే ఫలితం ఏమిటి? ఇలా చెప్పడానికి కారణం ఏమిటి?" అనేది వివరించమన్నాడు.

అందుకు ఆ గురుదేవుడు ఎంతో ఆనందించి "వత్సా! నీవు అడిగిన ప్రశ్నలో చాలా గూఢమైన అర్థం ఉంది. విను! జనన మరణాలకు - సుఖ దుఃఖాలకు కారణం - కర్మయే! కర్మవల్లనే జన్మం. కర్మ అజ్ఞాన మూలకం. అజ్ఞానం మాయవల్ల కలుగుతోంది. కనుక కర్మవల్ల పుట్టిన జీవికి అజ్ఞానం సహజం. జ్ఞానం సంపాదించేగాని వచ్చేదికాదు. సహజగుణాన్ని విడవడం ఎవరికో గాని సాధ్యంకానిది. ఈ దేహధర్మాలు ఎంత వారినైనా మోసం చేస్తాయి. ఈ అజ్ఞానాన్ని విడిచే సాధనం, అనుభవ పూర్వకంగా తెలుసుకోవలసి ఉంటుంది" అని చెప్తూ "నాయనా! నువ్వు వచ్చి చాలాకాలం అయింది. నీ కోసం నీ తల్లిదండ్రులు - బంధువులు ఎదురుచూస్తుంటారు. ఇక-వెళ్లి వారికి ఆనందం కలిగించి, వివాహం చేసుకుని సుఖంగా ఉండు" అని చెప్పాడు.

ఇది విని శివగురుడు ఆచార్యునితో "ఆర్యా! మీరు చెప్పింది నిజమే! కాని, బ్రహ్మచారి వేదాధ్యయనం చేశాక, గృహస్థే ఎందుకు కావాలి? ఇతర మార్గాలను ఎందుకు అనుసరించకూడదు? వివాహంవల్ల అంతా దుఃఖమే తప్ప సుఖం ఎక్కడ? కనుక నేను సన్యాసం స్వీకరించి, చదివింది మర్చిపోకుండా అనుభవగోచరంగా తిరిగి వేదపఠనం చేస్తూ మీ దగ్గరే ఉంటాను. యాగాలు చేస్తూ పుణ్యం సంపాదిస్తాను. ఈ 'కామము' (కోరిక) లనేవి ఎంతగా అనుభవించినా, ఇంకా - ఇంకా మొలకెత్తుతూనే ఉంటాయి గాని, తీరవు కదా! కనుక - ఈ బ్రహ్మచర్యాశ్రమం నుంచి నేరుగా తురీయా ('సన్యాసా) శ్రమంలోనికి వెళ్లడానికి నాకు అనుమతి నివ్వండి" అని పలికి వైరాగ్యం ప్రకటించాడు.

ఆ యువ శివగురుని వైరాగ్యప్రవృత్తికి ఆచార్యుల వారెంతో ఆశ్చర్యపోయారు. నీ కుమారుని 'మనఃస్థితి ఇలా వుంది' అంటూ ఆ విరాగి యొక్క తండ్రికి ఆ విషయం వార్త పంపేటంతలో, విద్యాధిరాజే దైవికంగా అక్కడకు రావడం తటస్థించింది. విషయమంతా వివరించాడు ఆచార్యుడు.

అది విన్నాక, విద్యాధిరాజు తన కుమారుని ఇంటికి తీసుకెళ్లి తగిన కన్యతో వివాహం జరిపించేస్తానని అన్నాడు. శివగురుడు మళ్లీ తన అభిప్రాయాన్ని తండ్రితో కూడా చెప్పాడు. కుమారుని బుద్ధిమరల్పగలరీతి ఏదో బోధపడక, విద్యాధిరాజు కలవరపడుతూంటే, ఆచార్యుడు శివగురుడిని ఏకాంతానికి తీసుకువెళ్లి అతని చెవిలో ఒక ఉపదేశాన్ని చేశాడు. ఆ ఉపదేశాన్ని జాగ్రత్తగా ఆకళింపుచేసుకున్నాక, శివగురుడు మారు మాట్లాడకుండా ఇంటికి తండ్రితోపాటు వెళ్లడానికి ఒప్పుకొన్నాడు. విద్యాభ్యాసం పూర్తి చేసి, సకల విద్యలలోను నిష్ణాతుడైన శివగురుని చూసి బంధు జనులంతా ఆనందించసాగారు.

తండ్రి కూడా పుత్రుని పాండిత్యం, తర్కవ్యాకరణాది శాస్త్రాలలో ఐతేనేం కణాద, భట్టపాద, ప్రాభాకర, గౌతమఋషుల మత సిద్ధాంతాల్లో ఐతేనేం - సంపాదించిన జ్ఞానానికి పొంగిపోయాడు. అచిరకాలంలోనే శివగురుని ప్రజ్ఞాపాటవాలు బంధుజనులవల్ల ఎక్కడెక్కడి వారికో తెలిసి, దూర ప్రాంతాలనుంచి సైతం 'కన్యల నిచ్చి పెళ్లి చేస్తామంటూ' ఎందరెందరో ధనికులైన బ్రాహ్మణులు విద్యాధిరాజు దగ్గర ప్రతిపాదించసాగారు. వివాహానికి ఒప్పించవలసిందని అతడి అనుమతిని వేడుకున్నారు.

# శివగురుని వివాహం

ఎంతో మంది పండితులు, తమ కుమార్తెల అందచందాల గురించీ విద్యావినయ సంపన్నత గురించీ చెప్తూంటే, అందరి చరిత్రలూ విని, తనకు నచ్చిన మఖపండితుడనే విద్వాంసుని పుత్రికని తమ కుమారునికి చేసుకోడానికి సమ్మతించాడు విద్యాధిరాజు. ఆ పండితుని పుత్రిక పేరు 'సతి'

తర్వాత దైవజ్ఞులు సూచించిన ఒక శుభముహూర్తంలో వివాహం జరిగిపోయింది. కొంతకాలం తర్వాత శివగురుడు భార్యతోగూడి ఎన్నెన్నో యజ్ఞాలు నిర్వహించి 'జంగమకల్పద్రుమం' అని ప్రఖ్యాతి పొందాడు. అయినప్పటికీ గర్వించక, వినయంగా మెలగే ఆ పుణ్యాత్మునికి నిత్యకృత్యంగా తోచేవివీ: వేదపఠనమే నియమం శాస్త్రం ఏదైతే విధించిందో అవే ఆచరణ మార్గాలు. పరోపకారమే ఒక వ్రతం.

అటువంటి మహానుభావునికి ఎందులోనైనా లోటు కల్గుతుందా? రూపంలో మన్మధుడిగా, విద్యల్లో బృహస్పతిగా, క్షమలో ధరిత్రిగా, ధనంలో కుబేరుడిగా వెలుగొందుతూ - అందరిచేతా కీర్తించబడుతూ - అయినప్పటికీ కించిత్తయినా గర్వాన్ని పొందక శివగురుని జీవితం సాగిపోతోంది. ఇంతటిపుణ్యాత్మునికీ చాలాకాలం సంతానం కలగలేదు. ఆ చింతతో ఒకరోజు అతడు తన భార్యతో "సాధ్వీ! మనకు జీవితంలో సగంకాలం పూర్తయింది. కాని, ఇంతవరకు సంతానం మాత్రం కలగలేదు. ఎన్ని సంపదలున్నాగాని, సంతానమన్నది లేకపోతే, ఆ సిరులేవీ సంతోషాన్ని కలిగించవు. ఎంత జ్ఞానవంతుడైనప్పటికీ - ఈ సంసారం అనే సముద్రాన్ని తరించడం కష్టం. కనుకనే- నేను మొదట్లో వివాహానికి సమ్మతించలేదు.

అయినప్పటికీ మా గురుదేవులు లోకవిఖ్యాతి చెందే పుత్రుడొకడు ఉదయిస్తాడనీ- అతడివల్ల లోకోపకారం జరగవలసి ఉందనీ నాకు చెవిలో రహస్యం చెప్తూ ప్రత్యేకంగా ఆనతిచ్చేసరికి కాదనలేకపోయాను. నిన్ను వివాహం చేసుకున్నది ఈ కారణం చేతనే. అంతేగాని, కామసుఖాలు అనుభవించడం నాధ్యేయం కాదు. నిష్కామయోగిలా వుండదలిచిన నాకు

ఎటువంటి స్థితి సంప్రాప్తించిందో చూడు! ఇటు సంతానమూ లేకపోయె! అటునా వైరాగ్యమూ నెరవేరకపోయె! రెంటికీ చెడ్డాను" అని విచారించాను.

భర్తకు అన్ని విధాలా అనుకూలవతి అయిన ఆ ఇల్లాలు "స్వామీ! దీని గురించి మీరింతగా వ్యధ చెందడం ఎందుకు? భక్తులందరికీ కల్ప వృక్షమైన ఆ చంద్రశేఖరుడనే ఆశ్రయిద్దాం మనం! తప్పకుండా ఫలితం లభిస్తుంది. ఉపమన్యుని కథే మనకు ప్రమాణం" అంటూ ఆ కథ నిట్లా చెప్పసాగింది.

## ఉపమన్యుని కథ

పూర్వం ఉపమన్యుడు అనే మునిబాలకుడు ఆడుకుంటూ ఒకచోట పాలు త్రాగుతున్న కొందరు ముని బాలకులతో పోట్లాడి తల్లిదగ్గరకు వచ్చి "అమ్మా! నేను ఆడుకోవడానికి వెళ్లినప్పుడు కొందరు పిల్లలు తెల్లనివేవో త్రాగుతున్నారు. నాకు కొంచెం ఇమ్మని అడిగితే వెక్కిరించారు. వాటి పేరు ఏమిటి?" అని తల్లిని అడుగగా "నాయనా! వాటిని పాలు అంటారు" అని చెప్పింది. అవి గోవులనుండి వస్తాయని కూడా చెప్పింది.

ఆ మాటలు విని ఆ బాలుడు "నాకుపాలు కావాలి. తెచ్చిమ్మని" అడుగగా తల్లి తమ దారిద్ర్యానికి బాధపడి తెల్లని పిండిని నీటిలో కలిపి ఇచ్చినది. వాటిని త్రాగి ఆ బాలుడు మళ్ళీ ఆ ముని బాలకుల వద్దకు పోయి నేను కూడా పాలు త్రాగుతున్నానని చెప్పగా వారు పరీక్షగా చూసి "ఇవి పిండి కలిపిన నీళ్ళే కానీ పాలుకావు అని చెప్పారు. పాలెక్కడ, నీవెక్కడ. నీవు దరిద్రుడవని పరిహాసం చేశారు".

వారి మాటలు విని ఉపమన్యుడు సిగ్గుపడి తల్లిదగ్గరకు వచ్చి "అమ్మా! నీవు నాతో పాలని చెప్పి పిండి కలిపిన నీటిని ఇచ్చినావు. నన్ను మోసం

చేశావు. నీ వల్ల నేను అవమానం పొందాల్సి వచ్చింది. వారు నన్ను దరిద్రుడా నీవెక్కడ? పాలెక్కడ అని పరిహసించారు. మనము దరిద్రులమా? దరిద్రం అనగా ఏమి?" అని ఉపమన్యుడు తల్లిని ప్రశ్నలతో వేధించసాగాడు. దానికి ఆమె 'ఏమీ లేకపోవడమే దరిద్రం' అని చెప్పింది. అయితే "అమ్మా! ఏమి చేస్తే ఈ దరిద్రం పోతుందో చెప్పు! ఆ విధంగా చేస్తాను" అన్నాడు. దానికి ఆ తల్లి "నాయనా! సర్వసంపన్నుడైన శివుని ఆరాధిస్తే దరిద్రం పోతుంది" అని చెప్పింది. అప్పుడు ఉపమన్యుడు తల్లితో "ఈశ్వరుడు ఎక్కడున్నాడో చెప్పు. ఆశ్రయిస్తాను" అనగా ఆమె గుడిలో ఉన్న శివలింగాన్ని చూపింది. ఆ బాలుడు గుడిలోకి వెళ్లి తలుపులు మూసుకొని ఆ లింగాన్ని రెండు చేతులతో పట్టుకొని "స్వామీ! నీవు సమస్త లోకాలకూ నాయకుడవనీ, కోరిన వెంటనే కోరికలు తీర్చేవాడవని మా అమ్మ నాతో చెప్పినది. నీవు మాత్రం సంపదలు కలిగి ఉండి మాకు ఏమీ లేకుండా చేయడం న్యాయమా? నేను మొన్న పాలు లేకపోవడంతో సాటి మునిబాలకులవద్ద ఎంత అవమానం పాలైనానో చూశావా? అదే నీ కుమారులంకు వస్తే నువ్వు ఊరుకుంటావా నాకు తండ్రిలేకపోవడం వల్లనే కదా నిన్నింతగా బ్రతిమాల వలసి వచ్చింది. తండ్రీ ఉంటే ఆయనే నాకు పాలు తెచ్చి ఇచ్చేవాడు కదా! తండ్రి లేని వారికి నీవే తండ్రివని మా అమ్మ చెప్పింది. మాట్లాడవేమి తండ్రీ? నామీద కోపమా? కోరిన వెంటనే కోరికలు తీరుస్తావని అమ్మ చెప్పడం వల్లనే కదా నేను ఇక్కడకు వచ్చాను? నీ మనసు మారిందా ఏమి? నిజం చెప్పు. నీకు నా పట్టుదల గురించి తెలియదు," అంటూ ఎంతగా వేడుకున్నప్పటికీ

శివుడు ప్రత్యక్షం కాకపోవడంతో ఇక లాభం లేదనుకొని శివలింగంపైపడి తల పగలకొట్టుకునేంతలో శివుడు ప్రత్యక్షమై ఉపమన్యుడిని ఎత్తుకొని “నాయనా! నీ మాటలు విని నేను వచ్చేలోగా ఇంత తొందర పడ్డావెందుకు? నీ కోరిక ఏమిటో చెప్పు? వెంటనే తీరుస్తాను” అన్నాడు.

దానికి ఉపమన్యుడు ఎంతో సంతోషించి “తండ్రీ! నాకేమీ అక్కరలేదు. నాకు తండ్రిలేడు కాబట్టి నేను పిలిచినప్పుడల్లా వచ్చి నా పనులు చేసిపెట్టు. మా ఇంట్లో పాలు సమృద్ధిగా ఉండేటట్లు చూడు” అన్నాడు. శివుడు ఆ బాలునికి ఆ వరాలిచ్చి అంతర్ధానమయ్యాడు. తర్వాత ఉపమన్యుడు తల్లి దగ్గరకు వచ్చి జరిగినదంతా వివరించాడు. ఆమె ఆనంద, ఆశ్చర్యాలతో శివుని స్తుతించింది. ఉపమన్యుడు శివభక్తుడై మహర్షిగా ప్రఖ్యాతిగాంచాడు. “అలాంటి మహానుభావుడు భక్తులపాలిటి కల్పవృక్షంలా ఉండగా మనం బాధపడడం ఎందుకు? ఆయన మన కోరిక తప్పక తీరుస్తాడు” అన్నది. తరువాత శివగురుడు భార్యతో సహా శివుని గురించి తపస్సు చేస్తూ ఆ పరమ శివుని దీక్షతో ఆరాధించాడు.

ఈ విధంగా అత్యంత నియమంతో తపస్సు చేస్తుండగా ఈశ్వరుడు కరుణించి శివగురుడికి బ్రాహ్మణుని రూపంలో కలలో కనిపించి “ఆర్యా! నీకేం కావాలో కోరుకో”మ్మనగా “పుత్రుడు కావాలని” శివగురుడు కలలోనే కోరుకున్నాడు.

అప్పుడు శివుడు శివగురునితో “అల్పాయువు కలిగి గుణ సంపన్నుడు, లోక విఖ్యాతిగాంచే కొడుకు ఒక్కడు చాలా? లేక దీర్ఘాయువు, అల్పబుద్ధులు, దుర్గుణాలు కలిగిన కొడుకులు ఎక్కువ మంది కావాలా?” అని అడిగాడు. దానికి శివగురుడు “అల్పాయువు కలిగినప్పటికీ లోక విఖ్యాతిగాంచే కొడుకు ఒక్కడు చాలు” అని కోరుకున్నాడు.

శివగురుని కోరిక తీర్చి శివుడు అంతర్ధానమయ్యాడు. వెంటనే శివగురుడు మేల్కొని భార్యకు కలలోని వృత్తాంతమంతా వివరించాడు. తమకు మంచి

కుమారుడు జన్మించగలడని విని ఆ దంపతులు ఎంతో సంతోషించి కఠోర నియమాలు చాలించి బ్రాహ్మణ సంతర్పణలు చేసి వారి ఆశీర్వాదాలు పొందారు.

పరమేశ్వరుడు వారికి ఆ వరం అనుగ్రహించాడు గనుక - విప్రభుక్తావశిష్టమైన ఆహారాన్ని ఆ దంపతులు పరమేశ్వర ప్రసాదంగా గ్రహించి సంతర్పణ ఫలితం సంపూర్ణంగా పొందారు.

## సతీదేవి గర్భ వర్ణన

**ఆ** ప్రసాద భక్షణతోనే, శైవతేజం ఆ అన్నంలో ప్రవేశించి ఉన్నందువల్ల, మొదట అది శివగురుని శరీరంలో వ్యాపించి, తర్వాత అతని భార్యలోనూ ప్రవేశించింది. ఆ వనితారత్నం దేహంలో గర్భచిహ్నాలు పొడసూపాయి. ఒక వింత కాంతి శరీరమంతా అలుముకున్నది.

ఆమెకు పుట్టే కుమారుడు మున్ముందు శూన్యమతవాదాలన్నీ ఖండిస్తాడనీ- గంధర్వులు, దేవతలు జయజయధ్వానాలతో అతన్ని స్తుతిస్తున్నారనీ - వాదప్రతివాదులను ఓర్పుతో చూసి విద్యాపీఠం అధిష్టిస్తున్నాడనీ ఆమెకు స్వప్నాలు కలిగాయి.

## శ్రీ శంకరాచార్యుని అవతార ఘట్టం

**ఆ**కాశ మార్గాన దివ్యదుందుభులు మ్రోగుతూండగా - సూర్యాదిగ్రహాలు ఉచ్ఛస్థితిలో ఉండగా - పుష్పవృష్టి కురుస్తుండగా - వాయువులు దివ్యసుగంధాలను వెదజల్లుతుండగా - చెట్లు అపూర్వంగా పుష్పించి, ఫలించి భారమైన కొమ్మలతో వంగి ఉండగా - నదులు నిర్మలమైన జలాలతో ప్రవహిస్తుండగా - జంతువులు పరస్పర వైరభావం విడనాడి సంచరిస్తుండగా శ్రీశంకరాచార్యుడు భువిన అవతరించాడు. అదొక రమణీయ ఘట్టం!

ఆ బాలుడు సర్వవిద్యల్లోను శారదాదేవిని మించగలడని- ఆ చంద్రతారార్కమైన కీర్తి నార్జించగలడని దైవజ్ఞులు చెప్పారే తప్ప ఆయువు గురించి చెప్పలేదు.

## శంకరుని రూపము పుణ్యాంగనలు వర్ణించుట

**శి**వగురుడు ఆ బాలుడికి జాతకర్మలు నిర్వర్తించి శ్రీశంకరుడని నామకరణం చేశాడు. ఆ ఉత్సవానికి వచ్చినవారు ఆ బాలుడిని చూచి "దీపం లేకుండానే ఇంటికి వెలుగును ప్రసాదించేవాడనీ, చూసే వారి కళ్ళకు ఆహ్లాదం కలిగిస్తున్నాడనీ, వీడిని చూస్తుంటే కళ్ళు చల్లబడుతున్నాయనీ, శివగురుడు వీడికి తగిన పేరే పెట్టాడనీ, ఆ బాలకుడి శరీరంపైగల చంద్రవంక- నేత్రచిహ్నాలు, త్రిశూలాకృతులను పరిశీలించి ఇతడు తప్పకుండా శంకరుని అవతారమే అనీ, ఈ శిశువు లోకవిఖ్యాతి చెందుతాడనీ, ఇలాంటి గుణాలు సామాన్యులకు ఉండవనీ" అన్నారు. శంకరుడు దినదిన ప్రవర్ధమానంగా పెరుగుతూ ఆరు మాసాలకే చూడడం, మాట్లాడడం, నడవడం నేర్చుకున్నాడు.

## శంకరుని బాల క్రీడలు

**శం**కరుడు సంవత్సరం నిండేసరికి స్పష్టంగా మాట్లాడేవాడు. సంవత్సరం వయస్సుగల బాలుడు ఎంతో వినయంగా, సంస్కారవంతంగా మాట్లాడడం అందరికీ విస్మయాన్ని కలిగించింది. రెండవ ఏడు వచ్చేసరికి, సమస్త భాషలు చదవడం వ్రాయడం నేర్చుకున్నాడు. మూడో ఏడు వచ్చేసరికి శ్రవణం లేకుండానే కావ్యనాటక, పురాణాలు, గ్రంథాలలోని విశేషాలను స్వయంగా తెలుసుకున్నాడు. శంకరుని విద్యాగ్రహణ శక్తి చూసి శివగురుడు అతనికి ఒకమంచి గురువును నియమించాడు. ఏకసంథాగ్రాహి అయిన శంకరుడు ఆ గురువుకు ఏ మాత్రం శ్రమ కలిగించకుండా మణి దర్పణమువలె విద్యలను నేర్చుకొంటూ, గురువుగారు పాఠాలు చెప్పేటప్పుడు పొరపాట్లు వస్తే అతని తప్పులను సరిదిద్దేవాడు.

బృహస్పతిని తిరస్కరించే బుద్ధిబలము గల శంకరుని ముందు ఎంతటి పండితుడైనా నోరు మెదల్చుడానికి భయపడేవారు. చిన్నతనం నుండే శంకరుడు కుత్సిత మతాలను ఖండిస్తూ, స్వంతమతాన్ని ప్రతిపాదించేవాడు.

శివగురుడు తన కుమారుని ప్రతిభావిశేషాలను తలచుకొని ఆనందించేవాడు. "వీడి వయస్సెంత? విద్యాగ్రహణ శక్తి ఎంత? వీడికి గురువులు నిమిత్తమాత్రులేకానీ ప్రధానములు కాదు" అనుకున్నాడు.

శంకరునికి ఉపనయనం చేయకపోతే వేదపఠనాధికారం ఉండదు. కాబట్టి గ్రహణశక్తిని బట్టి వీడికి ఉపనయనం చేయాలనుకున్నాడు. కానీ ఆ కోరిక తీరకుండానే శివగురుడు మరణించాడు. సతీదేవి భర్త కళేబరముపైపడి "నీవు లేకపోతే మాకు దిక్కెవ్వరూ? పిల్లవాడి ముద్దుముచ్చట్లు చూసేవారు ఎవ్వరూ?" అంటూ దుఃఖించసాగింది.

దుఃఖిస్తున్న తల్లిని చూసి శంకరుడు "జననీ! పుట్టిన ప్రతివారూ మరణించక తప్పదు. మనం మాత్రం ఎల్లకాలం జీవించగలమా? పరిపక్వం చెందినపండు చెట్టునుండి రాలినట్లు మనుషులు కూడా కాలాన్ని అనుసరించి నడుస్తారు. దీనికంతటికీ కారణం కర్మ, మా తండ్రి కృతకృత్యుడై స్వర్గాన్ని అలంకరించాడు. ఈ విషయం గురించి చింతించడం వల్ల ప్రయోజనం లేదు. నేనున్నంత వరకూ నీకే కొరతారాదు దుఃఖాన్ని విడిచి వైరాగ్యాన్ని అవలంబించమని" చెప్పిన కుమారుని మాటలకు సతీదేవి ఆశ్చర్యపడి బాధపడడం మానేసి, శివగురుని దహన సంస్కారాలను జ్ఞాతులచే చేయించింది.

సతీదేవి కుమారుని సంరక్షిస్తూ ఒక సంవత్సరం అతికష్టం మీద గడిపి, తర్వాత శంకరునికి వైభవంగా ఉపనయనం చేయించింది. శంకరుడు గురుకుల వాసం చేసి వేదవేదాంగాలను చదవడం ప్రారంభించాడు.

## శంకరుని విద్యాభ్యాస వైచిత్ర్యము

**శ**ంకరునితో విద్యాభ్యాసం చేస్తున్న సహాధ్యాయులు ఒక రోజు రహస్యంగా ఈ విధంగా మాట్లాడుకుంటున్నారు. "ఇది ఏమి విచిత్రమో కానీ శంకరుడు చూడడానికి జానెడు కూడా లేడు. కానీ వీడు ఈ విద్యలన్నీ ఎప్పుడు నేర్చుకున్నాడో, ఏమో? వాడి ముందర నేనేమాత్రం పనికిరాను.. మొన్న గురువుగారు పెట్టిన పరీక్షలో నాలో తప్పులు వెదికి వాటిని చక్కగా

వివరించి చెప్పాడు. మరో రోజు వేదమును ఘనములో స్వస్తి చెప్పమనగా శంకరుడు చేసిన విచిత్రావధానమును ఏమని చెప్పగలము? అతడు సరిదిద్దిన తప్పులు నాకే కాదు గురువుగారికి కూడా తెలియవు".

ఇంతలో మరొక సహాధ్యాయి వచ్చి శంకరుని మహిమను గురించి ఇలా చెప్పడం ప్రారంభించాడు. "నిన్నటిరోజు శంకరుడు ఒక పేద బ్రాహ్మణుడి ఇంటికి వెళ్లి భిక్ష అడిగాడు. పాపం ఆ బ్రాహ్మణుడు చాలా పేదవాడు. ఆ ఇంటి ఇల్లాలు వచ్చి "అయ్యా! మా ఇంట్లో ఏమీ లేక మూడు రోజులనుండి ఉపవాసం చేస్తున్నాము. మొదటగా మీరు మా ఇంటికే వచ్చారు. ఇంకోచోట కూడా మీకు భిక్ష లభించదు. మిమ్మల్ని ఊరికే పంపడం మాకు తగదు. కాబట్టి ఈ ఒక్క ఉసిరికాయను మాత్రం తీసుకోండి. మా దగ్గర ఉన్నది ఇదే" అంటూ బాధపడింది.

"ఈ అగ్రహారంలో ఇంత దరిద్రులు కూడా ఉన్నారా? పాపం ఆ పుణ్యాత్మురాలి మనస్సు ఎంత బాధపడిందో కదా!" అనుకుంటూ

భక్తిగా ఆ ఇల్లాలు ఇచ్చిన ఉసిరికాయను తీసుకుని శంకరుడు వారికి గల దారిద్ర్యానికి బాధపడుతూ వృత్తపద్య రత్నాలతో మహాలక్ష్మిని స్తోత్రం చేసి సాక్షాత్కరించిన ఆ మహాదేవిని "వారి దారిద్ర్యమును తొలిగించమని" వేడుకున్నాడు. లక్ష్మీదేవి కరుణించి ఆ బ్రాహ్మణుడి ఇంట్లో బంగారు ఉసిరికాయల వర్షాన్ని కురిపించింది. ఇది చూసి ఆ ఇల్లాలు ఆనందం పట్టలేక ఇరుగుపొరుగు వారికి ఈ విషయం గురించి చెప్పింది.

"మనము కూడా శంకరుని ఆశ్రయిద్దాము. అతని చేతిలో లక్ష్మి ఉంది. ఎప్పుడైనా మనపై దయ రాకపోతుందా? కేవలం ధనం మాత్రమే ఏమిటి? అతని అనుగ్రహమే ఉంటే మనకు శాశ్వత సుఖపదమే కలుగుతుంది కదా!" అనుకున్నారు. "శంకరుణ్ణి కేవలం సహాధ్యాయిగా మాత్రమే కాకుండా దైవంగా భావిద్దాం! మనము కూడా అతనితో పాటుగా అతనింటికి పోదాము" అనుకున్నారు.

ఈ విధంగా కథ చెప్పిన మణిసిద్ధుడు కాలాతీతం కావడం వలన మిగిలిన కథను అవతలి మజిలీలో ఈ విధంగా చెప్పడం ప్రారంభించాడు.....

# కాశీ మజిలీ కథలు

## 4రివ మజిలీ

### ద్వితీయోల్లాసము

ఆ విధంగా శంకరుడు పూర్వజన్మప్రభావం వలన ఏడవ ఏడు ముగిసేవరకు గురుకులంలో విద్యను అభ్యసించి, సర్వవిద్యలలోను పాండిత్యమును సంపాదించి, సాక్షాత్తు సరస్వతీదేవి అవతారమని అందరూ పొగుడు తుండగా శంకరుడు తల్లికి నమస్కరించాడు.

### శంకరుని మాతృసేవ

సతీదేవి కుమారుని అద్భుతమైన విద్యాగ్రహణ సామర్థ్యానికి ఆనందపడి కొడుకుని దీవించి, తలను ముద్దాడి, గారాబంచేసి విద్యాభ్యాస కాలంలోని విశేషాలను అడిగి తెలుసుకున్నది. శంకరుడు తల్లి అడిగిన ప్రశ్నలకు జవాబులు చెప్పి ఆమెకు సంతోషాన్ని కలిగించాడు. తల్లిని సేవించుకోవడం జనులకు అత్యంత ప్రధానకర్తవ్యమని బోధించడానికి కొన్ని రోజులు తల్లిదగ్గర ఉండి, ఆమెకు సేవలు చేస్తూ, సూర్యాగ్నులను ఆరాధిస్తూ ఇంట్లోనే ఉండిపోయాడు. వయస్సులో చిన్నవాడైనా, విద్యా విషయంలో అధికుడైన శంకరుణ్ణి చూసి అందరూ గౌరవించేవారు. ఒక రోజు సతీదేవి మండు వేసవికాలంలో మిట్టమధ్యాహ్న సమయంలో పూర్ణానదికిపోయి. నీళ్లు తెస్తుండగా, స్వభావరీత్యా మృదువైన ఆమె పాదాలు ఎండకు వేడెక్కి ఉన్న ఇసుకలో తొట్రుపడసాగాయి.

అది చూసిన కొందరు శంకరుని దగ్గరకు వెళ్లి "అయ్యా! సతీదేవి వేడెక్కి ఉన్న ఇసుకలో నడవలేక ఇబ్బంది పడుతున్నది.. తొందరగా వెళ్ళి

తీసుకురండి" అని చెప్పగా, అది విని శంకరుడు తామరాకులను తీసుకొచ్చి, వాటిని నేలపై పరిచి, ఆ ఆకులపై తల్లిని నడిపిస్తూ ఇంటికి తీసుకొచ్చాడు.

ఆ రాత్రి శంకరుడు నదిని తన ఇంటికి దగ్గరగా ప్రవహింపచేయాలని వృత్తపద్య, రత్నాలతో గంగాదేవిని స్తుతించాడు. శంకరుని భక్తికి మెచ్చి మరుసటిరోజు నుండి పూర్ణానది ఆ ఇంటికి దగ్గరగా ప్రవహించసాగింది. ఊరికి దూరంగా ఉండేనది అగ్రహారానికి దగ్గరగా ప్రవహించడం చూసి అందరూ 'ఇది శంకరుని మహిమే'నని కీర్తించసాగారు.

ఈ విధంగా శంకరుని మహిమ గోపాలకృష్ణుని వంటిదని దేశమంతా వ్యాపించింది.

## రాజశేఖరుడను రాజు శంకరుని ఆశ్రయించుట

అప్పుడు ప్రజల్ని పాలించేరాజు రాజశేఖరుడు శంకరుని విఖ్యాతి విని అతన్ని చూడాలనే కోరికతో తన ప్రధానమంత్రి సుబుద్ధిని కాలడి అగ్రహారము పంపి, శంకరుని తీసుకొని రమ్మన్నాడు. సుబుద్ధి శంకరుని దగ్గరకు వెళ్ళి 'మహాత్మా! నేను రాజశేఖరుడు అను రాజు దగ్గర ప్రధానమంత్రిని. ఆ మహారాజు భుజబలంతో భూభాగాన్నంతా జయించాడు. దానగుణంలో కర్ణుని మించినవాడు. అతడు తన సభామండలంలో నిరంతరం పండితులతో వాదాలు చేస్తూ, ప్రసంగాలు వింటూ ఆనంద పడుతుంటాడు. మహారాజు పండితప్రియుడు. సరసకవితా దురంధరుడు. ఆయన మీ దర్శనం కోసం ఎదురు చూస్తున్నాడు. ఈ ఏనుగు నెక్కి సభాభవనానికి విచ్చేయండి" అన్నాడు.

దానికి శంకరుడు "సుబుద్దీ! మీ రాజు గుణవిశేషాలు విని ఎంతో ఆనందిస్తున్నాను. మేము భిక్షాటనం చేస్తూ, వేదాధ్యయనం చేస్తూ, బ్రహ్మ చర్యం పాటిస్తున్నాము. అటువంటి మాకు కుత్సితభోగాలపై ఆసక్తిలేదు. మా ప్రజ్ఞావిశేషములు చూపి ధనము సంపాదించి ఏమి చేసుకుంటాము? కావున ఈ మాటలు నా మాటలుగా రాజుకు చెప్పు" అన్నాడు.

"రాజు ప్రజలకు తగిన వృత్తులను ఏర్పరచి, వర్ణాశ్రమ ఆచారాలను నియమాలను తప్పకుండా పాటిస్తూ ధర్మంగా పాలించాలి. ప్రజలు చేసే

సుకృత దుష్కృతాలలో ఆరవవంతు రాజుకు చేరుతాయి. ఎటువంటి వ్యసనాలు లేని రాజు సుఖము పొందుతాడు. ఇది నా ఉపదేశమని రాజుకు చెప్పు" అన్నాడు. సుబుద్ధి వెంటనే రాజశేఖరుని దగ్గరకు వెళ్ళి శంకరుడు చెప్పిన మాటలు చెప్పాడు.

"రాజా! అతడు సామాన్యుడు కాదు! అరవైనాలుగు విద్యల్లోని రహస్యాలను గ్రహించినవాడు. ఏడోఏటనే ఒక విప్రకాంత పేదరికాన్ని బాపినవాడు. తుచ్ఛమైన సిరులకు ఆశపడి, మనం పిలవగానే వచ్చేస్తాడని ఎలా అనుకున్నావు? అటువంటి వాడ్ని చూడాలనుకుంటే- మనమే వెళ్దాం! పద" అన్నాడు మంత్రి.

రాజు ఆ మాటలు విని ఎంతో సంతోషించి శంకరుని ఎలాగైనా చూడాలని నిశ్చయించుకుని అగ్రహారానికి వెళ్ళి బాలుడైన శంకరునికి అనేక సాష్టాంగ నమస్కారాలు చేశాడు. శంకరుడు రాజును దీవించి అతని రాకకు కారణం అడిగి తెలుసుకున్నాడు. అప్పుడు రాజు పదివేలదీనారములు అతని ముందుంచి "మహాత్మా! నేనెంతగానో కష్టపడి మూడు నాటకాలు రాశాను. మీరు వాటిని చదివి గుణదోషాలు వివరిస్తారని వచ్చాను" అంటూ అతని అనుమతితో ఆ మూడు నాటకాలను సంక్షిప్తంగా చదివి వినిపించాడు.

రసపూరితాలై, మనోహరంగా ఉన్న ఆ నాటకాలు మూడింటినీ విని శంకరుడు ఎంతగానో మెచ్చుకున్నాడు. రాజు కోరిక ఏమిటో అడిగి తెలుసుకున్నాడు.

"రాజా! నువ్వు తెచ్చిన ధనం మాకవసరం లేదు. ఈ అగ్రహారంలోని బ్రాహ్మణులకు దానిని పంచిపెట్టు. నీకు తప్పకుండా కుమారుడు కలుగుతాడు" అని రహస్యంగా అతని చెవిలో "పుత్రకామేష్టిచేయ" మని చెప్పాడు. రాజు ఇంటికి వెళ్ళి పుత్రకామేష్టి చేసి కుమారుణ్ణి పొందాడు.

## శంకరుని వద్దకు మహర్షులు వచ్చుట

**ఒ**కరోజు శంకరుడు శిష్యులతో కలిసి విద్యావ్యాసంగము చేస్తున్న సమయంలో ఉపమన్యుడు, దధీచీ, గౌతముడు,అగస్త్యుడు వంటి ప్రముఖులు రావడాన్ని దూరం నుంచే గమనించి శిష్యులతోసహా వారికి ఎదురెళ్ళి, స్వాగతం పలికి ఆతిథ్యం ఇచ్చాడు.

అప్పుడా మహర్షులు ఆదర పూర్వకంగా శంకరునితో ఇలా అన్నారు. "మహాత్మా! నువ్వు మతాలను ఉద్ధరించడానికి అవతరించిన శంకరుడవు. నీ పనిని మరచి తల్లికి సేవ చేస్తూ ఇంట్లోనే ఉంటున్నావు. ఇప్పటికైనా నీ కర్తవ్యాన్ని గ్రహించు"

అదే సమయంలో శంకరుని తల్లి ఆ మునుల దగ్గరకు వచ్చి వారికి నమస్కరించి "మహాత్ములారా! నేడు మేము కృతార్థులమైనాము. ఊరకరారు మహానుభావులు. అయ్యా! నా కుమారుడు చిన్నతనం నుండే సకల శాస్త్రాలు అభ్యసించి, అద్భుత కార్యాలు చేయడం చూసి అందరూ ఆశ్చర్యపోయేవారు. అంతేకాకుండా తమ వంటి మహాత్ములు మా ఇంటికి వచ్చి పిల్లవాడితో మాట్లాడటం ఎంతో ఆశ్చర్యంగా ఉంది. మీరు త్రికాల వేదులు కదా! వీడిపుట్టుక ఎలాంటిదో వివరించండి" అంది.

అప్పుడు కుంభసంభవుడు అని పేరు పొందిన ఋషివరేణ్యుడు "తల్లీ! నీవు, నీ భర్తా కుమారుడి కోసం చంద్రశేఖరుని ఆరాధించారు కదా! ఆయన మీ తపస్సుకు మెచ్చి నీ భర్తకు కలలో కనిపించి అల్పాయువు, లోకవిఖ్యాతిగాంచే కుమారుడు ఒకడు కావాలా? లేక దీర్ఘాయువు, దుర్గుణాలు కలిగిన కుమారులు వందమంది కావాలో కోరుకొమ్మనగా, నీ భర్త అల్పాయువు, లోకవిఖ్యాతి గాంచే కుమారుడే కావాలన్నాడు. ఆ విధంగా నీకు శంకరుడు కుమారుడుగా జన్మించాడు" అని జరిగినదంతా ఆమెకు వివరించాడు.

ఆ మాటలు విని సతీదేవి ఉలిక్కిపడి "మహాత్మా! మీరు ఏమంటున్నారు? ఈ విషయం నా భర్త నాకు చెప్పలేదు. అల్పాయువు అంటే ఎన్ని సంవత్సరాలు జీవిస్తాడో చెప్పండి" అని వేడుకుంది. దానికి ఆ మహర్షి ఈశ్వరుడు వీడికి పదహారు సంవత్సరాలు ఆయుర్దాయం ఇచ్చాడు. అయితే కొన్ని కారణాల వల్ల మరి కొంత కాలం జీవించమన్నాడు" అని చెప్పి వెళ్ళిపోయాడు.

## శంకరుడు అల్పాయువని విని తల్లి విలపించుట

పుత్రవాత్సల్యం ఇనుమడించగా, ఆ సతీదేవి, మహర్షిమాట వినడంతోనే మూర్ఛిల్లి, శోకభారం వల్ల చాలాసేపు ఏడ్చింది. కొంతసేపటి కెట్లాగో తెప్పరిల్లి, శంకరుని కౌగలించుకుని "కుమారా! సకల కళలూ నేర్చిన వాడవే! ఈ విద్యలన్నీ ఏం కావాలి? నీ తండ్రి నిన్ను నాకు దిక్కుగా చూపించి

స్వర్గానికి వెళ్లిపోయాడే! కపట వరాలిచ్చిన ఆ శివుణ్ణి ఏమంటాను? ఇంత అల్పాయుర్దాయం రాశాదని - ఆ పాడు విధిని నిందించనా?" అంటూ విలపించసాగింది.

అటువంటి అవతార శరీరుడు. తన కోసం తల్లి అలా మోహం చేత శోకిస్తూంటే, తాను ఆమెను దరిచేర్చాలని ప్రయత్నించాడే తప్ప మోహితుడు కాలేదు.

## శంకరుడు తల్లికి వైరాగ్యోపదేశము చేయుట

"ప్రబలమైన గాలి వేగానికి ధ్వజం వంటిది ఎలా రాలిపోతుందో, ఆ పతాకానికి గుడ్డ ఎలా రెపరెపలాడుతుందో, మనిషిదేహంలోని ప్రాణం కూడ అంతే!.... అమ్మా! ఈ కళేబరము శాశ్వతం కాదు. పూర్వజన్మలో నీకు నాలాంటి కొడుకులు ఎందరో పుట్టారు. ఎందరికో నువ్వు తల్లివైనావు. మరెందరినో పెంచావు. వారిలో నేను ఒకడిని మాత్రమే. ఎందరికోసం నువ్వు బాధపడగలవు? బాటసారులు పానశాలకు వచ్చిపోవునట్లు సంసారులు కూడా వస్తూ పోతుంటారు. నీ శరీరమే నీకు అరువు. నాకోసం బాధపడతావెందుకు? జీవులకు పుట్టుకతోనే మరణం కూడా రాసి ఉంటుంది. వందేళ్ళు బ్రతికినా కోరికలు తీరవు." అంటూ తల్లిని ఊరడించాడు.

కొడుకు మాటలకు కొంచెం ధైర్యం తెచ్చుకొని ఆమె "నాయనా! శరీరం ఉన్నంత వరకు మమత్వం విడవడం కష్టం. సమస్తము తెలిసిన నీకు చెప్పదగిన దాన్నికాను. విధి ఎలా ఉంటే అలాగే జరుగుతుంది. నువ్వింక వివాహం చేసుకొని, కొడుకుని కని కులాన్ని ఉద్ధరించు. క్రతువులు చేసి దేవతలకు తృప్తిని కలిగించు. నీ తండ్రి కోరుకున్నది ఇదే!" అని చెప్పింది.

దానికి శంకరుడు నవ్వి "అమ్మా! సంసారం సాగరం వంటిది సంసారులకు దుఃఖమే కానీ, సుఖము ఉండదు. పైగా అల్పాయువు కలిగిన నేను పెళ్ళి చేసుకొని భార్యపిల్లలను బాధపెట్టలేను" అన్నాడు. సతీదేవి ఆ మాటలు విని "నాయనా! నన్ను బాధపెట్టడానికా నీవు పుట్టావు. సన్యాసం స్వీకరిస్తావా? ముప్ఫై ఏళ్ళలో కూడా వివాహం చేసుకొని సంతానాన్ని కన్నవారున్నారు. నువ్వు కూడా వారి మార్గాన్ని అనుసరించు. నా కోరికను తీర్చు" అంటూ ఎంతో అనునయించింది. అది విని శంకరుడు "అమ్మా! నువ్వు నా మీదున్న

మమకారంతో ఇలా మాట్లాడుతున్నావు. నాకీ ఒంటిజందెమే బరువు. రెండవదాన్ని ఎలా భరించగలను. నాకీ సంసారమందు ఆసక్తి లేదు" అన్నాడు.

శంకరుని మాటలు విని ఆమె ఏడుస్తూ అతని గడ్డము పుచ్చుకొని "నాయనా! ఎందరినో రక్షించిన నువ్వు నా ముప్పును తీర్చి తరువాత నీ ఇష్టం వచ్చినట్లు చేసుకో" అని బ్రతిమాలింది శంకరుడు తల్లికి ఏమీ చెప్పలేక ఆ సమయంలో మౌనం వహించాడు. తనకు పెళ్ళి చేయాలనే కోరిక తల్లికి బలంగా ఉంది. సన్యాసం స్వీకరించడానికి ఆమె ఒప్పుకోదు. తల్లి ఆజ్ఞలేకపోతే సన్యాసం స్వీకరించరాదు. ఏమీ చేయాలో తెలియక శంకరుడు కొన్నిరోజులు గడిపాడు.

శ్లో॥ భ్రమతాం భవ వర్త్మ భ్రమా।
స్నహికించిత్సుఖ మంబలక్షయె॥
తదవాప్య చతుర్థ మాశ్రమం
ప్రయతిష్యే భవబంధ విముక్తయె॥

## శంకరుడు మకరగ్రస్తుడై తల్లిని సన్యాసమున కాజ్ఞ ఇమ్మనుట

ఎనిమిదవ ఏట శంకరుడు ఒకనాటి ప్రాతఃకాలమున పూర్ణానదిలో స్నానం చేస్తుండగా మొసలి ఒకటి అతని కాలుపట్టుకొని నీళ్ళలోకి లాగడం మొదలుపెట్టింది. జలస్తంభనం వంటి విద్యలు తెలిసినప్పటికీ తన కోరిక నెరవేర్చుకోవడానికి ఇదే సరైన సమయమని భావించి అటూ-ఇటూ కొట్టుకుంటూ "అమ్మా! నన్ను రక్షించు. ఒక మొసలి నన్ను పట్టుకొని నీటిలోకి లాగుతోంది. రక్షించు "అంటూ అరవడం ప్రారంభించాడు. ఆ అరుపులు విని ఇంట్లో పనులు చేసుకుంటున్న సతీదేవి పరుగున వచ్చి కొడుకును చూసి బాధపడి అతన్ని రక్షించే వారికోసం ఎదురుచూస్తోంది.

అప్పుడు శంకరుడు "అమ్మా! నేను సన్యాసం తీసుకోవడానికి నీవు అంగీకరిస్తే, నీటి నుండి బయటకు వస్తాను" అన్నాడు. దానికి సతీదేవి" "ఇదంతా నీ మాయ అన్నమాట! ఇలాగైతే సన్యాసం స్వీకరించడానికి నేను ఒప్పుకుంటానని కాబోలు.... అనుకుంటున్నావు"... అంది. ఇంతలో శంకరుడు ఒకసారి నీటిలో మునిగి ఇలా అన్నాడు.

ఆ మాటలు విని ఆమె కొడుకు బ్రతికుంటే చాలుననుకొని "నాయనా! నీవు సన్యాసం తీసుకోవడానికి ఆజ్ఞ ఇస్తున్నాను, త్వరగా బయటకు రా!" అంది. ఆ మాటలు విని శంకరుడు మొసలిపట్టు విడిపించుకొని నీళ్ళలోనే మనస్సులో సన్యాసం స్వీకరించి బయటకు వచ్చాడు. కొడుకుని చూసి "కుమారా! మొసలి పట్టుకు నీ శరీరం ఎంతగా వడిలి పోయిందో చూడు! త్వరగా ఇంటికి పోదాం పద వైద్యులను పిలిపించి వైద్యం చేయిస్తాను." అనగా శంకరుడు నవ్వుతూ "తల్లీ! నేను మనస్సులోనే సన్యాసం స్వీకరించాను ఇక ఇంటికి రాను" అన్నాడు.

దానికి సతీదేవి "నాయనా! నువ్వు సన్యాసం స్వీకరిస్తే నన్ను రక్షించే వారు ఎవరు? రోగము వచ్చినప్పుడు చూసే వారు ఎవరు? నేను మరణిస్తే అపర సంస్కారాలు చేసేది ఎవరు? "అంటూ బాధపడింది. దానికి శంకరుడు "అమ్మా! నీ కష్టసుఖాలను ఇక నుంచి దాయాదులే చూస్తారు. లేకపోతే ప్రాణంపోయే సమయంలో నన్ను తలుచుకో! ఎక్కడున్నాగానీ యోగబలంతో నీ దగ్గరకు వచ్చి దేహ సంస్కారాలు చేస్తాను" అన్నాడు.

తరువాత శంకరుడు దాయాదులను పిలిపించి వారికి తల్లిని అప్పగించాడు.

## శంకరుడు తల్లిని జ్ఞాతులకప్పగించుట

**త**ల్లి పాదాలకు ప్రణమిల్లి "కన్నతల్లి అనైనా చూడకుండా, వైరాగ్యం చేత, ఈమెను మీ పరం చేసి వెళ్తున్నాను. ఈమెని మీ తల్లిలా చూసుకోండి! ఆమె నన్ను తల్చుకొనేలా మీరు ప్రవర్తిస్తే అది మీకూ - నాకూ కూడా పాపమే! బంధువులారా! కష్టం ఎరగదనీ, మెత్తనిదీ, ఎన్నడూ ఏదీ కోరనిదీ, ఎవరింట్లోనూ తిననిదీ ఈమె. ధనం, భూమి, పశువులు, గృహసహితంగా దీన్ని మీ అధీనం చేసి వెళ్తున్నాను. ఇక మీదట ఆమె భారం మీదే! ఎలా చూసుకుంటారో మరి" - అని పలికి శంకరుడు కన్నీరు కారుస్తున్న తల్లిని జ్ఞాతులకు అప్పగించాడు. ఆ సమయంలో అగ్రహారంలోని బ్రాహ్మణులంతా అక్కడికి చేరి అతని వైరాగ్యానికి ఆశ్చర్యపడి, సతీదేవిని చూసి బాధపడ్డారు. ఇంతలో దూరం నుంచి "శంకరా! పూర్ణానదిని అగ్రహారానికి దగ్గరగా

ప్రవహింప జేయడం వల్ల ఆ అలల తాకిడికి గోపాలస్వామి దేవాలయం బీటలుపడింది. కాబట్టి ఆ స్వామిని మరొకచోట స్థాపించివెళ్ళు" అనే మాటలు వినిపించాయి. ఆ మాటలు ఎవ్వరివో తెలియక ఆశ్చర్యపడి, అవి భగవంతుని మాటలుగా తలచి, శంకరుడు వెంటనే వెళ్ళి ఆ గుడి బీటలుపడి ఉండడం చూసి బాధపడి స్వామిని తన భుజాలపై ఎత్తుకొని వేరొక చోట స్థాపించి ఆలయ- మంటప- ప్రాకారాలు కట్టించడానికి నియమించాడు. ఆ తరువాత......

## శంకరుడు సన్యాసం స్వీకరించడానికి గోవింద యతిదగ్గరి కెళ్లుట

**త**ల్లి పాదాలకు వందనం ఆచరించి, బంధువుల దీవెనలు పొంది ఇల్లు వదిలాడు. పూర్వం బ్రహ్మతో సహా అందరూ స్త్రీల పట్ల మోహితులై, మన్మథబాధ కోపలేక సంసారమనే సుడిగుండాన పడి, ఎప్పటికో దైవకృప వల్ల ఉద్ధరించబడ్డారు. నేను కూడ మరునిబారిన పడవలసిన వాడనే! స్త్రీల అందమైన స్తనాలు- జటాజూటాలు- వారి నడకలు- వయ్యారాలు ఇవన్నీ మోహాన్ని పుట్టించేవే! తమని తనివితీరా ఆస్వాదించ వలసిందంటూ ఆహ్వానించేవే! అంచేత మొట్టమొదట ఆ యతి కామాన్ని జయించడానికి పూనుకొన్నాడు. దేవతలను, గంధర్వులను, విద్యాధరులను వశపరుస్తున్న మన్మథుని సైతం పరాభవించిన ఆ శంకరుని గొప్పదనం సామాన్యమైనదా ఏమి?

పూలకు సువాసనలు అబ్బినట్లుగా, శంకరునికి అలవడిన ఈ వైరాగ్యభావం - దాని శక్తి వల్ల అతనికి శాంతి, క్షాంతి, సమాధి, శ్రద్ధ మొదలైన సాధువృత్తి పూర్వక సుగుణాలను అలవడచేసింది.

అప్పుడా శంకరుడు ఒక శుభముహూర్తాన అలా బయల్దేరి ఉత్తరదిక్కుగా వెళ్తూ వెళ్తూ, ఇంద్ర జాలికుని మాయలా కన్పించే ఈ సృష్టిలోని సమస్తాన్ని అద్వైత భావనతో చూడసాగాడు.

అట్లు దృశ్యాన్నంతా పరతత్వంగా బోధిస్తూ కులమత వాదుల వల్ల చెడు మార్గంలో నడిపించబడుతున్న 'వేదం' అనే ఆవును సన్మార్గంలో

నడిపించడానికా అన్నట్లు కాషాయ వస్త్రాలు, దండాన్ని ధరించాడు. ఆపైన పట్టణాలు, అరణ్యాలు అనేకం దాటి ఒకనాటి సాయంత్రం నర్మదా నది ఒడ్డున - ఉన్న గోవింద యతి ఆశ్రమానికి చేరుకున్నాడు.

అక్కడ జాతివైరాన్ని విడిచి, పరస్పరమైత్రితో జంతువులన్నీ మెలగసాగాయి. కప్ప-పాము, పులి-గోవు- సింహం- ఏనుగు ఒకేచోట మసలడం, లేళ్లు గంతులేస్తూ క్రూరమృగాల మధ్య సంచరించగలగడం చూసి ఆశ్చర్యపోయాడు.

అక్కడ శంకరుడు తాను చూసిన విశేషాలకు కారణం ఆ యతి మహిమేనని గ్రహించి నర్మదానదీ తీరం నుండి వచ్చే గాలితో ఆయాసం తీర్చుకొని, అక్కడ కొంతసేపు విశ్రమించిన తర్వాత ఆ ప్రాంతం నలుమూలలా తిరిగాక ఒకచోట తత్త్వగోష్ఠి చేస్తున్న కొందరు తాపసులను చూసి వారికి నమస్కరించాడు.

"సంసారం అనే మహాగ్ని చేత దహించబడుతూన్న నేను, ఇక ఆ బాధ భరింపలేక పుణ్యచరితుడైన గోవిందయతిని ఆశ్రయించాలని వచ్చాను. ఆమహాత్ముడు ఎక్కడ వసిస్తున్నాడో చెప్పండి మునులారా!" అని ప్రార్థించాడు.

అలా అడిగిన శంకరుని మాటలకు వారు ఆశ్చర్యపోతూ "నాయనా! ఇంత చిన్న వయస్సులోనే ఇంత వైరాగ్యం ఎందుకు? అసలు నువ్వు ఎవరు? మేము చాలాకాలం నుండి గోవింద యతిదర్శనం కోసం ఎదురు చూస్తున్నాము. ఆ మహానుభావుడు ఈ గుహలోపల ఉన్నారని చెప్తారు. యోగశక్తి ఉంటే గానీ గుహలోపలికి ప్రవేశించడం కష్టం. మాకు అటువంటి సామర్థ్యం లేదు. ఎప్పటికైనా ఆయన ప్రసన్నుడు కాకపోతాడా? అని మేము ఎదురుచూస్తున్నాము. నువ్వు ఇప్పుడు వచ్చి ఆయన్ని చూడాలంటున్నావు. సామాన్యంగా వారిని దర్శించడం సాధ్యంకాదు. మాతో కొంతకాలం ఉండి తత్వగోష్ఠిలో పాల్గొనుము" అన్నారు.

వారి మాటలకు శంకరుడు నవ్వుతూ వారికి సందర్భోచితంగా సమాధానాలు చెప్పి వారు చూస్తుండగానే యోగ శక్తితో ఆ గుహలోకి ప్రవేశించి సమాధిలో నిశ్చలంగా ఉన్న గోవింద యతిని చూసి ఆయనను ఇలా స్తుతించాడు.

"మహాత్మా! నీవు ఆదిశేషుడవు. వేయి ముఖాలున్న నిన్నుచూసి శిష్యులు భయపడగా, వారికి భయం పోగొట్టడానికి ఒకే ముఖంతో దర్శనమిచ్చిన పతంజలి మహర్షివి. యోగశాస్త్ర భాష్యకారుడివి. రసాతలానికి వెళ్లి, భుజంగ సాధువు ద్వారా యోగశాస్త్రంలో లోతులు అధ్యయనం గావించిన వాడవు. శోకమహర్షి శిష్యుడైన గౌడపాదుని వల్ల తత్త్వాలు సకలార్థాలు గ్రహించిన వాడవు. దృఢ స్వాంతుడవు. బ్రహ్మనిష్ఠ కలిగి సమాధిలో సైతం ప్రకాశించేవాడివి. అట్టి నీనుంచి మహత్త్వపూర్ణమైన బ్రహ్మతత్త్వాన్ని గ్రహింప వచ్చినవాడిని. దయతో నాకు దాన్ని బోధించండి"

అని స్తుతించిన శంకరుని స్వరం విని గోవిందయతి కళ్లు తెరచాడు తన పాదాల దగ్గర అంజలి ఘటిస్తూ నిలబడి ఉన్న శంకరుని చూసి ఆతని ప్రతిభా విశేషాలకు ఆశ్చర్యపోయి, నీవెవరవని అడిగిన, ఆ యతీంద్రునితో శంకరుడు ఇలా చెప్పాడు.

**శ్లో॥ స్వామీన్న హంస పృథివీ న జలం న తేజో ।**
**న స్పర్శనో న గగనం న చ తద్గుణా వా॥**
**నా ప్రీంద్రియాణ పితు విద్ధితతో విశిష్టో,**
**యః కేవరోస్తి పరమ స్సశివో మహస్మి॥**

("స్వామీ! నేను భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము, శబ్ద, స్పర్శ, రూప, రసగంధాలను ఇంద్రియాలుగాను వాటి భావా విష్ఠుడినై సర్వోత్తముడు చిదానందమయుడు అయిన శంకరుడను") అన్న బాలుని మాటలు విని ఆ మహర్షి ఆనందపడి "నాయనా! నీవు సాక్షాత్తు శంకరుడివే. అద్వైత మతాన్ని తెలియజేయడం కోసం అవతరించావు. నీకు ప్రణవ మంత్రోపదేశం చేస్తాను" అన్నాడు. ప్రణవ మంత్రోపదేశపూర్వకముగా, నాలుగువేదాలనుంచీ 'ప్రజ్ఞానం బ్రహ్మ' 'అహంబ్రహ్మాస్మి 'తత్త్వమసి' 'అయమాత్మాబ్రహ్మ' అనే 4 మహావాక్యాలు ఉపదేశించాడా గోవిందయతి.

ఈ నాలుగు మంత్రాలతో 'బ్రహ్మ భావం' తేటతెల్లమైంది. వ్యాసమహర్షి వలన శ్రీశుకుడు, శ్రీశుకుని వల్ల గౌడపాదుడు, అతని వల్ల గోవింద తీర్థులు సంప్రదాయ సిద్ధంగా బ్రహ్మసూత్రాలను తెలుసుకున్నారు. కాబట్టి గోవింద తీర్థులు చెప్పిన విషయాలను అతనికి చెప్పాడు. అంతే కాకుండా గోవింద

తీర్థులు పాతాళంలో అనంతుని దగ్గర నేర్చుకున్న విద్యలు, యోగాలు, మంత్ర తంత్రాలు అరవై నాలుగు కళలను శంకరునికి ఉపదేశించాడు. ఎంతో పూర్వజన్మ సుకృతంగా గానీ పొందడానికి వీలుకాని సన్యాసమును స్వీకరించి శంకరుడు ధృవుడిలా ప్రకాశించాడు. అక్కడున్న తాపసులు ఇది చూసి ఆశ్చర్యపోయి, వారిలో వారు ఇలా మాట్లాడుకున్నారు. “ఇతడు ఎంత గొప్పవాడో కదా! సాక్షాత్తు శంకరుడు పరమానంద స్వరూపుడు సూర్యునితో పోల్చదగినవాడు.” అని చెప్పుకుంటూ అక్కడి నుండి వెళ్ళిపోయారు.

శంకరుడు గోవింద యతికి శుశ్రూష చేస్తూ వర్షాకాలమంతా నర్మదానదీ తీరంలోనే గడిపాడు.

ఇలా ఉండగా ఒకసారి ప్రళయాన్ని తలపించే విధంగా పెద్ద వర్షం కురుస్తూండగా నర్మదానది పొంగి అగ్రహారాలను ముంచెత్తింది. అక్కడి స్త్రీలు, పిల్లలు, వృద్ధులు హాహాకారాలు చేస్తూ ఇళ్ళను వదిలి, అతి కష్టం మీద గోవిందయతి ఆశ్రమం చేరుకున్నారు. అప్పుడు ఆయన యోగ సమాధిలో ఉన్నారు. ఆశ్రమం వద్దకు చేరుకున్నవారి ఆర్తనాదాలను విని శంకరుడు వచ్చి, వారి హాహాకారాలకు కారణం తెలుసుకొని “విప్రులారా! మీరు చింతించకండి. ఈ కుండను వేగంగా తీసుకువెళ్ళి నర్మదానదీ ప్రవాహంలో విడవండి” అని చెప్పి ఒక కుండను ఇచ్చారు. వారు ఆ కుండను నర్మదానదిలో విడిచిపెట్టగా వరద నీరంతా కుండలోకి వెళ్ళిపోయి అగ్రహారాలన్నీ పూర్వంలా, నిర్మలంగా మారిపోయాయి. దాంతో అందరూ ఆనందపడి శంకరుని ఎన్నో విధాలుగా పొగిడారు.

తరువాత గోవిందయతి సమాధి నుండి లేచి జరిగినది అంతావిని, ఆనందపడి “నాయనా! నీవు అజేయుడవు. కాబట్టి నీవు కాశీనగరం వెళ్ళి వేదయుక్తమైన తత్త్వపద్ధతిని అక్కడ వివరించు” అని చెప్పాడు.

పూర్వం ఒకనాడు హిమాలయాల్లో అత్రి మహాముని సత్రయాగం చేయగా, దానిని చూడడానికి వచ్చిన మహామునులు అందరూ వేదశాస్త్ర, పురాణాలతో కాలక్షేపం చేస్తున్నారు. అక్కడ సభామండలంలో వ్యాసుడు ఉపనిషత్తులకు అర్థమును చెప్పమనగా “మహాత్మా! నీవు నాలుగు వేదాలను విభజించావు.

భారతాన్ని రాశావు. యోగశాస్త్రాన్ని చెప్పావు. లోకానికి ఉపకారం చేశావు. బ్రహ్మ సూత్రాలు నిర్మించావు. లోకానికి ఉపకారం చేశావు. కానీ వీటిని కొందరు తమ మతానుసారం విపరీతార్థాలు కల్పిస్తున్నారు. నీవు వాటికి నిశ్చయమైన అర్థాలు రచించు. అదే నా ప్రార్థన" అన్నాడు.

అది విని వ్యాసుడు నవ్వుతూ "పూర్వం కైలాసంలో దేవతలు ఈ విషయాన్నే ప్రస్తావించారు. ముందు-ముందు నీకు నా అంతటివాడు శిష్యుడు కాగలడు. అతడు నర్మదానదీ తీరప్రవాహాన్ని మంత్రించిన కుండలో బంధించగలడు. అదే నీకు గుర్తు. అతడు ఈ కుత్సిత మతాలను ఖండిస్తూ బ్రహ్మ సూత్రాలకు యదార్థంగా భాష్యం చెప్పగలడు. అతని వల్ల నీకీర్తి లోకమంతా వ్యాపించగలదు" అని చెప్పి వెళ్ళిపోయాడు వ్యాసమహర్షి.

"శంకరా! ఆ మహర్షి చెప్పిన గుణాలు నీలో కనబడుతున్నాయి. అజ్ఞానాన్ని పోగొట్టుకుని లోకాన్ని ఉద్ధరించు. కాశీకి వెళ్ళి సూత్ర భాష్యం రచించు. ఇది దేవ సమ్మతము" అని గోవింద యతి అన్నాడు. అతని నిర్మలదృష్టిచే పవిత్రుడైనాడు శంకరుడు.

అప్పుడు శంకరుడు గోవిందయతికి నమస్కరించి కాశీకి వెళ్ళాడు. అక్కడ గంగానదిలో స్నానం చేసి, విశ్వనాథుణ్ణి అర్చించి, అన్నపూర్ణను కొలిచి, భైరవుణ్ణిసేవించి సద్గోష్ఠి చేస్తూ కొన్నాళ్ళు కాశీ నగరంలో నివశించాడు.

## సనందుని ప్రవేశము

**ఆ** విధంగా శంకరుడు కాశీ పురంలో నివశిస్తుండగా బ్రహ్మతేజస్సుతో ప్రకాశించేవాడు, ఆజానుబాహుడు, వైరాగ్య బుద్ధితో వచ్చిన ఒక బ్రహ్మచారిని చూసి శంకరుడు ఆశ్చర్యపోయాడు. "నాయనా! ఎవరు నీవు? ఎందుకు వచ్చావు?" అని అడుగగా, "స్వామీ! నేను బ్రాహ్మణుడను, కావేరీ నదీ తీరంలో గల చోళదేశంలో నివశించే వాడిని. మహాత్ములను దర్శించాలనే కోరికతో ఇల్లు విడిచివచ్చాను. నన్ను మీ శిష్యునిగా స్వీకరించండి" అని శంకరుని పాదాలపైపడి వేడుకున్నాడు.

శంకరుడు అతని మాటలకు ఆనందపడి, అతని భక్తి విశ్వాసాలను మెచ్చుకొని ఒకరోజున శాస్త్ర ప్రకారం బ్రహ్మమతమును ఉపదేశించి

సన్యాసం ఇప్పించాడు. అతడే శంకరాచార్యునికి మొదటి శిష్యుడని చెప్తారు. తరువాత వామదేవుడు వంటి శిష్యులతో అతని కీర్తి నలుదిశలా వ్యాపించింది. ఎందరో ప్రజలు శంకరుని ఆరాధించి వక్ర మార్గంలో నడుస్తున్న తమ బుద్ధిని సరైన మార్గంలో పెట్టుకున్నారు.

## విశ్వేశ్వర దర్శనం

**ఒ**కరోజు శంకరుడు గంగానదికి వెళుతుండగా నాలుగు కుక్కలను తాళ్ళకు కట్టి, వాటిని చేతితో పట్టుకొని, కల్లువాసనతో, కళ్ళు చింత నిప్పుల్లా ఎరుపెక్కగా, భయంకరమైన చూపులతో, వింతవింత మాటలతో జనాలని నవ్విస్తూ ఒక మాలవాడు ఎదురయ్యాడు. వాడి వంక ఏవగింపుగా చూస్తూ "ఓరీ చండాలుడా! ఆచార సంపన్నులమైన మమ్మల్ని చూసి కూడా ఎదురువస్తావా? దూరంగా వెళ్ళు" అన్న శంకరునితో "చూడడానికి గొప్పవాడిలా ఉన్నావు. మాటలు మాత్రం విపరీతంగా ఉన్నాయి. నన్నెందుకు దూరంగా వెళ్ళమంటున్నావు? సర్వాంతర్యామి అయిన బ్రహ్మతత్వం గురించి శ్రుతులు చెబుతూఉంటే నీకెందుకు ఈ భేదభావం? నీ శరీరానికీ, నా శరీరానికి తేడా ఏమిటో చెప్పు? సూర్యబింబం గంగలో అయినా, కల్లులో అయినా ఒక్కలాగానే ఉంటుంది కదా! సర్వము తెలిసిన నీవే ఇలా అంటే ఎలా? పరమేశ్వరుని ఇంద్రజాలానికి మహాత్ములు సైతం అతీతులు కారనీ దీన్ని బట్టి తెలుస్తున్నది" అన్న వాని మాటలకు శంకరుడు ఆశ్చర్యపడి ఇలా అన్నాడు.

"అయ్యా! నీవు చెప్పింది నిజమే. లోకంలో కొందరు ఉపనిషత్తులకు అర్థాలను విని, మరికొందరు చూసి, కొందరు ఆచరించి తెలుసుకుంటారు. కానీ బుద్ధిలో ఉన్న భేదభావాన్ని మాత్రం ఎవ్వరూ వదలలేకపోతున్నారు. ఎవరికైతే ఈ జగమంతా ఆత్మ స్వరూపంగా తోస్తుందో వారు ఎవరైనా నాకు గౌరవనీయులే. ఎవరి మనసు లోనైతే దృఢనిశ్చయం ఉంటుందో వారు నాకు గురువుతో సమానం" అనగానే, మాలవాడి స్థానంలో పరమేశ్వరుడు ప్రత్యక్షమయ్యాడు.

పరమశివుని చూసి శంకరుడు విస్మయం చెంది అనేక విధాలుగా స్తుతించి సాష్టాంగ నమస్కారములు చేశాడు.

శంకరుని భక్తికి మెచ్చిన ఈశ్వరుడు "శంకరా! నిన్ను పరీక్షించడానికే నేను ఈ విధంగా వచ్చాను. కలియుగంలో కొందరు మూఢులు కుత్సిత భాష్యాలను రచించారు. ప్రజలు వాటినే నిజమని నమ్ముతున్నారు. కావున నీవు నిజమైన భాష్యాలను రచించి, వాటిని ప్రచారం చేయి. ఆ పండితులను విధ్యా వాదంలో నుండి రక్షించు. అల్పపండితుల్ని ఓడించి అద్వైత మతాన్ని విస్తరించు' అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

శంకరుడు ఈ విషయాన్ని మనసులోనే ధ్యానిస్తూ శిష్యులతో సహా గంగానదికి పోయి స్నానం చేసి, పూజా కార్యక్రమాలు నిర్వర్తించి శిష్యుడైన సనందునితో ఇలా అన్నాడు "సనందనా! పరమ శివుడు నన్ను సూత్ర భాష్యాలు రచించమని స్వయంగా చెప్పాడు. వ్యాసమహాముని కోరిక కూడా అదే అని విన్నాను. భాష్య రచనకు చక్కటి ప్రదేశం బదరికావనం. పైగా అది ఏకాంత ప్రదేశము. అక్కడ గల మునులు నాకు భాష్యరచనకు సహాయం చేస్తారు. కావున మనందరము బదరికా వనం వెళదాము" అని చెప్పి ఒక శుభముహూర్తంలో శిష్యులతో కలిసి బదరికా వనం చేరుకున్నాడు.

## భాష్యప్రచారము

**శం**కరాచార్యుడు బదరికా వనంలో తన పన్నెండవ ఏట బ్రహ్మ ఋషులతో కలిసి అనేక సార్లు ఉపనిషత్తులకు అర్ధాలను విమర్శించి షడూర్ముల చేత, సప్త ధాతువుల చేత, శరీరతత్వము చేత, తెలియబడేలాగును మధురమైన, గంభీరమైర సూత్రభాష్యాలు రచించాడు.

అంతేకాకుండా శంకరుడు బ్రహ్మవిద్యా ప్రతిపాదకములైన నచికేత, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య బృహదారణ్య వంటి ఉపనిషత్తులకు మహాభారత సారములకు భాష్యాలను రచించాడు. వాటికే ప్రస్థానత్రయమని వాడుక. శంకరుడు భాష్యాలను రచించి వాటిని తన శిష్యులకు చక్కగా అర్ధమయ్యేలాగా వివరించేవాడు.

అసమానమైన భక్తి విశ్వాసాలు కలిగిన సనందునికి సూత్రభాష్యాలను మూడు సార్లు చెప్పి. వాటిలోని అర్ధాలను వివరించేవాడు. అది చూసి మిగిలిన శిష్యులు తమ గురువుగారికి సనందుడంటే ఎక్కువ ఇష్టమని-

అతని యందు పక్షపాతమెక్కువని తలచి మనస్సులో బాధపడేవారు. అది గ్రహించి శంకరుడు ఒకనాడు సనందుని భక్తి విశేషాలు శిష్యులకు తెలియజేయాలని సనందుడు గంగానదికి అవతలి ఒడ్డున ఉండగా శంకరుడు "సనందా! వేగంగా ఇటురా! నీతో పనుంది" అని పలికాడు.

ఈ మాటలు విన్న సనందుడు భక్తితో గంగానది నీటిపై వడివడిగా నడుస్తూ ఇవతలి ఒడ్డుకు చేరుకున్నాడు. దానిని చూసి శిష్యులు ఆశ్చర్యపోయారు. శంకరుడు అతనికి పద్మపాదుడు అనే సార్థక నామధేయం పెట్టాడు.

ఒకనాడు శంకరుడు శిష్యులకు భాష్యంపాఠంగా చెబుతున్న సమయంలో భేద వాద మతస్థులు వచ్చి అతనితో వాదనకు దిగగా వారికి తగిన సమాధానం చెప్పి పంపించాడు. అది చూసి శిష్యులు "ఇదంతా బ్రహ్మ సూత్ర భాష్యమునకు ప్రతిఫలమని" భావించి, ఎన్నో విధాలుగా స్తుతిస్తూ వెళ్ళిపోయారు.

## వ్యాసదర్శనము

**ఒ**కనాడు శంకరుడు గంగానది సమీపంలో కూర్చొని సూత్ర భాష్యాన్ని శిష్యులకు పాఠంగా చెబుతున్న సమయంలో అక్కడకు ఒక వృద్ధబ్రాహ్మణుడు వచ్చి "అయ్యా! నీవెవరు? శిష్యులకు ఏం చెప్తున్నావు?" అని ప్రశ్నించాడు. దానికి శిష్యులు "ఆర్యా! ఈయన మా గురువు శంకరాచార్యులవారు. బ్రహ్మసూత్రాలకు భాష్యం రచించి వాటిని మాకు పాఠాలుగా చెప్తున్నారు" అని చెప్పారు.

ఆ మాటలువిని ముసలి బ్రాహ్మణుడు ఆశ్చర్యపడి, శంకరునితో "స్వామీ! మీరు సూత్రభాష్యాలను రచించారని మీ శిష్యులు చెప్పి ఉన్నారు. మీ ప్రజ్ఞావిశేషాలు అనన్య సామాన్యములు. ఒక సూత్రం చదివి, దానికి అర్థాన్ని వివరించండి" అన్నాడు.

దానికి శంకరుడు "అయ్యా! సూత్రార్థాలు బాగా తెలుసునని నేను చెప్పలేను. మిమ్మల్ని గురువుగా భావించి నాకు తెలిసినది చెబుతాను. ఏ సూత్రానికి అర్థం చెప్పమంటారు" అని అడిగాడు అప్పుడా బ్రాహ్మణుడు.

మూడవ అధ్యాయంలో మొదటి సూత్రానికి అర్ధం చెప్పమన్నాడు. శంకరుడు చెప్పిన సమాధానాన్ని ఖండిస్తూ బ్రాహ్మణుడు వేరొక అర్థాన్ని చెప్పాడు. ఇలా పరస్పరం ఒకరి అర్థాలను ఒకరు ఖండిస్తూ ఎనిమిది రోజుల పాటు సంవాదం చేశారు.

ఒకనాటి సాయంత్రం శంకరుడు రహస్యంగా పద్మపాదుని చూసి "వత్సా! ఈ బ్రాహ్మణుడు చూడడానికి సామాన్యంగా కనబడుతున్నాడు. కానీ ఈతడు సకల విద్యా పరిపూర్ణుడు. అనడంలో సందేహం లేదు. ఈయనను వాదనలో ఎలా గెలవాలో తెలియడం లేదు?" అని అడగ్గా, దానికి పద్మపాదుడు "ఆచార్య! ఈయన బ్రాహ్మణుడు మాత్రం కాదు. మీ పాండిత్యాన్ని పరీక్షించడానికి వ్యాసమహర్షే స్వయంగా వచ్చేనని నాకు అనుమానం. లేకపోతే మీతో ఇన్ని రోజులు వాదించడం సామాన్యులకు సాధ్యమయ్యే పనికాదు" అన్నాడు.

వచ్చినవాడు వ్యాసమహర్షేనని నిర్ధారించుకున్న శంకరుడు వ్యాసుని దగ్గరకు వెళ్ళి. ఆయనకు నమస్కరించి "మహాత్మా! మీ దర్శనంతో మేము కృతార్థులమైనాము". అంటూ అనేక విధాలుగా స్తుతించాడు.

దానికి వ్యాసమహాముని ఆనందించి "శంకరా! నీవు బ్రహ్మ సూత్రాలకు భాష్యమును రచించావని విని నిన్ను చూడడానికి వచ్చాను. నిన్ను పరీక్షించాను. నన్ను మెప్పించావు" అన్నాడు. ఈ మాటలు విని శంకరుడు "మహాత్మా! నీ శిష్యుల ముందు నేనెంతటి వాడిని? నామీద దయతలచి నీకు ప్రత్యక్షమయ్యావు. నీవెంత దయామయుడవు. ఈ భాషాల్లోని తప్పులను సరిదిద్ద"మని వేడుకున్నాడు.

వ్యాసుడు శంకరుడు అందించిన భాష్యాలను స్వీకరించి వాటిని చక్కగా విశ్లేషించాడు. సూత్రానుసారంగా, మృదువైన మాటలతో ఉన్న భాష్యాన్ని చూసి ఆనందపడి శంకరునితో ఇలా అన్నాడు "శంకరా! పూర్వం ఎందరో నా సూత్రాలకు భాష్యాలను రాశారు. కానీ ఏ ఒక్కటీ నాకు సంతృప్తి కలిగించలేదు. నీవు రాసిన ఈ భాష్యాలు నాకెంతో ఆనందాన్ని, తృప్తిని కలిగించాయి. నీతో భేదించే వారిని ఓడించు. అనుబంధ గ్రంథాలను రచించు. నీకు విజయం కలుగుతుంది" అని ఆశీర్వదించిన వ్యాస మహామునితో ఇలా అన్నాడు.

"స్వామీ! నీ అనుగ్రహం వల్ల భాష్యాలనేకం రచించాను. శిష్యులతో పఠింపజేసి, కుత్సిత మత వాదులను ఓడించాను. కొంతకాలం మీరు ఈ మణికర్ణికాక్షేత్రంలో నివశించండి. మీ పాదాల దగ్గరే కైవల్యం పొందుతాను. అనుమతి ఇవ్వండి" అన్నాడు ఈ మాటలు విని వ్యాసుడు కొంచెం బాధపడి "నాయనా! తొందర పడకు. కొందరు పండితులు అద్వైత మతాన్ని వ్యతిరేకిస్తున్నారు. వారిని జయించడానికైనా కొంతకాలం నీవు జీవించాలి." అన్నాడు. అంతేకాకుండా "శంకరా! నీకు ఎనిమిదేళ్ళు ఆయువు ఉన్నది. కానీ నీవు మరికొంతకాలం జీవించాల్సిన అవసరం ఉన్నది. ఆతరువాత ఈశ్వరసాన్నిధ్యం పొందుతావు" అని దీవించి అంతర్ధానమయ్యాడు.

అద్వైత మతాన్ని దిగ్విజయం చేయాలని భావించి ఒక శుభ ముహూర్తంలో శిష్యులతో సహా కాశీనగరాన్ని వదిలి ప్రయాగ చేరుకున్నాడు.

పద్మపాదునితో "వత్సా! ఈ మహాక్షేత్రంలో ఒకరోజు ఉన్నవారికి యాగాలు చేసినదానికన్నా ఎక్కువ ఫలితం కలుగుతుంది. కాబట్టే దీనిని 'ప్రయాగ' అంటారు ఈ ప్రాంతంలో మందాకినీ నది. కాళిందీనదిలో కలుస్తున్నది. ఇక్కడ స్నానం చేసిన వారికి వ్యాధులు కలుగవు ఈ నాటికి అంతటి మహత్తు ఉంది" అంటూ ప్రయాగ క్షేత్రం యొక్క మహత్యాన్ని వివరించాడు.

తల్లిని తలుచుకొని, అనుష్టానాలు తీర్చుకొని. స్నానం చేసి చల్లగాలులకు కాసేపు విశ్రమించి, తరువాత శిష్యులతో కలిసి వినోద కథా కాలక్షేపం చేశాడు.

## భట్టపాదుని కథ

"వేదమార్గమేమిన్న అని మహాపర్వతం మీద నుండి ఎవడైతే భూమ్మీదకు ఉరికాడో, దేవతలంతా ఎవరిచ్చే హవిర్భాగాలను తృప్తిగా గ్రహిస్తున్నారో, బౌద్ధ చార్వాకమతాలను ఏ పండితుడైతే ఖండించడానికి పెనుప్రయత్నం చేశాడో అట్టి శ్రీభట్టపాదుడు గురుని అతిక్రమించిన పాపం పోగొట్టుకోడానికి అగ్నిలో ప్రవేశిస్తున్నాడు. విజ్ఞాన పరమార్థుడు అతడే కదా!"

అని ఎవరో చెప్పుకోవడం విని శంకరుడు అదిరిపడి లేచి శిష్యులతో సహా ఆ మహాత్ముడు ఎక్కడ ఉన్నాడో తెలుసుకొని త్వరగా అక్కడికి వెళ్ళాడు.

అక్కడ ఒకచోట కుప్పగా పోసి ఉన్న వేడి ఊకపై పడుకొని అందులో నుంచి వచ్చే వేడికి ఒళ్ళంతా కమిలినప్పటికీ ముఖంలో ఏమాత్రం తేజస్సు తగ్గని భట్టిపాదుని చూశాడు.

భట్టిపాదుడు దూరం నుంచే శంకరుడు రావడం గమనించి ఆయనకు ఎదురెళ్ళి స్వాగతం పలికాడు. కుశల ప్రశ్నలు అడిగిన తరువాత శంకరుడు సూత్రభాష్యాలను క్లుప్తంగా చదివి వినిపించాడు. అది విని భట్టిపాదుడు ఆశ్చర్యపడి "ఆహా! మీ భాష్య ప్రభావం వర్ణించ వీలులేనిది" అని మెచ్చుకున్నాడు. అంతేకాకుండా "నేను ఈ దీక్ష వహించకపోయి ఉంటే మీ భాష్యాలకు అపురూప వ్యాఖ్యలను రాసి ఉండేవాడిని! అలాంటి యోగం నాకు లేదు. లేకపోతే మీవంటి మహాత్ముల దర్శనం నాకు కలిగేది కాదు. నేను వేదాలకు స్వతంత్రం కల్పించి, ఈశ్వరుణ్ణి నిరాకరించాను. గురువులకు ద్రోహం చేశాడు. ఈ రెండు పాపాలు పోవడం కోసం ఈ దీక్ష చేస్తున్నాను" అన్న భట్టిపాదుని ఆశ్చర్యంగా చూస్తూ.

"మహాత్మా! మీరు గురుద్రోహం ఎందుకు చేశారు? దాని వృత్తాంతం ఏమిటో వివరించండి" అని శంకరుడు అడిగాడు.

## భట్టపాదుని పూర్వ వృత్తాంతము

"నేను పుట్టిన సమయానికి బౌద్ధమతం ప్రపంచమంతా వ్యాపించి ఉంది. వైదిక మంత్రాలు గగనకుసుమాలై ఉన్నాయి. అటువంటి సమయంలో-నేను స్వల్పవ్యవధిలోనే వేదాలను చదివి వేద మార్గాలను సరిచెయ్యాలని భావించి ఇతర మతాల వారితో పరిచయం పెంచుకొని వారి మత విశేషాలను తెలుసుకోవడం మొదలుపెట్టాను. అంతేకాకుండా బౌద్ధమతం గురించి తెలుసుకోవడం కోసం బౌద్ధమతస్థుడి వేషం ధరించి, ఒక గురువు దగ్గరకు వెళ్ళి "అయ్యా! నేను బౌద్ధమతస్థుడిని. నాకు ఆ శాస్త్రాలను వివరించండి" అన్నాడు. దానికి ఆయన సంతోషించి వారి శిష్యులతో కలిపి నాకు కూడా వారి శాస్త్రాలు బోధించాడు.

ఒకరోజు సభలో పక్షపాత బుద్ధికలిగిన ఒక బౌద్ధుడు నిలబడి "వేదాలు ప్రత్యక్షప్రమాణ విరుద్ధమని ఎవరో ఈశ్వరుడు చెప్పాడట! మొదట కర్మ

చేయమని చెప్పి, తర్వాత దాని వల్ల ఏమీ ప్రయోజనం లేదన్నాడు. ఈ మాటలను ప్రమాణాలుగా తీసుకొని జీవహింస చేసే వైదికులను ఏమనాలి?" అంటూ అనవసరంగా వాదించడం మొదలెట్టాడు. ఈ మాటలను నేను విని బాధపడడం చూసి "వీడెవ్వడో వైదికుడిలా తోస్తున్నాడు. మన మత" విషయాలు తెలుసుకోవడానికి వచ్చాడు" అన్నాడు.

దాంతో గురువుగారికి నామీద నమ్మకం పోయి, శాస్త్ర మర్మాలను చెప్పడం మానేయడమే కాకుండా, ఒకసారి నేను నిద్రపోతుండగా మేడమీద నుంచి నన్ను క్రిందకు త్రోయించాడు. ఆ సమయంలో నాకు తెలివి వచ్చి "వేదమే ప్రమాణమైతే నాకేమీ కాకూడదు" అనుకొనగా నాకేమీ దెబ్బ తగల లేదు. ఒక కన్ను మాత్రం పోయింది.

నేను బౌద్ధమతం గురించి బాగా తెలుసుకొని ఉండడం వల్ల వారిని వాదనలో ఓడించాలనే ఉద్దేశంతో ఆ దేశాన్ని పరిపాలించే రాజు దగ్గరకు పోయి విషయం చెప్పాను. రాజు సభ ఏర్పాటు చేయగా, దానికి దగ్గరగా ఉన్న ఒక చెట్టుపై ఉన్న కోకిలగానాన్ని ఆధారంగా చేసుకొని బౌద్ధమతానికి వ్యతిరేకంగా పద్యం చెప్పాను. దానికి వారు ఎలాగైనా నన్ను ఓడించాలని భావించారు. బౌద్ధంలో ఉద్దండులైన పండితులు నాతో వాదనకు దిగారు. దాంతో రాజు మరొక పరీక్షపెట్టాడు. అదేమంటే ఒక కుండలో పామును ఉంచి దానిపైమూత పెట్టాడు.

"ఈ కుండలో ఏముందో చెప్పండి!" అంటూ నన్నూ- ఆ బౌద్ధ మతస్తుల్నీ అడిగాడు. అప్పుడు "మేము ఆ విషయం రేపు చెప్తాం!" అంటూ ఒకరోజు గడువుకోరి వెళ్లిపోయాం!

పీకలవరకూ నీటిలో మునిగి నేను లోకబాంధవుడైన సూర్యుడ్ని ఆరాధించాను. ఆయన దయవల్ల కుండలో ఏముందో మాకు తెలిసిపోయింది. మర్నాడు మేమంతా రాజసభకు వెళ్లాం! రాజు మమ్మల్నందర్నీ కుండలో ఏమున్నదని మళ్లీ అడగ్గా, బౌద్ధులంతా అందులో

'పామున్న దన్నారు. నేను "భోగీశ భోగశయనుడైన శ్రీవిష్ణుమూర్తి ఉన్నాడ"ని చెప్పాను.

నా మాట వినగానే,రాజు ముఖం వాడిపోయింది. వెంటనే ఆ కుండ మూత ఊడదీయించి చూసేసరికి, అందులో శేషశాయి అయిన శ్రీ విష్ణుదేవుని ఆకారం కనిపించింది. తాను ఏదైతే ఉంచాడో, అది మారిపోయి, నేను చెప్పినట్లే ఉండడంతో, ఆయన ముఖంలో క్రమంగా మార్పులు చోటుచేసుకున్నాయి. దేహం పులకిస్తుండగా, "ఎటువంటి సందేహం అక్కర్లేదు శ్రుతుల ప్రమాణమే నిజం" అని గ్రహించాడు.

తన భటుల్ని పిలిపించాడు. "హిమాలయాల మొదలు, యావద్భారత దేశమంతా ఉన్న బౌద్ధులందర్నీ పిల్లలు - వృద్ధులు అని తేడా చూడక వధించి రమ్మనీ- తేడా వచ్చిందో, జాలికొద్దీ ఎవర్నైనా వధించకుండా విడిచి పెట్టారో.... అలా వదిలిన భటుల్ని నేను చంపిస్తాను" అని మహాకోపంతో ఆజ్ఞాపించాడు.

మహాత్మా! ఒక్క అక్షరం చెప్పినా, గురువు అనే శబ్దానికి అర్హుడవుతున్నాడు. అటువంటిది నేను బౌద్ధగురువు దగ్గర, వారికి సంబంధించిన అన్ని శాస్త్రాలు అభ్యసించాను. చివరికి ఆ మతాన్నే నాశనం చేయించాను. గురుద్రోహం అనే మహాపాతకం నన్ను వేధిస్తోంది. అదీగాక బౌద్ధధర్మాన్ని అధ్యయనం చేస్తున్నప్పుడు 'పరమేశ్వరుడు అనేవాడు లేడు' అని నిందించాను. ఈ మహాపాతకాలు పోగొట్టుకోవాలనే ఉద్దేశం చేతనే ఈ జీవశరీరంతో సహా అగ్నిలో ప్రవేశించాను. ఇంతకంటే కూడ నీ పాదాలు దర్శించడమే దీనికి ఎక్కువ నిష్కృతి అని భావిస్తాను. నువ్వు అద్వైత మార్గాన్ని అవలంబించడానికీ - రక్షించడానికీ అవతరించిన పరమేశ్వరుడివి! నేను ఈ అగ్నిలో పడకముందైనా దర్శనం ఇచ్చావు కావు! ఈ ప్రాయశ్చిత్తంతో అవసరం లేకుండానే నేను కృతార్థుడ్ని అయ్యేవాడిని కదా! నీచే రచించబడిన భాష్యాలకు ప్రచారం చేయగల భాగ్యం నాకు లభించకపోయింది కదా! అని చింతిస్తున్నా" అన్నాడు.

దానికి శంకరుడు "మహాత్మా! అన్నీ తెలిసిన నీకు పాపాలు అంటుతాయా? సరైన ధర్మాలను తెలియజేయడానికి నీవు ఆ విధంగా చేయవలసి వచ్చింది. మండనమిశ్రుని ప్రఖ్యాతి నీవు వినే ఉంటావు. అతడు కూడా నా శిష్యుడే. కానీ నాకంటే విద్వాంసుడు. అతని భార్య కూడా విద్వాంసురాలే సాక్షాత్తు సరస్వతీ రూపమే. ఆమెను మధ్యవర్తిగా చేసుకొని వాదనలో అతణ్ణి జయించి అతనితోనే నీ భాష్యాలకు ప్రచారం చేయించు" అన్నాడు. "కాశీలో ఉండే విశ్వనాథుడిలా సమయానికి వచ్చావు. నాకు తారకోపదేశం చేయి! కృపాత్మా! క్షణకాలం ఇక్కడ ఉండు. యోగివైన నీ రూపం చూస్తూ ప్రాణాలను విడిచి కైవల్యం పొందుతాను" అని భట్టపాదుడు అన్నాడు.

దాంతో శంకరుడికి భట్టపాదునిపై దయకలిగి బ్రహ్మమును ఉపదేశించి మోహశూన్యుని చేశాడు. తర్వాత భట్టపాదుడు బంధాలను విడిచి కైవల్యం పొందాడు. ఈ విధంగా శంకరాచార్యుడు భట్టుపాదునికి ముక్తి కలిగించి శిష్యులను వెంటబెట్టుకొని మహిష్మతీ నగరం ప్రయాణమయ్యాడు.

ఈ విధంగా కథ చెప్పిన మణిసిద్ధుడు కాలాతీతం కావడంతో మిగిలిన కథను తర్వాత మజిలీలో ఈ విధంగా చెప్పసాగాడు.



# కాశీ మజిలీ కథలు

## 50వ మజిలీ

### తృతీయోల్లాసము

ఒకరోజు నారదుడు దేవలోకం నుండి భూలోకానికి వస్తుండగా మార్గ మధ్యంలో తుంబురుడు ఎదురుపడ్డాడు. కుశలప్రశ్నల అనంతరం తుంబురుడు "మునీంద్రా! ఇంత తొందర పడుతూ వెళుతున్నారు. ఎక్కడికేమిటి?" అంటూ ప్రశ్నించాడు. దానికి నారదుడు "కైలాసం నుండి వస్తున్నాననీ, భూలోకం వెళుతున్నాననీ," చెప్పగా తుంబురుడు కారణం అడిగాడు. నారదముని ఈ విధంగా చెప్పసాగాడు. "తుంబురుడా! విష్ణుమూర్తి బుద్ధావతారం ఎత్తి ఆ ధర్మాలను భూమి అంతా వ్యాపింపజేసిన సంగతి నీకు తెలుసుకదా! బౌద్ధశాస్త్రాలు చదివి బౌద్ధమతస్తులు వర్ణాశ్రమాలు, ఆచారాలు వదిలి శృతి దూషణ చేస్తూ, క్రతుభోక్తలకు క్షితి హవిర్భాగాలు ఇచ్చే వారు లేకపోవడంతో ఈ విషయాన్నంతా ఈశ్వరుడికి వివరించాడు.

అన్న ప్రదాతలు లేకపోతే కష్టమని భావించి ఈశ్వరుడు కరుణించి, వారికి అభయం ఇచ్చి మనుష్యరూపం ధరించి వారి కోరికను తీరుస్తానని చెప్పాడు. తర్వాత కుమారస్వామిని పిలిచి భట్టపాదుడనే పేరుతో బౌద్ధమతాన్ని ఖండించి, ముందు -ముందు నిగమంబుల కర్మకాండలు ఉద్ధరించమని ఆనతిచ్చాడు.

పితృవాక్య పరిపాలనా శీలుడైన కుమారస్వామి భూమిపై భట్టపాదునిగా జన్మించి ఇంద్రుని అంశవలన జన్మించిన సుధన్యుడిని ఆశ్రయించి బౌద్ధమతాన్ని ఖండింపజేసి కర్మమార్గాన్ని భూమి అంతా వ్యాపింపజేశాడు.

తరువాత పరమేశ్వరుడు దక్షిణ భారతదేశంలో శివగురుడు అనే బ్రాహ్మణుడికి కొడుకుగా జన్మించి, చిన్న వయస్సులోనే సకల విద్యలు అభ్యసించి, బ్రహ్మచర్యం నుండే సన్యాసం స్వీకరించాడు. తర్వాత గోవిందయతి అనుమతితో వ్యాసుని సూత్రాలను అద్వైత భాష్యాలను రచించి, శిష్యులతో కలిసి భట్టపాదునికి ముక్తిని కలిగించాడు బ్రహ్మాంశ సంభూతుడు, శాస్త్ర నిరతుడైన మండనమిశ్రుని జయించాలనుకుంటున్నాడు.

దుర్వాసుని శాపంవలన సరస్వతీదేవి ఉభయ భారతి అనే పేరుతో మండన మిశ్రుని భార్యగా జన్మించింది. ఇప్పుడు జరిగే ఈ పండితుల సంవాదంలో ఆమె మధ్యవర్తిగా వ్యవహరిస్తున్నది. అది చూడడానికే భూలోకం వెళుతున్నాను" అన్నాడు.

దానికి తుంబురుడు "ఆర్యా! మీకు మంచి భోజనమే దొరికింది. కానీ సకలలోక పూజ్యురాలైన సరస్వతీ దేవిని దూర్వాసుడు ఎందుకు శపించాడు? దానికి కారణం ఏమిటో చెప్పమని" అడిగాడు.

"మహాత్ముల చరిత్రలు స్మరించుకున్నాగానీ పుణ్యం కలుగుతుందని చెప్తారు. అయితే విను! పూర్వం ఒకసారి సత్యలోకంలో జరిగిన మహా సభలో గరుడు, గంధర్వ, దివిజగణాలు, దిక్పాలురు, మహర్షులు అనేకమంది తమ విద్యాపాటవాలను ప్రదర్శిస్తున్నారు. దూర్వాసుడు కూడా తనకు సామగానాలలో ప్రతిభ కలదని చెప్పి ఉచ్ఛస్వరంలో ఆ వేదాన్ని పఠిస్తున్నప్పుడు ఒకచోట స్వరం తప్పుగా పలికాడు. అది విని బ్రహ్మదేవుని ప్రక్కనే ఉన్న సరస్వతి నవ్వింది.

ఈ అవమానాన్ని దూర్వాసుడు సహించలేక క్రోధజ్వాలలతో ఇలా అన్నాడు "పరమేష్ఠి పత్నిననే గర్వంతో పెద్దా- చిన్నా తారతమ్యాలు మరచి మాబోటి తపోధనులలను పరిహసిస్తావా! కానిమ్ము! భూమిపై మనుష్య జాతిలో పుట్టు! ఇంకెప్పుడూ పెద్దలను పరిహసించకు!" అని శపించాను.

అది విని సరస్వతీ దేవి ఎంతో బాధపడింది. భాషాదేవి బాధ చూసి విధాత సహించలేక ఆ మునిని శాప విముక్తికై వాడుకున్నాడు. దూర్వాసుడు ఎట్టకేలకు కరుణించి "మనుష్య రూపంలో ఉన్న శంకరుని చూసి ప్రసంగించినప్పుడు శాప విమోచనం" కలుగుతుందన్నాడు.

తర్వాత సరస్వతీదేవి భూలోకంలో శోణానదీ తీరాన నివసించే విష్ణుమిత్రుడు అనే బ్రాహ్మణుడికి కూతురిగా జన్మించి 'ఉభయభారతి' అనే పేరుతో సకల కళలనూ అభ్యసించింది. చతురాననుడి అంశవలన జన్మించిన మండన మిశ్రునికి భార్య అయినది. ఇప్పుడు మనిషి రూపంలో జన్మించిన శంకరుడు ఆ మండనమిశ్రుని దగ్గరకు శిష్యులతో సహాసంవాదం చేయడానికి వెళుతున్నాడు. కనుక నేను వారి వాదనను వినడానికి భూలోకం వెళుతున్నాను. ఇప్పటికీ సమయం మించి పోయినది" అని చెప్పి నారదుడు అక్కడి నుండి నిష్క్రమించాడు.

కిశోర సమీరాలు మార్గాయాసం తీరుస్తుండగా కొంతసేపు శిష్యులతో సహా శంకరుడు అక్కడ విశ్రమించి, మధ్యాహ్న కార్యక్రమాలు నిర్వర్తించుకొని తిరిగా వెళుతుండగా వారికి దారిలో మండన పండితుడి పరిచారికలు ముగ్గురు నీళ్ళు తీసుకొస్తూ కనిపించారు. వారిని చూసి శంకరుడు మండన మిశ్రుని ఇల్లు ఎక్కడని అడిగాడు. శంకరుని రూప విశేషాలు చూసి వారు ఆశ్చర్యపడ్డారు. వారిలో ఒకామె శంకరునితో ఇలా అంది

"భూమ్మీద సుఖదుఃఖరూపాత్మక ఫలం అనుభవింప చేయడానికి కర్త పరమాత్మా లేక కర్మఫలితమా?" అంటూ ద్వారం దగ్గర చిలకలెక్కడ పలుకుతాయో అదే, మండనమిశ్రుని ఇల్లు"

అని పలికిన ఆ మగువల మధురమైన విశేషాలకు శంకరుడు ఆశ్చర్యపడి తిరిగి ఒకచోట మండన మిశ్రుని మందిరాన్ని కనుగొన్నాడు. అక్కడికి వెళ్ళడానికి వీలుకాకపోవడంతో శిష్యులను అక్కడే ఉండమని చెప్పి శంకరుడు యోగశక్తితో ఆకాశమార్గాన మందిరంలోకి వెళ్ళాడు.

ఈ సమయంలో మండనమిశ్రుడు శ్రాద్ధ విధిని చేస్తూ వ్యాసుడినీ, జైమిని మహామునిని భోక్తలుగా నియమించి వారికి కాళ్ళు కడుగుతున్న సమయంలో శంకరుడు రావడం చూసి, సన్యాసి అని భావించి కోపగించుకొన్నాడు.

## శంకర-మండన మిశ్రులసంవాదము

(ఈ సంవాదం మొత్తం సంస్కృతంలో నడిచినందున, సంస్కృత భాషా జ్ఞానం గలవారికిది గొప్ప రసవంతంగా తోస్తుంది. అట్టి పాఠకుల నిమిత్తం ఆ సంవాదం ఇక్కడ యధాతథంగా ఇచ్చాం!)

"కుతో ముండే?" అని అడిగాడు మండనుడు. (ఎక్కడ్నించిరాక?)

"ఆ గళాన్ముండీ" అని జవాబిచ్చాడు శంకరుడు. (మెడపైభాగం వరకే)

"తే పంథా మయా పృచ్ఛ్యతే?" (అదికాదు! నీ మార్గమేమిటని నాచే అడగబడుతోంది.)

"కి మాహా కంథాః పరియే!" (మార్గంలోనే వచ్చాను)

"త్వన్మాతా ముండేతి" అన్నాడు మండనుడు.

"తదైవహి" (బాగు!బాగు! నీవు మార్గం అడిగినందుకు 'నీతల్లిముండ' అని మంచిజవాబే!)

"సురా పీతా కిం" (పిచ్చిమాటలొస్తున్నాయి. కల్లుతాగావా?)

"నహి నహి. శ్వేతా స్మర. ('పీతా' అనే పదాన్ని 'పసుపురంగు' అనే అర్థంలో తీసుకుని జవాబు ఇచ్చాడు -తెల్లగా ఉంటుంది కల్లు అని)

"త్వం తద్వర్ణం జనాసికిం?" (అలవాటుగనుక దానిరంగు నీకు బాగా తెలిసి ఉంటుంది.

"నేను రంగును-నువ్వు రుచినీ ఎరుగుదుం కాబోలు"

"ద్వారపాలకుల్ని వంచించి, దొంగలాగ వచ్చావే!"

"భిక్షుకులకు అన్నంపెట్టక దేగలా నువ్వు భోజనం చెయ్యడానికి ప్రయత్నించడంలేదా? (ద్వారం మూసి ఉన్నందుకు హేళనగా)

"ఛీ ఇట్టి కర్మకాలంలో, మూర్ఖుడవైన నీతో మాట్లాడటం తటస్థించిందిదేమి కర్మమో!" అనుకున్నాడు మండన మిశ్రుడు.

"ఆహా! 'యతి'భంగంగా మాట్లాడే నీ జ్ఞానం వెల్లడైంది. చాల్చాలు" అని శంకరుని జవాబు

"నీవాయతివి దుర్బుద్ధీ!" అని మండనమిశ్రుడు దుర్భాషలాడుతుండగా దానికి తగిన సమాధానాలు శంకరుడు, చెప్పడం చూసి అక్కడికి భోక్తలుగా వచ్చిన వ్యాసుడు, జైమినులు మండనుడితో "వత్సా! తత్త్వవేత్త అయిన అతిథి ఇంటికి వచ్చినప్పుడు వారిని పూజించడం మానేసి ఇలా తగువు పడడం మంచిదికాదు. ఇక తగువు ఆపి వారికి అతిథిపూజ చేయమని ఆజ్ఞాపించిన వ్యాసుని మాటలు కాదనలేక మండనమిశ్రుడు శాంతించి శంకరుని పూజించి అతన్ని భిక్షకోసం పిలిచాడు. అప్పుడు శంకరుడు

మండన పండితుడితో “ఆర్యా! నేను అన్నార్థినై నీ దగ్గరకు రాలేదు. వాదభిక్ష కోసం వచ్చాను. సమర్థుడవైతే అదిచ్చి పంపించు! అందులో ఓడిపోతే ఓడినవారు గెలిచిన వారికి శిష్యులుగా ఉండాలి. యతినిషిద్ధమైనట్టి వాద భిక్ష నీకెందుకంటావా! ఉపనిషన్మార్గాలను వెల్లడి చేయడం కంటే నాకు వేరే కోరిక లేమీ లేవు”

“సంసారతాపాన్ని పరిహరించి, పరమానంద సుఖాన్ని పొందుతూ ఉండే నీ వలన సన్మార్గాలు తిరస్కరించబడ్డాయి. నీలాంటి వారినందరినీ వాదంలో జయించి ఈ లోకమంతా ఆ మార్గాలకు ప్రఖ్యాతి కలగజేస్తాను. నువ్వు కూడా ఈ మతాన్ని స్వీకరించు. లేకపోతే నాతో వాదనకు దిగు. దానికి కూడా చాలకపోతే ఓడిపోయానని ఒప్పుకో” అని శంకరుడు అన్నాడు.

మండనయతి ఆ మాటలకు ఆశ్చర్యపోయి, ఆత్మగౌరవాన్ని అనుసరించి “మండనముని పాండిత్యాన్ని నీవు ఎరుగవు. సహస్ర ముఖుడైన అనంతుడు వచ్చినాగానీ పరాభవిస్తాడే కానీ ‘జితోస్మి’ అని పలుకడు. వేదసమ్మతమైన మతాన్ని విడిచి, వ్యాసుని మతాన్ని గానీ, నీ మతాన్ని గానీ, స్వీకరించను. ఎప్పటికైనా భూమిపై ఒక పండితుడు పుట్టక పోతాడా సరస ప్రసంగం ఎప్పటికైనా జరగకపోతుందా అని నేను ఎప్పుడూ ఎదురు చూస్తూ ఉంటాను. అలాంటి సందర్భం ఈ రోజు నన్ను వెతుక్కుంటూ వచ్చింది. ఇప్పుడు మనిద్దరి మధ్యా ప్రసంగం జరుగుతుంది. పుష్కలమైన నా శాస్త్ర పరిశ్రమ ఫలిస్తుంది. స్వయంగా వచ్చి అమృతాన్ని రుచి చూపిస్తానంటే భూలోక వాసులు మాత్రం వదులు తారా! గర్వంతో నా వాక్చాతుర్యాన్ని తెలుసుకోలేక వాదానికి రమ్మంటున్నావు. వాదం అంటే నాకు చాలా సరదా! ఈ కోరిక నాకు చాలా కాలం నుంచీ ఉంది. కానీ ఏ పండితుడూ ఈ కోరిక తీర్చలేకపోయాడు.

సరే నీతో వాదానికి దిగుతాను. కానీ మన వాదనలో జయాపజయాలు నిశ్చయించే మధ్యవర్తి ఎవరు? మధ్యవర్తి లేకపోతే వాది ప్రతివాదుల సంవాదము కంఠశోషమే అవుతుంది. మనం ప్రసంగిస్తున్నప్పుడు తెలియజేయాల్సిన ప్రతిజ్ఞ ఏది? నేను గృహస్థుడను. నీవు భిక్షకుడవు. తర్వాత ఏమనుకున్నా లాభం లేదు. వాదాన్ని రేపు ప్రారంభిద్దాము. ఇప్పుడు

మధ్యాహ్న కార్యక్రమాలు నిర్వర్తించుకొని ఆతిధ్యం పొందమని మండనుడు పిలువగా శంకరుడు సమ్మతించాడు.

తరువాత మండన మిశ్రుడు మధ్యవర్తులుగా ఉండమని వ్యాస జైమినులను కోరాడు. దానికి వారు "ఆర్యా! నీ భార్య సాక్షాత్తు సరస్వతీ స్వరూపం ఆమె మీకు మధ్యవర్తిగా ఉండి జయాపజయాలు నిర్ణయించగలదు. మీరు దానికి అంగీకరించండి" అన్నారు. ఉపనిషత్తులకు అర్థాలు తెలిసిన వ్యాసజైమినులు, శంకరుడు ముగ్గురు భోజనం చేసిన తర్వాత ఒకచోట కూర్చొని సంతోషంగా అలౌకిక విషయాలు మాట్లాడుకున్న అనంతరం వ్యాసజైమినులు అంతర్ధాన మయ్యారు. శంకరుడు నర్మదానదీ తీర పరిసరాలలో తిరుగుతూ అక్కడ ఒక ఉద్యానవనంలో ఉన్న దేవాలయంలో నివసించి శిష్యులతో సహా అక్కడి విషయాలు చర్చించి ఆ రోజును గడిపాడు.

ఆ మరునాడు శంకరుడు, పద్మపాదుడు మొదలైన శిష్యులతో మండన పండితుని సభా భవనానికి రావడం చూసి ఆ పండితుడు సంతోషంగా వారికి స్వాగతం పలికి, అతిధి మర్యాదలుచేసి, సమస్త విద్యావిశారద అయిన ఉభయభారతిని వారి సంవాదానికి మధ్యవర్తిగా ఉండమని నియమించాడు. పతివ్రతా శిరోమణి అయిన ఉభయభారతి, భయ భారతి అయిన సరస్వతీదేవికి ఏమాత్రం తేడాలేదన్నట్లుగా ఆ సభా భవనంలో ప్రకాశించింది. సభలో వారిద్దరూ ఇలా ప్రతిజ్ఞ చేశారు.

"ఉపనిషత్ అర్థాలను ప్రమాణాలుగా చేసుకొని వాదిస్తానని అందులో గానీ ఓడిపోతే గృహస్థుడనవుతానని" శంకరుడు ప్రతిజ్ఞ చేశాడు. దానికి మండన మిశ్రుడు "ఈ వాదంలో కనుక నేను ఓడిపోతే గృహస్థాశ్రమం వదిలి సన్యాసం స్వీకరించి నీ శిష్యుడి నవుతానని" ప్రతిజ్ఞ చేశాడు.

వారిద్దరూ ఈ విధంగా ప్రతిజ్ఞలు చేసుకున్న తర్వాత ఉభయభారతి వారి మెడలో పూలమాలలు వేసినది. ఎవరి మెడలోని పూలమాల వాడిపోతే వారు ఓడిపోయినట్లుగా భావించమని చెప్పి ఆమె గృహకార్యాలు చక్కబెట్టడానికి వెళ్ళిపోయింది.

వారి ప్రసంగాన్ని వినాలనే ఉద్దేశంతో వచ్చిన బ్రహ్మాది దేవతలు ఆ గృహప్రాంత అంతరిక్షంపైగల విమానాలపై నివశించారు. శంకరుడు,

మండన మిశ్రుడు అభిముఖంగా కూర్చొని, చిరమందహాసంతో తొందర పడకుండా వేదాన్ని ప్రమాణంగా చేసుకొని ఈ విధంగా వాదిస్తున్నారు.

ముందుగా మండన పండితుడు "ఆర్యా! మీ వలన జీవేశ్వరులకు ఒకే రూపం ఉందని అంగీకరించబడింది. దీనికి ప్రమాణం ఏమిటని అడుగగా దానికి శంకరుడు మహాత్ములు తత్త్వంతో పరమాత్మను ఆత్మతత్త్వంగా బోధించారు. అదే దానికి ప్రమాణం అని చెప్పాడు. దానికి మండనుడు అన్ని విషయాలు తనకు తెలియక పోవడం వలన జీవుడు ఈశ్వరుణ్ణి వ్యతిరేకిస్తున్నాడనేది నీ అనుమానం మాత్రమే. తర్కంతో మీకు ఈ విషయం తెలియదా! అని అడగ్గా శంకరుడు తర్కం నాకు తెలియలేకకాదు. దీని గురించి అనుకోవాల్సిన పనిలేదు" అన్నాడు.

ఈ విధంగా మృదువాక్య చాతుర్యంతో, శాస్త్రదృష్టాంతాలతో మండన మిశ్రుడి ప్రశ్నలన్నింటికీ సరైన సమాధానాలు చెప్తూ, తన మతాన్ని స్థిరపరుచుకుంటున్న శంకరయతీంద్రుని పాండిత్యాన్ని చూసి, తన భర్త మెడలోని పూలమాల వాడిపోవడం గమనించి ఉభయభారతి ఆశ్చర్యపోయి వారిని భోజనానికి రమ్మని పిలిచింది. భోజనానంతరం ఆమె శంకరునితో ఇలా అన్నది.

"ఆర్యా! నీవు ఆదిశంకరుడవని నేను గ్రహించాను. దూర్వాసుని శాపం పోయి నీ దయ వలన కృతార్థురాలినైనాను. ఇక నేను సత్యంలోకం వెళతాను" అన్న సరస్వతీదేవిని కూడా జయించాలని అద్వైతమత స్థాపన చెయ్యాలనే ఉద్దేశంతో శంకరుడు "దేవీ! నువ్వు లోకరక్షణార్థం అవతరించిన దానివని నాకు తెలుసు నేను నీ భక్తుడను. నా మీద దయుంచి మరి కొంత కాలం ఇక్కడే ఉండు" అన్నాడు. మండన మిశ్రుని అనుమతి కోసం ఉభయభారతి, శంకరుడు ఆయన ముఖం చూశారు.

దానికి మండన మిశ్రుడు "ఆర్యా! నాకీ పరాజయం వలన కొంచెమైనా బాధ లేదు. కానీ జైమిని వాక్యాలను పరిహాసం చేశానని బాధపడుతున్నాను. సకలకళా నిపుణుడైన జైమిని ఈ పనికిరాని సూత్రాలను ఎందుకు రాసినట్టు? అనే సందేహం నాకు కలుగుతోంది" అన్నాడు. శంకరుడు నవ్వుతూ ఇందులో జైమిని చేసిన తప్పేమీలేదు మనమే ఆయన

అభిప్రాయాన్ని ఖండించినంత మాత్రాన జైమినిముని నిరాశావాదా? అని జైమిని వాక్యాలలో గల రహస్య విశేషాలను తెలియజేయడంతో మండన పండితుడు ఎంతో ఆనందించి హృదయంలోనే భక్తి పూర్వంగా జైమిని మహామునికి నమస్కరించాడు.

జైమిని ప్రత్యక్షమై "మహాత్మా! నా సూత్రాలకు శంకరుడు ఏ అర్థాలనైతే చెప్పాడో నా హృదయంలో కూడా అవే అర్థాలు ఉన్నాయి. ఈ మహాత్ముని మాటలతో సందేహాలన్నింటినీ వదిలి, యదార్థాలను తెలుసుకో. భూత భవిష్య వర్తమాన విషయాలను తెలుసుకునే మహిమ శంకరునికి ఉంది. నా గురువైన వ్యాసమహర్షి రాసిన సూత్రాలకు విరుద్ధంగా నేనొక్క సూత్రాన్నైనా చెప్పగలనా?" అని మండన మిశ్రునితో అన్నాడు.

దాంతో మండన మిశ్రుడు శంకరుని పాదాలపైపడి "స్వామీ! సంసార కూపంలో చిక్కుకున్న నన్ను ఉద్ధరించడానికి వచ్చిన నీకంటే పరమ హితుడు నాకింకెవరూ లేరు. కరుణించి నన్ను నీ శిష్యునిగా స్వీకరించు" అన్న మండన మిశ్రుని శిష్యునిగా స్వీకరించదలచి ఆయన భార్య అయిన ఉభయ భారతిని సాభిప్రాయంగా శంకరుడు చూశాడు.

## ఉభయభారతి బాల్యదశ

శంకరుని అభిప్రాయాన్ని గ్రహించి ఆ మహాదేవి "ఆర్యా! మండన మిశ్రుడు మీకు శిష్యుడు అవుతాడని నాకు ముందుగానే తెలుసు! నా చిన్నతనంలో మా తల్లిగారి ఇంట్లో ఉన్నప్పుడు ఒక మహర్షి వచ్చాడు. ఆయనను తగురీతిలో సత్కరించి ప్రసన్నుడైన సమయంలో మాతల్లి ఆయనతో ఇలా అంది. "స్వామీ! మీరు తపోమహిమతో త్రికాల వృత్తాంతాలు తెలుసుకుంటారు కదా! ఈ పసిపాప నా కూతురు. దీనిని గారాబంగా పెంచుకుంటున్నాము. దీని ఆయుష్షు ఎంత కాలం? భర్త ఎలాంటివాడు? పిల్లలు ఎంతమంది? ధనధాన్యాలను కలిగి ఉంటుందా? దీని భవిష్యత్తు ఎలా ఉంటుందో చెప్పండి" అని వేడుకుంది. ఆ మహాత్ముడు కొంతసేపు కళ్ళుమూసుకొని ధ్యానం చేసి "యువతీ! నీ కూతురు ఎంతో సౌఖ్యాన్ని అనుభవిస్తుంది. వేదమార్గము బాహ్య మతాల వలన మరుగున పడే

సమయంలో మండన పండితుడు అనే వాడికి భార్యకాగలదు. అతనితో కలిసి అనేక యజ్ఞయాగాలు చేసి పుత్రపౌత్రాది సంపదలతో చిరకాలం సుఖంగా జీవించగలదు. తర్వాత ఇతరమతాల వలన నష్టపోతున్న ఉపనిషత్సిద్ధాంతాలను సాధించడానికి శంకరుడు భూమిపై అవతరించి అతని ఉపన్యాసాలతో దీనిని పవిత్రం చేస్తాడు. యతి వేషంలో ఉన్న ఆ మహాత్మునితో నీ అల్లుడు వాదించి అతనినే శరణువేడుకుంటాడు" అని తెలిపి ఆ మహర్షి అంతర్ధానమయ్యాడు.

'ఆ మహర్షి చెప్పినట్లుగానే జరిగింది. ఇతడు నీకు శిష్యుడే అవుతాడు. అయితే నీకింకా పూర్తిగా విజయం కలుగలేదు. ఎందుకంటే నేను మండన పండితుని భార్యను. ఆయనలో సగభాగాన్ని కాబట్టి నన్ను కూడా వాదనలో జయించి ఆ తర్వాత అతనిని శిష్యునిగా స్వీకరించు. నువ్వు జగదీశ్వరుడవైన పరపురుషుడి వని తెలుసు. అయినా నీతో వాదించాలని నాకు ముచ్చటగా ఉంది" అని ఉభయభారతి పలికిన పలుకులు విని మధుర గంభీర యుక్తమైన ఆమె మాటలకు ఆనందించి శంకరుడు ఇలా అన్నాడు.

"దేవీ! నేను కూడా నీతో వాదించాలనే అనుకుంటున్నాను. కానీ అది అనుచితంగా తోస్తున్నది. ఎందుకంటే కీర్తిశాలురు స్త్రీలతో వాదించడాన్ని సమ్మతించరుకదా!" అనగా దానికి ఉభయభారతి ఇలా అంది "శంకరా! ఎవరైతే స్వమత ఖండన చేస్తారో వారిని జయించడానికి స్త్రీలుకానీ, పురుషులు కానీ ప్రయత్నం చేయాలి. దీనిలో స్త్రీ, పురుష వివక్ష ఎందుకు? అంతేకాకుండా పూర్వం గార్గి అనే కాంతామణితో యాజ్ఞవల్క్యుడు ప్రసంగం చేయలేదా! బృహదారణ్యకోపనిషత్తు చూడు. స్వమత రక్షణార్థం ప్రవర్తించే నీవు ఇలా మాట్లాడడం న్యాయంకాదు" అన్న ఉభయభారతి మాటలు విని ఆమెతో వాదించడానికి శంకరుడు సమ్మతించాడు.

## శంకర - సరస్వతుల సంవాదము

**త**రువాత ఆ సభలో శంకర సరస్వతులు ఇద్దరూ ఎవరికి వారే విజయం సాధించాలనే ఉద్దేశంతో విద్వాంసులకు సైతం ఆశ్చర్యం కలిగించే విధంగా అద్భుతంగా ప్రసంగం చేస్తున్నారు. విచిత్ర పదాలతో ప్రయోగాలు

చేస్తూ, అహోరాత్రులు ఏకధాటిగా పదిహేడు రోజులు ప్రసంగం చేశారు. ఆ విధంగా వాగ్దేవి పదిహేడు రోజులు అన్నిశాస్త్రాలలో శంకరుని పాండిత్యాన్ని పరీక్షించి దేనిలోనూ అతన్ని జయించలేకపోయింది. శంకరుడు బాల్యంలోనే సన్యసించి ఉన్నందువల్ల అతన్ని మదన శాస్త్రంలో ప్రశ్నలడిగి ఓడించాలి. ఇంతకంటే వేరే మార్గం లేదనుకొని ఈ విధంగా ప్రశ్నించింది.

"మునీంద్రా! మన్మథ కళలెన్ని? వాటి స్వరూప స్థానాలేమిటి? అవి శుక్ల, కృష్ణ పక్షాలలో ఎలాంటి వ్యత్యాసాన్ని కలిగిఉంటాయి? స్త్రీలలో, పురుషుల్లో ఎలా ఉంటాయి?" అని అడిగింది. దానికి శంకరుడు సమాధానం చెప్పకుండా కొంతసేపు ఆలోచించి యతుల నియమాలను కాపాడుకోవాలనే ఉద్దేశంతో "సాధ్వీ! నాకొక నెల గడువుఇవ్వు. నెలాఖరున నీ ప్రశ్నలకు సమాధానాలు చెప్తాను" అన్నాడు ఉభయభారతి గడువు ఇవ్వడానికి ఒప్పుకోవడంతో సభ ముగిసింది. శంకరుడు సనందాది శిష్యులతో నర్మదానదీ తీరంలో గల ఉద్యానవనంలో ఆ రాత్రి గడిపాడు.

ఆ మరునాటి ఉదయం శంకరుడు యతి శిష్యులతో ఆకాశమార్గాన ప్రయాణిస్తూ ఒక అడవి మధ్యలో రాత్రి వేటకోసం వచ్చి చనిపోయిన అమరకుడు అనే రాజుని చూశాడు. అతని భార్యలు వందమంది అతని చుట్టూ చేరి ఆ అడవిలో ప్రతిధ్వనించేటట్లు ఏడవడం చూసి బాధపడి సనందునితో ఇలా అన్నాడు. "సనందనా! ఈ రాజు చనిపోయి ఉన్నాడు. ఇతని భార్యలు సౌందర్య సౌభాగ్యాలతో చూడముచ్చటగా ఉన్నారు. పాపం పతి వియోగంతో బాధపడుతున్నారు. నేను ఇతని శరీరంలో ప్రవేశించి వారికి బాధ నుండి విముక్తి కలిగిస్తాను. ఈ రాజు కొడుకుని పట్టాభిషిక్తుడిని చేసి మళ్ళీ నాశరీరంలోకి ప్రవేశిస్తాను. అంతేకాక ఉభయభారతి అడిగిన ప్రశ్నలకు సమాధానాలు తెలుసుకొని వస్తాను" అన్నాడు.

దానికి సనందుడు "స్వామీ! నేను మీ మాటలను కాదనేంతటి వాడినికాదు. సర్వజ్ఞులైన మీకు తెలియంది కాదు! అయినా భక్తితో చెబుతున్నాను. పూర్వం మత్స్యేంద్రుడు అనే మహాత్ముడు ఒకచోట మృతుడైన మహారాజు శరీరాన్ని చూసి తన శిష్యుడైన గోరక్షుడితో తన కళేబరాన్ని కాపాడమని చెప్పి ఆ రాజు శరీరంలో ప్రవేశించి రాజ్యపాలన చేయసాగాడు. ఆ మహర్షి

సింహాసనం ఎక్కింది మొదలు ఆదేశం సస్యశ్యామలం అయింది. అతని మంత్రులు ఈ తేజస్సును చూసి "ఈయనెవరో పరకాయప్రవేశ విద్యా నిపుణుడైన యోగిలా ఉన్నాడు. కాకపోతే చనిపోయినవాడు ఎక్కడైనా బ్రతుకుతాడా? అతడు తిరిగి తన శరీరానికి వెళ్ళకుండా ఇక్కడే ఉండాలనే ఉద్దేశంతో రూపయవ్వన కళావిలాసాలలో ఉన్న అతివలను అతని సేవలకు నియమించారు. ఈ వినోదాలను చూస్తూ ఆ యోగి పూర్వ వృత్తాంతాన్ని మరచిపోయాడు.

గోరక్షుడు చాలా కాలం గురువుకోసం ఎదురుచూసి ఆయన ఎంతకీ రాకపోవడంతో ఆ శరీరాన్ని మరొకచోట దాచి గురువు కోసం వెతుకుతూపోయి, జరిగినదంతా తెలుసుకొని, ఆ కాంతలను ఆశ్రయించి, వారికి అంతరంగికుడైనాడు. ఇలా ఉండగా ఒకరోజు ఆ యోగికి పూర్వ వృత్తాంతం గుర్తొచ్చి విచారిస్తున్న సమయంలో గోరక్షుడు ఆయనను సమీపించి విషయం వివరించాడు. ఆ తర్వాత ఆ యోగి తన శరీరంలోకి ప్రవేశించాడు.

"అయ్యా! భూమి మీద శిధిలమవు తున్న యతి ధర్మాలను నిలుపడానికి కంకణం కట్టుకున్న మీకు ఇది తెలియనిది కాదు. అయినా మీ దగ్గర ఉండే పరిచయంతో ఇదంతా చెప్పాను. నా తప్పును మన్నించండి" అన్నాడు దానికి శంకరుడు "వత్సా! నీవు నిజమే చెప్పావు కానీ తత్త్వవేత్తలకు పాపాలు అంటవు. విశిష్ట మార్గ పరిపాలన కోసం కన్యశరీరాన్ని ఆశ్రయిస్తున్నాను" అని చెప్పి శిష్యులతో సహా వెళ్ళి మానవులు ఎవరూ ఎక్కడానికి వీలుపడని పర్వత శిఖరం మీద దిగాడు. తర్వాత శంకరుడు శిష్యులతో "నేను అమరకుని శరీరంలోకి ప్రవేశించి పంచశరకళా పాండిత్యాన్ని సంపాదించుకొని వస్తాను. అంతవరకు నా కళేబరానికి ఏ అపాయం రాకుండా కాపాడండి" అని చెప్పి యోగబలంతో అమరకుని శరీరంలోకి ప్రవేశించాడు.

అలా శంకరుడు అమరకుని శరీరంలో ప్రవేశించగానే అతడు కొంచెం కదలసాగాడు. తర్వాత నిద్రలోంచి లేచినట్లుగా లేచాడు. అతని భార్యలు, మంత్రులు ఎంతో సంతోషించారు. ఆ తర్వాత అందరూ కలిసి రాజ్యానికి వెళ్ళారు. ఆ రాజు శరీరంలో ఉన్న శంకరుడు సింహాసనం ఎక్కి ప్రజలను న్యాయంగా పరిపాలించడం మొదలు పెట్టాడు.

ఆ సమయంలో మంత్రులు రహస్యంగా ఈ విధంగా మాట్లాడుకుంటున్నారు. "మిత్రులారా! మన రాజుగారు పూర్వంలా కాకుండా ఇప్పుడు ఎంతో న్యాయంగా పాలిస్తున్నారు. ఋతువులు కూడా సక్రమంగా వస్తున్నాయి. ఇదంతా మనరాజుగారి ప్రభావం మాత్రం కాదు. పరకాయ ప్రవేశంలో నిపుణుడై మహాత్ముడెవరో ఈయన శరీరంలో ఉన్నాడు. ఆ మహాత్ముని శరీరం వేరెక్కడో ఉండి ఉంటుంది.. కాబట్టి మనం మొత్తం రాజ్యాన్నంతా వెదికి కనబడిన శవాలన్నింటినీ దహనం చేయమని భటులను పురమాయించారు. రాజుగారు రాణులతో కాలం గడుపుతూ రాజ్య కార్యక్రమాలన్నీ మనల్నే చూడమన్నారు. కాబట్టి దీనిని గురించి ఆయనకు ఏమీ చెప్పక్కర్లేదు" అనుకుంటూ అక్కడి నుండి వెళ్ళిపోయారు.

అమరకుడు రాజ్యభార్యాన్ని మంత్రులకు అప్పగించి పట్టణానికి దూరంగా ఉన్న క్రీడాశైలమునకు నూరుగురు భార్యలతో కలిసివెళ్ళాడు. అక్కడ కొంతకాలం, వారితో కలిసి ఆనందించాడు.

ఈ విధంగా కథచెప్పిన మణిసిద్ధుడు కాలాతీతం కావడంతో తర్వాత మజిలీలో కథను చెప్పడం ప్రారంభించాడు....



# కాశీ మజిలీ కథలు

## 51వ మజిలీ

### చతుర్థోల్లాసము

ఆ విధంగా శంకర యతీంద్రుడు అమరకుని శరీరంలో ప్రవేశించి రాణులతో క్రీడా విశేషాలు అనుభవిస్తూన్నాడు. నియమించిన సమయం మించిపోవడంతో కొండబిలంలో కళేబరం దగ్గర కాచుకొని ఉన్న శిష్యులు విచారంతో వారిలోవారు ఇలా సంభాషించుకుంటున్నారు.

"అయ్యో! మన ఆచార్యుడు చెప్పిన సమయం దాటిపోయి ఐదారు రోజులైంది. అయినప్పటికీ ఇంతవరకు తన శరీరంలో ప్రవేశించలేదు. ఇప్పుడు ఏం చేస్తాం? ఎక్కడని వెదుకుతాం? ఆయన జాడచెప్పేవారు ఎవరు? గురువుగారు తొందరగా రాకపోతే మన బాధను పోగొట్టేవారు ఎవరు?"అంటూ విచారించసాగారు.

దానికి పద్మపాదుడు "మిత్రులారా! బాధపడకండి. నాకో ఉపాయం తోస్తున్నది. మనం ఆయన గురించి భూలోకంలోనే కాక స్వర్గపాతాళలోకాలలో సైతం వెదుకుదాము" అన్నాడు. అంతలో అన్యశరీరంలో ఉన్న గురువుగారిని ఎలా గుర్తించాలా అని ఆలోచిస్తున్న సమయంలో "ఎక్కడైతే ప్రజలు సుఖసంతోషాలతో ఉంటారో, ఎక్కడైతే రోగశోకాది బాధలు లేకుండా ఉంటారో, ఏ ప్రాంతంలో అయితే వర్షాలు చక్కగా కురుస్తూ, పంటలు బాగా పండుతాయో అక్కడే శంకర యతీంద్రులవారు ఉంటారు" అన్నాడు.

గురువుగారి శరీరాన్ని రక్షిస్తూ కొందరు ఇక్కడ ఉంటారు. మరికొందరు ఆయనను వెదకడానికి వెళతారు అన్నట్లుగా ఒప్పందం చేసుకొని కనబడిన వారినందరినీ అడుగుతూ దేశాటన చేయసాగారు.

ఈ విధంగా శంకరుని గురించి వెదుకుతూ ఒక రాజధానీ నగరం చేరి ఒక బ్రాహ్మణుని ఇంట ఆతిథ్యం స్వీకరించారు. ఆ బ్రాహ్మణుడు శంకరుని శిష్యులను తగిన రీతిని సత్కరించిన తరువాత వారు "అయ్యా! ఈ రాజ్యం ఎవరిది? మీ రాజు పండితులను గౌరవిస్తాడా? సారస్వతం ఉన్నదా? అతడు ఏ విద్యలను ఇష్టపడతాడు? వయస్సెంత? విశేషాలు ఏమిటని?" అడిగిన శిష్యులతో బ్రాహ్మణుడు ఇలా చెప్పాడు.

"ఆర్యులారా! మా దేశాన్ని పాలించే రాజుపేరు అమరకుడు. ఆయన ఎంతో మంచివాడు. ధర్మాత్ముడు. ఈ మధ్య ఒక విశేషం కూడా జరిగింది. వినండి! కొంత కాలం క్రిందట మా రాజుగారు వేట కోసం వెళ్ళి మృత్యువాత పడినాడు. ఇంతలో ఏదో అద్భుతం జరిగినట్లు వెంటనే నిద్ర నుండి లేచినట్లుగా లేచాడు. అంత వరకూ బాధపడుతున్న ఆయన వందమంది భార్యలు, మంత్రులు, మరికొందరు మొదట ఆశ్చర్యపడి, తర్వాత రాజుగారు బ్రతికినందుకు ఎంతో సంతోషించారు. నేను కూడా అక్కడే ఉన్నానప్పుడు. మారాజు రాజ్యాన్ని మంత్రుల చేతులోపెట్టి, భార్యలతో వేడుకలను భవిస్తూండడాన్ని బట్టి ఇప్పుడు మీవంటి వాళ్ళు ఆయనను దర్శించడానికి తగిన సమయం కాదు. సంగీత విద్యావేత్తలకు తప్ప ఇతరులెవరికీ ఆయన దర్శనం ఇవ్వడం లేదని తెలుస్తోంది. ఇదీ నేనెరిగివున్న వృత్తాంతం" అని చెప్పాడు.

ఆ కథ విన్న పద్మపాదుడు మొదలైనవారికి చాలా సంతోషం కలిగింది. "తరుణులతోకూడా మన్మథ శాస్త్రాన్ని మధిస్తున్న ఆ మహానుభావుడు మన గురుదేవుడే! సందేహంలేదు. ఆ రోజున నాకు అమరకుడనే పేరే చెప్పినట్లుగా ఇప్పుడు గుర్తొస్తోంది" అని ఒకరితో ఒకరు ముచ్చటించుకున్నారు. క్రమంగా పౌరులను గానప్రావీణ్యంతో రంజింపచేసేలా పాటలుపాడే గాయకుల వేషాల్లో బయలుదేరారు. మెల్లగా ప్రభువు దృష్టిలో పడ్డారు.

శృంగార లీలల్లో తేలియాడుతూన్న తమగురువుని కనులారాగాంచి

"క. **మదన కళా పాండిత్యం**
**బొదవగ దొలి మేనును విడిచి యొగి నిచ్చట ష**
**ట్పదమా! క్రుమ్మరెదవు నీ**
**వది ఎరుగక ఇట్లు మోహమందుట తగునే?**

గీ. **అరయ నేది జాగ్రదాద్యవస్థల నను**
**స్యూతమై యుపాధి జాత మంట**
**క, సరులందు దార మట్ల వెరుగ నుండు**
**నట్టి తత్త్వ మీవె యతివతంస**

అని, మహారాజు కళేబరంలో ఉన్న శంకరునికి మనోహర స్వరంతో గంధర్వగానం చేసి మరీ వినిపించారు. అమరకుడు ఆగానానికి వివశత్వం పొందిన వాడో ఆ గానంలోని భావానికి పశ్చాత్తాపం చెందినవాడో గాని సింహాసనం యొక్క చేతిభాగం నిల్పుకొనే చోట తలవాల్చి కనులుమూశాడు.

రాజభటులు, ఆయన నిద్రపోతున్నాడనుకుని సభాసదులను సద్దుచేయవద్దని కోరారు. అందరూ మౌనం వహించారు. రాజు ఎంతసేపటికీ నిద్రచాలించకపోయేసరికి, కొందరు సుందరీ మణులు దగ్గరగా వెళ్లి కళదప్పివున్న అతన్ని చూసి "అయ్యో! ఇదేం చిత్రం? ఈ రాజు మళ్లీ మూర్ఛ చెందినట్లు కనిపిస్తున్నాడు" అని గట్టిగా అరవడంతో, రాజు భార్యలంతా దగ్గరగా వచ్చి చూసి గుండెలు బాదుకుంటూ, "మన ప్రాణనాధుడు మనకు దక్కేలా లేడు. ఎంతలోనే ఎంతో సంతోషపెట్టి, ఇట్లా అయ్యాడేమి?" అని రకరకాలుగా అతడ్ని తల్చుకుంటూ గుండెలు బాదుకోసాగారు. అంతలోనే మంత్రి సామంతాది పురోహితబృందం అక్కడకు వచ్చి, అమరకుని మృతికి ఆశ్చర్యపడి, అంతకు ముందు జరిగిన కథంతా తెలుసుకుని "ఆ గాయకు లెక్కడ?" అంటూ కేకవేశారు.

ఆ గాయక వేషధారులైన శిష్యులు, మంత్రుల ప్రశ్నలకు తొణక్కుండా "అయ్యా! మాకోదేశం అంటే ఏదీ లేదు. అన్ని దేశాలూ తిరుగుతూంటాం! ఇక్కడి కొచ్చి నాలుగురోజులైంది. రాజుగారి ఆనతి మేరకే లోపలి కొచ్చాం! ఆయన ఆజ్ఞప్రకారమే భ్రమరగీతాలు పాడాం!" అని జవాబులు చెప్పి "ఏఏ గీతాలు పాడారో మళ్లీ పాడండి" అని మంత్రులు ఆజ్ఞాపించడంతో, తాము

పాడిన పద్యాలు మళ్ళీ రాగయుక్తంగా వినిపించి "అయ్యా! ఇన్ని ప్రశ్నలు దేనికి వేస్తున్నారు?" అని అడిగారు. "పని ఉంది. సరే! వీటికి అర్థం చెప్పండి" అన్నారా మంత్రులు. "మాకు తెలీదు. మేము గాయకులమేగాని, సాహిత్యంలో పట్టు ఉన్న వాళ్లం కాము. మూలాన్ని పాఠంచేశాం! అదే పాడాం! దాన్ని రచించిన వారెవరో కూడా మాకు తెలీదు" అన్నారు.

అందుకు మంత్రులు కోపించి "మీరు గాయకులమని మోసం చేసి, మా రాజుగారి ప్రాణాలు తీశారు" అన్నారు. "అయ్యో! మేము అటువంటి వాళ్లం కాము. దూరంనుంచే పాడాం! కావాలంటే అంతఃపురకాంత లిందరిక్కడున్నారు. వారిని అడిగి తెలుసుకోండి!" అన్నారా గాయకులు.

"ఎవర్నీ అడగక్కర్లేదు. అంతా మాకు తెలుసు! కానివ్వండి! మీ అపరాధాన్ని ముమ్మందు విమర్శిస్తాం! మా అనుమతి లేకుండా ఎక్కడికీ వెళ్ళకండి!" అని, నిరాయుధులూ-కళాకారులూ కావడం వల్ల అప్పటికి వారిని ఏ విధంగా శిక్షించాలో తెలీక, వారికి కొందరు భటుల్ని కాపలా పెట్టారు.

రాజుగారి భార్యల్ని ఊరడిస్తూ, శాస్త్రప్రకారం రాజుగారికి అపర కర్మకాండ నిర్వర్తించి, వారి పుత్రులకు పట్టాభిషేకం చేశారు మంత్రులు. ఆ సమయానికి, పూర్వమెప్పుడో వాళ్ళు పంపిన భటులు తిరిగొచ్చారు.

"అయ్యా! మేం మీ ఆజ్ఞప్రకారం అరణ్యాలు, కొండలు, గుహలు ఏదీ వదలకుండా గాలించాం! నరసింహ శైలక్షేత్రంలో మాత్రం ఒక వింత చూశాం! చిత్తగించండి! ఆ కొండ గుహల్లో ఒకచోట కొందరు బోడి బాపనయ్యలు జేగురురంగు గుడ్డలు కట్టుకుని నివశిస్తుంటే, వాళ్లని చూసి "మీరు ఇక్కడ ఉన్నారు దేనికీ? అడ్డం లేవండి. గుహలోపల చూడాలి!" అన్నాము. అయితే వారు దానికి జవాబు చెప్పక, లోపలి కెళ్లవద్దంటూ చేత్తో సైగచేశారు. మేం వాళ్లని లెక్కచెయ్యక తోసుకుంటూ లోపలికివెళ్లాం! అక్కడో ఇరవయ్యేళ్లవాడు రాతిమీద జేగురు రంగు వస్త్రాన్ని ముసుగేసుకుని పరుండడం చూసి, చాలా గట్టిగా లెమ్మని కేకవేశాం! సమాధానం ఏమీ లేకపోవడంతో అది శవం అని తలచి, మీ ఆజ్ఞప్రకారమే ఆ శవాన్ని దహనం చేద్దామని ప్రయత్నిస్తూంటే, ఆ బాపనయ్యలు మాతో పోట్లాటకు దిగారు. "ఆయన తమ గురువనీ-యోగ నిద్రలో ఉన్నాడనీ-ఆయనను అంటడం

మహాపాతకం అనీ" చాలాసేపు ఆటంకం కలిగించారు కూడా! అది యోగనిద్ర కాదని గ్రహించిన మేము, శవమని నిర్ధారించి చితిపేర్చి అంటించగా, చేతికి నిప్పు తగిలేసరికి అతడు తటాలున లేచి కూర్చున్నాడు. అప్పుడు ఆశ్చర్యపోవడం మావంతైంది. మేం భయపడి పారిపోయి "పాపం! బాపనయ్యలు నిజమే చెప్పారు" అనుకొంటూంటే, వాళ్లంతా ఆయన చుట్టూ చేరి, మాకు తెలీని భాషలో ఏదో అన్నారాయనతో. వెంటనే ఆయన కళ్లు మూసుకొని కొన్ని శ్లోకాలు పఠించేసరికి, చిత్రంగా కాలిన ఆనవాలైనా లేకుండా చేతులు యథాతథంగా వచ్చేశాయి. ఇంతవరకు చూసి, మేం వేగంగా ఆ వృత్తాంతాన్ని మీకు చెప్పాలని పరుగెత్తుకుంటూ వచ్చేశాము. ఆయనెవరో నిజంగానే మహానుభావుడు. తెలీక అపరాధం చేశాం! తెలిసీ అపరాధంచేసి, అచేతనంగా ఉన్న ఆ పుణ్యాత్ముని దేహాన్ని పాదంతో తాకిన మాలో ఒక భటుడికి కళ్ళుపోయాయి. మాకూ ఏ ఆపద వస్తుందోనని భయంగానే ఉంది" అంటూ విన్నవించుకున్నారా భటులు.

అప్పుడా మంత్రులు ఒకరితో ఒకరు సమాలోచనలు జరిపి "ఓహో! అతడే ఇతడు మనం ఏది ఊహించామో అదే నిజమైంది. వీళ్లు తెచ్చిన సమాచారం ప్రకారం – చితి అంటించగా ఆ సిద్ధపురుషుడు లేచిన సమయం, ఇక్కడ మన ప్రభువు తలవాల్చిన సమయంతో సరిగ్గా సరిపోయింది. ఈ గాయకులు కూడా ఆ మహానుభావుడి ఆప్తవర్గంలో వారే అయి ఉండొచ్చు! వీళ్లలో ఏదో సంకేతార్థం ఉండి ఉంటుంది. ఏది ఎలా అయినా వీళ్లను ఇక మనం నిర్బంధించ కూడదు. వీళ్లు మహానుభావులని ఆ గీతాలే చెప్తున్నాయి" అనుకుంటూ పద్మపాదుడు మొదలైన వాళ్లందర్నీ అప్పటికప్పుడే "అపరాధం క్షమించండంటూ" వారి ఇష్టానికి వార్ని వదిలివేశారా మంత్రులు.

వెంటనే పద్మపాదాదులు వేగంగా నరసింహశైలం వైపు వెళ్తూ ఉంటే-దారిలోనే కొందరు శిష్యులు ఎదురై "మీరింత ఆలస్యం చేశారేం? మన గురుదేవులు మీరాక కోసం ఎదురుచూస్తున్నారు. లక్ష్మీనృశింహ కరావలంబ స్తోత్రంచేశారు గురుదేవులు. ఎంత హృద్యంగా ఉన్నదనుకున్నారు?" అంటూ మచ్చుకు కొన్నిశ్లోకాలు వినిపించారు. అందరూ కలిపి తిరిగి గురుదేవుల చెంతకు రాగా, చాలా కాలానికి పద్మపాదుని చూసిన ఆనందంతో ఆయనకు ఆనందబాష్పాలు వర్షించాయి.

ఆ తరువాత శంకరుడు తన శిష్యులతో సహా యోగమార్గాన ఎగిరి, స్వల్పకాలంలోనే మండనమిశ్రుని మందిరానికి చేరుకున్నాడు.

మండనమిశ్రుడు అనతి పాదులపైవ్రాలి, అతిథిపూజలుచేసి "మహాత్మా! నాయిల్లు-నాదేహం సమస్తం నీ అధీనం చేస్తున్నాను. నేను నీకు శిష్యుడ్ని! కర్తవ్యం ఉపదేశించు!" అని ప్రార్థించాడు.

శంకరుడిని అర్చించిన ఉభయభారతి కూడ "మహాత్మా! నువ్వు పరమేశ్వరుడివి. నన్ను సభలో కామశాస్త్ర ప్రసంగంలో ఓడింపక, నేర్చుకొనే వాడిలా వ్యవధి కోరడం వెనుక ఆంతర్యం నాకు తెలుసు! నీ చేత ఓడించబడి నందుకుగాను మేము సిగ్గు వహించము. నువ్వు సర్వేశ్వరుడివి. నువ్వు ఎరుగనిదంటూ లేదు. నేనిక సత్యలోకానికి వెళ్లిపోతాను. అనుజ్ఞ ఇవ్వు" అని ఆ బ్రహ్మభార్యని యోగశక్తి చేత చూస్తూ ఆ భాష్యకారుడు "దేవీ! నీవు విధాత పతివ్రత వైన వాగ్దేవతగాను, చిత్ స్వరూపిణిగాను నేను ఎరింగిన వాడ్ని నాచే నెలకొల్పబడే ఋష్యశృంగాది క్షేత్రాల్లో నీవు శారదాభిఖ్యవై, ఆ పీఠాలపై వసించి, నాకు సన్నిహితంగా ఉండే వరం అనుగ్రహించు!" అని వేడుకోగా, శంకరునికి ఆ వరం అనుగ్రహించి, అంతర్వింతురాలైంది భారతి.

తాను సన్యసించడం వల్ల విధవకానక్కర్లేకుండా ఉభయభారతి ఇలా అంతర్ధానమైనందుకు మండనమిశ్రుడు సంతోషంతో సన్యాసదీక్షా స్వీకారం చిత్తుడైనాడు. శాస్త్రోక్తంగా ధన కనక వస్తు వాహనాది భోగ భాగ్యాలన్నీ బ్రాహ్మణులకు పంచి ఇచ్చి ఆశాపాశాలు విడనాడి ఆచార్యుని సన్నిధికి చేరుకున్నాడు. శంకరుడతనికి సన్యాసమిచ్చి 'తత్త్వమసి' అనే వాక్యాన్ని కుడిచెవిలో ఉపదేశించాడు. ఆ వాక్యానికి గల వేదాంత పరమైన అర్థాన్ని బోధపరిచాడు 'నువ్వు బ్రహ్మవయ్యావు' అని చెప్పగా, మండన మిశ్రుడు అద్వైత తత్త్వాన్ని గురుబోధ ద్వారా అకళింపుచేసుకొని, శ్రీశంకరాచార్యుని సేవిస్తూ అది మొదలు సురేశ్వరుడు అనే పేరిట ప్రఖ్యాతిగాంచాడు.

ఆ తర్వాత మహారాష్ట్ర దేశంలో కొన్ని భాష్యాలు వ్యాపింపజేసి అక్కడి నుంచి శ్రీశైలం వెళ్లి 'శివానందలహరి' స్తోత్రంతో శ్రీగిరి మల్లికార్జునుని స్తుతించాడు. అష్టాదశ పీఠాల్లో ఒక శక్తి స్థానంగా భాసించే శ్రీభ్రమరాంబికా అమ్మవారిని వేద విధానం ప్రధానంగా మహాశక్తిగా స్థాపించి శిష్యులతో కూడ కొన్నాళ్లు అక్కడ వసించాడు.

అయితే - అక్కడ ఉంటూండగానే శంకర యతీంద్రుల భాష్యాలను వైష్ణవులూ, పాశుపతులూ, వీరశైవులూ ఆక్షేపించగా, శంకరుని శిష్యగణమే వారిని పరాజితుల్ని చేయగా కొందరతడికి శిష్యులయ్యారు. కొందరు అతడి మరణాన్ని చూడదల్చుకున్నారు.

**శ్లో॥ సంధ్యారంభ విజృంభుతం శృతిశిఖర స్థానాంతరాధిష్ఠితం**
**సప్రేమ భ్రమరాభిరామ నమః కృత్స ద్వాసనా శోభితం॥**
**భోగీంద్రా భరణం సమస్త సుమనః పూజం**
**గుణావిష్కృతం**
**సేవే శ్రీగిరి మల్లికార్జున మహాలింగం శివాలింగితం**

## ఉగ్రభైరవుని కథ

ఒకరోజున శంకరుడు పాతాళగంగ వద్ద భాష్యరహస్యాలు ఆలోచిస్తూ వుండగా, అవధూత వేషంలో వచ్చిన కాపాలికుడొకడు, శంకరుని ఎన్నోవిధాల స్తుతించి, అగ్నిలో హోమం చెయ్యడానికి ఆ యతీంద్రుని శిరస్సు కావాలన్నాడు. ఆ ప్రకారం హోమం చేసిన వారికి - సశరీరంగా కైలాసప్రాప్తి కలిగి, ఈశ్వరునితో సమానమైన రీతిలో కైలాస విహార యోగం పడుతుంది.

దయామయుడైన శంకరయతీంద్రుడు, తప్పకుండా అతని కోరిక తీరుస్తానన్నాడు. అయితే - తన శిష్యులకు తెలిస్తే, వాళ్లంతా తానే శరణు అంటూ తన్ను ఆశ్రయించి ఉన్నందువల్ల, ఆ కాపాలికుని సంకల్పం సాగనివ్వరని చెప్పి జనం లేని ప్రదేశం ఏదైనా చూసుకోమన్నాడు. సంతోషంగా తన శిరస్సు ఖండించుకోమన్నాడు. ఆహా! మహాపురుషులు తప్ప, ఇంత చిదానందంగా తమ శిరస్సును ఖండించుకోమని చెప్పే వారెవరుంటారు?

ఆ మాటలకు కాపాలికుడు మహదానందం చెంది, ఒక నిర్ణీత సంకేత స్థలాన్ని చూపి, శంకరుని అందుంచి ఎక్కడికో వెళ్లాడు. మెడలో కంకాళాల మాల - చేతిలో త్రిశూలం ధరించి తిరిగివచ్చాడు. కళ్లు ఎర్రగా ఉన్నాయి. ఆ కాపాలికుడికి ఆ భైరవాకారుడ్ని చూసి శంకరుడు ఇంద్రియాలను

ఉపసంహరించుకొని, ఆత్మనీ-పరమాత్మనీ సంధానం చేసుకుని, సమాధిలో ఉండగా కాపాలికుడు త్రిశూలం ఎత్తి అతడ్ని చంపడానికి ఎటువంటి సందేహాన్నీ పెట్టుకోక కంఠం ఉత్తరించబోతూండగా - దైవ ప్రేరితమైన బుద్ధి వల్ల పద్మపాదుడు అక్కడికి వచ్చి, తమ గురుదేవుని శిరస్సు తరిగే ప్రయత్నంలో ఉన్న ఆ కౄరుని ప్రయత్నాన్ని అడ్డుకోడానికి శ్రీమన్మహానృసింహమంత్రాన్ని స్తోత్రం చేసి, అపరనృసింహావతారుడై ఆ కాపాలికుని పొట్ట చీల్చి చంపేశాడు. అప్పుడొక భీకర శబ్దం జనించింది.

అది విని అక్కడున్న శిష్యులంతా తల్లడిల్లిపోతూ, పరుగు పరుగున అక్కడికొచ్చి చచ్చిపడిఉన్న కాపాలికుడినీ - నరసింహాకృతిలో ఉన్న పద్మపాదుడినీ, సమాధిస్థితిలో ఉన్న గురువునీ చూసి ఆశ్చర్యపోతూంటే శంకరుడు సమాధి చాలించి, కళ్లు తెరిచి జరిగినదంతా శిష్యుల ద్వారా తెలుసుకుని, పద్మపాదుడ్ని ఆవహించి ఉన్న నరసింహమూర్తిని ఎన్నో విధాలుగా స్తుతించాడు.

భక్త సులభుడైన ఆ దైవం, ఆ స్తోత్రాలతో శాంతించి. ఉగ్రతను ఉపసంహరించుకుని అంతర్ధానమయ్యాడు. శాంతుడై ఉన్న పద్మపాదుడిని చూసి, శిష్యులంతా ఆశ్చర్యంగా నువ్వీదేవుడ్ని ఎలా ప్రసన్నం చేసుకున్నావని అడగ్గా పద్మపాదుడిలా అన్నాడు...

## అహోబల నరసింహుని కథ

నేను పూర్వం ఒకప్పుడు అహోబల పర్వతానికి వెళ్లి, అందులోని ఒక అరణ్యాన భక్తవశ్యుడైన నరసింహమూర్తిని గురించి చాలా కాలం తపస్సుచేశాను. ఆ తపస్సుచేస్తున్న కాలంలో ఒక కిరాతుని కుమారుడు తరచుగా నాకు కనిపిస్తూ "అయ్యా! నువ్వెవరు? ఒక్కడివీ ఈ కొండగుహలో ఏం చేస్తున్నావు?" అని అడుగుతూండేవాడు.

చెప్పకపోతే వదిలేలా లేదని, ఒకసారి "ఓరీ! నువ్వు మూఢుడివి. ఆటవిక జాతివాడివి! నీకు చెప్పినా అర్థం కాదు. పైగా బాలుడివి నువ్వు మావంటి తపోదీక్షలో ఉన్న వారిని పలకరించడం మంచిదికాదు. విను! కంఠం పైభాగం సింహం-మొండెమంతా మనిషి రూపందాల్చిన ఒక స్వామిని చూడాలని

ఇక్కడున్నాను. అతడు నాకు బంధువు. అటువంటి స్వామి నెక్కడన్నా చూస్తే చెప్పు!" అన్నాను నేను.

అప్పుడా పిల్లవాడు నవ్వేసి "ఈ మాత్రానికే ఇంత శ్రమపడుతున్నావా? మొదట్లోనే చెప్తే ఈ పాటికి తీసుకు రాకపోదునా? ఆయనుండే చోటు నాకు తెలియడం మాత్రమేకాదు - తరచు మేమిద్దరం కలుసుకుని ఆడుకుంటూంటాం" అన్నాడు.

వాడికి సరిగ్గా అర్థమైందో, లేక పరిహాస మాడుతున్నాడో అని "కంఠం వరకూ మనిషి. ఆపైన సింహం రూపం ఉండే వాడితో నీకు ఆటలా? అతడ్ని నువ్వు చూడ్డమా? నిజం చెప్పు!"అని రెట్టించాను.

అందుకాపిల్లవాడు "నిజమేనయ్యా! మీరునాతో ఇన్నిసార్లు అనక్కర్లేదు. నాకు అర్థమైంది. మీరు అడిగినవాడు- నిత్యం నేను ఆడుకొనేవాడే! ఇప్పుడే తీసుకొస్తాచూడండి!" అని రెండు అంగల్లో తటాలున వెళ్లి, లతలూ-తీగల్తో ఆ స్వామిని బంధించి తీసుకొచ్చి "ఇతడేనా నువ్వడిగినవాడు?" అని నన్నే ప్రశ్నించాడు.

"ఔరా! ఇతడీ బాలుడికెట్లా వశమైనాడో" అనుకుంటూ, నాకు శరీరం జలదరిస్తూంటే స్వామిని స్తోత్రాలతో ప్రసన్నం చేసుకుని "ఈ బాలుడెంత పుణ్యాత్ముడో కదా!" అని ఆశ్చర్యం ప్రకటించగా, స్వామి "వీడికి నాయందున్న భక్తి విశ్వాసాలు బ్రహ్మాదులకైనా లేవంటే అతిశయోక్తి కాదు. కనుకనే నేను వీడికి వశుడనైవున్నాను. భక్తికి వశమైనట్లు జప-తప-దాన- యోగాలకు వశం కాను. నా భక్తుడివైన నీవు అవసరమైనప్పుడు తల్చుకో! ప్రసన్నుడినై నీ కోరిక తీరుస్తాను" అని మాయం అయ్యాడు. అప్పటినుంచీ ఆయన నాకు అభీష్టదైవమై- పిలిస్తే పలుకుతాడు. ఇప్పుడీ శత్రువధ ఆ విధంగా జరిగిందే" అని వివరించాడు పద్మపాదుడు.

తర్వాత పద్మపాదాది శిష్యులతో కలసి శంకరుడు శ్రీశైలాన్ని వదలి, గోకర్ణక్షేత్రానికి వెళ్లడం - అక్కడో మూడురోజులుండి మహాకాళనాధుని ఆరాధించి, దగ్గర్లోగల హరిశంకర క్షేత్రానికి వెళ్లి అద్వైతబుద్ధితో హరిహరుల్ని స్తుతించడం, అనంతరం మూకాంబికాక్షేత్రాన్ని చేరడం జరిగాయి. అక్కడొక

బ్రాహ్మణదంపతుల మృత పుత్రుని జీవింపజేయగా, అక్కడివాళ్లు శంకరుని మహిమకెంతో ఆశ్చర్యపడ్డారు.

ఆ తరువాత- అక్కడి మూకాంబికను స్తుతించిన శంకరుడు సమీపంలో గల శ్రీబలి అనే అగ్రహారానికి వెళ్లగా, శంకరుని ప్రతిభ నెరిగివున్న ఎంతోమంది బ్రాహ్మణులు ఆయనను సగౌరవంగా ఆహ్వానించి ఆదరించి శ్రీపినాకపాణి ఆలయానికి తోడ్కొని వెళ్లారు.

ప్రభాకరుడనే గొప్ప పండితుడు, తన ఉన్మత్త పుత్రుడితో కూడ శంకరుని దర్శించాడు.

## హస్తామలకుడి కథ

శంకరుడా పండితుని సాదరంగా కూర్చుండ నియమించి అతని రాకకు కారణం అడగ్గా- తన పుత్రునిచూపి "ఆర్యా! వీడికిప్పుడు 13 వత్సరాలు, పుట్టినప్పట్నుంచీ ఎవరితోనూ మాట్లాడడు- పలకరించినా పలకడు. వీడి రూప తేజాలకు లోటులేకపోయినా మాటా -పలుకూ లోపం ఆటకువెళ్లడు కొట్టినా చలించడు. ప్రారబ్ధమో! గ్రహదోషమో! చెయ్యని వైద్యంగాని జపహోమాదులు గాని లేవు. మీ అపూర్వ కటాక్షం వీడిమీద ప్రసరింపజేయండి! వీడి బుద్ధిమాంద్యం వదలగొట్టండి! వీడ్ని శిష్యుడిగా అనుగ్రహించండి!" అంటూ ప్రార్థించాడు.

అప్పుడా శంకరుడు "డింభకా! ఈ జడత్వ ప్రవర్తనమేమి?" అని శిరస్సు నిమిరేసరికి "గురుదేవా! నేను జడుని కాను. నీ అనుగ్రహం పరిపూర్ణంగా లభించిన శిష్యపరమాణువుని" అంటూ అక్కడి వాళ్లందర్నీ ఆశ్చర్యపరిచేలాగ, అప్పటికప్పుడు ఆశువుగా పన్నెండు శ్లోకాలు ధారగా తన నోట్లోంచి ప్రవహింపజేశాడు ఆ పిల్లవాడు.

ఏ ఉపదేశం లేకుండా, అంతటి పాండిత్యంతో పరమాత్మ తత్వాన్ని తేట తెల్లం చేసే రీతిలో ఆ శ్లోకాల్ని రచించడం అనితరసాధ్యం కేవలం శంకర కృప ప్రసరించినందువల్లే అది సాధ్యమైనందున, అరచేత ఉసిరికాయ ఉంచుకున్న చందంగా, అతి శీఘ్రంగా వాటిని ఆశువుగా చెప్పడంతో అతడికి 'హస్తామలకుడు' అని పేరొచ్చింది.

"నీ కుమారుడు పూర్వస్మృతి కలవాడు. ఇతడికి సర్వం తెలుసు! లోకంలోని అజ్ఞానాన్ని గురించి చింతిస్తూ జడుని మాదిరి ప్రవర్తించాడు. తప్ప నిజంగా జడుడు కాడు" అనేసరికి, అంతా ఆశ్చర్యపోయారు. తన వెంట శిష్యునిగా తీసుకెళ్లడానికి ఆ బాలుని తండ్రిని ఒప్పించాడు. హస్తామలకుని తన ప్రధాన శిష్యులలో ఒకడిగా చేర్చుకున్నాడు.

అక్కడ్నుంచి శృంగగిరి అనీ-శృంగేరి అనీ ప్రసిద్ధిగాంచిన ఒక పవిత్రక్షేత్రాన్ని చేరుకుని, అతడిచేత ఆభాష్యగ్రంథాలు చదివించి, వాటిని వ్యాప్తి చెందించడంలో కృషిచేశాడు. శంకరుడు, అక్కడ ఉంటూండగానే, ఆ పుణ్యస్థలంలో శారదాంబని నిలపడానికి ఉత్సాహం కలిగి, ఒక పీఠం నిర్మింపచేసి దానికి సురేశ్వరుణ్ణి (మండన మిశ్రుడ్ని) అధ్యక్షస్థానంలో నిలిపాడు. శారదాంబ, ఉభయ భారతిగా నాడుచేసిన ప్రతిజ్ఞ నేటికీ పాటిస్తూ ఇప్పటికీ శృంగేరీ పీఠంలో భక్తశిఖామణుల అభీష్టాలు తీర్చే కల్పవృక్షంగా విరాజిల్లుతోంది.

## తోటకాచార్యుని కథ

శంకరుడు శృంగేరిలో ఉండగా విద్యావిహీనుడు -మూఢుడూ అయిన ఒక బ్రహ్మచారి అక్కడకొచ్చి, తన పేరు 'ఆనందగిరి' అనీ -విద్యలేనివారి నెందరినో గురుదేవులు అనుగ్రహంతో శిష్యులుగా చేర్చుకున్నారని విని, తానూ వారితోపాటు చేరవచ్చాననీ - అనుగ్రహించమనీ వేడుకున్నాడు. శంకరులు చిరునవ్వుతో ఆనందగిరిని శిష్యునిగా చేర్చుకున్నారు.

అతడు అన్ని వేళలా గురుదేవుని అనుసరిస్తూ, శంకరుని మనస్సుకు ఎక్కిన శిష్యుడనిపించుకున్నాడు. శంకరుడు అతడ్ని కటాక్షించి వక్తగా, జ్ఞానిగా, అందరికంటె అధికుడిగా అనుగ్రహించడంతో వాడు పధ్నాలుగు విద్యలలో ప్రవీణుడయ్యాడు. శంకరుడు అతనికి తోటకాచార్యులు అని పేరు పెట్టి తన ప్రధాన శిష్యులలో ఒకడిగా చేర్చుకున్నాడు.

"భాష్యానికి 'వార్తికం' చేయగల అర్హులెవరా?" అనే సందేహం తలెత్తినపుడు పద్మపాదుడ్ని నియమించాలా? హస్తామలకునికి ఆ బాధ్యతను

అప్పగించాలా? అనే చర్చవచ్చింది. కొందరు శిష్యులు, ఆనందగిరికి ఆ బాధ్యత అప్పగించమనీ- ఉగ్రమైన తపస్సుతో అతడు సరస్వతిని ప్రసన్నురాలిగా చేసుకున్నాడనీ సమర్థించారు.

పద్మపాదుడు ఆ సమయంలో అక్కడికి వచ్చి "ఆర్యా! మీకృప వల్ల హస్తామలకుడికి పద్నాలుగు విద్యలూ తెలిశాయి. అతడు మీ భాష్యానికి టీకరాయడానికి అర్హుడు కాడా?" అని అడిగాడు.

"స్వామీ! ఈ హస్తామలకుడికి బోధ లేకుండానే ఇటువంటి శాస్త్ర ప్రజ్ఞ ఎలా అలవడిందో చెప్పండి" అని కొందరు అడిగారు.

## హస్తామలకుని పూర్వకథ

"అతడు శ్రీబలి అగ్రహారవాస్తవ్యుడైన ప్రభాకర పండితుని పుత్రుడని మీకు తెలిసిందేకదా! చాలాకాలం క్రితం ఆయన భార్య రెండేళ్ల వయసుగల హస్తామలకుడిని ఎత్తుకొని స్నానానికి నదికి వెళ్లింది. ఆ నది ఒడ్డున ఒక సిద్ధుడు తపస్సు చేసుకుంటుంటే, కుమారుడ్ని అతని ముందుంచి "మహాత్మా! నేను స్నానం చేసి వచ్చేదాకా వీడ్ని చూడండి" అని వదలి వెళ్లింది. కాని, అతడా బాలుని చూసే స్థితిలో గాక, సమాధిస్థితిలో మునిగిఉన్నాడు. దురదృష్టవశాన అతడు నదిలోకి దొర్లుకుంటూ పడి మృతిచెందాడు. బాలుడి మృతదేహం ఆ సిద్ధుని ఎదుటుంచి "నీవు అంగీకరించకపోయనా, మేము మా జాగ్రత్తలు మేం తీసుకొనే వాళ్లం! అలా చూస్తున్నావు కదా! అని నీ దగ్గర వదలి వెళ్తే ఇలా చేస్తావా?" అంటూ ఆయన్ని నిలదీసేసరికి, కళ్లు మూసుకోకపోయినా, అలౌకిక స్థితిలో ఉన్న ఆ సాధువు ఈ ప్రపంచంలో జరిగే వాటికి దూరంగా తన ధ్యానంలో ఉన్నాడు తాను. అతడు చూస్తున్నాడనుకున్నదా తల్లి. మౌనం అంగీకార సూచకం అనుకున్నదామె.

ఇక ఆ సాధువు అపవాదుభరించలేక, సమాధి నుంచి బైటపడి, "అయ్యో!వాడి కోసం చింతిస్తారేం? ఒక్కక్షణం ఆగండి! "అని, తన శరీరాన్ని

ఎక్కడో వదిలేసి యోగసామర్థ్యం వల్ల - పరకాయ ప్రవేశంలో ఆయనకున్న నైపుణ్యం కొద్దీ ఆ బాలునిలో ప్రవేశించాడు.

ఆ పిల్లవాడిలో చలనం రాగానే, సిద్ధుడి దయవల్లనే ఆ పిల్లవాడు బతికాడనుకొని, వాడినెత్తుకొని ఆ తల్లి ఇంటికి తీసుకుపోయింది. ఆ పిల్లవాడు అందరిలాగ కాక భిన్నంగా ఉండటం చూసి తండ్రి ఎన్నెన్నో చికిత్సల - ప్రక్రియల వెంట పడ్డాను. తర్వాత కథ మీకు తెలిసిందే! అందువల్ల ఉపదేశంతో పనిలేకనే, హస్తామలకుడు సర్వజ్ఞుడైనాడు. అన్నీ తెలిసినా బాహ్యప్రవృత్తి లేనందున భాష్యం రాణించడానికి తగడు. సురేశ్వరుడే అందుకు అర్హుడు" అని స్పష్టంచేశాడు శంకరుడు. పద్మపాదుడు గురువు అనుమతితో తీర్థయాత్రలకు బయలుదేరాడు.

ఒకరోజు శంకరులు సురేశ్వరుణ్ణి చూసి "ఆర్యా! నువ్వు వార్తికం చేయడానికి నా శిష్యులు సమ్మతించడం లేదు. నీ సామర్థం తెలిసేలా - ఆధ్యాత్మిక తత్త్వం వెల్లడయ్యేలా స్వతంత్రంగా ఒక గ్రంథం రాసి నాకు చూపించు! ఈ శిష్యులకు నమ్మకం కలిగించు!" అన్నాడు "గురువాజ్ఞను పాటించాలి" అని అందరూ అతడ్ని ప్రేరేపించారు. అందుకు సురేశ్వరుడు కొంచెం కోపం తెచ్చుకుని, అతి స్వల్పకాలంలోనే 'నైష్కర్మ్యసిద్ధి' అనే గ్రంథం రచించి గురువుకు చూపించగా, అతడాశ్చర్యపోయి, అదిశిష్యులకు చూపి, సురేశ్వరుడిని ఎంతగానో ప్రశంసించాడు. ఇప్పటికీ యతీశ్వరులా గ్రంథాన్నే ఎక్కువగా విశ్వసిస్తున్నారు. తన గ్రంధానికి శంకరాచార్యుల ఆమోద ముద్ర లభించడంతోనే సురేశ్వరుడు కోపంగా "ఈ లోకంలో మాత్సర్యగ్రస్తులు చాలామంది ఉన్నారు. నేను ఆచార్యవాక్యంతో వార్తికం చేద్దామని ప్రయత్నించబోతే, కొందరు అనవసరంగా విఘ్నం తలపెట్టారు. అందువల్ల నేను తప్ప ఇతరులెవరు ఆ గ్రంధానికి వార్తికం చేసినా అది నిలవక నశించుగాక!" అని శాపం ఇచ్చేశాడు. శంకరుడు అతని కోపాగ్ని చల్లార్చాడు.

"ఆర్యా! నువ్వు తొందరపడి, నా సూత్ర భాష్యానికి వార్తికం నిలబడనీయక శపించావు. అది నన్ను ఎక్కువగా బాధిస్తోంది. సరే! అది దైవకృతమని భావిస్తాను. కానీయ్! తైత్తిరీయోపనిషత్తు - దాని ద్వితీయశాఖ అయిన కాణ్వోపనిషత్తులకు నేను భాష్యాలు చేసి ఉన్నాను. ఆ రెండింటికీ నువ్వు వార్తికాలు రచించు! నీకీర్తి చిరస్థాయిగా ఉండగలదు" అని ఆనతిచ్చాడు.

ఆ తర్వాత ఇతర శిష్యులచేత ఎన్నెన్నో గ్రంథాలు రచింపజేసి శంకరుడు శృంగేరీ లోనే ఉన్నాడు. ఒకరోజున శంకరుని తల్లి ప్రాణంపోయే సమయంలో కొడుకుని స్మరించుకొని, పుత్రునికై కలవరించసాగింది. తాను వచ్చేదాకా శిష్యుల్ని అక్కడే ఉండమని, యోగశక్తితో ఆకాశ మార్గాన ఒక ముహూర్తకాలంలో తల్లి దగ్గరకు వెళ్లాడు. "నీ కోరిక ఏమిటో చెప్పు! తప్పక తీరుస్తాను" అంటూ ఆమె పాదాలకు నమస్కరించాడు.

అప్పుడామె, తన పుత్రుని ప్రియమారా ఆలింగనం చేసుకుని "తండ్రీ! నువ్వు నాకు, ఈ అవస్థలో కుశలంగా వచ్చి కనిపించావు. ఇంతకంటే నాకు గొప్పవరం ఏముంటుంది? ఈ శరీరాన్నింక సంస్కరించి. దీనికి పుణ్యలోకాలు ప్రాప్తింపచెయ్యి!" అని కోరింది.

శంకరుడామెకు పరతత్త్వోపదేశం చేసి, శుద్ధాత్మతో ఆమె దివ్యదేహం దాల్చి పరమపదాన్ని పొందేలా చేశాడు. అయితే కర్మసన్యాసం చేసినవాడు, తల్లి కోరిక మేరకే అయినా కర్మ చేస్తాననగానే, అగ్రహారం పండితులు "సన్యాసి ఏమిటి? తల్లికి కర్మచెయ్యడం ఏమిటి?" అంటూ నిరసించేసరికి, శంకరుడు తల్లి శవం యొక్క కుడిభుజాన్ని మధించి అగ్ని పుట్టించి దాంతోనే పెరట్లోనే చితికి నిప్పంటించాడు.

జగద్విఖ్యాతుడైన ఆ మహానుభావునికి జన్మభూమిలో ఎదురైన ఈ సహాయనిరాకరణతో, శంకరుడు కోపించి "ఈ గ్రామస్తులు వేదబాహ్య

లయ్యెదురుగాక! యతులు వీరి ఇంట భుజించకుందురుగాక! వీళ్ల పెరళ్లు శ్మశానాలు అగుగాక!" అని శపించాడు.

శాంతుడని దయామయుడనీ తెలిసిపీడిస్తే, కోపగించకుండా ఉంటాడా? చల్లదనాన్నిచ్చే చందన వృక్షాన్నయినా, అదే పనిగా మధిస్తే అగ్ని పుట్టుకపోతుందా? తేజ శ్మాలుల కృత్యాలు అశాస్త్రీయాలైనా సరే నిందించరాదనడానికి శంకరుడే ప్రబలో దాహరణము. తల్లికి ముక్తి నిచ్చి పద్మపాదుని రాక కోసం శంకరుడక్కడే కొన్నిరోజులుండిపోయాడు.

## పద్మపాదుని తీర్థయాత్ర

శ్రీకాళహస్తి మొదలైన పుణ్యతీర్థాలు సేవించి, తన మేనమామ ఊరైన శ్రీరంగం కూడా పుణ్యక్షేత్రమే గనుక, అక్కడికీ వెళ్లాడు పద్మపాదుడు. అక్కడ ఇతర బంధువులను కూడ కలుసుకొని, అందరికీ ఆనందాన్ని కలిగించాడు. మేనమామ ఇంట్లో భిక్ష చేసి, శంకరాచార్యసూత్ర గ్రంథానికి తాను రాసిన టీకా (వివరణ) గ్రంథాన్ని ఆ మాతులుడికి చూపాడు.

తన మేనల్లునికింతటి ప్రజ్ఞ, ఆచార్యుని వరప్రసాదమేనని ఆగ్రంథ రచనా నైపుణ్యానికి ఆశ్చర్యపోయాడతడు. ఆ గ్రంధాన్ని భద్రంగా కాపాడమని, అమాయకంగా పద్మపాదుడా మేనమామ చేతిలో పెడితే మేనల్లుడటు వెళ్లగానే దాన్ని రూపుమాపి, తన గురువుగారి మతాన్ని రక్షించిన వాడౌదామ నుకున్నాడు అతడు. ఒకరోజు రాత్రి తన ఇంటికి తానే నిప్పంటించుకుని, గ్రంథం అందులో కాలిపోయేలా చేసి, కొన్నాళ్ల తర్వాత తిరిగి వచ్చిన మేనల్లుడి దగ్గర బుడిబుడిదుఃఖం నటించాడు.

"విచారించకు మామా! పుస్తకం ఉండక పోతేనేం? మస్తకం (తల) లోని బుద్ధి ఉండనే ఉందిగా! శీఘ్రకాలంలోనే తిరిగి ఆ గ్రంథాన్ని రచిస్తాను చూడు!" అంటూ అక్కడే ఉండి గ్రంథరచనకు శ్రీకారం చుట్టగా అతడంతటి



5

వాడేనని ఎరిగిన అతని మేనమామ అందుకు అంతరాయం కల్పించదలచి, భోజనంలో బుద్ధిమాంద్యం కలిగించే విషం కలిపాడు. గ్రంథరచనానికి అంతరాయం కలిగింది.

ఇంతలో శిష్యులు కొందరు అతడ్ని వెతుక్కుంటూ అక్కడికిరాగా, వారితో కలసి గురువుగారిని దర్శించి, తనకు ఆకస్మికంగా కలిగిన బుద్ధి మాంద్యం గురించి పలుకగా, శంకరుడు చిరునవ్వుతో "నాకు అది తెలుసు! నేను ఏక సంథాగ్రాహిని కదా! నువ్వు గ్రంథరచన చేశాక ఒకప్పుడు నాకు చదివి వినిపించావు. అదంతా నాకు గుర్తుంది. అది అలాగే అప్పగిస్తాను. రాసుకో!" అన్నాడు శంకరుడు.

అనడమేకాదు! అదేవరసలో ఏకరువు పెట్టాడు కూడా! ఒకప్పుడు రాజశేఖరుడనే రాజు రచించిన మూడు నాటకాలూ ప్రమాదవశాన దగ్ధమైతే, వాటినీ అలాగే చెప్పాడు. ఆశ్చర్యానందాలతో ఆ ఇద్దరు వ్రాతగాళ్లు ఆయనను స్తుతించారు.

ఆ రాజు, శంకరుని సేవకునిగా ఏం చెయ్యడానికైనా సిద్ధపడగా "నేను కాలడి బ్రాహ్మణులు ద్విజకర్మకు తగరని శపించాను. దాన్ని నువ్వు శాసనంగా విధించు!" అన్నాడు. రాజశేఖరుడు అలాగే చేశాడు.



# కాశీ మజిలీ కథలు

## 52 వ మజిలీ

### పంచమోల్లాసము

శ్రీ శంకరయతి సార్వభౌముడు- పద్మపాద, హస్తామలక, నమిత్పాణి, చిద్విలాస, జ్ఞానకంద, విష్ణుగుప్త, శుద్ధకీర్తి, భానుమరీచి, కృష్ణదర్శన, బుద్ధి వృద్ధి, విరించిపాద, శుద్ధాంతానంద గిరి మొదలైన ప్రముఖ శిష్యులు వేలాది మంది కీర్తిస్తుంటే సుధన్వుడనే రాజు చతురంగబలాలతోను తోడు రాగా ఒక శుభముహూర్తంలో దిగ్విజయ యాత్రకు బయలుదేరాడు. ప్రమధులతో కూడిన ఈశ్వరునివలె ప్రకాశిస్తూ - ఒకనాడు మధ్యార్జునం అనే శైవక్షేత్రానికి వెళ్లి, అక్కడున్న ద్వైత మతస్థులందరినీ కర్కశ తర్కవాక్యులతో పరాజితుల్ని చేశాడు. నిదర్శనాలు చూపించ వలసిందిగా కోరారు వాళ్లు.

శంకరుడు వాళ్లందరినీ మధ్యార్జున స్వామి ఆలయానికి తీసుకు వెళ్లి, స్వామి ఎదుట నిలబడి "స్వామీ! ద్వైతా ద్వైతాల మధ్య తారతమ్యం వివరించడానికి నువ్వే సమర్థుడివి! నిజం తెలియజేసి మా సందేహం పోగొట్టు" అన్నాడు. అప్పుడు ఆ లింగం పైనుంచి ఒక దివ్య పురుషుడా విర్భవించి "సత్యం అద్వైతం" అని ముమ్మారు పలికి అంతర్ధానమైనాడు ఆ వచనాలు విన్న ద్వైతులంతా ఆశ్చర్యపోయి, సర్వోత్కృష్టమైనది అద్వైతమేనని ఒప్పుకొని, శంకరుని శిష్యులైనారు.

అక్కడ్నుంచి ప్రయాణించి, ఆ యతిచంద్రుడు రామేశ్వరం వెళ్లి సేతువున్న ఆ తీర్థంలో స్నానం చేసి, రామనాధుని అర్చించి, మిగతా తీర్థాలన్నీకూడా సేవించి, అద్వైత మత విరోధులందరినీ నిరోధించడానికి అక్కడొక రెండు మాసాలు నివశించాడు.

# శాక్తమత ఖండన

ఒకరోజున తుల్జాభవానీ మందిరంలో శాక్తమతస్తులంతా గుమికూడి, "శంకరుడనే సన్యాసి వచ్చాడట! 'అద్వైత మతం ఒక్కటే ముక్తికి హేతువు. మిగిలిన వన్నీ వ్యర్థమే!' అన్నాడట. మనలో మనకు విభేదాలెన్ని ఉన్నా సారస్వతులు, లక్ష్మీసేవకులు, భవానీ దీక్షాపరులు అందరం కలసికట్టుగా ఉండి వాదించాలి. లేకపోతే శాక్తేయమతం అధోగతి పాలైపోగలదు" అని తీర్మానించుకున్నారు. వామా చారుల్ని కూడా తమతో కలుపుకొన్నారు. నాలుగు తెగలుగా ఉన్న శాక్తమతం నలుదిక్కులా అప్పటికే వ్యాపించి ఉంది.

అయితే - వారిలో వారికి ఉన్న విభేదాల వల్ల భిన్న వాదాలు ప్రబలి ఏదీ ఇతమిత్థం అని నిర్ధారించుకోలేని స్థితిలో ఉన్నారు వాళ్లు.

సరస్వతినే ముఖ్యదేవతగా చెప్పి వాదిస్తే, వాదం గెలుస్తా మంటారు సారస్వతులు. సరస్వతికి జగత్కారణత్వం లేదు. కనుక ఆదిశక్తియే సర్వకార్యములకూ ఆధారభూతురాలైన జనని అని-ఆమె ప్రభావం అగోచరమని భవానీదేవిని ముఖ్యదేవతని చేశారు భవానీ దీక్షాపరులు. మహాలక్ష్మి ఆదిప్రకృతి అని వేదాల్లోనే ఉందన్నారు లక్ష్మీసేవకులు.

ఏ శక్తి లేకుండా పరమేశ్వరుడైనా గడ్డిపోచను సైతం కదల్చలేడో, ఆ పరాదేవతాశక్తే సర్వస్వతంత్రురాలు. అటువంటి శక్తి సేవకులమైన మాకే ముక్తి కలగదనడం నీ అజ్ఞానం శక్తిని ఆరాధించే మాకు నిషేధం ఏదీలేదు. 'త్రిగుణాతీతం అయిన మార్గంలో సంచరించే వారికి విధినిషేధాలు లేవు' కనుక - భృగుమహర్షి ప్రకృతి ప్రకారం పంచమకారాలు (మత్స్య, మాంస, మద్య, ముద్ర, మైధునాలు) మాకు నిత్యం సేవించ దగినవి. నువ్వూ మా ఆచారం స్వీకరించి సుఖించు అన్నారు వామాచారులు.

అప్పుడు శంకరుడందర్నీ సాభిప్రాయంగా చూస్తూ "మీలో మీకే పరస్పర విభేదాలున్నాయి. లోకమంతా కూడా ఇలాగే ఉంది. వేదానికి నిత్యత్వం లేదు. అందుక్కారణం అది పరమపురుషుడిన్యాసం. పుట్టే ప్రతీదీలయమవు తుందనేది ఎవరూ కాదనలేదు. అది పరమసత్యం! అదీ గాక వేదం సాంగంగా

నశిస్తుందని మహర్షులతో సూర్యుడే చెప్పినట్లు సూర్యసిద్ధాంతంలో ఉంది. చతుర్ముఖుడు సైతం శాశ్వతుడు కాడు. ఇక అతని ముఖ నిర్గత శక్తి శారద కేదీ నిత్యత్వం? అట్లే లక్ష్మీ, భవానీ 'అంశ దేవతలే' తప్ప ప్రధానదేవతలు కారు. ఇక -వామాచారులు... భృగువును పరమ ప్రమాణమని చెప్పుకొచ్చారు. వారికున్న చిత్తశుద్ధి మీలో ఉందా? పంచ'మ' కారాలకు భౌతికమైన అర్థం తీసుకొనే మీరు భృగువంత శక్తిమంతులా? నైవేద్యనెపంతో మద్యం మాంసం మైథునంసైతం స్వీకరించే మీరు బ్రాహ్మణత్వసిద్ధికే దూరమైనారు. ప్రాయశ్చిత్తం చేస్తే తప్ప మీతో మాట్లాడనేకూడదు" అని ఉపన్యసించి శంకరుడు అందరి వాక్కుల్నీ కట్టిపడేశాడు ఆ ప్రకారం శాక్తమత ఖండనలో విజయం సాధించాక, ఆ ప్రాంతపుశైవమతస్థులను తన శిష్యులు తీసుకురాగా వారితో కూడా వాదించాడాయన.

## పాషండ మత ఖండనం

**ఈశ్వరం రుద్ర మవ్యక్తం వ్యక్తరూపం జగల్లయే।**
**యేర్చయంతి -నరశ్రేష్ఠ స్తేషాం ముక్తిః కరే స్థితా॥**
**ఇత్యతః పరమాత్మా సౌ సేవనియో ముముక్షుభిః॥**

(దూర్వాస మహామునికి ఆనతిచ్చిన ప్రకారం - వ్యక్తావ్యక్త స్వరూపుడైన రుద్రుని అర్చించిన వారికి మోక్షం కరతలామలకం. అతడ్ని ఆరాధించడం ముక్తి కారణం. మహేశ్వర సేవా పరాయణులకు కర్మతో పనిలేదు. ఇదీ వారి సిద్ధాంతం అన్నారు పాషండులు.

అప్పుడు శాస్త్రప్రమాణాలు ఎత్తిచూపుతూ "లింగధారులారా! సర్వదేవమయమైన బ్రాహ్మణశరీరాన్ని తపింపచేయరాదు. వ్యాధిలేకనే విప్రుని శరీరాన్ని కాల్చకూడదు. కనుక మీ మతం శ్రుతిసమ్మతం కాదు" అన్నాడు శంకరుడు.

"శివగ్రంథాలన్నీ బూటకమనా మీ ఉద్దేశం?"

"అలా నేను అంటానా? శివ!శివా! మీకు ధర్మరహస్యాలు తెలీవు. కేవలం భక్తి ఒక్కటే శుద్ధ కైవల్యం ఇవ్వదు. మీకు విద్యాగంధం లేక జ్ఞాన సూక్ష్మం అవగతం కావడంలేదు. శివుడే ఉత్తముడనీ - విష్ణువు అతనికి దాసుడనీ

నిందిస్తున్నారు. శివ -విష్ణు శబ్దాలు పరమాత్మ యొక్క సగుణరూప వాచకాలు. ఈ ప్రమాణాల వల్ల చిహ్నధారణ సైతం నింద్యమే!" అని కొన్ని ప్రామాణిక శ్లోకాలు చదివాడు శంకరుడు. కేవలం సగుణోపాసనతో అజ్ఞానం పోదు. తత్త్వజ్ఞానం లేక మోక్షం దొరకదు. లోకమంతా కర్మబద్ధమై ఉంది. జ్ఞానం సిద్ధించేవరకు కర్మని వదలకూడదు. అద్వైత జ్ఞానమే పునరావృత్తి రహితమైన ముక్తిని ఇస్తుంది" అని ఉపదేశించి, వారి అజ్ఞానం తొలిగించి వారిని శిష్యులుగా చేసుకుని అక్కడ్నుంచి అనంతశయనం వెళ్లాడు శంకరుడు.

## వైష్ణవ మతఖండనం

శంకరుడు అనంతశయనం పుణ్యక్షేత్రంలో పద్మనాభస్వామిని ఆరాధించి నెలరోజులు ఉన్నాడు. ఆ వూరిలో వైష్ణవులు ఆరు రకాల వాళ్లూ ఉన్నారు. శంకరునితో వాదించాలని వచ్చారు. విష్ణుధ్యానమే జ్ఞానం అనీ అనంత నామమే రక్ష అనీ చెప్పారు. విష్ణూపాసనే క్రియ అన్నారు.

శంకరుడది ఖండించాడు. "యతులకు సైతం దేవతార్చన విధి ఉంది. వేద విహితమైనది కర్మ. విష్ణుసేవే బ్రాహ్మణ కర్మ అని చెప్పడం అపాండిత్యం. పరమాత్మకి నామరూపాలు లేవంటూంటే మీరు శంఖచక్ర ధారణ విరుద్ధంగా ఆచరిస్తున్నారు. మందబుద్ధుల కోసమే నామ-రూప- అలంకారాలు కల్పించబడ్డాయి. అహంబ్రహ్మాస్మి అని నిత్యం ధ్యానించండి! భేదబుద్ధి వదిలితే జీవుడే ఈశ్వరుడని తోస్తుంది. భగవత్ చిహ్నాలను చక్రాంకిత ముద్రలను ధరించి హరితో సమానులం అనుకోకండి! గాయత్రి వల్లగానీ బ్రాహ్మణ్యం సిద్ధించదు. బ్రాహ్మణ్య హీనమైన వైష్ణవత్వం పతనంగా చెప్పబడింది. పాంచరాత్రాగమము వేద విరుద్ధమైనది. శృతి స్మృతులు భగవంతుని ఆజ్ఞలు. వాటికి ద్రోహం చేసినవాడు తన భక్తుడైనా నరకంలో పడతాడని సాక్షాత్ విష్ణువే చెప్పి ఉన్నాడు. కనుక వేదోక్త కర్మ విడనాడవద్దు. బ్రహ్మచారులకైనా-బ్రాహ్మణులకైనా అగ్ని సేవ విధి.

ఆ ప్రకారం వాదించి వైష్ణవులను సైతం శిష్యులుగా చేసుకుని, శంకరాచార్యుడక్కడ్నుంచి బయలుదేరి కుమారధారా నదీతీరాన గల

సుబ్రహ్మణ్యక్షేత్రానికి వెళ్లాడు. అక్కడి బ్రాహ్మమతస్థులతో వాదించాడు. వహ్నిమతస్థులనూ- సూర్యోపాసలకును కూడా అద్వైత మతస్థులుగా ఉపదేశాలద్వారా మార్చగలిగాడు. కౌముదీ నదిలో స్నానం చేయడానికి - గణపవరానికి వెళ్లాడు. అక్కడ గణపతిని ఆరాధిస్తూ శిష్యులతో ఒక నెల గడిపాడు.

ఆ మహాత్ముని శిష్యులు పద్మపాద ప్రభృతులు ఒకనాటి సాయంకాలం, ఆ ఆచార్య శిరోమణిని పీఠం మీద కూర్చోబెట్టి ఢక్కాది వాద్యాలు మోగిస్తూ నృత్యం చేస్తూ-

**శ్లో॥ ప్రపూర్ణం బ్రహ్మోహం నిఖిల జనకం బుద్ధి నిహితం**
**చిదానందం సత్యం సకల జగదా ధార మమలం॥**
**అగమ్యం వాగాద్యైస్సుజిత కరణైర్జ్ఞాత మనమై**
**స్సు నిర్వాణం లబ్ధ్వాయ దిహన పునస్సంసృతిరయః॥**

అంటూ గురుభజన చేసి, తమ గురువు దిగ్విజయమతఖండనాది విశేషాలు తలుచుకుంటూ గురుసమీపాన వసించి పరమానందం చెందారు.

## గాణపత్యమతం

**అ**ట్టి సమయాన, ఆ పట్టణవాసులైన బ్రాహ్మణులు ఆ వింత చూసి ఆక్షేపిస్తూ "అయ్యా! ఇంతవరకూ మీ స్తుతి వాక్యాలన్నీ విన్నాం! అవాఙ్మానస గోచరమైన అద్వితీయ బ్రహ్మమును అజ్ఞుడు తెలుసుకోవడం సాధ్యమా? కనుక - మీ అద్వైతం మేలైనది కాదు. మా మతమైన గాణాపత్యం సర్వోత్కృష్టమైంది. గణపతియే జగత్కారణుడు. ఇది ఆరు విధాలు. ఆయన మాయచేతనే బ్రహ్మాదులు సృష్టించబడ్డారు. అందుకే ఆయనకు ప్రారంభ పూజ్యత కలిగింది" అన్నారు ఆ మతస్తులు.

"మూర్ఖులారా! గణపతి రుద్రసుతుడు. బ్రాహ్మణ కులంలో జన్మించినవాడు శిఖ- యజ్ఞోపవీతాలు దాల్చి వేదోక్త కర్మలు చేస్తుండాలి. మీమతం ఆరు శాఖలైందని మీరే అంటున్నారు. స్త్రీ - పురుష సంయోగం వల్ల దోషంరాదనీ - ప్రతి వనితా ఇష్టమైన వాడితో భోగించవచ్చుననీ ఆనంద స్వరూపుడే గణపతి అనీ చెప్తున్నారే! శ్రుతులకు భిన్నంగా ఉందీ వాదం. అభేద భావం

యతులకూ- సర్వసంగ పరిత్యాగులకు చెప్పబడింది కాని, సుఖ భోగలాలసులైన లౌకికులకి కాదు". అని ఆ మతాను యాయులందరినీ వరసగా వాదంలో ఓడించి, వారంతా శిష్యులై తన వెన్నంటి రాగా కాంచీపురం చేరుకున్నాడు.

అతడా పురిలో కొంతకాలం నివశించి, ప్రతిష్ఠాత్మకమైన శివకంచి అనే పట్టణం నిర్మింపజేసి, బ్రాహ్మణులను అక్కడకు రప్పించి శుద్ధాద్వైత బోధచేసి వారిని అక్కడ నిలిపాడు.

ఒకరోజు తామ్రపర్ణీ నదీతీరం నుంచి కొందరు బ్రాహ్మణులు అక్కడికి రాగా, ఆ గురుదేవుని పాదాలకు నమస్కరించి "అభేదవాదనకు నిదర్శనం" అడిగారు.

శ్రు॥ యత్ర త్యస్య పరమాత్మె వా భూత్ తత్కేన కంపశ్యేత్ (తత్త్వజ్ఞానాగ్నిచే దగ్ధమైన పాపపంకిలం వల్ల ముక్తిదశలోనే భేదభావం తెలుస్తుంది) అని కదా శ్రుతి ప్రమాణం! జగత్కర్త అయిన పరమాత్మతత్వం - అనే కత్వంలోనే ఏకత్వం. జీవాత్మ-పరమాత్మ భేదాలు వదలితేనే ముక్తి" అని వేదాంత జ్ఞానోపదేశం చేసి, వేంకటాచలానికి వెళ్లి శ్రీవేంకటేశుని ఆరాధించి, విదర్భరాజధానిలో కొన్నాళ్లున్నాడు.



# కాశీ మజిలీ కథలు

## 53 వ మజిలీ

### షష్ఠోల్లాసము

గీ. మానవ కపాల మొక కేలఁవబూని
శూల మింకొక కేలఁ దాల్చుచు శ్మశాన
భసిత లిప్తాంగుడై జటాపటల మొప్పఁ
గ్రకచ నామక కాపాలిక ప్రభుండు.

అక్కడ తనతో సమానమైన వేషందాల్చిన కాపాలికులతో ఓ సభలో -అది కర్ణాటక దేశం ఇలా సంభాషిస్తున్నాడు- క్రకచుడనే కాపాలికుడు.

### క్రకచుని కథ

శంకరుడనే డాంబిక సన్యాసి కొత్త మతాన్ని స్థాపించి, ఇతర మతాలన్నింటిని పరిహసిస్తూ, శిష్య జంఝాటంతో రామేశ్వరాది క్షేత్రాలన్నీ తిరుగుతున్నాడని- అతడ్ని పరాభవించడానికి మిత్రమతాలైన క్షపణ, ఆది, జైన, బౌద్ధ మతాల వారికి వార్త పంపానని చెప్పి, అలా వెళ్లిన కౌక్షేయకుడు అనేవాడు తిరిగొచ్చాడో లేదో కనుక్కున్నాడు.

తాను తిరిగొచ్చినట్టు చెప్పి, ఆ శిష్యుడు "స్వామీ! అతడ్ని నేను కాంచీపురంలో చూశాను. అతడక్కడ హరిహరులకు గొప్ప ఆలయ ప్రాకారాలు కట్టించాడు. సపరివారంగా రాజుచేత అర్చితుడై, భైరవ తాంత్రికులను ఆ విదర్భ రాజు నిందిస్తూంటే, "అయితే ఆ మతం వారినీ గెలవాల్సి ఉందన్నమాట!" అని మన కర్ణాట దేశానికి ప్రయాణమయ్యాడు.

సుధన్వుడనే ఒక మహారాజు కూడ ఆయన శిష్యవర్గంలో ఉన్నట్లున్నాడు. చతురంగబల సమేతుడై ఆ సన్యాసి ఇక్కడికే వస్తున్నాడు" అని వార్త అందించాడు.

శంకరాచార్యులు, కాపాలికులధికంగా ఉన్న కర్ణాటకదేశానికి వచ్చి ఒక దేవాలయంలో నివశించి, తన శిష్యుడొకడ్ని క్రకచుని వద్దకు పంపి ఆ మతానుయాయిగా వాదించదలుచుకుంటే రమ్మన్నాడు.

క్రకచుడు దొరికిన అవకాశాన్ని విడుస్తాడా? శంకరునితో వాదానికి దిగాడు "పురుషాధమా! నువ్వులోకుల్ని వంచిస్తున్నావు. నువ్వు భస్మధారణ చెయ్యడం మాకూ సమ్మతమే! అయితే, మానవకపాలానికి బదులు భిక్షాటనకు మట్టిపాత్ర ఎంచుకుంటావా? రక్తంతో భైరవుడ్ని ఆరాధించని, నీకు మోక్షం లభిస్తుందా?" అంటూ విరుచుకుపడబోతూవుంటే, సుధన్వుడతన్ని దూరంగా మెడబట్టి త్రోసేయించాడు.

అది అవమానంగా భావించిన క్రకచుడు కోపంతో, ఆ బ్రాహ్మణుల నందరినీ వధించి రమ్మని కాపాలిక గణానికి ఆజ్ఞాపించాడు. ఇంకోవైపు సుధన్వుని సేనలకూ-కాపాలికులకూ యుద్ధం జరుగసాగింది. ఆ కింకరులు పెడుతూన్న బాధలకు బ్రాహ్మణులంతా శంకరాచార్యుల పాదాల్నంటి శరణువేడారు. శంకరుడు హుంకరించగా అగ్నికీలలు రేగి కాపాలికుల్ని దగ్ధం చేయసాగాయి. అది గొప్ప మహిమగా భావించారు శంకరశిష్యులు.

అది చూసిన క్రకచుడు, శంకరునికి చేరువగా వచ్చి "వంచకుడా! దీనికి ఫలితం అనుభవిస్తావు. నా మహిమ చూడు!" అంటూ, కళ్లు మూసుకుని భైరవుని ధ్యానించాడు. కపాలంలోంచి భైరవుడురాగా, క్రకచుడు తన నుదుట చేతులు ఆనించి "స్వామీ! ఈ నీచుణ్ణి అంతం చెయ్యి" అని శంకరుడి మీద భైరవుని ప్రయోగించాడు.

అప్పుడు భైరవుడు "క్రూరాత్మా! నా ఆత్మ స్వరూపుడైన శంకర భగవానునికే ద్రోహం తలపెడతావా? నీ పాపం నిన్నే తింటుంది" అంటూ ఆ కాపాలికుని శిరస్సునే నరికి నాట్యం చేయసాగాడు.

శంకరుడా వెంటనే భైరవుని స్తుతించి "సంహార భైరవా! వేదశాస్త్రాలలో చెప్పబడిన కర్మ బ్రాహ్మణులకు కర్తవ్యం! అటువంటి కర్మవల్ల ధర్మం అభివృద్ధి చెందుతుంది కదా!" అనగా "శంకరా! నువ్వు సర్వజ్ఞుడివి!

వేదార్థాలను నీకంటె మెరుగ్గా ఎరిగిన వారెవరు? నీ మతం త్రిలోక సమ్మతం ఈ కాపాలికులందరికీ బ్రాహ్మణాచార తత్పరత కల్పించు! నేను వీళ్లకి మంత్రబద్ధుడిని కావడం వల్ల ప్రత్యక్షం అయ్యాను తప్ప, ధర్మంచేతకాదు సుమీ!" అని అంతర్థానం చెందాడు.

ఆ మాటలు విన్న కాపాలికులు ఆశ్చర్యపోయి, శంకరుని పాదాల మీద పడి "మహాత్మా! మూఢులమైన మమ్మల్ని రక్షించు!" అని ప్రార్థించే సరికి శంకరుడు వారినందరినీ బ్రాహ్మణాచార తత్పరుల్ని గావించవలసిందంటూ శిష్యులకు ఆజ్ఞాపించాడు.

## కాపాలికమతము

అప్పుడొక వృద్ధకాపాలికుడొచ్చి "స్వామీ! మమ్మల్ని బలవంతాన మత భ్రష్టుల్ని చేయడం మీకు సముచితం కాదు! మాకు తగిన సమాధానం చెప్పి ఒప్పించండి! మీ శిష్యులు మా నోళ్లు కట్టేస్తున్నారు. నా ఉపన్యాసం పూర్తయ్యేంత వరకు నన్ను ఆటంక పరచవద్దని మీ శిష్యులకు చెప్పండి" అని కోరాడు. శంకరుడు అందుకు సరేనన్నాడు.

"సర్వదేహాలూ, భౌతిక వికారాల మయమైనవే! కనుక మనుషుల్లో జాతిభేదం అధికం! బ్రాహ్మణజాతి ఆధిక్యతను మేము అంగీకరించం! శరీరాన్ని చూసి జాతిని నిర్ణయించలేం! స్త్రీ పురుషజాతులే సత్యం! దేని సంయోగం వల్ల ఎక్కువ సంతోషం కలుగుతుందో ఆ స్త్రీజాతి గొప్పది. దీనితో కూడ వచ్చు! దీన్ని కూడ రాదు అనేది మా మతంలో లేదు. సంతోషం కోసం చేసే దేహాల సంయోగం వల్ల జీవికి ఏం అనర్థం? స్త్రీ పురుష సంయోగం కంటే మోక్షం ఇంకొకటి ఉందా? సకల జనులకూ సులభ సాధ్యమైన ఇటువంటి ముక్తి మా మతంలోగాక ఇంకే మతంలోనూ లేదు" అంటూ ఉపన్యసించాడు కాపాలికుడు.

"ఓహో! మీకు స్త్రీ-మద్యం నిషేధం కావు! నువ్వు కావాలంటే నీ ఇష్టం వచ్చినట్లు సంచరించు! మేము బ్రాహ్మణుల్ని దండించైనా సరే ఉత్తములుగా మార్చాలని సంకల్పించాం! నువ్వు సంభాషణార్హుడవు కూడా కాదు. మీ భైరవుడు ప్రత్యక్షమైనపుడు, నీ వంటి పాపికి కన్పించి ఉండడు" అంటూ శంకర శిష్యులు అతడ్ని దూరంగా గెంటేశారు.

# చార్వాకాది మతఖండనం

**చా**ర్వాకుడు మంచి మాటకారి. అతడు సౌగత-క్షపణకులతో కలసి ఆలోచిస్తూ "శంకరుని శిష్యులు వృద్ధ కాపాలికుని దూరంగా తరిమేశారు. ఆ శంకరునికేదో దైవబలం ఉండి ఉంటుంది. లేకపోతే క్రకచుడి వల్ల పిలువబడిన భైరవుడు, అతడ్నే సంహరించడం ఏమిటి? మంత్రబలంలో సన్యాసి, మన క్రకచునికంటే అధికుడే కావచ్చు ! శంకరుడు పరమశాంతుడనీ విన్నాం! కనుక- శిష్యులతో వాదం పెట్టుకోక సరాసరి ఆయన్నే అడుగుదాం!" అని చెప్పేసరికి, "మాటకారివి గనుక నువ్వే అందుకు సమర్థుడివి" అన్నారా ఇద్దరూ

చార్వాకుడు శంకరుని వద్దకు వెళ్లగా, చార్వాకుని వాదం వినిపించమన్నాడు ఆచార్యుడు.

"మరణానంతరం ముక్తి కలుగుతుందని మీరు చెప్పేది సత్యం కాదు! దేహాన్ని విడవడమే జీవుడికి ముక్తి. సముద్రంలో కలిసిపోయింది నది

అయితే వెనక్కురాదు. ఇతర పదార్థాలు తీరం చేరవచ్చు! మృతిపొందిన వాళ్లని శ్రాద్ధకర్మలతో సంతృప్తి పరచడం అంటే- ఆరిపోయిన దీపానికి చమురుపోయడమే! స్వర్గనరకాలు ఎక్కడ ఉన్నాయనేదీ బూటకమే! సుఖదుఃఖాను భూతి ఈ లోకంలోనే ఉంది. దీనిని కాదని పరోక్ష కల్పన చేస్తూ లోకుల్ని వంచించడం దౌష్ట్యమే! దేహం - ఇంద్రియాది భూతములు ఇక్కడే నష్టమవుతూ ఉంటే, ఇక 'పరం' అనేదెక్కడ? దానికి వెళ్లే వాడెవడు? రూపహీనునికి గమనం ఏమిటి? ఎలా సాధ్యం? మీ మతం ప్రత్యక్ష విరోధమైనది" అని పలికాడు చార్వాకుడు.

"మూఢ చార్వాకా! నీ మతం కూడా శ్రుతి బాహ్యం కావడం వల్ల మన్నించదగినది కాదు. 'జ్ఞానాన్ని దగ్ధకర్మాణో- యాంతి బ్రహ్మసనాతనం' అని నీవు విని ఉండలేదు కాబోలు! జ్యోతిష్టోమాది వాక్యాలే దీనికి ప్రమాణాలు. జీవుడు జలగవలెనే ఈ దేహమునుండి దేహాంతరము స్వీకరించి పరలోకానికి వెళ్తాడని శ్రుతి. మృతుని ప్రేతత్వ విముక్తి కోసం ఆ పుత్రుడు శ్రాద్ధం చెయ్యాలి. గయ మొదలగుచోట్ల పిండదానాల వల్ల పితరులు

పుణ్యలోకాలకు వెళ్తారని చెప్పబడింది. జీవుడు మరణానంతరం లింగశరీరాన్ని ఆశ్రయించి పక్షిలా తిరుగుతాడని శ్రుతి సిద్ధాంతం" అని అతనికి బోధించగా, చార్వాకుడు అద్వైత మతాన్ని అంగీకరించాడు.

తరువాత సౌగత మతస్తుడైన పీనకాయుడు "స్వామీ! కర్మశీలురు మూఢభావంతో, స్నానాదికాలతో శరీరాన్ని కష్టపెడుతూంటారు. భౌతిక శరీరం స్నానాదుల వల్ల శుద్ధి అవుతుందా? జీవుడు కర్మఋణం తీర్చుకోడానికే జన్మించాడని అంటారు. దేహాంతరంలో ఏమీ లేకపోవుటచేత ఋణమైనా చేసుకొని ఘృతం తాగాలని మా సిద్ధాంతం. 'దేహాంతే వాణాభావా దృణం కృత్వా ఘృతం పిబేత్' -వంటి ప్రమాణ వాక్యాల వల్ల దేహ పుష్టి సర్వదా చేసుకోదగినది. బుద్ధిమంతుడైనవాడు. అక్కడక్కడ ధనాన్ని సంపాదించుకొని సుఖంగా తినాలి. సర్వభక్షణశాలుడైనవాడే నేర్పరి. నియమాలతో దేహాన్ని కష్టపెట్టడం దేనికి? ఒక దేహం కష్టపడి, ఇంకో దేహాన్ని సుఖపెట్టడం ఎలా తటస్థిస్తుంది?" అని ఉపన్యసించాడు.

"అందుకే కాబోలు - శరీరాన్ని ఇంతగా బలిపించావు నువ్వు నీ మతం మరీ విపరీతం. అజ్ఞానం వదులు" అన్నాడు శంకరాచార్యుడు.

"అహింసాపరమోధర్మః అని ఎప్పుడూ స్మరించుకుంటూ ఉండాలి. అహింసకన్న పుణ్యకర్మ ఇంకొకటి లేదు. సర్వధర్మాలూ భూతదయనే చెప్తున్నాయి. అహింస వల్లనే ముక్తిని పొందుతారు. వైదికులు యజ్ఞయాగాలలో పశుహింసచేస్తారు. అది మహాపాపాలకు హేతువు. మా మతం పరమధర్మసాధనం" అన్నాడు పీనకాయుడు.

శంకరుడు "నీకు ధర్మం పైపైన బోధపడదు. ధర్మసూక్ష్మం తెలీదు అందుకే ఇలా వాదిస్తున్నావు. యాగాల్లో చెప్పబడిన హింస పరమధర్మం అని నిగమాలలో చెప్పబడింది. అగ్నిష్టోమాది క్రతువులలో చేసిన పశుహింస వల్ల స్వర్గప్రాప్తి కలుగుతుంది. పూర్వాచారాల్ని వదిలి వేదనిందచేసే వారు నరకాన్ని పొందుతారు" అని చెప్పి, ఇటువంటి అన్యమతస్తుల నెందర్నో అద్వైతానికి మరలించి, పడమటి సముద్ర తీరంలోగల గోకర్ణానికి వెళ్లాడు.

# కాశీ మజిలీ కథలు

## 54వ మజిలీ

### సప్తమోల్లాసము

గోకర్ణక్షేత్రంలో మహాకాళనాథుని సేవించి, ఆ ఆలయంలో నివశించి ఉన్న సమయంలో హరదత్తుడనే వాడు శిష్యులకు వేదాంతం ఉపదేశించే, నీలకంఠుడనే తన గురువుగారి దగ్గరకు వెళ్లాడు.

### నీలకంఠుని కథ

"ఆర్యా! నీవు శైవపరంగా వ్యాససూత్రాలకు భాష్యం రాశావు. కాని ఇప్పుడు శంకరుడనే సన్యాసి భట్టమండనాది పండిత ప్రకాండుల్ని జయించి శిష్యులుగా చేసుకుని, వారితో కూడా దిగ్విజయం చేస్తూ, నిన్ను జయించడానికి, ఈ ఊరి మహాకాళుని ఆలయంలో నివశించి ఉన్నాడు. అతడు అద్వైత పరంగా సూత్ర భాష్యం చేస్తున్నాడట! ఇప్పుడు మన సూత్ర భాష్యం ఖండింప వచ్చినాడు. వాని శిష్యులే లోకాతీతులని విన్నాను" అన్నాడు.

అప్పుడు నీలకంఠుడు "హరదత్తా! నువ్వు ఇట్లా పిరికితనంతో మాట్లాడుతున్నావేమిటి? నా సామర్థ్యాన్ని మర్చిపోయావా? తర్కంతో ఇప్పుడే అతడ్నెలా జయిస్తానో నువ్వే చూడు!

శా. పారావార జలంబు వెల్ల గడుదర్పం బొప్ప నింకింప నీ
ధీరుండై దివి నుండి భాస్కరుని ధాత్రిం ద్రెళ్ల ద్రొబ్బింప నీ
ధారాళంబుగ నాకసంబు నురువస్త్రంబట్టు కై జుట్ట నీ
సారప్రజ్ఞన నుం జయింప, యతికిన్ శక్యంబు గాదెన్నడున్.

అని బీరాలు పలుకుతూ, మహాకోపంతో - పటాటోపంతో రుద్రాక్ష మాలలు ధరించిన నీలకంఠుడు, శిష్యులతో కూడ శివాలయానికి వెళ్లి, అక్కడ రెండవ శంకరునిలా ప్రకాశిస్తున్న శంకరుని చూసి ఆశ్చర్యంగానే వాద సన్నాహాలు చేశాడు. అప్పుడు - గురువుగారిని ఆగవలసిందని క్షణకాలం విశ్రమించ వలసిందని కోరి, సురేశ్వరుడు తన వాదశక్తితో నీలకంఠుని పరాభవించి పంపిస్తానన్నాడు.

"ఓహో! సురేశ్వరా! లజ్జావిహీనుడివై ఈ సభాముఖంగా తల ఎత్తి ఎలా సంభాషిస్తున్నావో నాకు విచిత్రమనిపిస్తోంది. సన్యాసితో వాదించి నువ్వు ఓడిపోవడమేగాక, భార్యని కూడ సభకెక్కించి గెలుపుపొందలేక దాసుడివై అతని వెంట తిరుగుతున్న నువ్వు వాదానికి అర్హుడివి కానేకాదు- పొమ్మ్మ" అనే సరికి, శంకరుడు "నీలకంఠా! నీకు సురేశ్వరుడి ప్రజ్ఞ తెలీక నిందించావు. సరే! వ్యాస మహర్షి సూత్రాలకు శివపరంగా నీవు భాష్యకారుడి వైనావట ఏదీ- చదువు! ఆమోదయోగ్యమైతే అభినందిస్తాం" అన్నాడు.

"యతీ! తత్త్వమసి మొదలైన ఆగమాంత వచనములచేత. తేజస్తిమిరములకన్న తేడా ఎంతటిదో అలా విరుద్ధ ధర్మాలున్న జీవేశ్వరులకు ఐక్యం చెప్తున్నారు. ఇది శుద్ధ అవివేకం. మూఢత్వాది గుణ విశిష్టుడైన జీవుడు సర్వజ్ఞత్వాది గుణసమంచితుడైన ఈశ్వరుడెలా అవుతాడు?"

"జీవేశ్వరులకు వాచ్యార్థము చేత విరుద్ధధర్మాలు కలిగిఉంటే ఉండొచ్చు! కాని లక్షణార్థం వల్ల మాత్రం లేవు. చిత్ స్వరూపదా సామ్యం చేత ఇరువురికీ అభేదమే! ఇన్ని శంకలెందుకు? నీ ప్రతిపాదనలకు నా భాష్యం, మా సురేశ్వరుని దగ్గర చదువుకో!" అని ఇంకొక్కమాటకు అవకాశమివ్వకుండా వైరిమతాలను పూర్వపక్షం చేసిన తన భాష్యం సురేశ్వరుని దగ్గర లభిస్తుందని సూచించాడు. అది తెలిసిన తర్వాత అద్వైత మత ఖండన పాండిత్యంతో అక్కడికొచ్చిన ఉదయనుడు మొదలగువారు ఎక్కడికో పారిపోయారు.

సౌరాష్ట్రదేశంలో పర్యటించి, ద్వారవతీ పురానికి వెళ్లి పాంచరాత్రులనే వైష్ణవమతస్తుల్నీ జయించాడు.

ఉజ్జయినీ నగరాన్ని చేరిన శంకరాచార్యుడు, కాళేశ్వరుని ఆలయంలో విశ్రమించి "భట్ట భాస్కరునికి మన ఆగమన వార్త తెలియజేసి రా! అతడు

ప్రౌఢవాది" అని పద్మపాదుడితో చెప్పాడు. పద్మపాదుడెంత చెప్పినా, శంకరుని గొప్పదనం తానే స్వయంగా చూడదలచి భట్టభాస్కర పండితుడు వాదానికి వచ్చాడు.

శంకరుడు భట్ట భాస్కరుడు తమతమ మతాలను సమర్థించుకోడానికి ప్రకృతి–పురుషుల భేదం జీవేశ్వరుల అభేదం గురించి మూడు రాత్రులు మూడు పగళ్లు అలా వాదిస్తూనే ఉన్నారు. చివరకు భట్టభాస్కరుని ఓడించగలిగాడు శంకరుడు. అతడినీ– అతడితోపాటు అతని శిష్యులను కూడా తన వైపు తిప్పుకున్నాడు. అక్కడినుంచి నైమిశారణ్యం వెళ్లి తాపసులకు సంతోషం కలిగించాడు. తర్వాత దేశాటనంలో పలుచోట్ల కుతర్కవాదుల్ని శంకరుని శిష్యులే జయించగా, కామరూప దేశంలో అభినవగుప్తుడు శంకరునితోనే వాదానికి తలపడ్డాడు. ఓడిపోతూన్నదశలో, శంకరునికి శిష్యుడైనట్లు నటించాడు. శంకరుడది తెలుసుకోలేకపోయాడు.

తన మంత్ర శక్తితో శంకరుని ప్రాణం తీయాలనుకున్నాడు. ఆ దురాత్ముడు శంకరుని వైభవం చూడలేక, రహస్యంగా అభిచార క్రియ నిర్వర్తించి, మాన్పడానికి శక్యంగాని భగంధర రోగం కలిగేలా ప్రయోగం చేసి, తాను ఎటో పారిపోయాడు.

ఆ క్షణం నుంచే శంకరుడిని ఆ వ్యాధి పీడించసాగింది. గురుదేవుని వస్త్రాలు ఉతికే పద్మపాదుడి వల్ల ఆ విషయం అందరికే తెలిసింది. రాజవైద్యులు చికిత్స చేసినా ప్రయోజనంలేకపోయింది.

బాధ అధికం కావడంతో, శంకరుడు ఈశ్వరుని ప్రార్థించగా అశ్వినీ దేవతలే శంకరునికి వైద్యం చెయ్యడానికి వచ్చారు. "ఈ వ్యాధి శాక్తిక సంబంధ ప్రయోగం వల్ల వచ్చిందని చెప్పి ప్రతి ప్రయోగమే వైద్యం" అని చెప్పడంతో, పద్మపాదుడు నియమంగా తన అభీష్టదైవం అయిన నారసింహుని ఆరాధించి, అభినవగుప్తుని అంతమొందించేసరికి శంకరులకు రోగం ఉపశమించింది.

# గౌడపాదముని దర్శనం

అట్లు రోగ విముక్తుడైన శంకరాచార్యులొక రోజున. గంగానదీ తీరాన చల్లగాలికి ధ్యాన మగ్నుడై ఉండగా. శుకుని శిష్యుడు, తపోధనుడు అయిన గౌడపాద మహర్షి అక్కడకు వచ్చాడు. అప్పుడాచార్యుడు లేచి, భక్తిశ్రద్ధలతో ఆ మునీశ్వరునికి నమస్కరించి నిలబడ్డాడు.

ఆ మహర్షి కుశల ప్రశ్నలు వేశాక "అంతా తమ కటాక్షం" అని వినయంగా పలికాడు శంకరుడు. శంకరభాష్యాన్ని వినిపించమన్నాడు గౌడపాదుడు.

గీ. **గరిమ మాండూక్య గతములౌ గౌడపాద**
**కారికా భాష్యమును వేదసార భాష్య**
**మును విశేషించి అమ్మహా ముని వరునకు**
**జదివి వినిపించె శంకరాచార్యు డపుడు**

దానికి మునీశ్వరుడు ఆనందించి, వరం కోరుకో మనగా– "ఆర్యా! శుక మహర్షి తుల్యుడివి! సాక్షాత్ భగవానుడివి! నువ్వు ప్రత్యక్షం కావడమే నాకు ఒక వరం. నా మనస్సెప్పుడూ పరతత్త్వచింతనలో ఆసక్తి కలిగి ఉండేలా అనుగ్రహించు! ఇంతకంటే నాకే కోరికాలేదు" అన్నాడు శంకరుడు.

మర్నాడు ప్రస్తావనలో "కాశ్మీరదేశం శారదాపీఠ" ప్రసక్తి వచ్చింది. ఆ పీఠం అధిరోహించడానికి తమ గురువుగారే సమర్థులని– దాంతో వారి దిగ్విజయ యాత్ర పూర్వవుతుందనీ పద్మపాదుడు అన్నాడు.

శంకరుడు శిష్యులతో గూడ కాశ్మీరం చేరుకున్నాడు. అక్కడ దక్షిణ ద్వారం గుండా లోపలికి ప్రవేశించ బోతూంటే, సర్వజ్ఞత లేని వారు ద్వారం తెరవలేరని పండితులు అడ్డుకోగా తన సర్వజ్ఞత నిరూపించుకున్నాడు శంకరాచార్యుడు. తరువాత బదరికారణ్యానికి వెళ్లాడు. శంకరుని భూలోకాగమన కారణం ముగిసిందని ప్రమథగణాలు సిద్ధులు ప్రార్థించగా, శంకరుడు తన లోకానికి వెళ్లిపోయాడు...".

అని శంకరాచార్య చరిత్రకు మంగళంపాడి, ఆ నాటికి వేళ అతిక్రమించడంతో, ఆ నాటికి కథ చాలించి, ఆనందంగా ఉన్న శిష్యునితో కూడ క్రమముగా అవ్వలి మజిలీ చేరాడు మణిసిద్ధుడు.

# కాశీ మజిలీ కథలు

## 55 వ మజిలీ

### అష్టమోల్లాసము

క. శ్రీకల్యాణ నికేతన
లోకానీక స్తుతా ఘలుంటా కాభి
ఖ్యా కలిత విబుధ జనర
క్షా కల్పక సుకృతి శరణ కరుణా భరణా!

దేవా! అవధరించు! అట్లు - ఆ మణిసిద్ధుడు శిష్యునికి శంకరాచార్య చరిత్రమంతా చెప్పి, ఇలా అన్నాడు- "వత్సా! ఆ మహాత్ముని గురించి చెప్పుకొనే కథా విశేషాలు కొన్ని ఉన్నాయి. గ్రంథస్థం కాకపోయినప్పటికీ-లోకంలో ప్రఖ్యాతంగా చెప్పుకుంటున్నారు. వాటిని అన్నింటినీ వివరిస్తాను. సావధానమయిన మనసుతో విను"!

### మహాశక్తి గురించి జరిగిన కథ

శ్రీ శంకరాచార్యుడు శాక్తమత ఖండన చేసిన కొన్నిరోజులకు ఒకనాడు శిష్యులతోకూడి అడవిమార్గాన వెళ్తూన్నాడు. మొదట చిన్న పిల్లగాలిలాగానే ప్రారంభమైన వాయువు క్రమంగా పెద్దదై, పెనుగాలిగా మారి కొమ్మలు విరిగి పోయేటంత ప్రభంజనంగా మారింది. ఆ శక్తి ఎంతటిదోగాని, శిష్యుల్ని - శంకరాచార్యుల్నీ కూడా ఎగరేసుకుపోయింది - ఎంతో దూరానికి.

శిష్యులకు ప్రాణాలు పోతూన్నాయనిపించి "హా! శంకరా! గురువరా! రక్షించు! రక్షించు!" అని మొరపెట్టుకోసాగారు. శిష్యులకు దూరంగా

గాల్లో కొట్టుకొనిపోతూన్న తాను స్వీయ రక్షణానికైనా ప్రయత్నించక, ఇది పరీక్ష కాబోలునని నిశ్చలంగా ఉన్నాడు శంకరుడు.

ఆ గాలి శంకరుడ్ని అలా తీసుకెళ్లి ఒకచోట ఊబివంటి బురదనేలలోకి విసిరేసింది. నడుంలోతువరకు అందులో కూరుకుపోయిన ఆ మహనీయునికి ప్రాణాలు నిలుపుకోవడమే కష్టంగా తోచింది. అందులోన దిగబడిపోయిన అతడికి కాలు కదల్చడానికై వీల్లేనంత చికాకుగావుంది. ఆహా! కాలం ఎంతటి వారినైనా తన వశం చేసుకోకమానదు కదా! గాలి తగ్గినా అది ఊబి కావడం వల్ల పైకొద్దామని ప్రయత్నిస్తున్న కొద్దీ దేహం మరింతగా బురదలో కూరుకుపోసాగింది.

"ఓహో! మోహావేశంలోపడి నేను ఈ ఇక్కట్లలో పడ్డానా? లేకపోతే మనుషుల్ని ఎగరేసేటంతటి గాలులు వీచడం ఏమిటి? నేను తెలీక ఏ దైవతకైనా అపచారం చేశానా?" అని రకరకాలుగా ఆలోచిస్తూవుంటే - దైవచింతన తప్ప మరో మార్గం లేదని తోచిందా యతికి. అప్పుడు-

గీ. **తెలియకెవ్వరి నైన నిందించి ఇట్టి**
**వెతల గాంచితి నేని సద్వృత్తి నిపుడు**
**మాన్పి కొనియెద నా బుద్ధి మాంద్య మెల్ల**
**వేగ రక్షింప రయ్యయో వేల్పులార!**

అని ప్రార్థిస్తూన్న సమయంలో- ఆ ప్రాంతాన వందేళ్ల వయస్సున్నదీ, శరీరమంతా ముడతలుపడి, పండుటాకు వంటి కాంతి గలిగినదీ, వింతకాంతులు విరజిమ్మే తెల్లని వెంట్రుకలతో ఉన్నదీ, నుదుట కాసంత బొట్టున్నదీ, కుడిచేత్తో కర్ర ఊతంగా గలదీ, ఎడమచేత సూర్యకిరణాలు ముఖంపైన పడకుండా అడ్డు ఉంచినదీ అయిన ఓ వృద్ధమాత అక్కడికొచ్చి "అయ్యా! దారి తెలీక, ఈ నట్టడవిలో చిక్కుపడి ఉన్నాను. సన్మార్గం చూపిస్తారా?" అంటూ ప్రశ్నించింది.

ఆ మహారణ్యంలో ఆ ముసలామెను చూసి ఆశ్చర్యంగా "అవ్వా! నేనూ దారితెలీకనే వచ్చి ఈ బురదలో చిక్కుకున్నాను. దీన్ని దాటి వచ్చేశక్తి లేకుండా ఉంది. నీకు దండంగానీ కొంచెం ఊత ఇస్తే దీని లోంచి బైటకు రాగలనేమో అని చిన్న ఆశ" అన్నాడు శంకరుడు.

అప్పుడా వృద్ధురాలు నవ్వుతూ "నాయనా! నీ మాటలు చిత్రంగా ఉన్నాయి. నేను ఈ కర్ర అందించినంత మాత్రాన నీలో లేని శక్తి నీ కెలా వస్తుంది? అదీగాక, నేను నూరేళ్లదాన్ని! నువ్వు వయస్సులో ఉన్నవాడివి! బురదలోంచి ఉద్ధరించడానికి నీలాంటి వాళ్లు సమర్థులుగాని, మావంటి వాళ్లు ఉన్నా అదో లెక్కలోకి రాదు కదా! పోనీ! నాకీ వితర్కం అంతా దేనికి గానీ- నీకు మంచి మార్గం తెలిస్తే చెప్పు! లేకపోతే నా దారినపడి నేను వెళ్తాను" అంది. ఆ వృద్ధాంగన అప్పుడు శంకరాచార్యునికి స్ఫురించింది- ఆమె సామాన్యురాలు కాదనీ, సాక్షాత్ ఆదిశక్తి అనీ. ఆచార్యుడంతటనే చేతులెత్తి మొక్కి "దేవీ! నీవు ఆదిశక్తి వని తెలుసుకున్నాను. నువ్వు లేవని వాదించిన అపరాధానికి నాకీ శిక్ష విధించావు కాబోలు!

**శా. దేవీ! పురాణ శక్తివి భవద్దివ్య ప్రభావంబు మా**
**యా విష్టాత్మ గ్రహింపనేర కటులన్యభ్రాంతి వర్తించితిన్**
**కావంగా దగు నీదు భక్తు గరుణన్ గాయత్రి సావిత్రియున్**
**నీవే యాత్మవటంచు నేడెరిగితిన్ నిక్కంబు కాత్యాయనీ!**

అని స్తుతించగా, సంతోషించి ఆ దేవి దివ్యరూపం ధరించి ఆ యతి శేఖరుని ఊబిలోంచి బైటకు దీసి, ఒళ్లు నిమిరింది.

''వత్సా! శంకరా! నీవు ఉత్తమజ్ఞాన సంపన్నుడివౌతావు పరమార్థోపదేశంతో లోకుల నందర్నీ కృతార్థులను చేస్తావు. నీకు నా ప్రభావమెంతో తెలియాలని ఇలాటిమాయ నేనే కల్పించాను. హరిహరాదులైనాసరే! నా ప్రభావం తెలుసుకోలేరు. దీనికి నిదర్శనంగా నీకో ఇతిహాసం చెబుతాను - విను!" అని చెప్పసాగింది దేవి.

## త్రిమూర్తుల కలహము కథ

పూర్వం నారదమహర్షి ఒకసారి బ్రహ్మలోకానికి వెళ్లగా, బ్రహ్మ "నాయనా! త్రిలోక సంచారివి! నీకు తెలీని విశేషాలుండవు. ఎక్కడేమేమి వర్తమానాలు?" అని అడగ్గా "తండ్రీ! నిన్న స్వర్గంలో ఒక సభ జరిగింది. అందులో త్రిమూర్తుల తారతమ్యం - ఆధిక్యం ప్రస్తావన వచ్చింది. ఆ వివాదంలో పాలుపంచుకున్న వాళ్లంతా ఎవరికి తోచింది వారు చెప్ప

సాగారు. అక్కడ ఎంతసేపు హరిహరుల ప్రస్తావనే తప్ప, నీ గురించి ఒక్కరూ ఎత్తలేదు. తండ్రి అవమానం కొడుకుది కాదా? హరిహరుల కంటే నువ్వే అధికుడివన్నాను నేను. నా మాటలకు అక్కడి వాళ్లంతా ఫక్కున నవ్వారు. నేను అది అవమానంగా భావించి ఇంకేమీ మాట్లాడకుండా, సభ ముగియక ముందే వచ్చేశాను" అన్నాడు.

"ఏమిటేమిటీ? దేవతల సభలో నన్ను పట్టించుకోలేదా? అంత తీసిపోయానా? అతి పరిచయం వల్ల కలిగిన అనర్థం ఇది! నువ్వు మళ్లీ వెళ్లి నేను అధికుడిననీ- నా సామర్థ్యం చూడదల్చుకుంటే చూపిస్తాననీ చెప్పి వచ్చేయ్! నేను సృష్టి చెయ్యకపోతే, హరిహరులేం చేస్తారో చూస్తాను" అన్నాడు చిన్నబుచ్చుకున్న నాలుగు ముఖాలతోనూ.

అందుకు నారదుడు "తండ్రీ! ఆ మధ్య వైకుంఠానికి వెళ్లినప్పుడు మా గోష్ఠిలో నీ ప్రస్తావన తెచ్చి, ఇవే మాటలు చెప్పాను. అప్పుడు విష్ణుమూర్తి కూడ, ఎంతో అతిశయంతో "ఆః! అతడికేం తెలుసు?" అన్నాడు. నాకు చాలా బాధకలిగినా ఏ మాటంటే ఏం నేరమో అని భయపడ్డాను. నువ్వు దేవతలలో అధికుడివేగాని వాళ్లతో సమానుడివి కావు అని వారి ఉద్దేశం కాబోలు! నువ్వు పంతం చెల్లించుకోదల్చుకుంటే, విష్ణువుమీద చూపించు నీ ప్రతాపం!" అన్నాడు.

"అయితే నువ్వు వైకుంఠం వెళ్లి, నీ మాటలకు బ్రహ్మ చింతిస్తున్నాడనీ – తేల్చుకొనే అభిప్రాయం ఉంటే అలాగేననీ చెప్పు!" అని నారదుడిని పంపాడు.

విష్ణువు మందహాసంతో నారదుని ఆహ్వానించి విశేషాలు అడగ్గా "హరిహర బ్రహ్మల్లో ఎవరెక్కువ అని మునులకీ-దేవతలకీ సంవాదం జరిగింది. మునులంతా శివుడెక్కువ అన్నారు. మీరే అధికులని దేవతలన్నారు. చివరికి మునులదే పైచేయి అయింది" అన్నాడు నారదుడు.

"అలాగా! మునులు నా దగ్గరకు రాకపోతారా? అప్పుడు చెబుతాను"అన్నాడు అలిగిన విష్ణువు.

"అయ్యా! జగత్కారకులైన త్రిమూర్తుల ప్రభావం తెలుసుకోవడం మాలాంటి వారి తరమా? మునుల పట్ల మీరు- దేవతలపట్ల శివుడు – మీ

ఇద్దరిపట్ల బ్రహ్మ కోపగిస్తే మా జీవన మెలా సాగుతుంది? ఇప్పటికే బ్రహ్మ మీ ఇద్దరి కంటే తానే అధికుడినని వాదించి గెలుస్తానని ప్రతిజ్ఞచేశాడు. వేదాలన్నీ తన పరంగానే ఉన్నాయట" అన్నాడు నారదుడు.

విష్ణువు కోపగించి "నా నాభికమలంలోంచి పుట్టి, కర్తవ్యం తెలీక చింతిస్తూంటే పుత్ర వాత్సల్యం కొద్దీ సృష్టిక్రియాసామర్థ్యం కలిగించాను. ఆ మాట మరచి నాకంటె తానే అధికుడనని విర్రవీగుతున్నాడా? కేవలం నా పుత్ర వాత్సల్యమే అతడ్ని కాపాడుతోంది. నా పరాక్రమం చూడాలనుకుంటే చెప్పు!" అన్నాడు.

"మీ భక్తుడినైన నేను ఊరుకోలేదు. దేవతలను వాదానికి పురిగొల్పినా, నా భక్తి విశ్వాసాలు గ్రహించలేకపోయారు" అని నారదుడనేసరికి నారాయణుడు విశ్వరూపం దాల్చి విజృంభిస్తూ" నాకు ఆగ్రహం వస్తే రుద్రుడినైనా రూపుమాపుతా" అన్నాడు.

ఇంతలో అక్కడికొచ్చిన లక్ష్మి "శివుడిపైన మీ ప్రతాపం చూపడమంత సమంజసంకాదు" అంది.

అక్కడ్నుంచి కైలాసం వెళ్లిన నారదుడు, విష్ణుమూర్తి విజృంభణను లక్ష్మి ఆపిన వైనం వివరించాడు.

దాంతో రుద్రుడు శివమెత్తిన వాడై "నా రుద్రావతార చరిత్ర ఆ విష్ణువు మరచిపోయాడా ఏం?" అంటూ హూంకరించేసరికి, పార్వతి అడ్డువచ్చి "ఇదంతా ఈ కలహభోజనుడి కల్పన అయి ఉంటుంది. నారాయణుడు శాంత స్వభావి అని మీరు మరచిపోయారా?" అని అడిగింది.

అప్పుడు శివుడు "నారదా! అందర్నీ ఇక్కడికే పిల్చుకురా! సభ చేద్దాం ! ఎవరి ఆధిక్యత ఏమిటో ఇక్కడే తేలుతుంది." అన్నాడు,

అదే మాట విష్ణువూ - బ్రహ్మకూడా అన్నారు. తమ తమ నివాస స్థానాలకే అందరినీ రమ్మన్నారు.

"ఒకరు ఆజ్ఞాపిస్తే రావడానికి మేమేం వారి కింకరులమా?" అదీ ఆ త్రిమూర్తుల ధోరణి అయ్యేసరికి, సభ ఎక్కడ జరపాలో- ఎక్కడ జరుగుతుందని అందర్నీ పిలవాలో నారదునికి అర్థం కాలేదు.

త్రిమూర్తుల్లో ఎవరికీ సంబంధించని మేరు పర్వతం మీద అధికులెవరో తేల్చుకోడానికి ఒప్పించాడు నారదుడు. అక్కడ్నుంచి తిన్నగా ఇంద్రుడి దగ్గరకు వెళ్లి "దేవేంద్రా! మేరు పర్వతం పై త్రిమూర్తుల సభ జరుగనున్నది. దేవతలు, మునులు, దిక్పాలురు, సిద్ధ, సాధ్యులందరితోను వచ్చి నిన్ను సభాభవనాన్ని అలంకరించమన్నారు, నేటికి నాలుగోనాడు అంతా అక్కడకు వస్తున్నారు" అని చెప్పి నారదుడు ఎక్కడికో వెళ్లిపోయాడు...

ఇలా చెప్పిన ఆ మహాశక్తి శంకరాచార్యునికి, కుతూహలం కలిగించే ఆ వృత్తాంతాన్నింకా ఇలా చెప్పసాగింది.

గోపాలా! మహాశక్తి ఏం చెప్పిందో మనం తరువాత మజిలీలో చెప్పుకుందాం! ఇప్పటికే కాలాతీతమైంది" అని ఆనంద హృదయుడైన శిష్యునితో కూడ క్రమంగా అవతలి మజిలీ చేరాడు.



# కాశీ మజిలీ కథలు

## 56 వ మజిలీ

## నవమోల్లాసము

సత్యలోకములో సరస్వతీ వీణాగాన వినోదంతో కాలక్షేపం చేస్తూంటే ఒక సఖి వచ్చి, బ్రహ్మ సృష్టిక్రియా విముఖుడై పడుకొన్నాడని - త్వరగా వచ్చి ఆ విరక్తికి కారణం తెలుసుకోకపోతే, లోకానికి కీడు మూడుతుందని విన్నవించింది.

"వారు పగటివేళ నిద్రించడం నేనెన్నడూ ఎరుగను. మేరు శిఖరిపై జరిగిన సభకు వెళ్లి వచ్చిన అలసట వల్ల నిద్రిస్తున్నారేమో! విశేషాలు తెలుసుకొందామంటే, కోపంగా ఉన్నారేమో! ఆ సభలో ఈయనకేమయినా అవమానం జరగలేదు కదా!" అనుకుంటూనే, నైపుణ్యంగా కోపకారణాన్ని ఆరాతీసింది.

ఆమెకు జవాబు చెప్పక అటు తిరిగి పడుకున్నాడు బ్రహ్మ. అదే పరిస్థితిలో మహేశ్వరుడూ, విష్ణువూ కూడా ఉన్నారని తెలిసి - లక్ష్మి పార్వతి, సరస్వతులు ముగ్గురూ నందీశ్వరుడి ద్వారా ఆ సభా విశేషాలు తెలుసుకోదలచారు. ఇదంతా నారద మహర్షి నిర్వాకమేనని వారికి గట్టి నమ్మకం. సభకు వెళ్లి వచ్చిన నందీశ్వరుడా సభ విశేషాలు వివరిస్తూ -

"తల్లులారా! మేరుగిరి మీద ఒకరత్నపీఠాన్ని అగ్ర సింహాసనంగా అమర్చి, త్రిమూర్తులలో అధికులెవరో, వారు దాన్ని అధిష్ఠించెదరు గాక! లోకులు చిరకాలంగా సందేహపడుతున్నందున, వారి అనుమానం నివృత్తి కావడానికి - సమస్త దేవ, ముని, దిక్పాలక, సమక్షంలో ఏర్పాటైన ఈ సభ ఏర్పాటు చేయడమైనది.....అని ప్రకటించాడు నారదుడు.

ఎవరి అనుయాయులు వారి ఏలికను ఆ పీఠం అధిష్ఠించమని తొందరచేయసాగారు. (పురాణాలతో చక్కని పరిచయం గలవారికి - శివ విష్ణువుల సంవాదం మూలంలోని రచన చాలా ఆనందంగా ఉంటుంది.) అగ్రాసనాధిపత్యం కోసం శివ - విష్ణువులు వివాద పడుతూంటే తన తండ్రిని కూడ అందులో కల్పించుకోమని ప్రోత్సాహించాడు నారదుడు. బ్రహ్మ కూడా అందులో దూరేసరికి వాదం ముదిరి పాకాన పడింది. అప్పుడా త్రిమూర్తులకు అలుక హెచ్చి, తాము తమకు విహితమైన కార్యాలపట్ల విముఖత ప్రదర్శించడానికే నిర్ణయించుకున్నారు. వాళ్లకా పోట్లాట పెట్టిన నారదుడు ఏ దారి పట్టాడో తెలీదు. ఏదీ తేలక పోవడంతో తెల్లముఖాలేసుకుని సభ్యులూ అక్కడ్నుంచి వెళ్లిపోయారు! అదీ విషయం" అని చెప్పాడు.

ఇంతలో శచీదేవి కూడా అక్కడకొచ్చి, పధ్నాలుగులోకాలలోను పురుషజాతి కదలికలేక పడి ఉందని - వృద్ధి క్షయాలు లేవని - స్త్రీ జాతి మాత్రం ఎప్పటిలాగానే ఉందని - ఈ ప్రళయం నివారించమని కోరింది.

ఇంతలో అంతరిక్షం నుంచి వచ్చిన ఒక విమానం లోంచి కొందరు స్త్రీలు దిగి "మీ మీ భర్తలు ప్రధానత్వం గురించి కలహించి నియమిత కార్యాలు మానేశారట! త్రిమూర్తులకు జనని అయిన ఆదిశక్తి పరిచారికులం మేము! లోకానికి పీడ కలిగిస్తున్నందున వారిని తన దగ్గరకు తీసుకురమ్మని జగదంబ ఈ విమానమిచ్చి పంపింది" అన్నారు.

త్రిమాతలు ముగ్గురూ ఆ విషయాన్ని తమ భర్తలకు చెప్పగా, పూర్వకలహాన్ని విస్మరించిన హరిహర బ్రహ్మలు ముగ్గురూ విమానం దగ్గర కలుసుకొని, "మనం ఆ జగడాల మారి మాటలు విని కలహించుకున్నాం! కనుకనే ఇప్పుడు ప్రమాదంలో పడ్డాం! అందుకే మనకు తల్లి నుంచి పిలుపు అందింది. ఆమె మందలిస్తుందేమో!" అనుకుంటూ ఒకరితో ఒకరు స్నేహభావాన్ని ప్రకటిస్తూ విమానం ఎక్కారు.

ఆ విమానం క్షణంలోనే - ఎన్నోవేల యోజనాలు ఊర్ధ్వలోకాల్లోకి దూసుకుపోయింది. అక్కడ మరో మూర్తిత్రయం అచ్చు వారి పోలికల్లోనే ఉన్నవారు ఈ త్రిమూర్తులకు నమస్కరించి వెళ్లారు.

"చిత్రంగా ఉందే! వాళ్లూ మనలాగే ఉన్నారే" అని త్రిమూర్తులు ఆశ్చర్యపోగా - శక్తి దూతికలు "మనం ఇప్పుడు మీ బ్రహ్మాండం దాటి, మరో బ్రహ్మాండంలోకి వచ్చాం! ఈ ముగ్గురూ ఆ బ్రహ్మాండం పాలకులు" అని వివరించారు.

అప్పుడు బ్రహ్మ- విష్ణు - మహేశ్వరులు సిగ్గుపడి "ఆహా! ఈ లోకాలకెల్లా మనమే ప్రధానులమని గర్వపడి ఒకర్నొకరు ఆక్షేపించుకున్నాం! మనలాంటివారు ఈ సృష్టిలో వందలూ - వేలూ ఉన్నారేమో! మన గొప్పదనం ఏముంది?" అనుకుంటూనే, విమానం వేగం పెరగడం- ఆ బ్రహ్మాండాన్నీ వారు దాటిపోవడం జరిగాయి.

ఇలా వారి ప్రయాణంలో వారికి లెక్కలేనంత మంది తమవంటి త్రిమూర్తులే కనిపించారు. చాలాచోట్ల. దాంతో వారికి మతులు పోయి, తమను తామే మరిచి పలవరించసాగారు.

ఎట్టకేలకు వారి విమానం మహాదేవి జగదంబ గల మణిద్వీపానికి వారిని తీసుకువెళ్లింది. ఆ మహాశక్తిని వారు ప్రార్థించగా, ఆమె తేజం ఉపసంహరించుకుని వారిని కనికరించింది.

అప్పుడా ముగ్గురూ ఆమె పాదాలపై పడి "తల్లీ! అజ్ఞానంతో మేమే లోకప్రధానులమని గర్వించాం! మా తప్పు మన్నించు! తనయుల బుద్ధిపొరపాట్లను తల్లి లెక్కచెయ్యదు కదా! రక్షించు!" అంటూ ప్రార్థించారు. ఆమె వారిని మందలించి తిరిగి పంపేయగా, వారు తిరిగి వచ్చి ఎప్పటిలా లోకపాలన చేయసాగారు.

"శంకరా! అటువంటి ఆదిశక్తి ప్రభావం ఎరుగక నువ్వు 'శక్తి' లేదన్నావు. నీ ప్రవృత్తి తెలిసినదాన్ని గనుక - నీకు బోధించాలని వచ్చాను. నన్ను ఆ మహాశక్తిగా భావించి పూజించు!" అని ఆనతివ్వగా "నేను శాక్తేయుల దురాచారాల్ని మాత్రమే ఖండించాను. అంతేగాని, నువ్వు లేనేలేవు అని నేనెందుకు వాదిస్తాను? నువ్వు ఆత్మస్వరూపిణివన్న సంగతి నేనెరుగుదును. నన్ను కృతార్థుడిని చెయ్యి జగన్మాతా!" అంటూ పెక్కు స్తోత్రాలు చేశాడు.

తరువాత ఆ దేవి కూడ, ఆ విద్వత్ప్రవరునికి ఎన్నెన్నో విద్యలు ప్రసాదించి అంతర్ధానం చెందింది. ఆపైన శంకరుడు ఆదిశక్తి యందు భక్తి విశ్వాసాలు

కలిగి, ఈ భరతభూమి మీద ప్రఖ్యాతి చెందిన శ్రీశైలం మొదలైన పదిచోట్ల శక్తిస్థాపన చేసి కృతార్థుడైనాడు" అని ఆదిశక్తి ప్రభావం గురించి గోపాలునికి చెప్పిన మణిసిద్ధుడు మరొక కథ కూడా శిష్యునికి తెలిపాడు......

## ఈడిగ కాపుల కథ

"ఈడిగ కాపు ('తాటిచెట్టు కల్లు తీసి అమ్ముకొనే ఒకానొక శూద్రజాతి) వాని వల్ల విద్యగ్రహించిన శంకరాచార్యుల ఉదంతం ఇది. ప్రజల్లో ఈ కథ వ్యాప్తి చెందినందువల్ల చెప్తున్నాను. దీని నిజానిజాల గురించి చర్చించకూడదు.

శంకరాచార్యులు, మండన మిశ్రుని జయించడానికి మాహిష్మతీ నగరానికి వెళ్లి, అక్కడ చీమ దూరడానికైనా వీల్లేని అతని మందిరంలో ఎలా ప్రవేశించాలా? అనీ ప్రహరీ ఎత్తుగా ఉంది, ఎలా? అనీ ఆలోచిస్తూ నిలబడి అటూ ఇటూ చూస్తున్నాడు.

దగ్గర్లోనే ఒక ఈడిగవాడు, ఈత/తాటి చెట్టు కెదురుగా నిలిచి ఏదో అనేసరికి, ఆ చెట్టు శిరోభాగం వంగి, అతనికి అందుబాటులోకి రాగా, దానికి తగిలించి ఉన్న కుండల్లో కల్లు తీసుకుని, ఖాళీకుండల్ని దానికి తగిలించి ఏదో ఉచ్చరించాడు. అప్పుడా చెట్టు మళ్లీ నిటారుగా నిలబడింది.

అది చూసిన శంకరాచార్యుడు "ఓహో! సృష్టిలో ఎన్నెన్ని వింతలున్నాయి? ఇతడి వల్ల ఈ విద్యగ్రహిస్తే నాకు మండన మిశ్రుడింట ప్రవేశం సులభతరం కాగలదు" అనుకుని, అతడి దగ్గరకెళ్లి, "నీకీ విద్య ఎలా పట్టుబడింది? నిన్ను చూస్తుంటే నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది" అని ప్రశంసించాడు.

నా విద్య సాధారణంగా ఇతరులకు తెలీదు. మీరు గ్రహించేశారంటే, మీరు తప్పక మహానుభావులై ఉంటారు. మీకు ఇది ఎలా కన్పించిందో గాని, యోగ దృష్టి గలవారికే ఇది సాధ్యం" అని ఈడిగకాపు ఆశ్చర్యపోయి, తన తండ్రి తనకీ విద్య నేర్పినట్లు తన కాపురం మాహిష్మతీ నగరం అన్నాడు.

శంకరుడు తనకా విద్య నేర్పమన్నాడు. అందుకు ప్రతిగా తనకు బంగారం చేసే యోగం చెబుతానన్నాడు. వైరాగ్యంతో తిరిగే తనకు బంగారంతో

పనిలేదని చెప్పి, ఆ ఈడిగవాడి నుంచి నేర్చుకున్న విద్యతో మండనుడి గృహ ఆవరణలో ఉన్న కొబ్బరిచెట్లను ప్రహరీ ఈవలకు వంచి అటుపైన లోపల ప్రవేశించాడు శంకరుడు.

సువర్ణయోగ విద్యను శంకరుని ద్వారా గ్రహించి, అనంతంగా బంగారాన్ని తయారుచేసుకున్న ఈడిగవాడు, వాటిని కాసులుగా మార్చి లోకంలో వ్యాపింపజేశాడు. వాటిని ఈడిగకాసులు' అంటారు.

అపారమైన, అపూర్వమైన మహిమలను చిన్నప్పుడే చూసిన శంకరాచార్యులు ప్రహరీ ఎక్కి మండనుడింట ప్రవేశించాడని లోకరీతిలో వాడుకలో ఉండడం - అందుకీ కథ కల్పించబడటం హాస్యాస్పదంగా ఉన్నప్పటికీ, ఇందులో అంతర్థానం మనం గ్రహించవలసినదొకటి ఉంది. అదే, 'అల్పులనుంచి అయినా విశేషవిద్యలు గ్రహించవలసిందే!' అనే నీతి. ఇదికాక ఇటువంటి అద్భుతాలెన్నో శంకరుల దివ్య చరిత్రలోకి జొరబడి, ప్రజల నాల్కల మీద నానుతున్నాయి. వాటికి హేతుబద్ధత లేదు. ప్రజల్ని తన మతంతో సన్మార్గంలోకి మళ్లించిన శ్రీ శంకరాచార్యులు 32 సంవత్సరాలు పూర్తికాగానే, మతవ్యాప్తి శిష్యుల భుజస్కంధాలపై పెట్టి తాను కైలాసవాసి అయ్యాడు.

అని మణిసిద్ధుడు అప్పటికి వేళ అతిక్రమించడంతో, శంకరాచార్య చరిత్ర పరిపూర్ణం చేశాడు. గోపాలుడు పరమానందం చెంది, అద్వైత జ్ఞానసాధన చేయాలనుకున్నాడు.

## శ్రీ శంకరాచార్య చరిత్ర సంపూర్ణము




# కాశీమజిలీ కథలు

## ఉత్తర ఖండానుబంధము

### కాదంబరి

(పూర్వభాగము)

## శూద్రక మహారాజు కథ

ఆ పట్టణానికి అధినాయకుడై శూద్రకుడు అనే రాజు రెండవ ఇంద్రుడిలా భూమండలాన్నంతా ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలిస్తున్నాడు. ఆ రాజు సర్వశాస్త్రాలు తెలిసినవాడు. కళలను ప్రోత్సహించేవాడు.

మిత్రులకి, రసికులకి, విలువిద్యలో ప్రవేశం ఉన్నవారికి ఆశ్రయం కల్పించేవాడు. ఎంతో పేరు ప్రఖ్యాతులు గడించాడు. సారవేత్రవతీ నదీతీరంలో ఉన్న 'విదిశ' అనే పట్నం ఉంది.

శూద్రకుడు ఎంతో అందమైన వాడైనప్పటికీ అవివాహితుడుగానే ఉండిపోయాడు. కనీసం సంతానం కోసం అయినా పెళ్ళి చేసుకోమని మంత్రులు చెప్పినప్పటికీ రాజువారి మాటలు వినలేదు.

ఒకరోజు శూద్రకుడు స్థానమంటపంలో కొలువు దీరి ఉన్న సమయంలో భయంకరమైన వేషంతో ఒక దూత వచ్చి రాజుకు నమస్కరించి "దేవా! దక్షిణ దేశం నుండి ఒక మాతంగ కన్య పంజరంతో ఒక చిలుకను తీసుకొని వచ్చి ద్వారం దగ్గర నిలబడి మీకు ఇలా చెప్పమన్నది. "భూలోకంలో ఆశ్చర్యం, అద్భుతమైన వస్తువులు రాజుగారి దగ్గరే ఉండాలి! ఆ ఉద్దేశంతోనే ఎంతో ఆశ్చర్యకరమైన ఈ చిలుకను రాజుకు సమర్పిస్తాను' అన్నది. ఆమె మీ దర్శనం కోరుతుంది' అంటూ ఆ దూత వివరించింది.

ఈ విషయం విని రాజు కుతూహలంతో ఆ మాతంగకన్యను స్వయంగా తీసుకొని రమ్మని ఆ దూతను పంపించాడు.

ముసలితనం వలన శరీరం కొంత వంగినప్పటికీ, శారీరక శ్రమ చేయడం వలన బింకమైన దేహంతో తెల్లని బట్టలు ధరించిన ఒక ముసలివాడూ - చిలుకను పంజరంలో ఉంచి దాచి జాగ్రత్తగా పట్టుకొని వచ్చే ఒక పిల్లవాడూ వెంటరాగా, మేలిముసుగు ధరించి ఇంద్రనీలపు బొమ్మలా ఉన్న ఓ మాతంగకన్య సభలో ప్రవేశించి రాజుగారికి నమస్కరించింది.

రాజుగారు ఆమె సౌందర్యానికి విస్మయం చెంది "అన్నన్నా! ఇంతటి సౌందర్య విశేషాలు కలిగిన ఆమె అంటరాని కులంలో పుట్టినదా! ఇంతటి మనోహర రాశి బోయకులంలో పుట్టి రాక్షసుల సంపదలాగ ఉపయోగించడానికి వీలులేకుండా పోయింది' అని విచారించాడు.

ఇంతలో ఆ మాతంగకన్య తెచ్చిన చిలుకను చూపిస్తూ ఆ వృద్ధుడు "మహారాజా! ఈ చిలుక సకల శాస్త్రాలూ చదివింది. రాజనీతిలోనూ, పురాణాలలోనూ దీనికి మంచి ప్రావీణ్యం ఉంది. కావ్యనాటక అలంకార గ్రంథాలను చదవడమే కాకుండా స్వయంగా రచించగలదు. వీణా, వేణువు వంటి వాయిద్యాలలో కూడా ప్రవేశం ఉంది. చిత్రకళలోనూ, వ్యాపారంలోనూ, స్త్రీ లక్షణంలోనూ దీనిని మించిన వారు లేరు. ఇన్ని మాటలెందుకు? దీనికి తెలియని విషయాలంటూ లేవు. ఈ చిలుక పేరు వైశంపాయనము" అని చెప్పాడు. అంతేకాకుండా ఇన్ని విశేషాలు కలిగిన ఈ చిలుక మీ దగ్గర ఉండడమే న్యాయమని రాజుపాదాల ముందుంచాడు.

అప్పుడు చిలుక రాజుకు ఎదురుగా నిలబడి ఎంతో స్పష్టంగా చక్కటి స్వరంతో ఒక పద్యం పాడి వినిపించింది. ఆ చిలుక పలుకులు విని శూద్రకుడు ఎంతో సంతోషించి కుమార పాలితుడు అనే వృద్ధ మంత్రిని చూసి "మంత్రివర్యా! ఈ చిలుక పలుకులలోని మాధుర్యాన్ని విన్నారా! ఇది స్పష్టంగా మాట్లాడడమే ఒక చిత్రం. అంతేకాకుండా కుడికాలు ఎత్తి మరీ జయశబ్ద పూర్వకంగా పద్యాన్ని చెప్పడం మరీ విచిత్రం" అన్నాడు.

దానికి కుమారపాలికుడు నవ్వుతూ "రాజా! ఇదేమి విచిత్రం కాదు. కొన్ని రకాలైన పక్షులు మనుషులు చెప్పిన మాటలను పలుకడం మీకు తెలియనిది కాదు. పూర్వం చిలుకలు కూడా చాలా స్పష్టంగా మాట్లాడేవి. అయితే అగ్నిదేవుని శాపం వలన వాటి మాటలు అస్పష్టమైనాయి" అని చెప్పాడు.

వారిట్లా మాట్లాడుకుంటూ ఉండగానే మధ్యాహ్న సమయం అయిందదానికి గుర్తుగా భేరీనాదం మ్రోగింది. అది విని రాజు సభ నుండి లేచి, మిగిలినవారిని వెళ్ళిపొమ్మని చెప్పి, ఆ మాతంగకన్యను మాత్రం తాను వచ్చేవరకు ఉండమని చెప్పాడు. తర్వాత ఆ చిలుకను కూడా తనతోపాటు లోపలికి తీసుకువెళ్ళి దానికి స్నానపానాదులు ఏర్పాటు చేయమని చెప్పి వెళ్లిపోయాడు.

రాజు స్నానం చేసి పూజాకార్యక్రమాలు నిర్వర్తించుకొని, భోజనం చేసిన తర్వాత మిత్రులతో కూర్చొని వైశంపాయనమును తీసుకొని రమ్మని దూతకు చెప్పాడు. ఆ దూత వెళ్ళి వెంటనే ఆ చిలుకను తీసుకొచ్చి రాజు ముందుంచింది. రాజు చిలుకను చూసి "పక్షిరాజా! నీకు భోజనం నచ్చిందా?" అని అడగ్గా దానికి ఆ చిలుక "మహారాజా! జంబూఫలాలను తిన్నాను. ద్రాక్షపళ్ళ మాధుర్యాన్ని చెప్పలేను. ఉసిరి కాయల పస అనుభవిస్తేనే గానీ తెలియదు. ఈరోజు నేను తిన్న భోజనం అమృతంతో సమాన" మని ఎంతగానో పొగిడింది.

ఆ మాటలకు రాజు సంతోషించి "ఓ పక్షి రాజమా! నువ్వు ఏ దేశంలో జన్మించావు? నీ తల్లిదండ్రులెవరు? నీకు ఈ వేదశాస్త్ర పరిచయం ఎలా కలిగింది? ఇన్ని విద్యలు ఎలా నేర్చుకున్నావు? ఇది నీకు వరమా లేక చిలుక రూపంలోఉన్న దివ్యుడివా? నీకెన్ని సంవత్సరాల వయస్సు ఉంటుంది? ఇంతకుముందు నువ్వెక్కడ ఉండేదానివి? నీకీ పంజరంలో బందిఖానా ఏమిటి? నీ వృత్తాంతం అంతా వివరించు. వినాలని కుతూహలంగా ఉంది" అన్న రాజు మాటలకు చిలుక కొంతసేపు ధ్యానించి ఇలా చెప్పసాగింది.

## చిలుక కథ

"మహారాజా! నా కథ చాలా పెద్దది. మీరు వినడానికి ఇష్టపడుతున్నారు కాబట్టి వివరిస్తాను. వింధ్యారణ్యంలో దండకారణ్యంగా ప్రసిద్ధి చెందిన పంచవటీ తీరానికి కొంత దూరంలో పంపాసరోవరం ఉన్నది. దానికి పశ్చిమభాగంలో ఏడు తాటి చెట్లకు ప్రక్కగా ఒక ముసలి

బూరుగు వృక్షం ఉంది. ఆ చెట్టు కొమ్మలు దట్టంగా ఉండి శాఖోపశాఖలుగా విస్తరించింది. ఆ చెట్టు మేరు పర్వతమంత ప్రఖ్యాతి గాంచింది. సామాన్యులు ఆ చెట్టును ఎక్కడం సాధ్యం కాదు. కాబట్టి ఏమాత్రం అపాయం ఉండదని భావించి వివిధ దేశాలనుండి పక్షులు వచ్చి చెట్టు తొర్రల్లో గూళ్ళు కట్టుకొని నివశించేవి.

అదేవిధంగా మా తండ్రి కూడా భార్యతో చాలాకాలం నివశించాడు. విధివశాన నేను వారికి ముసలితనంలో జన్మించాను. నేను పుట్టిన తర్వాత ప్రసవరోగంలో నా తల్లి మరణించింది. భార్య మరణించడంతో నా తండ్రి ఎంతో బాధపడినప్పటికీ నాకు మాత్రం ఏ కొరతా రాకుండా పెంచసాగాడు.

నా తండ్రి ముసలివాడు కావడంతో శిధిలమైన రెక్కలతో ఎగరలేక, వణుకుతున్న ముక్కుతో అశక్తుడైనా గానీ అక్కడక్కడా జారిపడిన గింజలను, పళ్ళను ఏరి తీసుకొచ్చి ముందు నాకు పెట్టి మిగిలింది ఆయన తినేవాడు ఈ విధంగా కొంతకాలం గడిచింది.

ఒకరోజు ఉదయాన్నే లేత ఎండలో కొన్ని చిలుకలు మేతకోసం వెళ్ళగా, మరికొన్ని పిల్లలను చూసుకుంటూ గూళ్ళలోనే ఉండిపోయాయి. నా తండ్రి కూడా నన్ను రెక్కలక్రింద దాచుకొన్నాడు. ఆ సమయంలో అకస్మాత్తుగా జంతువులన్నీ ఒక్కసారిగా భయపడేలాగా వేటగాళ్ళ అరుపులు వినిపించాయి. ఆ అరుపులకు నేను భయపడి నా తండ్రి రెక్కల క్రింద దాక్కున్నాను. కొంతసేపటికి ఆ అరుపులన్నీ పోయి మొత్తం నిశ్శబ్దం అయిపోయింది. ఇదేంటో చూద్దామని నేను నా తండ్రి రెక్కల సందులోంచి తల బయటకు పెట్టి ఆ అరుపులు వచ్చినవైపు చూడసాగాను.

అప్పుడా వంక నుండి శబరసైన్యము నా ఎదురుగా రావడం గమనించాను. వారి శరీరాల నలుపుకి ఆ అడవి అంతా నల్లగా మారిపోయింది. వారిలో మాతంగుడు అనేవాడిని చూశాను. అతను మహామోహినీ దేవి సోదరుడేమో అన్నట్లుగా ఉన్నాడు.

“ఆహా! వీడి జీవితము మోహప్రాయము. ఇతని చరిత్రను సాధుజనులు మెచ్చరు. మద్యమాంసాలను ఆహారంగా తీసుకుంటాడు. జీవహింస చేస్తాడు. చెరబట్టిన స్త్రీలే భార్యలు. మృగాలతో సహవాసం చేస్తాడు. పశువుల

రక్తంతో దేవతార్చన చేస్తాడు. వీడికి అసలు కరుణ అనేదే తెలియదు. శాంతి పేరు కూడా తలవడు. క్షమాగుణానికి ఆమడ దూరంగా ఉంటాడు. వీడికి వివేకం అనేది అస్సలు కలగదా?'' అని నాలో నేను ఆలోచించుకుంటూండగా ఆ మాతంగుడు అడవిలో తిరిగి అలసిపోయి వచ్చి బూరుగు చెట్టు క్రింద కూర్చున్నాడు.

అప్పుడు ఒక బోయ యువకుడు దగ్గరలోని చెరువుకు వెళ్ళి తామరాకులో నీటిని తెచ్చి మాతంగుడికి అందించాడు. వాడు ఆ నీటిని త్రాగి కొంత బడలిక తీర్చుకొని కాసేపు చెట్టునీడన విశ్రమించాడు. ఆ తర్వాత సైన్యంతో ఎటో వెళ్ళిపోయాడు.

వారిలో ఒక ముసలి బోయవాడు తినడానికి మాంసం ఏమీ దొరక్కపోవడంతో ఒక్కసారి బూరుగుచెట్టుపైకి చూశాడు. ఆ చూపులతోనే మా ప్రాణాలు పోతాయని మాకు అర్థమైంది. ఆ ముసలి బోయవాడు సునాయాసంగా ఆ మహావృక్షాన్ని ఎక్కి కనిపించిన పక్షులన్నింటినీ చంపి క్రిందకు పడేయసాగాడు. చివరకు మమ్మల్ని కూడా వదలలేదు. నా తండ్రిని గొంతు నులిమి దారుణంగా చంపేశాడు. చిన్నదాన్నైనా నేను నా తండ్రి రెక్కల క్రింద ఉండడం వాడు గమనించలేదు. నేను నా తండ్రితో పాటు నేలపై పడ్డాను. కానీ దైవవశాత్తు రాశిగా ఉన్న ఆకులపై పడడం వల్ల నాకేమీ కాలేదు. ఆ బోయవాడు చెట్టుదిగి వచ్చేలోపు అక్కడికి దగ్గరగా ఉన్న తమలపాకుల తీగలో చేరి, దట్టమైన దాని ఆకుల రంగులో కలిసిపోయాను.

ఆ కిరాతుడు చెట్టు దిగి తాను చంపిన పక్షులన్నింటినీ చిక్కంలో పెట్టుకొని మాతంగుడు వెళ్ళిన వైపుకు వేగంగా వెళ్ళిపోయాడు.

తర్వాత నేను కొంచెం తలెత్తి చూశాను. ఏ చిన్న శబ్దం వినిపించినా వాడే వస్తున్నాడేమో అని భయపడుతూ, తండ్రి చనిపోయినందుకు బాధపడుతూ దాహంగా ఉండటం వల్ల నీటి కోసం వెదకడం ప్రారంభించాను. రెక్కలతో ఎగరలేక పాదాలతో నడుస్తూ ఆయాసంతో కొంతదూరం అయినా నడవలేక దాహాన్ని భరించలేక నాలో నేను ఇలా అనుకున్నాను.

"ఆహా! అత్యంత కష్టసమయంలో కూడా ప్రాణులకు జీవితంపై ఎంత ఆపేక్ష! జీవులకు జీవితం కన్నా విలువైనది మరొకటి లేదు. నన్నెంతో

ప్రేమగా చూసుకునే తండ్రి మరణించినా, నాకు జీవిత్తంపై ఆశ వదలకున్నది. తండ్రి మరణాన్ని కూడా లెక్కచేయని నన్ను దాహం ఈ విధంగా బాధిస్తున్నది కాబోలు! కనుచూపు మేరలో నీరు కనబడడం లేదు. ఈ దాహానికి నిముషమైనా ఓర్చుకోలేను. కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయి. విధి ఎంత దారుణమైనది. నాకు మరణమైనా రాదా" అని బాధపడ్డాను.

ఆ ప్రాంతంలో జాబాలి మహర్షి ఆశ్రమం ఉంది. అతని కుమారుడు హారీతకుడు అనేవాడు సకల విద్యాపారంగతుడు. స్నేహితులతో కలిసి స్నానార్థమై పంపా సరస్సుకు వెళుతూ దాహంతో నోరు తెరుచుకుని పడి ఉన్న నన్ను చూశాడు.

సత్పురుషుల హృదయాలు కరుణాబంధురములు కదా! నా అవస్థను చూసి జాలిపడి తన మృదు హస్తంతో పట్టుకొని ఆ సరస్సుకు దగ్గరగా తీసుకువెళ్ళి కొన్ని నీటి చుక్కలను నా నోట్లో పోశాడు. అప్పటికి గానీ నా శరీరం చల్లబడలేదు. పోయిన ప్రాణాలు తిరిగివచ్చాయి. తర్వాత నన్నొక చెట్టు నీడన ఉంచి స్నానాదులు ముగించుకొని తన స్నేహితులతో సహా నన్ను వెంటబెట్టుకొని తన ఆశ్రమానికి తీసుకువెళ్ళాడు.

ఎంతో మహిమగల ఆ ఆశ్రమంలో నిష్ఠాగరిష్ఠుడైన జాబాలి మహర్షిని చూసి నా మనస్సులో ఇలా అనుకున్నాను.

"ఆహా! తపస్సు ప్రభావంతో ఎంత శాంతంగా ఉన్నాడు. మహాత్ముల పేరును తలుచుకుంటేనే పాపాలు పోతాయి. అలాంటిది వారి దర్శన భాగ్యం కలిగితే, ఆ అదృష్టాన్ని ఏమని చెప్పుకోవాలి? సకల విద్యలు ఈయన మొహంలో కనిపిస్తున్నాయి. అయినా ముసలితనానికి ఎవరన్నా కూడా లెక్కలేదు కదా– ఆ మహానుభావుని జటాకపాలాన్ని కూడా తెలుపుచేశాయి" అనుకుంటూండగా హారీతకుడు నన్నొక చోట ఉంచి తండ్రికి నమస్కరించి తానొక మూలగా కూర్చొన్నాడు.

అప్పుడు అక్కడ ఉన్న మునులు నన్ను చూసి దీన్ని ఎక్కడ నుండి తెచ్చావని హారీతకుని అడగ్గా తాను స్నానానికి వెళుతుండగా దాహార్తిగా ఉన్న నన్ను చూసి జాలిపడి ఇక్కడకు తీసుకొచ్చానని చెప్పాడు. దీనికి రెక్కలు వచ్చేవరకు ఇక్కడే ఉంటుంది. రెక్కలు వచ్చిన తర్వాత దానికి నచ్చిన చోటికి వెళుతుంది.

ఇదే నా అభిప్రాయం' అన్న హారీతకుని వైపు చూశాడు. తర్వాత నిర్మలమైన దృష్టితో సాభిప్రాయంగా నన్ను చూసి "తాను చేసుకున్నదానికి ఫలితం అనుభవిస్తున్నాడు" అని పలికాడు.

దివ్యదృష్టితో ప్రపంచంలో గల త్రికాల విశేషాలు బాగా తెలుసుకున్న ఆ మహర్షి అలా చెప్పగానే అక్కడే ఉన్న మునులందరూ "ఇది పూర్వజన్మలో ఎవరు? ఎలాంటి పనులు చేయడం వలన ఈ జన్మ ఎత్తింది? దీని పేరేమిటి? దీని వృత్తాంతం ఏమిటో మాకు వివరించండి" అని అడగ్గా దానికి ఆ మహాత్ముడు దీని చరిత్ర చాలా వింతైనది. ముందు స్నానపానాదులు కానీయండి. రాత్రికి సావధానంగా వివరిస్తాను" అని చెప్పి అక్కడినుండి వెళ్ళిపోయాడు.

అందరూ తమ తమ కార్యక్రమాలను పూర్తి చేసుకొని రాత్రికి జాబాలి మహర్షికి నమస్కరించి చిలుక వృత్తాంతాన్ని వివరించమనగా ఆ మహర్షి వారి కుతూహలానికి సంతోషించి

ఇలా చెప్పడం మొదలుపెట్టాడు...........

## తారాపీడుని కథ

**తా**రాపీడుడు అనే రాజు ఉజ్జయినీ నగరాన్ని పాలిస్తుండేవాడు. ఆ రాజు సకల శాస్త్ర పారంగతుడు. ధర్మజ్ఞుడు. ప్రజలను కన్న బిడ్డల్లాగా పాలించేవాడు. అతని దగ్గర సకల కళానిపుణుడైన శుకనాశుడు అనే మంత్రి ఉండేవాడు. అతడు బ్రాహ్మణుడైనా గానీ, క్షాత్ర ధర్మంలో ప్రసిద్ధి చెందాడు. చంద్రునికి వెన్నెలలాగా ఆ మహారాజుకు విలాసవతి అనే భార్య ఉండేది. రాజుకు ఆమె అంటే ఎంతో మక్కువ.

ఒకరోజు మహారాజు విలాసవతి భవనానికి వెళ్ళగా ఆమె ఎంతో బాధపడుతూ ఉండడం గమనించాడు. వెంటనే ఆమె దగ్గరకు వెళ్ళి "దేవీ! ఎందుకింతలా బాధపడుతున్నావు? అలంకరించుకోలేదేమి? నీ విరక్తికి కారణం ఏమిటి? నీకు ఇష్టం లేని పనిని గానీ నేనేమైనా చేశానా?" అంటూ బ్రతిమాలాడు.

అప్పుడు మకరిక అనే పరిచారిక తారాపీడునితో “దేవా! మహారాణిగారికి ఏ విషయంలోనూ కొరత లేదు. నేడు శివరాత్రి కావడంతో ఈశ్వరుని ఆరాధించడానికి గుడికి వెళ్ళాము. అక్కడొక చోట మహాభారతం చదవడం చూసి కొంతసేపు అక్కడే ఆగిపోయాము. అందులో కుమారులు లేనివారికి గతులు లేవనీ, పున్నామ నరకాన్ని కొడుకులు మాత్రమే తప్పించగలరనీ విని ఇంటికి వచ్చిన దగ్గర నుండి ఆ విషయాన్నే తలుచుకుంటూ, పిల్లలు లేరని బాధపడుతున్నారు” అంటూ వివరించింది.

అది విని రాజు “దేవీ! బాధపడకు. దేవుడు చేయవలసిన పనిని గురించి మనం మాత్రం ఏం చేయగలం? దేవతలకు ఇంకా మనమీద దయ కలుగలేదో ఏమో! లేదా పూర్వజన్మలో మంచి పనులు చేయలేదేమో? ఇకమీదట మనుషులు చేయదగిన అన్ని మంచి పనులను చేద్దాం! దేవతలను విశేషంగా పూజిద్దాం! గురువులను గౌరవిద్దాం! వారు మనకు తప్పకుండా వరాలు ఇస్తారు. దశరథుడు వృద్ధుడైనప్పటికీ విభాండకనందుని ఆరాధించే కదా రామలక్ష్మణ భరతశత్రుఘ్నులను కొడుకులుగా పొందాడు. అంతేకాకుండా చండకౌశికుని వరం వల్లనే కదా బృహద్రథుడు జరాసంధుని పొందాడు. మునీశ్వరులకు సేవచేసిన ఫలితం ఊరికే పోదు. అయినా పిల్లలు లేరనే బాధ నాకు మాత్రం లేదనుకున్నావా! నేను మాత్రం ఏం చేయగలను. బాధపడడం మానేసి ధర్మకార్యాలను చేయి” అంటూ ఆమెను ఓదార్చి రాజు తన మందిరానికి వెళ్ళిపోయాడు.

అప్పటినుండి విలాసవతి దేవతారాధనలు, బ్రాహ్మణపూజలు వెనుకటి కన్నా ఎక్కువగా చేయడం మొదలుపెట్టింది. కొడుకులు పుట్టడానికి ఎవరు ఏ వ్రతం చెప్పినా, అది ఎంత కష్టమైనా చేయడం ప్రారంభించింది. ఇలా ఉండగా ఒకరోజు మహారాజుకు, నిద్రలో చంద్రుడు విలాసవతిలో ప్రవేశిస్తున్నట్లు కల వచ్చింది. వెంటనే లేచి ఆనందంతో శుకనాశుని రప్పించి తనకు వచ్చిన కలను గురించి చెప్పాడు.

అది విని శుకనాశుడు ఎంతో సంతోషించి “మహారాజా! మీ కోరిక తొందరలోనే తీరబోతుంది. అంతేకాదు, నా భార్య మనోరమ యందు బ్రాహ్మణుడొకడు దివ్యవస్త్రాలంకారాలతో వేయిరేకులు గల పద్మాన్ని

ఉంచినట్లు నాకు కల వచ్చింది. శుభసూచకాలు కనబడుతున్నాయి. తొందరలోనే కుమారులు కలుగుతారు" అని చెప్పాడు. ఈ వార్త విని రాజు ఆనందపడి వెంటనే శుకనాశునితో సహా విలాసవతి మందిరం వెళ్ళి వారిద్దరికీ వచ్చిన కలను గురించి చెప్పి ఆమెకు సంతోషాన్ని కలిగించారు.

మరికొన్ని రోజులకు విలాసవతి గర్భవతి అయింది. కులవర్ధని అనే ప్రధానదాసి ఆ విషయాన్ని రాజుకు, మహామంత్రికి వెళ్ళి చెప్పింది. దాసి చెప్పిన మాటలు విని వారిద్దరూ ఎంతో ఆనందించారు. ఒక శుభముహూర్తంలో విలాసవతి కుమారుని కన్నది. ఈ విషయం విని అంతః పురంలో మంగళగీతాలు మ్రోగించారు. ఆ నగరంలోనే కాక దేశమంతా ఉత్సవాలు చేయించారు.

తారాపీడుడు కొడుకుని చూడాలనే ఉద్దేశంతో మహామంత్రిని వెంటబెట్టుకొని ప్రసూతి గృహానికి వెళ్ళి మొదట నీటిని, తర్వాత అగ్నిని ముట్టుకొని తర్వాత విలాసవతి దగ్గర దీపంలా ప్రకాశిస్తున్న కొడుకుని చూసి ఆనందపడ్డాడు. అప్పుడు శుకనాశుడు ఆ బాలుణ్ణి చూసి చక్రవర్తి చిహ్నాలు కనబడుతున్నాయన్నాడు. అదే సమయంలో ఒక పురుషుడు వచ్చి వారికి నమస్కరించి "దేవా! శుకనాశుని భార్య మనోరమకు పరశురాముడి వంటి కుమారుడు జన్మించాడు" అని చెప్పాడు. ఆ వార్త విని రాజు సంతోషించి ఆ పురుషునికి పారితోషికం ఇచ్చి, శుకనాశుని కొడుకుని చూడడానికి అతని ఇంటికి వెళ్ళాడు.

తర్వాత మహావైభవంగా జాత కర్మాదివిధులు నిర్వర్తించి కలలో తన భార్య గర్భంలో చంద్రుడు ప్రవేశించడం వలన కలిగిన కుమారునికి చంద్రాపీడుడని పేరు పెట్టాడు. మహామంత్రి శుకనాశుడు తన కుమారుడికి వైశంపాయనుడని పేరు పెట్టాడు.

కాలక్రమంలో తారాపీడుడు కుమారునికి విద్యాబుద్ధులు చెప్పించడం కోసం ఆ నగరానికి దగ్గరలోనే విద్యామందిరాన్ని కట్టించి అందులో సకల విద్యా పారంగతులైన గురువులను నియమించి వైశంపాయనునితో సహా తన కుమారుని చదివించాడు.

రాజపుత్రుడు, వైశంపాయనుడు ఇద్దరూ అనతికాలంలోనే సమస్త విద్యలూ నేర్చుకున్నారు. అంతేకాకుండా రాజకుమారుడైన చంద్రాపీడుడు చిన్నతనంలోనే అందరూ ఆశ్చర్యపోయే విధంగా మహాబలాన్ని కలిగి ఉన్నాడు. ఎదురుపడి ఏనుగుల చెవులను పట్టుకొని అవలీలగా వాటిని వంచేవాడు. సింహాలు సైతం అతని పట్టుకి కదలలేకపోయేవి. బాణాలు వేస్తే పర్వతాలు చిల్లులు పడేవి. పదిమంది మోయలేని ఇనుపదండాన్ని కూడా అవలీలగా మోసేవాడు.

ఇలాంటి మహాశక్తులు లేకపోయినప్పటికీ తక్కిన విద్యలన్నింటిలో చంద్రాపీడునికి వైశంపాయనుడు సమానమైనవాడు. వారిద్దరూ పుట్టినదగ్గరనుంచి కలిసి పెరగడం, కలిసి చదువుకోవడం వలన రాజకుమారునికి వైశంపాయనుడు రెండవ హృదయం వంటివాడైనాడు. వారికి యుక్త వయస్సు వచ్చింది. వారి సకల విద్యప్రావీణ్యమును విని రాజు సంతోషించి బాలాహకుడు అనే సేనాధిపతిని పిలిచి ఒక శుభముహూర్తంలో వారిని తీసుకొని రమ్మని ఆజ్ఞాపించాడు.

అతడు విద్యాగృహానికి వెళ్ళి వైశంపాయనునితో సహా విద్యాభ్యాసం చేస్తున్న చంద్రాపీడునికి నమస్కరించి “మీరు సకల విద్యలు నేర్చుకున్నారని విని మహారాజు సంతోషించి నిన్ను చూడాలనుకుంటున్నారు. మీరిద్దరూ విద్యాభ్యాసం ప్రారంభించడం వల్ల చూడడానికి మీ తల్లులు వేయి కళ్ళతో ఎదురుచూస్తున్నారు. ఇక ఇంటికి వచ్చి రాజభోగాలు అనుభవించండి. రాజలోకాన్ని సన్మానించండి. బ్రాహ్మణులను పూజించండి. ప్రజలను పాలించండి. ఇంద్రాయుధమగు ఈ గుర్రాన్ని ఎక్కి రండి. మీ తండ్రిగారికి పారశీకపు దేశపు రాజు దీన్ని కానుకగా పంపాడు. ఇది ఎంతో వేగమైనది” అని చెప్పాడు.

రాకుమారుడు వైశంపాయనునితో సహా ఆ గుర్రాన్ని చూసి ఆ గుర్రం యొక్క లక్షణాలను పరీక్షించి ఆ గుర్రాన్ని ఎక్కాడు. వైశంపాయనుడు వేరొక గుర్రంపై రాగా ఇద్దరూ రాజమార్గంలో ప్రయాణమయ్యారు. రాజపుత్రుడు సమస్త విద్యలు నేర్చుకొని వస్తున్నాడనే వార్త విని ప్రజలందరూ వారి - వారి భవనాలనెక్కి చూడసాగారు.

అంతేకాకుండా "ఈ సుకుమారుని, కుమారునిగా కన్న విలాసవతి ధన్యురాలు. ఇతనిని భర్తగా పొందే అమ్మాయి ఎంత పుణ్యం చేసుకున్నదో కదా!" అని అంతఃపుర స్త్రీలు స్తుతిస్తుండగా ద్వారం దగ్గరే గుర్రాలను ఆపి, వైశంపాయనుని తీసుకొని బాలాహకుడు వినయంగా ముందు నడుస్తూ వారికి దారిచూపగా రాజకుమారుడు సభామండపంలో ఉన్న తండ్రికి నమస్కరించాడు. పుత్రుని చూసి ఆనందభాష్పాలు రాలగా కుమారుని కౌగిలించుకున్నాడు. ఆ తర్వాత వైశంపాయనుని చూసి ఆనందించాడు.

"నాయనా! నీ తల్లి నీ రాక కోసం ఎదురుచూస్తున్నది. వెంటనే వెళ్ళమనగా రాజకుమారుడు స్నేహితునితో కలిసి విలాసవతి మందిరం వైపు వెళ్ళాడు.

కొడుకుని చూసి విలాసవతి ఆనందం పట్టలేకపోయింది. కుశల ప్రశ్నలు వేసింది. సమస్త విద్యలు నేర్చుకున్న కొడుకుని చూసి గర్వపడింది. చంద్రాపీడుడు కొంతసేపు తల్లి దగ్గర ఉండి ఆమె అనుమతి తీసుకొని వైశంపాయనుని ఇంటికి వెళ్ళి శుకనాశునికి వినయంగా నమస్కరించాడు. రాజకుమారుని, మంత్రి కుమారుని చూసి సామంతరాజులు తమ ఆసనాలను వదిలి నేలపైన కూర్చొన్నారు.

మంత్రి శుకనాశుడు రాకుమారునితో "నాయనా! సమస్త విద్యలు నేర్చుకున్న నిన్ను చూసి అందరూ ఆనందిస్తున్నారు. గురువుల ఆశీర్వాదం ఇప్పటికి ఫలించింది. నీ వంటి ఉత్తముడిని భవిష్యత్తులో రాజుగా పొందే ఈ దేశప్రజలు ఎంత అదృష్టవంతులు. ఈ రాజ్యభారాన్ని నీ తండ్రితో కలిసి నీవు కూడా పంచుకో" అన్నాడు. శుకనాశుని ఆశీర్వాదాలు పొంది ఆయన అనుమతితో మంత్రి భార్య మనోరమను చూసి ఆమె ఆశీర్వాదాలు కూడా పొంది తన తండ్రి తన కోసం కొత్తగా కట్టించిన భవనానికి వైశంపాయనునితో సహా వెళ్ళిపోయాడు.

ఒకరోజు కైలాసుడు అనేవాడు పత్రలేఖ అనే ఆమెను వెంట తీసుకొని అక్కడికి వచ్చాడు. ఎంతో సౌందర్య విశేషాలు కలిగిన ఆమెను చూసి రాకుమారుడు ఆశ్చర్యపోయి "ఈమె ఎవరు? ఇక్కడికి ఎందుకు తీసుకొచ్చావు?" అని అడుగగా దానికి కైలాసుడు "కుమారా! ఈశ్వరుని

కూతురు పత్రలేఖ. మీ తండ్రిగారు దిగ్విజయం చేస్తూ కులూత రాజధానిని కూడా జయించి బందీ జనముతో కూడా ఈమెను తీసుకొచ్చి అంతఃపుర పరిచారికల మధ్య ఉంచారు.

నేను ఈమె వృత్తాంతం విని అనాథ అని జాలిపడి రాజపుత్రిక అని గౌరవించి ఇంతకాలం పెంచాను. ఇప్పుడు ఈమెను నీకు సేవలు చేయమని చెప్పి నీ దగ్గరకు పంపుతున్నాను. నీవు ఈ అమ్మాయిని పరిజనుల మాదిరిగా చూడకూడదు. శిష్యురాలిగా చూడవలెను. స్నేహితునిగా ఉండవలెను. మహారాజు కుమార్తె కాబట్టి నీవు కూడా గౌరవించాలి. కొన్నాళ్ళకు ఈ అమ్మాయి మంచితనం నీకే తెలుస్తుంది. దీని గురించి నీకు తెలియదు కాబట్టి ఇంతగా చెబుతున్నాను" అని చెప్పి కైలాసుడు వెళ్లిపోయాడు.

అప్పటినుండి పత్రలేఖ చంద్రాపీడునికి రాత్రి, పగలు అనే తేడా లేకుండా సపర్యలు చేస్తున్నది. పత్రలేఖను చూసిన దగ్గర నుండి రాకుమారునికి ఆమెపై ప్రీతి కలుగుతున్నది. అలా కొన్ని రోజులు గడిచిన తరువాత చంద్రాపీడునికి పట్టాభిషేకం చేయ నిశ్చయించి దానికి కావాల్సిన ఏర్పాట్లు చేయిస్తున్నారు. ఒకరోజు తన దర్శనం కోసం వచ్చిన చంద్రాపీడునికి శుకనాశుడు ఈ విధంగా రాజనీతి బోధించాడు.

## రాజనీతి

"నాయనా! చంద్రాపీడా! సమస్త శాస్త్రాలు తెలిసిన నీకు నేను చెప్పవలసిన అవసరం లేదు. స్వభావరీత్యా వచ్చిన యవ్వనం సూర్యకాంతి వల్లగానీ, రత్న కాంతుల వల్లకానీ, దీపపు కాంతుల వల్లగానీ పోదు. ధన మదం కూడా దారుణమైనది. ఐశ్వర్యమదం కూడా పోయేది కాదు. శౌర్యం, యవ్వనం, సౌందర్యం అన్నీ కలిసి ఉన్న ఈ సమయంలోనే ఏమని చెప్పగలము?

యవ్వన ప్రారంభంలో ఎన్ని శాస్త్రాలు చదివినప్పటికీ - బుద్ధి కలుషితం కాకమానదు. తరచుగా మునుల దృష్టి అనురాగంతో ఉంటుంది. నీ వంటి వారే ఈ ఉపదేశానికి అర్హులు. జనులకు గురూపదేశము ప్రక్షాళన జలం వంటిది. రాజులకు విశేషంగా చెప్పవలసిన పని లేదు. రాజు మాటను అనుసరించి ప్రజలు ముందుకు నడుస్తారు.

ధనమదం ఉన్నవారు గురూపదేశమును చెవిన పెట్టరు. రాజ్యలక్ష్మి సరస్వతీ పుత్రుడైన విద్యావంతుడిని చూడనీయదు. గుణవంతుడిని కూడా అపవిత్రునిగా చూస్తూ పరిహాసం చేస్తుంది. వినయ విధేయతలను కూడా పట్టించుకోదు. రాజ్యమదం వలన కలిగే నష్టాలను ఎన్నని చెప్పగలము? ధనమదం కలవారు దగ్గర బంధువులను కూడా నమ్మరు. గుడ్డివారిలా కావలసిన వారిని చూడలేరు. జూదం ఆడడం, వినోదం అనీ, వేట ఒక ఆట అనీ, సురాపానం విలాసం అనీ దోషాలను సైతం గుణాలను భ్రమింపజేస్తుంది. మోసం చేసే వారి మాటలు బాగా రుచిస్తాయి. ఈ కారణాల వల్ల రాజుల దగ్గర సిరి ఎక్కువకాలం ఉండలేదు.

నాయనా! నువ్వు ఇలాంటి వాటికి దూరంగా ఉండు. మోసం చేసేవారిని దరి చేరనీయకు. వారి మాటలు నమ్మకు. ఎప్పుడూ మంచివారితో మసలుతూ ఉండు! సాధువులను సత్కరించు! సేవకులకు చనువీయకు. లోభాన్ని దరిచేరనీయకు. పండితులను, ధీరులను గౌరవించు! అన్నీ తెలిసిన నీకు ఇంతగా చెప్పవలసిన పనిలేదు. రాజ్యభారాన్ని వహించు. ప్రజలను దయతో పరిపాలించు" అని రాజనీతి అంతా ఉపదేశించాడు.

చంద్రాపీడుడు శుకనాశుని మాటలను శ్రద్ధగా విని అతని అనుమతి తీసుకొని తన భవనానికి వెళ్ళిపోయాడు. తరువాత తారాపీడుడు ఒక మంచి ముహూర్తం చూసి నాలుగు సముద్రాల నీటిని తెప్పించి, బ్రాహ్మణుల ఆశీర్వాదాలతో చంద్రాపీడునికి పట్టాభిషేకం చేయించాడు. ప్రజలందరూ ఎంతో సంతోషించారు.

చంద్రాపీడుడు సింహాసనం ఎక్కిన కొద్దికాలానికే తండ్రి అనుమతి తీసుకొని శుకనాశుని మాట ప్రకారం చతురంగ బలాలను వెంటబెట్టుకొని, వైశంపాయనుని తోడు తీసుకొని, పత్రలేఖతో సహా దిగ్విజయ యాత్రకు బయలుదేరాడు. పూర్వ దక్షిణ, పశ్చిమోత్తర దేశాలను తిరిగి శరణాగతులను రక్షిస్తూ, దుర్మార్గులను శిక్షిస్తూ, బాధితులను ఓదారుస్తూ, రాజపుత్రులకు అభిషేకం చేస్తూ, రత్నాలను స్వీకరిస్తూ, పన్నులను వసూలు చేస్తూ, బ్రాహ్మణులను పూజిస్తూ మునులకు ఆశ్రమాలు కట్టిస్తూ, భూమండలాన్నంతా తిరిగి విజయ స్తంభాలు నాటిస్తూ రాజధానికి వస్తూ మార్గమధ్యంలో గల

కైలాసానికి సమీపాన గల హేమజటులు అను కిరాతకులకు నివాసస్థానమైన పూర్వ సముద్రానికి కొద్దిదూరంలో ఉన్న సువర్ణపురాన్ని జయించాడు. ఇన్ని రోజులు తనతో వచ్చి అలసిపోయిన తన బలగానికి విశ్రాంతి కోసం కొన్నాళ్ళు అక్కడే ఉన్నాడు.

## కిన్నెర మిధునం కథ

ఒకరోజు ఆ రాజకుమారుడు ప్రాతఃకాలాన్నే లేచి ఇంద్రాయుధం అనే తన గుర్రాన్ని ఎక్కి విహారం కోసం ఒక్కడే అరణ్యములో తిరుగుతుండగా ఒకచోట పర్వతశిఖరం నుండి దిగుతున్న కిన్నెర జంటను చూశాడు. వాటిని పట్టుకోవాలని ఆ కిన్నెర జంట దగ్గరకు వెళ్ళాడు. ఎప్పుడూ చూడని మనిషిని చూసేసరికి ఆ కిన్నెర జంట భయపడి కాలికొద్దీ పరిగెత్తడం మొదలుపెట్టాయి.

చంద్రాపీడుడు గుర్రాన్ని వేగంగా పరిగెత్తిస్తూ, తన పరివారాన్ని వదిలి ఆ కిన్నెర జంట వెనుక చాలా దూరం వెళ్ళిపోయాడు. ఆ కిన్నెర జంట దొరికినట్లే దొరికి దొరకకుండా అతడు చూస్తుండగానే అక్కడున్న పర్వతశిఖరం ఎక్కాయి.

ఇంతదూరం తానొక్కడే వచ్చి ఎంతో శ్రమపడి చమటలు పట్టగా గుర్రాన్ని నిలిచి తనలోతాను నవ్వుకుంటూ మనసులో ఇలా అనుకున్నాడు. “అన్నన్నా! చిన్నపిల్లాడిలా నేనీ కిన్నెరజంట వెనుక ఇంతదూరం శ్రమపడి వచ్చాను. ఇవి దొరికితే మాత్రం నాకేమిటి వీటి వల్ల లాభం? అనవసరంగా నాకు వీటిపై ఆసక్తి ఎందుకు? వీటి వెనుక ఎంత దూరం వచ్చానో కూడా తెలియదు. నా గుర్రం నిముషంలో చాలా దూరం పోగలదు. ఈ అడవిలో దారి చెప్పడానికి ఒక్క మనిషి కూడా కనిపించడం లేదు. ఇది దేవ భూమిలా ఉంది. ఇక్కడ నర సంచారం ఉండదు. ఈ దారికి దక్షిణంగా పోయి చూస్తాను” అనుకొని గుర్రాన్ని దక్షిణదిశగా మరలించాడు.

అలా వెళ్ళగా “అయ్యో! ఇప్పుడు మధ్యాహ్న కాలం అయింది. గుర్రం బాగా అలసిపోయింది. దీనికి కొంచెం మేత ఇచ్చి నీరు త్రాగించి, నేను కూడా కొంత అలసట తీర్చుకున్న తరువాత వెళతాను” అనుకున్నాడు. నీటికోసం వెదుకుతూండగా ఒకవైపు నుండి కొన్ని పక్షుల గుంపు రావడం

గమనించి ఆ వైపుగా వెళ్ళి చూశాడు. అక్కడ ఒక సరస్సు కనిపించింది. దానిని చూడడంతోనే మార్గాయాసం అంతా మర్చిపోయాడు. అది మనోహరమైన పరిసరాలను కలిగి ఉంది. దానిని చూసి చంద్రాపీడుడు మనస్సులోనే "ఆహా! ఆ కిన్నెర జంటను అనుసరించడం వల్ల ఈ సుందరమైన సరస్సును చూడగలిగాను. ఈ సరస్సు సకల ఇంద్రియాలను ఆహ్లాద పరుస్తున్నది. అందుకే కాబోలు వాసుదేవుడు జలశయనము విడువకున్నాడు" అని అనుకున్నాడు.

తరువాత తన గుర్రానికి నీటిని త్రాగించి, అక్కడ ఉన్న గడ్డిని స్వయంగా తెచ్చి దానికి పెట్టి తాను కూడా కొంచెం నీరు త్రాగి, సరస్సులోని తామరాకులను తెచ్చి వాటిపై తన ఉత్తరీయాన్ని పరిచి కూర్చున్నాడు.

కొంతసేపటి తరువాత ఇంద్రాయుధం చెవులు నిక్కబెట్టుకొని వినడం గమనించి ఆ వైపు చూడగా ఎక్కడి నుండో వీణానాదం వినిపించింది. సంచారం లేని ఈ ప్రాంతంలో వీణాగానం వినిపించడానికి కారణం ఏమిటి?" అనుకుంటూ ఆ గానం వచ్చే వైపుగా వెళ్ళాడు. కానీ ఎంతదూరం వెళ్ళినా ఏమీ కనిపించలేదు. సరికదా - వీణాగానం మాత్రం వినిపిస్తూనే ఉంది. దాంతో చంద్రాపీడుడు గుర్రాన్ని ఎక్కి ఆ దిశగా మరికొంతదూరం వెళ్ళాడు.

అలా వెళ్ళగా ఒకచోట స్ఫటిక శిలలతో నిర్మించబడిన మండపం కనిపించింది. దానిలో అర్చించబడుతున్న స్ఫటిక శివలింగాన్ని చూశాడు. ఆ మహాలింగానికి దక్షిణ భాగాన బ్రహ్మాసనం వేసుకొని, తెల్లని దేహకాంతితో, దంతంతో చేసిన వీణను పట్టుకొని మూర్తీభవించిన గంధర్వ దేవతేమో అన్నట్లుగా తంత్రీనాదంతో కంఠస్వరాన్ని మేళవించి పాడుతున్న ఆమెను చూసి చంద్రాపీడుడు ఆశ్చర్యంతో "ఆహా! మనుషులకు ఇంతటి సౌందర్యం ఉండదు. ఈమెవరో దైవాంశ సంభూతురాలై ఉంటుంది. లేకపోతే ఇంత చిన్న వయస్సులోనే ఇలాంటి వ్రతం ఎందుకు చేస్తుంది? అసలు ఆమె పేరు ఏమిటో తెలుసుకోవాలి" అనుకుంటూ అక్కడే ఒక స్తంభం ప్రక్కగా కూర్చున్నాడు.

కొంతసేపటికి ఆమె గానాన్ని ఆపి, వీణను పక్కనపెట్టి ఆ మహాశివలింగానికి ప్రదక్షిణ చేస్తూ ఒక మూలగా కూర్చొన్న రాకుమారుని చూసి అతనితో ఇలా అన్నది " అతిథికి స్వాగతం. మీరు ఇక్కడికి ఏ పని మీద వచ్చారు? అతిథి సత్కారం అందుకోవడానికి నాతో రండి". ఇది విని చంద్రాపీడుడు భక్తితో లేచి ఆమెకు నమస్కరించి "భగవతీ! నీ ఆజ్ఞను పాటిస్తాను. నన్ను నీ శిష్యునిగా భావించు". అని ఆమెను అనుసరిస్తూ మనస్సులో "ఈమె నన్ను చూసి అంతర్ధానం కాలేదు. దివ్యరూపం కలిగిన ఈమెకు నాపై ఎలా దాక్షిణ్యం కలిగినదో కదా! సమయం చూసి ఈమె వృత్తాంతం అడిగి తెలుసుకోవాలి" అనుకున్నాడు.

పగలైనప్పటికీ దట్టమైన చెట్ల వల్ల ఆ ప్రాంతమంతా చీకటిగా ఉంది. అలా కొంతదూరం వెళ్ళిన తర్వాత అక్కడ ఒక గుహ కనిపించింది. గుహ ముఖద్వారాన గల ఆసనంపై చంద్రాపీడుని కూర్చుండబెట్టి అతిథి మర్యాదలు చేసింది. తర్వాత ఆమె కూడా వేరే ఆసనంపై కూర్చొని అతను ఈ ప్రాంతానికి రావడానికి కారణం అడిగి తెలుసుకుంది.

అతని వృత్తాంతాన్ని విని ఆమె సంతోషించి భిక్షాపాత్రను తీసుకొని వెళ్ళింది. చెట్లు స్వయంగా ఆ పాత్రలోకి పళ్ళను రాల్చాయి. వాటిని తీసుకొచ్చి చంద్రాపీడుని తినమని చెప్పింది. ఈ చిత్రాన్ని చూసి చంద్రాపీడుడు 'ఆహా! తపస్సు ఎంత గొప్పది. అచేతనమైన వృక్షాలు కూడా ఈమె దయ కోరుతూ స్వయంగా పళ్ళను రాల్చాయి. ఇంతకన్నా అదృష్టం, ఆశ్చర్యం ఏమున్నాయి?' అనుకుంటూ స్నానాదికాలు పూర్తి చేసుకొని ఆమె ఇచ్చిన ఫలాలు తిన్నాడు.

తర్వాత ఆమె దగ్గరకు వెళ్ళి "అమ్మా! నీకు బాధ అనిపించకపోతే నేను అడిగే ప్రశ్నలకు జవాబులు చెప్పు! నిన్ను చూసిన దగ్గర నుండి నాకు నీ విషయాలు తెలుసుకోవాలని ఉత్సాహంగా ఉంది. కోమలమైన ఈ వయస్సులో ఇంత కఠినమైన వ్రతం ఎందుకు చేస్తున్నావు? నీ వయస్సెంత? నీ రాకకు కారణం ఏమిటి? ఈ తపస్సు ఎందుకు? సురలోక సౌఖ్యాలను వదిలి నిర్జనమైన ఈ ప్రాంతంలో ఒంటరిగా ఎందుకున్నావు? నీ వృత్తాంతాన్నంతా చెప్పి నా సందేహాలను తీర్చు" అన్నాడు.

అతని మాటలు విని ఆమె హృదయంలో ఏదో ధ్యానిస్తూ కొంతసేపు ఉన్న తర్వాత వెక్కి వెక్కి ఏడవడం ప్రారంభించింది. ఆమెను చూసి చంద్రాపీడుడు బాధపడి "బలమైన కారణం లేకపోతే ఈమె ఇంతగా బాధపడదు" అనుకుంటూ సరస్సుకు వెళ్ళి దోసిలితో నీరు తెచ్చి ఆమెను ముఖం కడుక్కోమన్నాడు.

ఆమె ఆ నీటితో కళ్ళను తుడుచుకొని చంద్రాపీడునితో ఇలా అన్నది. "రాజపుత్రా! మందభాగ్యురాలినైన నా వృత్తాంతంతో నీకేమి లాభం ఉంది? అయినా అడిగావు కనుక చెబుతున్నాను" అంటూ ఇలా చెప్పింది.

## మహాశ్వేత కథ

దక్షుని ప్రసిద్ధి గురించి నీకు తెలిసే ఉంటుంది. అతనికి మని, అరిష్ట అని ఇద్దరు కుమార్తెలు జన్మించారు. వారిలో మనికి చిత్రరధుడు అనే కుమారుడు జన్మించాడు. అతడు సమస్త గంధర్వులకు నాయకుడై ఇంద్రునితో స్నేహం చేసి ఈశ్వరప్రసాదమగు ఈ ప్రాంతంలో చైత్రరధమును ఉద్యానవనాన్ని, 'అచ్ఛోదము' అను సరస్సును నిర్మించాడు.

అరిష్ట కొడుకు హంసుడు అనేవాడు. అతడు ద్వితీయగంధర్వులకు రాజై గౌరి అనే కన్యను పెళ్ళి చేసుకున్నాడు. ఆ దంపతులకు నేను కుమార్తెగా జన్మించాను. నా తండ్రి సంతోషించి జాతకర్మల తర్వాత నాకు మహాశ్వేత అని పేరు పెట్టాడు.

కాలక్రమంలో నాలో యవ్వనం ప్రవేశించింది. ఒకసారి వసంత కాలంలో నా తల్లితో కలిసి స్నానం కోసం ఈ సరోవరానికి వచ్చి శిలాతలములపై వ్రాయబడిన శంభుమూర్తులకు నమస్కరించి, ఎన్నో రకాలైన పుష్పాలు గల ఉద్యానవనాన్ని చూసి ఉత్సాహంతో ఇక్కడ కొంతసేపు స్నేహితురాళ్ళతో కలిసి తిరిగాను.

ఆ సమయంలో ఎక్కడి నుంచో ఒక పుష్పం యొక్క సువాసన నన్ను బాగా ఆకర్షించింది. ఆ సువాసన ఎక్కడ నుండి వచ్చిందా అని నలువైపులా చూశాను. అప్పుడు ఒకవైపు నుండి మనోహరాకారంతో చేతిలో దండకమండలాలు, నుదిటిపై విభూతి రేఖలు ధరించిన మునికుమారుడు

ఒకరు తోటి మునికుమారులతో స్నానార్థమై వెళుతూ నా కంట పడ్డాడు. అతని చెవిలో గల కృత్తికా నక్షత్రాన్ని పోలి ఉన్న పుష్పం నుండి అమృత బిందువులు స్రవించగా ఆ వాసన ఇలా పరిమళించింది. సువాసనకు కారణం ఈ పుష్పమేనని భావించి, ఆ మునికుమారుని చూసి నా మనస్సులో ఇలా అనుకున్నాను.

"అయ్యారే! చతుర్ముఖుని వస్తు నిర్మాణ కౌశలం ఎంత చిత్రమైనది. మొదట అద్భుత రూపంతో మన్మధుని సృష్టించి, వాని కన్నా ఎక్కువ రూపము కలవాడిని సృష్టించే సామర్థ్యం ఉందో, లేదోనని ముని మాయ చేత రెండవ మన్మధునిగా ఇతనిని పుట్టించాడు కాబోలు" అనుకుంటున్న నన్ను కుసుమశరుడు పరవశం చేశాడు.

అతని రూపం చూసి మోహపడిన నేను అతని హృదయంలో నాకు చోటివ్వమని కోరాలనుకున్నాను. అంతలోనే కులస్త్రీకి రాకూడని ఆలోచన వచ్చినందుకు బాధపడ్డాను. అయినా అతని చూడకుండా ఉండలేకపోయాను. అప్పటి నా అవస్థ ఇలా ఉందని చెప్పలేను. పూర్వం ఎన్నడూ ఇలా జరుగలేదు.

చాలాసేపటి తర్వాత నేనిలా అనుకున్నాను. "అయ్యయ్యో! మహానుభావుడైన ఈ ముని కుమారునిపై నాకు అనురాగం ఎందుకు కలగాలి? స్త్రీ హృదయం ఎంత మూఢమైనదో కదా! మన్మధ విలాసం ఎక్కడ? తపో మహిమ ఎక్కడ? నన్ను చూసి ఇతను ఏమనుకుంటాడో? ఇది నా దోషం కాదు. అతని రూపలావణ్యం అలాంటిది. ఇతడు నన్ను చేసే లోపే నేను ఇక్కడి నుండి వెళ్ళిపోవడం మంచిది" అనుకున్నాను. కానీ వెళ్ళలేకపోయాను. ఆయనకి నమస్కరించాలనే ఉద్దేశంతో అతని దగ్గరకు వెళ్ళి ముఖాన్ని చూస్తూ పాదాలకు నమస్కరించాను.

అదే సమయంలో ఆ మునికుమారునికి కూడా నాపై అలాంటి అనురాగమే కలిగిందనడానికి గుర్తుగా నా దగ్గరకు వస్తున్న హృదయానికి దారి చూపుతున్నట్లు నిట్టూర్పులు వచ్చాయి. వ్రత భంగానికి భయపడినట్లుగా జపమాల జారిపడింది.

అప్పుడు నేను ఇతని సహచరుడైన రెండవ మునికుమారుని దగ్గరకు వెళ్ళి నమస్కరించి "ఆర్యా! ఈ మునికుమారుని పేరేమిటి? ఈయన ఎవరి కుమారుడు? ఈయన చెవిలో ధరించిన పుష్పం పేరేమిటి? దీని పరిమళం చూసిన దగ్గరనుండి దీని గురించి తెలుసుకోవాలని ఉంది. ఇంతకు ముందెప్పుడూ నేనిలాంటి పుష్పాన్ని చూడలేదు." అని పలుకగా ఆ మునికుమారుడు నవ్వి నాతో ఇలా అన్నాడు. "బాలా! నీ ప్రశ్నలతో ప్రయోజనం ఏమున్నది? అయినా అడిగావు కాబట్టి చెబుతాను. విను"అన్నాడు.

## పుండరీకుని కథ

"దేవలోకంలో శ్వేతకేతుడు అనే మహాముని ఉండేవాడు. అతని ఆకారం అత్యంత సుందరమైనది. ఆ మహాముని ఒకరోజు దేవతార్చన కోసం పువ్వులు కోయడానికి మందాకినీ నది దగ్గరకు వెళ్లాడు. ఆ నదిలో పద్మాలను కోస్తున్న ఆ మునిని చూసి లక్ష్మీదేవి మనస్సు చలించింది. కేవలం చూసినంత మాత్రానే ఆమె కూర్చున్న పద్మమునందు కుమారుడు జన్మించాడు. ఆ శిశువుని లక్ష్మీదేవి శ్వేతకేతునికి ఇచ్చింది. ఆ బాలునికి పుండరీకుడని నామకరణం చేసి సమస్త విద్యలు నేర్పించాడు. ఆ శ్వేతకేతుని కుమారుడే ఇతను.

ఈ పువ్వును గురించి కూడా అడిగావు కదా! ఈ పుష్పం పారిజాత తరువుకి పుట్టింది. ఒకరోజు నేనూ, పుండరీకుడు ఈశ్వరుని ఆరాధించడానికి కైలాసానికి నందనవనం మీదుగా వెళుతున్నాము. అప్పుడా నందనలక్ష్మి ఈ పారిజాత పుష్పాన్ని తీసుకొచ్చి "ఆర్యా! త్రిభువన దర్శనీయమైన నీ రూపానికి ఈ పువ్వు తగినది. దీనిని నీ చెవిలో ధరించు" అని చెప్పింది. కానీ పుండరీకుడు ఆ మాటలను పట్టించుకోకుండా ముందుకు నడవసాగాడు. అప్పుడా దేవి మమ్మల్ని వదలకుండా మా వెంట రాసాగింది. అది చూసి నేను "మిత్రమా! దీనిలో దోషం ఏముంది. దీనిని తీసుకోవడం మంచిది" అని చెప్పి బలవంతంగా ఆ పుష్పాన్ని ఇతని చెవిలో పెట్టాను" అని చెప్పాడు.

తర్వాత పుండరీకుడు మందహాసంతో నన్ను చూసి "అమ్మాయి! నీకీ ప్రశ్నలతో పనేమిటి? కావాలంటే ఈ పుష్పాన్ని నువ్వు తీసుకో" అంటూ ఆ పువ్వును నా చెవిలో పెట్టాడు. అప్పుడు అతని చేతిలోని జపమాల జారిక్రింద పడిపోయింది. నేను దానిని తీసుకొని నా మెడలో వేసుకున్నాను.

ఇంతలో ఒక పరిచారిక వచ్చి "రాజపుత్రీ! మీ తల్లి స్నానం చేయడం పూర్తయింది. ఇంటికి వెళ్ళే సమయం అయింది. నీవు కూడా వచ్చి స్నానం కానిస్తే ఇంటికి వెళదామని" చెప్పింది. ఆ మాట విని ఇష్టం లేకపోయినా ప్రయత్నంతో దృష్టి మరల్చుకొని స్నానం చేయడానికి వెళ్ళాను. తర్వాత రెండవ మునికుమారుడు పుండరీకుని చూసి "మిత్రమా! నీకు ఇంద్రియ చాపల్యం పనికి రాదు. జపమాల జారిపడిపోయిన విషయం కూడా నువ్వు గమనించలేదు. వివేకంతో నీ బుద్ధిని మరల్చుకో" అంటూ హితోపదేశం చేశాడు.

దాంతో పుండరీకుడు కోపం తెచ్చుకొని నా దగ్గరకు వచ్చి "నా జపమాల నాకియ్యకుండా ఎక్కడికి పోతావు. అది ఇచ్చి కదలమని" ఆదేశించాడు. అది విని నేను నా మెడలోని ముత్యాలహారాన్ని తీసి జపమాల అని చెప్పి అతనికి ఇచ్చి వెళ్ళిపోయాను.

ఇంటికి వచ్చినది మొదలు నా మనసు పరిపరి విధాలుగా అతని గురించే ఆలోచించడం మొదలుపెట్టింది. వంటరిగా కూర్చొని మధనపడసాగాను. ఇంతలో చెలికత్తె తరళిక వచ్చి "రాజపుత్రా! స్నానం చేసిన తర్వాత నువ్వు ఇంటికి తొందరగా వచ్చేశావు కదా! అప్పుడొక విశేషం జరిగింది. నీకీ పుష్పాన్ని ఇచ్చిన మునికుమారుడు నా దగ్గరకు వచ్చి నీ గురించి విశేషాలు అడిగాడు. "దానికి నేను నీ పేరు మహాశ్వేత అనీ, హంసుని కూతురివనీ" చెప్పాను. దాంతో ఆ మునికుమారుడు నాకు నమస్కరించి "కనక గాత్రీ! నీవీ ఉత్తరం తీసుకొని వెళ్ళి ఆ రాజపుత్రికకు ఏకాంతంగా ఉన్న సమయంలో ఇవ్వమన్నాడు" అంటూ అతను ఇచ్చిన ఉత్తరం ఇచ్చింది.

దానిలో చక్కటి పద్యం రాసి ఉంది. అది చదివి నేను ఎంతో సంతోషించాను. అతికష్టం మీద ఆ రోజును గడపగలిగాను. మర్నాడు

ఒక పరిచారిక వచ్చి “ఆ ముని కుమారులలో ఒకరు ద్వారం దగ్గర నీ దర్శనం కోసం ఎదురుచూస్తున్నారు” అని చెప్పగా వెంటనే ఆయనను తీసుకురమ్మని చెప్పాను.

ఆ పరిచారిక వెళ్ళి రెండవ మునికుమారుడైన కపింజలుని తీసుకొచ్చింది. అతను చూడడానికి చాలా విచారంగా కనిపించాడు. నేను ఆయనకు నమస్కరించి, అతిథిమర్యాదలు చేసి అతని విచారానికి కారణం అడిగాను. దాంతో అతను విషయం చెప్పదలచుకొని “రాజపుత్రీ! నీవు ఇంటికి వచ్చేశాక నా మిత్రుడు ఎంతో విచారపడ్డాడు. కన్నీళ్ళు ధారగా వస్తూండగా వేడి నిట్టూర్పులతో ఉన్న పుండరీకుని చూశాను. ఇదంతా యవ్వన మహిమ కదా! అనుకుంటూ అతని దగ్గరకు వెళ్ళి “పుండరీకా! ఎందుకు ఇలా ఉన్నావని' అడగ్గా దానికి పుండరీకుడు నా చేయి పట్టుకొని “కపింజలా! నీకు తెలియనిది కాదు. నేను నా మనస్సును ఆమె నుండి మరల్చుకోలేకపోతున్నాను. ఏం చేస్తే ఈ బాధ పోతుందో చెప్పు!” అంటూ ప్రాధేయపడ్డాడు.

నేనెంతగా చెప్పినా నా మిత్రుడు నా మాట వినడం లేదు. ఏమైపోతాడోనని భయంగా ఉంది. ఎలాగైనా నా మిత్రుని రక్షించు” అంటూ జరిగినదంతా నాతో చెప్పాడు.

నేనతని మాటలు విని పుండరీకుని కూడా నాపై ప్రేమ ఉన్నందుకు ఆనందపడి ఇతనికి ఏమి చెప్పి పంపించాలా అనుకుంటూండగా ఇంతలో ఒక పరిచారిక వచ్చి “నిన్ను చూడడానికి మీ అమ్మగారు వస్తున్నారు” అని చెప్పింది.

అది విని కపింజలుడు భయంతో లేచి “రాజకుమారీ! సూర్యాస్తమయం అవుతున్నది. నేనికపోయి వస్తాను. ఏదో ఒకటి చేసి నా మిత్రుని రక్షించు” అంటూ నా సమాధానాన్ని కూడా వినకుండానే వెళ్ళిపోయాడు.

తర్వాత నా తల్లి వచ్చి కొంతసేపు వుండి వెళ్ళిపోయింది. ఆమె నాతో ఏం మాట్లాడిందో కూడా నాకు తెలియదు. ఇంతలో సాయంకాలం కావడంతో ఏం చేయాలో తోచక తరళికతో ఇలా అన్నానున. “తరళికా! కపింజలుడు చెప్పిన మాటలు విన్నావు కదా! ఏం చేయాలో నాకు పాలుపోవడం లేదు.

నా తండ్రి అనుమతి లేకుండా నేను అతని దగ్గరకు వెళ్ళలేను. నేను లేకపోతే అతను మరణిస్తాడు. నా వల్ల మునికుమారునికి తపోభంగం కలిగింది. ఇది మహాపాపం కాదా!" అంటూ బాధపడ్డాను.

దానికి తరళిక "దేవీ! నీవిక ఆలోచించి లాభం లేదు. ధర్మం గురించి ఆలోచిస్తే పుండరీకుడు దక్కడు. వెంటనే అతను ఉన్నచోటుకి వెళదాం" అంటూ నన్ను తొందరపెట్టింది. మేము వెంటనే బయలుదేరాము. ఆ సమయంలో నా కుడికన్ను అదరడంతో ఏదో ప్రమాదం జరిగి ఉంటుందని శంకిస్తూనే వడి - వడిగా అతి ప్రయత్నం మీద అచ్ఛోద సరస్సు దగ్గరకు వచ్చాము. ఆ సమయంలో సరోవరానికి పశ్చిమం వైపు నుండి ఎవరో పురుషుని రోదనధ్వని వినిపించింది. ఆ శబ్దం వస్తున్న వైపుగా వెళ్ళాము.

అక్కడ "హా పుండరీకా! హా ప్రాణమిత్రా! మన్మధుడు నీ కెలాంటి ఉపద్రవాన్ని తెచ్చిపెట్టాడు. ఇదంతా మహాశ్వేత వల్లనే కదా! అయ్యో! మిత్రమా! నన్ను చూడవేమి? నాతో మాట్లాడవేమి? నన్ను విడిచిపోవడం నీకు న్యాయమా? అంటూ కపింజలుడు విలపిస్తున్నట్లు వినిపించింది. నేనూ, తరళికా వేగంగా అక్కడికి వెళ్ళి చూడగా పుండరీకుడు విగతజీవై పడి ఉన్నాడు.

అది చూసి నేను "హా! నాధా నన్ను వదలి ఎక్కడికి వెళ్ళావు. ఒక్కసారి మాట్లాడు." అంటూ రోదించసాగాను. అంతేకాకుండా నా ప్రాణేశ్వరుడు లేని జీవితం ఎందుకని ఆత్మహత్య చేసుకోవాలనుకున్నాను. ఆ సమయంలో ఒక మహానుభావుడు అక్కడికి వచ్చి "మహాశ్వేతా! నువ్విపుడు ఆత్మహత్య చేసుకోవద్దు. నీకితనితో సమాగమం కలదు" అంటూ తండ్రిలా నన్ను ఓదార్చి పుండరీకుని దేహాన్ని ఎత్తుకొని ఆకాశంలోకి ఎగిరిపోయాడు.

ఇదంతా నాకు అర్థంకాకపోవడంతో కపింజలుని అడిగాను. అతడు నాకేమీ సమాధానం చెప్పకుండానే తన మిత్రుడిని ఎక్కడికి తీసుకువెళుతున్నాడో తెలుసుకోవాలని వెళ్ళి అతను కూడా నక్షత్ర మండలంలో ప్రవేశించి అంతర్ధానమైపోయాడు.

అప్పుడు నేను తరళికను చూసి "ఓసీ! ఇప్పుడు నాకేమీ తెలియడం లేదు. నీకేమైనా తెలిస్తే చెప్పమనగా దానికి తరళిక "దేవీ! ఆ దివ్యపురుషుడు వచ్చి నిన్ను ఓదార్చడం వింతగా ఉంది. అయినా అతను చెప్పిన మాటలపై నమ్మకం ఉంచి మనం ఇక్కడి నుండి వెళ్ళిపోవడం మంచిది. కపింజలుడు వచ్చి ఏ విషయం చెప్పేదాకా తొందరపడకు" అంటూ నన్ను ఓదార్చింది.

అప్పటినుండీ నేను కపింజలుని రాకకోసం ఎదురుచూస్తూ, పుండరీకుని ప్రీతిగా అతని దండకమండలాలను, జపమాలను ధరించి, సంసారం నిస్సారమైందనీ, శోకం తప్పదనీ, దైవాన్ని నిందిస్తూ, తల్లిదండ్రుల మాట లెక్కచేయకుండా, బంధుమిత్రులను వదిలి, బ్రహ్మచర్యం పాటిస్తూ ఈశ్వరుని ఆరాధిస్తున్నాను.

నా వృత్తాంతాన్ని విని నా తండ్రి బంధుజన సమేతంగా వచ్చి ఇంటికి రమ్మని ఎంతో బ్రతిమాలాడు. ఒక్కదాన్నే కూతురిని కావడంతో నా కోసం చాలాకాలం ఎదురుచూసి ఇంటికి వెళ్లిపోయాడు. అప్పటినుండి శివుని పూజిస్తూ తరళికతో సహా ఈ గుహ దగ్గరే ఉండిపోయాను." అంటూ మహాశ్వేత తన వృత్తాంతాన్ని చంద్రాపీడునికి వివరించింది.

చంద్రాపీడుడు ఆమె కథ విని, కృతజ్ఞతా విశేషాలతో మెల్లగా ఆమెతో ఇలా అన్నాడు. "భగవతీ! పుండరీకుని కోసం సమస్త సుఖాలు వదులుకున్నావు. తల్లిదండ్రులను వదులుకున్నావు. కఠినమైన నియమాలను పాటిస్తూ శరీరాన్ని శుష్కింపజేసుకుంటున్నావు. ఆత్మీయులు చనిపోయినప్పుడు మనం కూడా వారితో పాటే చనిపోవాలనుకోవడం సబబు కాదు. దీనివల్ల ఏ విధమైన ప్రయోజనం లేదు. పోయినవారు తిరిగిరారు కదా!

రతీదేవి వృత్తాంతాన్ని చూడు. ప్రియుడు శివుని మూడోకంటికి బలైనప్పటికీ తాను కూడా చనిపోకుండా వేరొక విధంగా అతన్ని పొందింది. అంతేకాకుండా దివ్యపురుషుని మాటలను బట్టి పుండరీకునితో సమాగమం ఉందని చెప్పాడు కదా! పుండరీకుడు తప్పకుండా వస్తాడు" అంటూ మృదువైన మాటలతో ఆమెను ఓదార్చి సరస్సుకు వెళ్ళి నీటిని తెచ్చి ఆమెను

ముఖం కడుక్కోమన్నాడు. అంతలో మహాశ్వేత కథ విని శోకిస్తున్న వాడల్లే సూర్యుడు కూడా అస్తమించాడు.

ఈ విధంగా మణిసిద్ధుడు కథ వివరించి "గోపా! ఇప్పుడు సమయం మించిపోయింది. తర్వాత కథ చాలా పెద్దది. కాబట్టి దానికి ముందరి మజిలీలో చెప్తాను. ఇప్పుడు వెళ్ళి కట్టెలు తెచ్చి, వంట చేసుకొని భుజిద్దాము" అని పలికి వాడిని సమాధాన పరిచాడు.

తర్వాత గోపాలుడు ఆ యతీశ్వరుని వెంట కావడి మోస్తూ నడుస్తూ మధ్య – మధ్యలో "అయ్యా! ఆ మహాశ్వేతను పుండరీకుడు కలుసుకున్నాడా? తర్వాత చంద్రాపీడుడు ఏమి చేశాడు? ఎక్కడికి వెళ్ళాడు? ఏం జరిగింది? అని అడుగుతుండగా ఆ యతి చేతి సైగల చేత వారిస్తూ, ఎట్టకేలకు – తరువాత మజిలీ చేరిన వెనుక ఈ విధంగా కథ చెప్పడం ప్రారంభించాడు...



# కాశీమజిలీ కథలు

## కాదంబరి

(నాయకునితో పరిచయం)

### చంద్రాపీడుని కథ

ఆ విధంగా సాయంకాలం అవుతూ ఉండగా మహాశ్వేత మెల్లగా లేచి మలిసంజను ఉపాసించి, కమండలంలోని నీటితో పాదాలను కడుక్కొని ఆ శిలాతల్పంపై కూర్చుంది. చంద్రాపీడుడు కూడా సంధ్యావందనం చేసుకొని రెండవ శిలాతల్పంపై కూర్చొని వినయంతో ఆమెతో ఇలా అన్నాడు. "భగవతీ! నీ పరిచారిక తరళిక ఎక్కడికి వెళ్లింది." అని అడగ్గా ఆమె "రాజకుమారా! గంధర్వకుల నాయకుడైన చిత్రరధుని గురించి నువ్వు వినే ఉంటావు. అతనికి కాదంబరి అనే కూతురు ఉంది. ఆమె నాకు రెండో హృదయం వంటిది. మా ఇద్దరి బాల్యం ఒక్కచోటనే గడిచింది.

ఆమె నా కథను విని బాధపడి "నా స్నేహితురాలైన మహాశ్వేత బాధపడుతూ ఉండగా నేను పెళ్ళి చేసుకోను. నా తండ్రి నాకు బలవంతంగా పెళ్లి చేస్తే మరణిస్తానని" తన చెలికత్తెల దగ్గర శపథం చేసింది. ఆమె తండ్రి చిత్రరథుడు ఒక్కతే కుమార్తె కావడంతో ఆమెను మందలించలేక నా దగ్గరకు వచ్చి "మహాశ్వేతా! నీ నెచ్చెలి కాదంబరి వివాహానికి సిద్ధంగా ఉంది. కానీ ఎంతమంది చెప్పినప్పటికీ పెళ్ళి చేసుకోవడానికి అంగీకరించడం లేదు. ఎలాగైనా నువ్వే ఆమెను ఒప్పించాలి" అంటూ నన్ను బ్రతిమాలాడు. నేను ఆయనపై గౌరవంతో కాదంబరిని ఒప్పిస్తానని చెప్పి "కాదంబరీ! బాధలో ఉన్న నన్ను మరింత బాధపెట్టకు. నాకు సంతోషం కలిగించాలంటే నా మాట విని తండ్రి చెప్పినట్లు నడుచుకో. ఇది నాకు ప్రియాన్ని కలిగిస్తుంది".

అని నా మాటగా చెప్పమని క్షీరోదుని వెంట తరళికను ఈ రోజే పంపించాను. అది అలా వెళ్ళిన కొంచెం సేపటికే మీరిలావచ్చారు" అని చెప్పింది.

అంతలో చీకటి పడడంతో మహాశ్వేత ఆ శిలాతల్పంపైనే పడుకొని నిద్రపోయింది. చంద్రాపీడుడు మాత్రం మనస్సులో "అయ్యో! ఇప్పుడు వైశంపాయనుడు ఏమి చేస్తున్నాడో? నా కోసం బాధపడుతున్నాడేమో? పత్రలేఖ ఏమనుకుంటుందో? రాజపుత్రులు ఏమంటారో?" అనుకుంటూ నిద్రపోయాడు.

తెల్లవారి లేచి మహాశ్వేత, చంద్రాపీడుడు నిత్యకృత్యాలు నిర్వర్తించారు. ఇంతలో మనోహరమైన వేషంలో కేయూరకుడు అనే గంధర్వ కుమారునితో కలిసి తరళిక వచ్చింది. అక్కడ ఉన్న రాజపుత్రుని విస్మయంతో చూసి, తర్వాత మహాశ్వేత దగ్గరకు వచ్చి "రాజపుత్రీ! నేను వెళ్ళి కాదంబరిని చూశాను. ఆమె బాగానే ఉంది. నీవు చెప్పిన విషయాన్ని ఆమెకు చెప్పాను. ఆమె కన్నీరు కారుస్తూ కేయూరకుడు అనే వీణావాహకునికి ఏదో చెప్పి పంపించింది.

అప్పుడు కేయూరకుడు లేచి నమస్కరించి "దేవీ! మా రాజపుత్రి మీకిలా చెప్పమంది. "మహాశ్వేతా! ఇప్పుడు తరళిక చెప్పినదంతా విన్నాను. నీవక్కడ అంతగా బాధపడుతూంటే నేనిలా పెళ్ళి చేసుకొని సుఖంగా ఉంటాను? ఇకమీదట ఈ విషయం గురించి నాకు చెప్పాలని ప్రయత్నించకు. నా మనస్సు మారదు" అని చెప్పాడు.

అతని మాటలు విని మహాశ్వేత కొంచెంసేపాలోచించి "కేయూరకా! ఇప్పుడు నువ్వు వెళ్ళు. నేను వచ్చి కాదంబరిని చూస్తాను" అని చెప్పి చంద్రాపీడుని చూసి "రాకుమారా! గంధర్వుల రాజధాని అయిన హేమకూటానికి నేను వెళ్ళాల్సి ఉంది. ఆ ప్రాంతం ఇక్కడికి దగ్గరగానే ఉంటుంది. ఆ పట్టణాన్ని చూడాలని కోరికగా ఉంటే చూసి వద్దువుగానీ, నాతో పాటురా ! నా స్నేహితురాలు కాదంబరిని కూడా చూడవచ్చు! అకారణంగా బంధువైన నిన్ను చూస్తుంటే, నా బాధ కొంత తీరినట్టుంది.

సజ్జనులతో స్నేహం శోకాన్ని పోగొడుతుంది కదా! మీ వంటి వారు పరుల సుఖం కోసమే ఆలోచిస్తారు కదా!" అని పలికిన మహాశ్వేతతో చంద్రాపీడుడు ఇలా అన్నాడు.

"భగవతీ! నిన్ను చూసినది మొదలు నా హృదయం ఎంతో ఉత్సాహంగా ఉంది. పరాయి వాడిగా నన్ను భావించకు! తప్పకుండా హేమకూటం వస్తాను" అన్నాడు. మహాశ్వేత, చంద్రాపీడుడు కలిసి ఒక శుభముహూర్తంలో బయలుదేరి హేమకూటం చేరుకున్నారు. బంగారు తోరణాలు కట్టిన ద్వారాలను దాటుకుంటూ కాదంబరి అంతఃపురం చేరుకున్నారు.

మహాశ్వేతను చూడగానే పరివారం అంతా ఆమెకు నమస్కరిస్తూ దారి చూపగా, అక్కడి గంధర్వ స్త్రీలను చూసి ఇది అంతా కలేమో అన్నట్లుగా ఆశ్చర్యపోతూ చంద్రాపీడుడు ఆమెను అనుసరించాడు. లవలికా, సాగరికా, మృణాలికా, మకరికా, రజనికా, కుముదినికా, నిపుణికా, ఉత్పలికా, మాలతికా, కేసరికా, కదళికా, కమలినికా, లవంగికా, మధురికా వంటి చెలికత్తెల వినోద సంభాషణను వింటూ వైభవంగా ప్రకాశిస్తున్న కాదంబరిని చూసి చంద్రాపీడుని హృదయం ఎలా ఉందో చెప్పడం కష్టం.

"ఆహా! నా కళ్ళు ఎంతటి పుణ్యం చేసుకున్నాయి? ఇంతటి లోకైక సుందరిని చూడగలిగాను. బంగారు బొమ్మేమో అనేంతటి అద్భుతంగా ఉంది" అని మనస్సులో అనుకున్నాడు. కాదంబరి కూడా చంద్రాపీడుని రూపమును చూసి ఆశ్చర్యపోయి రెప్పలార్పకుండా చూస్తూ ఉండిపోయింది. అప్పుడు మహాశ్వేత "సఖీ! ఇతడు తారాపీడుడు అనే భూలోక చక్రవర్తి కుమారుడు చంద్రాపీడుడు. ఇతనిని చూసిన దగ్గర నుండి మనకు బంధువు అనిపిస్తున్నాడు. సరళ స్వభావం కలవాడు. ఇలాంటి మిత్రుడు దొరకడం కష్టం. నేనే ఇక్కడికి ఇతనిని బలవంతంగా తీసుకొచ్చాను. ఇతను కొత్తవాడని సిగ్గుపడకుండా, నాతో ఎలా ఉంటావో అలాగే ఇతనితో కూడా ఉండు. ఈ రాకుమారుడు మనం నమ్మదగినవాడు" అని చెప్పగా చంద్రాపీడుడు, కాదంబరి ఇద్దరూ పరస్పరం నమస్కరించుకున్నారు. వచ్చిన అతిధికి సత్కారం చేయమని కాదంబరి చెలులను నియమించింది.

తర్వాత మహాశ్వేత "కాదంబరీ! కులాసాగా ఉన్నావా?" అని అడుగగా ఏదో అపరాధం చేసినదానిలా సిగ్గుపడుతూ "నువ్వు అక్కడ అన్ని బాధలు పడుతూ ఉంటే, సుఖంగా ఉండగలను?" అంటూ కన్నీరు కార్చింది. మహాశ్వేత ఆమెను ఓదార్చుతూ "సఖీ! మనం అందరం కొత్త చుట్టమైన ఈ రాకుమారుని ఆరాధించాలి కాబట్టి ముందుగా అతనికి తాంబూలం ఇమ్మని చెప్పగా కాదంబరి "చెలీ! ఇంతకు ముందెప్పుడూ అతనితో పరిచయం లేకపోవడంతో కొంచెం సిగ్గుగా ఉంది. నీవు ఆ తాంబూలం అతనికి ఇవ్వు" అంది. దానికి మహాశ్వేత ఒప్పుకోక బలవంతంగా ఆమెతో చంద్రాపీడునికి తాంబూలం ఇప్పించింది. అది మొదలు "నా జీవితం నీ హస్తం అందు ఉంది" అన్నట్లుగా కాదంబరి ఆ తాంబూలాన్ని చంద్రాపీడునికి అందించింది. తాంబూలం అందించేటప్పుడు ఆమె చేతినుండి రత్న కంకణం జారిపడడం ఆమె గమనించలేదు.

మరొక తాంబూలాన్ని మహాశ్వేతకి ఇస్తున్న సమయంలో అక్కడికి ఒక చిలుక వచ్చి దానిని తరుముకొస్తున్న వేరొక చిలుకను చూపిస్తూ ఇలా అంది "కాదంబరీ! నన్ను బాధిస్తున్న ఈ పక్షిని చూడవెందుకు? వీడి వల్ల బాధపడుతున్న నన్ను చూసి ఉపేక్షిస్తే నీ పాదాల దగ్గరే నా ప్రాణాలను విడుస్తాను" అనగా కాదంబరి నవ్వి ఊరుకుంది.

అప్పుడు మహాశ్వేత విస్మయంతో ఈ చిలుక ఏమంటున్నదని మదనలేఖను అడగ్గా "దేవీ! ఈ చిలుకకు కాళింది అని పేరు పెట్టి మా రాజపుత్రిక పెంచి పరిహాసం అనే పేరుగల ఈ చిలుకతో పెళ్ళి చేసింది. ఇవాళ ఉదయం కాదంబరికి తాంబూలం అందించే తమాలికతో ఈ చిలుక ఏదో ఏకాంతంగా మాట్లాడడం చూసినది. అప్పటినుండి ఈ చిలుకతో మాట్లాడదు. దగ్గరకు రానీయదు. మేమెంతగా బ్రతిమాలినా ప్రయోజనం లేదు." అంటూ దాని వృత్తాంతాన్ని చెప్పింది.

అది విని చంద్రాపీడుడు "అవునవును! దీని గురించి ఇంతకు ముందే విన్నాము. తాంబూలం అందించే తమాలికను వరించి పరిహాసం అనే చిలుక విరహవేదన చెందుతున్నదని లోకంలోని ప్రజలు చెప్పుకుంటున్నారు. ఈ వృత్తాంతం రాజకులమంతా వ్యాపించింది. చపల బుద్ధి గల ఆ

పరిచారికను కాదంబరి ఎందుకు మందలించదు? ఈ చిలుకకు పెళ్ళి చేస్తున్నప్పుడు ఎన్ని బుద్ధులు చెప్పిందో కదా! ఇప్పుడు ఈ చిలుకతో దానికి క్షమాపణలు చెప్పిద్దాము. లేకపోతే దానిదే తప్పుగా భావించి వదిలేద్దాము. ఇదే దీనికి ప్రాయశ్చిత్తము" అని పలుకగా కాదంబరి చెలికత్తెలందరూ నవ్వుకున్నారు.

ఆ సమయంలో ఒక పరిచారిక వచ్చి "మహాశ్వేతా! చిత్రరధుడు; ఆయన భార్య మదిరాదేవి నీ రాక గురించి విని ఆనందపడుతున్నారు. నీతో మాట్లాడాలని తొందరపడుతూ నిన్ను తీసుకొని రమ్మన్నారు" అని చెప్పింది.

అప్పుడు మహాశ్వేత "కాదంబరీ! నేను నీ తల్లిదండ్రులను చూడడానికి వెళుతున్నాను. నేను వచ్చేవరకు ఇతడు ఎక్కడ ఉంటాడు? అని అడుగగా, కాదంబరి ఇలా అంది "సఖీ! నీవు నన్ను అడుగుతావెందుకు? చూసిన దగ్గర నుండి శరీరానికీ, భవనానికీ, వైభవానికీ ఇతడే అధిపతి అనుకుంటున్నాను. అతనికి ఎక్కడ ఇష్టమైతే అక్కడ ఉండవచ్చు" అని చెప్పగా, దానికి మహాశ్వేత "అలాగైతే నీ భవనానికి దగ్గరగా ఉన్న ప్రమదవనంలోని క్రీడా పర్వతంపైన కట్టబడిన మణిసదనంలో నివశింపజేయమని" చెప్పి మహాశ్వేత వెళ్ళిపోయింది.

చంద్రాపీడుడు కూడా మహాశ్వేత వెళ్ళగానే ముందు పరిచయమైన కేయూరకుడు దారి చూపిస్తుండగా ఆ మణి మందిరానికి వెళ్ళాడు.

తర్వాత కాదంబరి పరిజనులనందరినీ వదిలి ఒక్కతే మేడ ఎక్కి అక్కడ ఉన్న తల్పంపై పడుకొని ఇలా అనుకుంది.....

"అయ్యో! మోహంక్రమ్మిన నేను ఇప్పుడు ఎటువంటి పని చేశాను? అతనికి కనబడకూడదని కొంచెమైనా అనుమానించలేదు. లోకులు ఏమనుకుంటారో అనిగానీ, పెద్దల పట్ల గౌరవం కూడా లేకుండా, మహాశ్వేత దుఃఖంలో ఉందన్న ఆలోచన అయినా రానీయకుండా నేను ఎంత పెద్ద తప్పు చేశాను. ఇది విని నా తల్లిదండ్రులు ఏమంటారో? నేనిప్పుడు ఏం చేయాలి? స్నేహితులతో పెళ్ళి చేసుకోనని చెప్పాను. అదే విషయాన్ని కేయూరకుని ద్వారా మహాశ్వేతకు సందేశం పంపాను. ఆ మాట నాకు కొంచెం కూడా గుర్తులేకుండా పోయింది. అసలు మహాశ్వేత, చంద్రాపీడుని

ఇక్కడకు ఎందుకు తీసుకొని రావాలి? అతన్ని ఎప్పుడైనా చూశానా? మాట్లాడానా? తలచానా? నా ఇంద్రియాలన్నీ వశం తప్పుతున్నాయెందుకు?" అనుకుంటూ క్రీడాపర్వతం వైపు చూసింది.

చంద్రాపీడుడు మణిమందిరంలో ప్రవేశించి, గంధర్వకన్యలు సంగీతం పాడుతుండగా, కేయూరకుడు వెంట ఉండగా మనస్సులో ఇలా అనుకున్నాడు. "ఆహా! ఈ గంధర్వ రాజకుమారి సౌందర్యం మనోహరం. అనురాగంతో కూడిన క్రీగంటి చూపులతోనే నన్ను వశం చేసుకుంది" అనుకుంటూ క్రీడాపర్వత శిఖరం ఎక్కాడు.

కాదంబరి మహాశ్వేత వచ్చిందేమో చూద్దామని మేడ పైకి ఎక్కింది. ఇంతలో ఒక చెలికత్తె వచ్చి మహాశ్వేత వచ్చిందని చెప్పగా కాదంబరి మేడ దిగింది. చంద్రాపీడుడు భోజనం చేసిన తర్వాత క్రీడాశిఖరం తూర్పువైపున గల లతామంటపం క్రింద మరకత శిలాతల్పంపై కూర్చొని తాంబూలం వేసుకుంటూండగా ఆకాశం అంతా తెల్లని తేజస్సు పరుచుకున్నట్లు కాంతి కనబడింది.

"ఆహా! చంద్రుడు పగలే ఉదయించాడా? లేక ఆకాశగంగ భూమికి దిగివస్తున్నదా?" అని ఆలోచిస్తూ అటు చూశాడు. తారాహారాన్ని చేతిలో పట్టుకొని మదనలేఖా, తరళికా, కేయూరకుడు రావడం గమనించి, వారికి స్వాగతం చెప్పాడు. ఈ తెల్లటికాంతికి కారణం ఆ హారమేనని భావించాడు.

అప్పుడు మదనలేఖ "రాకుమారా! మనోహర రూపం గల మిమ్మల్ని ఏ అమ్మాయి జీవిత భాగస్వామిగా పొందుతుందో కదా! సరళ స్వభావం గల మిమ్మల్ని అందరూ ఆదరిస్తారు. ఈ వస్తువును మీకిమ్మని కాదంబరీ దేవి పంపింది. ఈ హారం సముద్ర మథన సమయంలో పుట్టింది. ఎంతో విశేషమైనది. మీ రూపానికి ఈ హారం సరైనదని కాదంబరి దీనిని మిమ్మల్ని ధరించమని చెప్పింది. ఇది మీరు తప్పుగా భావిస్తే మహాశ్వేతను నిందించండి. ఆమె అలా చేయమని తరళికను కూడా పంపింది." అని చెప్పి ఆ హారాన్ని చంద్రాపీడునికి అలంకరించింది.

అప్పుడు చంద్రాపీడుడు ఆ మాటలు విని "తరుణీ మణీ! నీవు మాట్లాడడంలో మహా చాతుర్యం గలదానివి. ఈ హారం గురించి నాకు ముందుగానే తెలుసు." అని చెప్పి క్రీడాపర్వత శిఖరం ఎక్కాడు. కాదంబరి మదన లేఖ ద్వారా జరిగిన వృత్తాంతాన్ని తెలుసుకొని తమాలికను వెంటబెట్టుకొని మేడ ఎక్కి చంద్రాపీడుని చూసి రకరకాలైన విలాసాలతో అతని మనస్సు హరించింది.

చంద్రాపీడుడు ముక్తా మంటపంలో వెన్నెలలో తిరుగుతూండగా కేయూరకుడు వచ్చి "రాజపుత్రా! మీ దర్శనం కోసం కాదంబరి వస్తున్నది" అన్నాడు. ఆ మాటలు విని రాకుమారుడు ఆశ్చర్యపడినాడు. తర్వాత కాదంబరి మదన లేఖను వెంట తీసుకొని చంద్రాపీడుని దగ్గరకు వచ్చి నేలపై కూర్చుంది. మదనలేఖ వెంట తీసుకొని వారిస్తున్నా వినకుండా చంద్రాపీడుడు కూడా వారికి ఎదురుగా నేలపై కూర్చున్నాడు.

"దేవీ! దృష్టి మాత్రానికే సంతోషించే దాసునితో సంభాషించడం ఏమిటి? అలాంటి అనుగ్రహమే కనుక లభిస్తే ఇక చెప్పేది ఏముంది? నీ గౌరవాన్నే కానుకగా కోరుకొన వచ్చిన నేను, ఈ శరీరము, జీవితం, ఇంద్రియాలు నీ ఇష్టం. నీకు నచ్చిన పనికి నన్ను వినియోగించుకో" అని పలికిన చంద్రాపీడుని చూసి మదనలేఖ నవ్వి "రాకుమారా! మనోహరమైన మాటలతో మమ్మల్ని ఎందుకు సందేహంలో పడేస్తావు? నీ తండ్రి తారాపీడుడు ఎలాంటివాడు? మీ తల్లి విలాసవతి ఎలాంటిది? నీ రాజధాని ఉజ్జయిని ఇక్కడికి ఎంత దూరం? దాని రమణీయ విశేషాలు ఏమిటి?" అని అడుగగా, వారికి కావాల్సిన సమాధానాలు చెప్పి ఆనందపరిచాడు.

కాదంబరి కొంతసేపు అక్కడే ఉండి, కేయూరకుని చంద్రాపీడుని దగ్గర వదిలి తన మందిరానికి వెళ్ళిపోయింది. చంద్రాపీడుడు కాదంబరి విశేష గుణాలు, మహాశ్వేత వాత్సల్యం, కింపురుష దేశ రమ్యత్వం గురించి తలుచుకుంటూ నిద్రపోయాడు.

మర్నాటి ఉదయం మేల్కొని కాలకృత్యాలు తీర్చుకొని తన దగ్గరే ఉన్న కేయూరకునితో "ఓయీ! నీవు వెళ్ళి మహాశ్వేత ఎక్కడ ఉన్నదో, కాదంబరి ఏమి చేస్తున్నదో చూసిరా" అని చెప్పి పంపిచాడు. కేయూరకుడు వెళ్ళి,

అక్కడి విశేషాలు చూసి వచ్చి నమస్కరించి "దేవా! తెల్లని విభూదిని ధరించి, దేవతాస్తుతి చేస్తూ, జపమాలను ధరించి, బంధువులను సన్మానిస్తూ మహాశ్వేత కాదంబరితో ముచ్చటిస్తున్నది." అని చెప్పాడు.

తర్వాత కేయూరకుడు దారి చూపిస్తుండగా చంద్రాపీడుడు అంతఃపుర విశేషాలను చూస్తూ, మహాశ్వేత దగ్గరకు వెళ్ళి నమస్కరించి అక్కడ కొంతసేపు కూర్చున్నాడు. అతని అభిప్రాయాన్ని గ్రహించి మహాశ్వేత కాదంబరితో ఇలా అంది. "సఖీ! చంద్రాపీడుడు వెళ్ళాలని నిశ్చయించుకొని నిన్ను చూసి ఏమీ మాట్లాడలేకపోతున్నాడు. ఇతని గురించి తెలియక అతని పరివారం అంతా బాధపడుతున్నారు. దూరంగా ఉన్నంత మాత్రాన మీ ఇద్దరికీ ప్రేమ స్థిరంగానే ఉంటుంది. ఇతను వెళ్ళడానికి అనుమతి ఇవ్వు" అన్నది. అది విని కాదంబరి "నెచ్చెలీ! ఇతనికి తన అంతరాత్మ లాగానే పరిజనం కూడా స్వాధీనమై ఉండగా వెళ్ళడానికి అభ్యంతరం ఏమీ లేదు. అలాగే వెళ్ళవచ్చు" అని చెప్పి గంధర్వ కుమారులని పిలిచి గుర్రాన్ని సిద్ధం చేయమంది.

అప్పుడు చంద్రాపీడుడు లేచి ముందుగా మహాశ్వేతకి నమస్కరించి, తర్వాత కాదంబరికి కూడా నమస్కరించి వారి దగ్గర సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు. అతని మనస్సు వెళ్ళద్దని వెనక్కి లాగుతున్నప్పటికీ రాకుమారుడు ముందుకు సాగిపోయాడు. తనను చూసి మొక్కిన రాకుమారులను మన్నించి, వైశంపాయనుని కౌగిలించుకొని, పత్రలేఖ వైపు ఆదరంగా చూసి తన భవనానికి వెళ్ళిపోయి ఏకాంతంగా పత్రలేఖ వింటూండగా వైశంపాయనునితో తాను చూసిన విశేషాలను గురించి చెప్పాడు.

మర్నాటి ఉదయం రాకుమారుడు సభాభవనంలో కాదంబరి గురించి ఆలోచిస్తూ ఉండగా అంతలో ద్వారపాలకుడు కేయూరకుని తీసుకొని రావడం గమనించాడు. అతన్ని చూస్తూనే చంద్రాపీడుడు నమస్కారం చేస్తూ "గంధర్వపుత్రా! రమ్ము" అని పలుకుతూ అతనిని కౌగలించుకొని అతనికి దగ్గరగానే కూర్చోబెట్టుకొని "వత్సా! కాదంబరి కుశలమా? మహాశ్వేత భద్రమా?" అని అడిగాడు.

దానికి కేయూరకుడు "దేవా! అందరూ కుశలమే. కాదంబరి మీకు నమస్కారాలు తెలుపమంది. మహాశ్వేత కుశలం తెలుపమంది. మదనలేఖ, తమాలికా మీకు పాదప్రమాణాలు చేశారు. అంతేకాకుండా మహాశ్వేత మీకిలా తెలుపమంది" అందరూ నిన్ను తలుచుకుంటున్నారు. నీవు లేని రాజనగరం ఉత్సవం మర్నాటిలా వెల - వెల బోతూ ఉంది. అకారణంగా బంధువువైన నిన్ను చూడాలని ఉంది. అంతేకాకుండా నిన్ను స్మరిస్తూ కాదంబరి అనారోగ్యం పాలైంది. కాదంబరి నీకు పంపిన హారాన్ని మర్చిపోయి వచ్చావు. దానిని నీకు తిరిగి పంపుతున్నాను. ఒక్కసారి వచ్చి పోవాలని కోరుతున్నాను. కాదంబరి నీకోసం ఆకులు, వక్కలు, కర్పూరం, చందనం అన్నీ కలిపి తామరాకులో ఉంచి పంపుతున్నది" అంటూ కేయూరకుడు వివరించి, కాదంబరి పంపిన తాంబూలాన్ని చంద్రాపీడునికి అందించాడు.

అప్పుడు చంద్రాపీడుడు "ఆహా! నేను ఎంత పుణ్యం చేసుకున్నాను. కాదంబరి నన్ను తలుచుకుంటూ ఉండడం మహాశ్వేత పాదసేవల వలన కలిగిన భాగ్యం కదా!" అనుకుంటూ ఆమె పంపిన వస్తువులను అందుకున్నాడు."కేయూరకా! నేను వచ్చిన తర్వాత అక్కడ ఏమి జరిగినది? కాదంబరి, మహాశ్వేత ఏం చేశారు? మదనలేఖ ఏమనుకుంటున్నది?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించాడు.

దానికి కేయూరకుడు "దేవా! మీరు వచ్చిన తర్వాత కాదంబరీ దేవి చాలాసేపు మిమ్మల్నే తలుచుకుంటూ మేడపైనే ఉంది. ఆ తర్వాత క్రీడా పర్వతం ఎక్కి చాలాసేపు అక్కడ గడిపింది. మహాశ్వేత బలవంతం చేయగా భోజనం చేసి పడుకుంది. అప్పటినుండి ఆమెకు అనారోగ్యంగా ఉంది. మీరెలా ఉన్నారో చూసిరమ్మని నన్ను పంపింది" అంటూ అక్కడ జరిగిన విశేషాలు మొత్తం చెప్పాడు.

అది విని చంద్రాపీడుడు కాదంబరిని చూడాలని తొందరపడుతూ ఇంద్రాయుధాన్ని సిద్ధం చేసుకొని పత్రలేఖ, వైశంపాయనునితో సహా, కేయూరకుడు వెంటరాగా హేమాకూటం ప్రయాణం అయ్యాడు. కాదంబరి అంతఃపురం చేరుకొని "ఆమె ఎక్కడ ఉన్నది" అని వారికి ఎదురైన ఒక

గంధర్వుని అడిగారు. దానికి ఆ గంధర్వుడు "క్రీడా పర్వతం క్రింద గల హిమగృహంలో ఉందని" చెప్పగా, కేయూరకుడు దారి చూపగా చంద్రాపీడుడు హిమగృహం చేరాడు.

అంతకు ముందే వెళ్ళి పరివారం వారి రాక గురించి కాదంబరికి తెలియజేయగా "ఆ! నిజంగా చంద్రాపీడుడు వచ్చాడా? మీరు చూశారా?" అంటూ ప్రశ్నిస్తుండగానే రాకుమారుడు, వైశంపాయనుడు, పత్రలేఖలతో సహా వచ్చి మహాశ్వేతకు, కాదంబరికి నమస్కరించి అక్కడే కూర్చున్నాడు.

అప్పుడు కేయూరకుడు "దేవీ! ఈ అమ్మాయి చంద్రాపీడునికి తాంబూలం అందించే పత్రలేఖ. వీరికి నమ్మకమైనది" అంటూ పత్రలేఖను పరిచయం చేయగా కాదంబరి ఆమెను ఆత్మీయంగా స్పృశించింది. చంద్రాపీడుడు కాదంబరిని చూసి "దేవీ! నీకీ అనారోగ్యం ఎలా కలిగింది? దీనికి నీ కన్నా నేనే ఎక్కువ బాధపడుతున్నాను. నిన్ను ఆరోగ్యవంతురాలిగా చేయడానికి నా హృదయం తొందర పడుతోంది" అన్నాడు.

దానికి మదనలేఖ "రాజకుమారా! ఈమె మనోభావాల్ని నీవు తెలుసుకోలేకపోతున్నావు. ఈమెకు ధీరత్వమే ప్రాణానికి హేతువు కాగలదు" అంటూ జవాబిచ్చింది. చంద్రాపీడుడు కొంతసేపు వారితో కాలక్షేపం చేసి తన రాజధానికి వెళ్ళబోతూ కాదంబరి కోరికపై పత్రలేఖను అక్కడే వదిలి వైశంపాయనని తీసుకొని వెళ్ళిపోయాడు. అంతకు ముందే తండ్రి దగ్గర నుండి వచ్చిన దూతను చూసి గుర్తుపట్టి "మహారాజు కుశలమేనా? ప్రజలందరూ సుఖంగా ఉన్నారా?" అంటూ ప్రశ్నించగా దానికి ఆ దూత చంద్రాపీడునికి అతని తండ్రి తారాపీడుడు ఇచ్చిన ఉత్తరాన్ని ఇచ్చాడు.

దానిలో "ప్రజలందరూ సుఖంగానే ఉన్నారు. నీవు దిగ్విజయ యాత్రకు వెళ్ళి చాలాకాలం అయింది. నిన్ను చూడాలని అందరూ కోరుకుంటున్నారు. ఈ ఉత్తరం చదివిన వెంటనే ప్రయాణం కమ్మని" రాసి ఉంది. వైశంపాయనునికి కూడా అతని తండ్రి శుకనాశుడు అదే అర్థం వచ్చేటట్లు ఉత్తరం రాసి పంపాడు.

వెంటనే చంద్రాపీడుడు ప్రయాణానికి సిద్ధమై, మేఘనాధుడు అనే సేనాపతిని అక్కడ ఉంచి, పత్రలేఖను కేయూరకుడు తీసుకొచ్చిన తర్వాత ఆమెను తీసుకొని రమ్మని చెప్పి రాజ్యానికి బయలుదేరాడు. వెళ్ళేముందు కాదంబరికి ఇలా ఉత్తరం రాశాడు. "దేవీ! తండ్రి ఆజ్ఞ ప్రకారం నేను ఉజ్జయినికి వెళుతున్నాను. నన్ను ఎప్పుడైనా తలుచుకుంటూ ఉండు. మహాశ్వేతకు నమస్కారాలు చెప్పు. మదనలేఖను, తమాలికను అడిగినట్లు చెప్పు" అంటూ లేఖ రాసి కేయూరకుడు వచ్చినప్పుడు ఇవ్వమని చెప్పి, వైశంపాయనునితో పరివారాన్ని తీసుకొని రమ్మని చెప్పి, ఇంద్రాయుధం ఎక్కి వేగంగా ఉజ్జయినికి వెళ్ళిపోయాడు.

ఆకస్మికంగా వచ్చిన రాకుమారుని చూసి ప్రజలందరూ ఆశ్చర్యపోయారు. కొడుకు వచ్చాడని తారాపీడుడు పట్టరాని సంతోషంతో చంద్రాపీడుని కౌగలించుకున్నాడు. వెంటనే విలాసవతి మందిరానికి వెళ్ళి ఆమెకు నమస్కరించాడు. మహారాణి కుమారుని చూసి చాలా సంతోషించింది. తర్వాత చంద్రాపీడుడు శుకనాశుని ఇంటికి వెళ్ళి వైశంపాయనుడు పరివారాన్ని తీసుకొని వెనక వస్తున్నాడని చెప్పి, మనోరమకు ఆనందాన్ని కలిగించి వారి నుండి ఆశీర్వాదం తీసుకొని తన భవనానికి వెళ్ళిపోయాడు.

కాదంబరి వియోగం వలన ఆ మనోహరమైన భవనం కూడా అతనికి శూన్యంలా కనిపించింది. ఆ వియోగ బాధతో కొన్నాళ్ళు గడిపి ఒక రోజు మేఘనాధునితో సహా పత్రలేఖ హేమకూటం నుండి రావడం గమనించి, ఆనందంతో ముఖం వికసించగా ఆమెను ఆదరించి "కాదంబరీ, మహాశ్వేతలిద్దరూ సుఖంగానే ఉన్నారు కదా?" అని అతని క్షేమం గురించి అడిగిందని చెప్పింది.

చంద్రాపీడుడు ఆమె చేయి పట్టుకొని తన మందిరానికి తీసుకువెళ్ళి మాణిక్య శిలా మంటపంపై కూర్చోబెట్టి "పత్రలేఖా! నేను వచ్చేశాక అక్కడ జరిగిన విశేషాలు ఏమిటి? నువ్వక్కడ ఎంతకాలం ఉన్నావు? ఆమె నిన్నెలా చూసుకుంది? మీ మాటల మధ్యలో ఏమేం విషయాలు వచ్చాయి? కాదంబరి నా గురించి ఎప్పుడైనా తలుచుకుందా?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించాడు.

దానికి పత్రలేఖ "రాకుమారా! మీరు వెళ్ళిన కొంతసేపటికి కాదంబరి తన పరివారాన్ని వదిలి, నన్ను మాణిక్య సోపానాల వల్ల ప్రకాశించే ప్రమదావనంలోని వేదిక మీద తన ప్రక్కన కూర్చోబెట్టుకుంది. ఏదో చెప్పాలని నా ముఖం వైపు రెప్పవేయకుండా చూసింది. ఆమె అభిప్రాయం గ్రహించి "అయ్యో సఖీ! భయపడతావెందుకు? నన్ను పరాయిదానిగా భావించకు. ఏం చెప్పదల్చుకున్నా ధైర్యంగా చెప్పు" అన్నాను. ఆమె కాలిబొటన వేలితో నేలపై రాస్తూ, అటూ ఇటూ దిక్కులు చూస్తూ, చెప్పదలుచుకున్నప్పటికీ సిగ్గు వల్ల చెప్పలేక, ఊరుకొని, తలవంచుకొని కన్నీరు కార్చసాగింది.

"అమ్మా! నీకిది భావ్యం కాదు. కారణం ఏమిటో చెప్పు. ఊరికే కన్నీరు పెడతావెందుకు?" అని నేను చాలాసార్లు అడుగగా అతిప్రయత్నంతో కన్నీరు తుడుచుకొని చెప్పవలసినవి విషయాన్ని గోటి చివరలతో మొగిలి రేకులపై రాసి, అంతలోనే వాటిని చింపేసి, తలెత్తి మాటి - మాటికీ నన్ను చూస్తూ ఇలా చెప్పింది.

"సఖీ! పత్రలేఖా! నిన్ను చూసిన దగ్గర నుండి అందరికంటే నీ మీదే నాకెక్కువ నమ్మకం కలిగింది. ఎందుకో తెలియదు. నాకు జరిగిన పరాభవం ఎవరితో చెప్పుకోను? నా బాధను పంచుకునేవారెవరు? నా బాధను చెప్పుకోడానికి నీ కన్నా ఆప్తులు నాకెవ్వరూ కనబడలేదు. నా సంతాపమంతా నీకు చెప్పుకొని ఈ జీవితం చాలిస్తాను. కళంకం లేని కులాన్ని కళంకపరచి సామాన్య కన్యలాగా నాలాటిది చిత్త చాంచల్యం పొందవచ్చునా? చంద్రాపీడుని వలన అనాధలా, నీచురాలిగా బలవంతంగా నిందితురాలిని అవుతున్నాను. గొప్పవారిలా ఇలా చేయడం సమంజసమేనా? పరిచయమైనందుకు ఫలితం ఇదా? సుకుమారమైన నా మనస్సును అతడు అలా అవమానపరచవచ్చునా? నా హృదయం దహించుకుపోతోంది. ఇక నేను బ్రతకలేను. మరోజన్మలో కూడా నేను నీ స్నేహాన్ని కోరుకుంటున్నాను. నాకు నీలాంటి స్నేహితురాలు లేదు. ప్రాణ త్యాగం చేసి నా కళంకాన్ని కడుక్కుంటాను" అని చెప్పి ఊరుకుంది.

నాకేమీ తెలియకపోవడం వల్ల చాలా భయపడుతూ, విచారంగా "దేవీ! చంద్రాపీడుడు ఏం తప్పు చేశాడు. నీ మనసుని ఎందుకు కష్టపెట్టాడు? వినడానికి సిద్ధంగా ఉన్నాను. త్వరగా చెప్పు. విన్న తర్వాత మొదట నేను నా శరీరాన్ని వదిలాక, నువ్వు నీ శరీరాన్ని వదులుదువు గానీ" అన్నాను.

దానికి ఆమె "ఆ ధూర్తుడు నా కలలోకి వచ్చి చిలుకలతో రహస్య సందేశాలు పంపుతున్నాడు. నిజంగా నాపై అనురాగం ఉన్నవాడిలా నా పాదాలకు లత్తుక పూస్తాడు. చెక్కిళ్ళపైన గల స్వేదబిందువులను గాలి విసిరి పోగొడతాడు. ఒంటరిగా తిరుగుతూ ఉంటే బిగిగా కౌగిలించుకుంటాడు. వక్షం మీద చిత్ర రచన చేస్తాడు. పత్రలేఖా! అతన్ని నేను ఎలా పట్టుకోగలను?" అంది.

ఈమె చంద్రాపీడుని గురించి మన్మధుడి చేత ఆకర్షించబడింది. ఈ పంచదార బొమ్మ వలన రాకుమారుడు కూడా మన్మధుడి బారినపడ్డాడు. అని మనస్సులో అనుకుని "దేవీ! నీ విషయం అంతా తెలుసుకున్నాను. కోపగించుకోకు! కామం చేసిన అపరాధానికి మా రాజపుత్రుని నిందించకు! ఈ చేష్టలన్నీ మన్మధుడివే గానీ చంద్రాపీడునివి కావు" అన్నాను.

ఆమె చాలా సంతోషంతో తలెత్తి "కాముడు అంటే ఎవరు? అతని రూపం ఎలాంటిది? వాడి చేష్టలేమిటి?" అని అడిగింది.

"తరుణీ! వాడికి రూపమంటూ లేదు. శరీరం లేకుండానే దహించగలడు. మంట లేకుండానే తాపం తెప్పించగలడు. పొగ లేకుండానే కన్నీరు పుట్టిస్తాడు. అలాంటి భూతం మూడులోకాల్లోనూ లేదు. వాడి బారినపడితే ఎంతటి ధైర్యవంతులనైనా వేధించి తీరుతాడు. అతని చేత ఆవహించబడిన స్త్రీలకు ఆకాశమంతా వారి ప్రియుడి ముఖమే కనిపిస్తుంది. భూమి అంతా కూడా అతనే కనిపిస్తాడు. వాడి చర్యలు చాలా విపరీతంగా ఉంటాయి" అని వివరించాను.

దానికి కాదంబరి "పత్రలేఖా! ఇప్పుడు ఎలాగైతే చెప్పావో అదే విధంగా మన్మధుడు నన్ను వేధిస్తున్నాడు. నువ్వు నాకు ప్రాణంతో సమానమైనదానివి! ఇప్పుడు నేనేం చేయాలో చెప్పు! ఇంతకు ముందెప్పుడూ ఇలా జరగలేదు.

అందుకే నా బాధను ఎవరికీ చెప్పుకోలేక ఇలా కష్టపడడం కంటే చనిపోవడమే మేలు" అంటూ విచారించింది.

"వద్దు దేవీ! అకారణ మరణంతో నీకు పనిలేదు. ఆరాధించకుండానే ప్రసన్నుడయ్యే మన్మధుడే నీ కార్యాన్ని చక్కబెడతాడు! నీ మనస్సులోని ఆలోచన అనర్ధమైనది కాదు. స్వయంవర పద్ధతిలో ఎందరో స్త్రీలు, పతిని వరించారు. మరణించాలనే ఆలోచన మానుకో! నీ పాదాల మీద ఒట్టు! నన్ను వెంటనే పంపించు! తొందరగా వెళ్లి చంద్రాపీడుని తీసుకు వస్తాను" అన్నాను.

"పత్రలేఖా! నీ ప్రీతి నాకు తెలుసు! మృదువైన ప్రకృతి గల కన్యకు ప్రగల్భాలు ఎలా వస్తాయి? నేనేం చేయాలో తెలియడం లేదు. అన్న కాదంబరితో "నువ్వు చెప్పమన్నట్లుగానే చెపుతాను! చంద్రాపీడునికి, ఏం చెప్పమంటావో చెప్పు!" అంది పత్రలేఖ.

"నీవు నా ప్రియుడవని చెప్తే పునరుక్తి దోషం మరి! 'నీకు నా మీద ప్రేమ ఉందా? లేదా? అని అడిగితే మూఢత్వం కాదా? నీ మీద నాకెంతో ప్రేమ ఉంది' అంటే వేశ్యాలాపం అవుతుంది. 'నీవు లేకపోతే నేను జీవించను' అని చెప్పడం అనుభవ విరుద్ధం(........ఎంచేతనంటే ఈ మాటలు చెప్పేటప్పుడు నేను జీవించే ఉన్నాను కదా!) పీడిస్తున్నాడు' అంటే నాలో లోపం చెప్పకున్నట్లు అవుతుంది! నన్ను మన్మధుడు నన్ను నీకు ఇచ్చేసినాడు' అంటే స్వయంగా నిన్న చేరడానికి ఉపాయం అవుతుంది. నిన్ను బలాత్కారంగా వశపరచుకుంటున్నాను. అనడం కులట చూపించే ధార్ష్యం అవుతుంది. నేను వస్తానని చెబితే స్త్రీ చాపల్యత అనిపించుకుంటుంది. ఈ సేవకురాలికి ఇతరులు ఎవరి మీదా అనురాగం లేదని చెబితే తన భక్తి తానే ప్రకటించుకున్న తెలికతనం అవుతుంది. నీవు నిరాకరిస్తావేమోనని సందేశం పంపడం' లేదంటే ఎరుగని వారికి నేర్పినట్లు అవుతుంది. నాకు నీ మీద ఎంత ప్రేమ వుందో నేను మరణించిన తర్వాత తెలుస్తుంది. అనడం అసంభావ్యం.......ఇన్ని ఊహలు నా మనస్సును తొలుస్తూంటే ఏమని చెప్పను పత్రలేఖా! ఏం చెబుదామన్నా దోషమే కన్పిస్తోంది" అంది కాదంబరి.

"వద్దొద్దు! మృతిమాట తలవకు! ముందే చెప్పాను కదా! నీ విరహాన్ని కొద్దికాలం భరించక తప్పదు. ఆ పైన మన్మధుడే అన్ని కార్యాలు చక్కదిద్దుతాడు...." అన్నాను నేను. మరోసారి కాదంబరిని అనునయిస్తూ.

కాదంబరి పూర్వభాగం ముగిసింది.

*వివరణ*

**(బాణభట్టు రచన అయిన ఈ కాదంబరి, సంస్కృతంలోని ఉత్తమ గద్యకావ్యం. ఇతడు హర్షచక్రవర్తి ఆస్థానకవి. కథా కల్పనా చాతుర్యంలో గొప్పవాడు బాణుడు. 'బాణోచ్ఛిష్టమ్ జగత్ సర్వమ్' అని ఆర్యోక్తి. అంటే - బాణుడు ఏదీ వదలకుండా, సమస్త విషయాలు కల్పన చేశాడు. అతడు ఊహించిన కల్పనా చాతుర్యాన్ని మించి ఇంకెవరూ ఊహించలేరని భావం. మనం ఏ కల్పన చేసినా, అది ఇంతకుముందే బాణుని రచనలో ఏదో ఒక చోట కనిపిస్తుంది. మనస్తత్వ విశ్లేషణలో సైతం బాణుని ఊహకు మనం సాటి రాలేము. ఇక - ఈ కాదంబరి కథలో ఇంతవరకే బాణుని రచన. ఇక్కడి వరకూ రాసి, బాణభట్టు స్వర్గస్తుడు కాగా, తండ్రికి దీటైన కల్పనా చాతుర్యంతో ఈ తరువాయి కథాభాగాన్ని అతడి కుమారుడు రచించాడు.)**



# కాశీమజిలీ కథలు

## కాదంబరి
### ఉత్తరభాగము

చెబుతున్నది.....

పత్రలేఖ నా ఓదార్పునకు జవాబుగా, తిరిగి కాదంబరి ఇలా చెప్పసాగింది......ఆ వేళ క్రీడా పర్వతం పాద పీఠాన గల సరస్సు ఒడ్డున, శిలాసదృశంగా ఉన్న మంచుబండల మధ్య పూలపాన్పు మీద పడుకొని ఉండగా - చంద్రాపీడుడు నన్ను చూశాడా?! రెండుసార్లు వచ్చి చూసి కూడా, నా అవస్థ అంతా గమనించినా ఉపేక్ష వహించి వెళ్లిపోయాడు. ఇంకేం చెప్పమంటావు సఖీ! కూర్చున్నా, తిరుగుతూన్నా, నిద్రపోతూన్నా, మేల్కొని ఉన్నా, రాత్రింబగళ్లూ ఆ క్రీడా పర్వతం - ఆ రాజకుమారుడూ మాత్రమే కనిపిస్తున్నారు. అని ఆ తర్వాత ఏం చెప్పడానికీ మాటలు చాలక, శోకంతో తలను భుజాలమీదకు వంచి, మూర్ఛిల్లిన దానిలా కొంతసేపు ఊరకుంది.

అప్పుడు - ఆ మాటలు విన్న నేను "ఆహా! వియోగులకు జీవితమింత దుర్భరం" అని నేను భావిస్తూన్నంతలో పొద్దుపోయింది. అప్పుడు కొందరు బాలికలు వింత వింత దీపాలు వెలిగించారు. నేనూ ఆమెను చూసి "దేవీ! దుఃఖించకు! నేను వేగం వెళ్లి ఆ రాజకుమారుడిని తీసుకొస్తాను" అని చెప్పడం వల్ల ఆమె కొంత స్వాంతన పొంది "ఎవరక్కడ? అంటూ పరిజనుల్ని పిల్చింది. అప్పుడక్కడికి ఎంతో మంది యువతులు ఏమి ఆజ్ఞ?" అని పరిగెత్తుకుంటూ వచ్చారు.....

"పత్రలేఖా! నీ రాక కోసం ప్రాణాలు నిలుపుకొని ఎలాగో ఉంటాననుకో! త్వరగా కార్యం సాధించుకుని రా!" అని పలుకుతూ, ఆ హారం నా మెడలో వేసింది. నాకు ఆభరణ తాంబూలాదులిచ్చి నన్ను పంపింది.

నేను కాదంబరి తరఫున దుఃఖిస్తూ మీకు విన్నపం చేస్తున్నాను. దేవరకు సైతం అటువంటి అవస్థలో ఉన్న గంధర్వ రాజపుత్రికను ఉపేక్షించి రావడం ఉచితం కాదు. ఆపన్నవత్సలురైన మీరే తగనికార్యం చేశారు" అని చెప్పి ముగించిన పత్రలేఖను రెప్పవాల్చక చూడసాగాడు చంద్రాపీడుడు.

కొంతసేపటికి వరకు కన్నీరు కారుస్తూ, మనస్సులో కమ్ముకున్న బాధను వ్యక్తం చేస్తూ "పత్రలేఖా! నన్నేం చెయ్యమంటావు? శృంగారలీలా విలాసాలు విరజిమ్మే ఆ మన్మధుడు దీనికంతటికీ కారణం! పోనీ! తాను ఈ మన్మధావస్థకు లోనైనట్లు ఆమె నాకు చెప్పిందా అంటే, అదీ లేదు. దేవతాస్త్రీల యొక్క ప్రవర్తనం - చూపులు అన్నీ కరుణారస ప్రపూర్ణాలు కనుక, ఆ చల్లని చూపులు అనురాగ సహజాలని అనుకున్నాను. నాకు ఓ పక్క సందేహంగానే ఉన్నప్పటికీ - ఆమె నా పట్ల అభిమానం చూపడం వాత్సల్యదృష్టి అనే అనుకున్నాను. అందువల్ల కాదంబరీ దుఃఖానికి నేను కారకుడి నయ్యాను. ఏది ఏమైనప్పటికీ ఆ తప్పు నా వల్లనే జరిగింది కనుక, నా ప్రాణాలు ఇచ్చి అయినా సరే - నేను కఠినుడిని కానని ఆమెకు తెలియచేస్తాను" అన్నాడు.

ఇంతలో ప్రతీహారి అక్కడకు వచ్చి, ఆ యువరాజుకు నమస్కరించాడు. "పత్రలేఖా సహితంగా నిన్ను చూడాలని విలాసవతీ మహారాణిగారు నన్ను ఇక్కడకు పంపించారు" అని విన్నవించాడు. "ఆహా! తల్లి నన్ను చూడకుండా క్షణమైనా ఉండజాలదు. నేనూ తండ్రి పాదసేవ చేయకుండా ఉండలేను. పరస్పర ప్రేమాతిశయం మాకు ముగ్గురికీ ఉంది. అలాగే ప్రజలకూ నా పట్ల అనురాగం అధికమే! ఇక - నాకు, కాదంబరి అంటే ఓ గొప్ప మోహం అనురాగం, హేమకూటం ఎక్కడ? వింధ్య ఎక్కడ ? ఏం చేస్తాను?" అని ఆలోచిస్తూనే, తల్లి దగ్గరకు వెళ్లి ఆమెకు ఆనందం కలిగించాడు. ఆ పగలంతా తల్లి లాలన సుఖంలో వాత్సల్యాభిమానాలు పొందుతూ అక్కడే ఉన్నాడు.

చంద్రాపీడునికి కాదంబరిని చూడాలన్న కుతూహలం అధికమైంది. "అయ్యో! ఇదేమి? నా జీవితం ఇలా సందేహాల ఊయల ఊగుతూన్నదే! నా తల్లి నన్ను తనివితీరా చూసిందో లేదో! ఇంతలో పత్రలేఖ, కాదంబరి

అవస్థ చెప్పింది. మాతృసేవ వదలనా? గంధర్వరాజపుత్రిని వదలనా?" కాదంబరీ విరహవేదనలో శుష్కించిపోతూ భారంగా కాలం గడపసాగాడు అతడు.

ఒకరోజు చంద్రాపీడుడు సాయంకాలపు వ్యాహ్యాళికై సిప్రానదీతీరాన విహరిస్తుండగా, దూరంగా గుర్రాల అలికిడి విని, అది ఏమిటో తెలుసుకురమ్మని ఒక భటుడ్ని పంపాడు. పత్రలేఖ అప్పుడు చంద్రాపీడుని పక్కనే ఉంది''. 'విచిత్రగమనంతో ఆ గుర్రం నడుపుతున్నవాడు కేయూరకుడిలాగే ఉన్నాడు కదూ!" అన్నాడు ఆమెతో.

ఇంతలో అతడక్కడికి వచ్చి గుర్రం దిగి, చంద్రాపీడునికి నమస్కరించాడు. అతడ్ని ఆనందంగా కౌగలించుకుని "కేయూరకా! నీ రాక వల్ల కాదంబరి క్షేమంగా ఉందని తెలుస్తోంది. కొంత విశ్రాంతి తీసుకో! ఆ తర్వాత నువ్వ వచ్చిన కారణం చెప్పవచ్చును" అంటూ పత్రలేఖను - కేయూరకుని వెంటబెట్టుకుని తన భవనానికి వెళ్లి, లోపలకు ఎవ్వరినీ రానివ్వవద్దని ద్వారపాలకునితో చెప్పి "గంధర్వపుత్రా! కేయూరకా! నీవు తెచ్చిన సందేశమేమిటి? కాదంబరి, మహాశ్వేత, మదన లేఖలు ఏమైనా చెప్పి పంపించారా! చెప్పు!" అని అడిగాడు.

"రాజపుత్రా! నేను నీకు ఉజ్జయినీపురి కేగిన వార్త చెప్పాను కదా! మహాశ్వేత మీ ఉత్తరం చదివి, ఏదో ఆలోచించుకుని, నిట్టూర్పు వదలి విచారంగా లేచి తపస్సు చేసుకోడానికి ఆశ్రమానికి వెళ్లిపోయింది.

ఇక - కాదంబరి దురవస్థ చెప్పనేల? ఆమె మీ ఈ స్వదేశ ప్రయాణ వార్త విని, పిడుగుపడి మూర్ఛపొందినదానిలా అయిపోయింది. అంతలోనే కాస్త తెప్పరిల్లి "మదనలేఖా! చూశావా! చంద్రాపీడుడు ఎలాంటి పని చేశాడో!? ఇలాటివాడు ఎక్కడైనా ఉంటాడా?" అని ఒక్కతే ఏకాంతగృహానికి వెళ్లిపోయి ముసుగువేసుకుని, మదనలేఖతో సైతం మాట్లాడక పరితాపంతోనే ఆ రోజంతా గడిపింది.

మర్నాడు ఉదయం నేను ఆమె బాధచూడలేక, ఆమె చూపులను బట్టే

ఆమె అభిప్రాయం గ్రహించేసి ఆమెకు చెప్పకుండానే మిమ్మల్ని చూడడానికి నేను వచ్చేశాను. రాజకుమారా! ఆమె అవస్థ గురించి వివరించాలంటే కనీసం పదిరోజులైనా పడుతుంది" అన్నాడు కేయూరకుడు.

"ఇక చెప్పకు! నేను ఆమె బాధ విని తట్టుకోలేను. పత్రలేఖ వల్ల కొంత నీ వలన మరికొంత కాదంబరి హృదయం బాగా అర్థమైంది. సరే! తాను చెప్పలేకపోయిందే అనుకో! మదనలేఖ ద్వారానైనా నాకు తెలుపవచ్చుగా! ఎంత చిత్రమో చూడు! ఓ అశ్వం వల్ల నేను గంధర్వలోకానికి వెళ్లడం ఏమిటి? మహాశ్వేతను చూడటం – హేమకూటానికి వెళ్లడం – కాదంబరీ దర్శనం ఇదంతా ఏమిటి? ఇదంతా మన్మధుని మాయాజాలం కాదూ!? కనుక వేగంగా వెళ్లి ఆమెను ఓదార్చే ప్రయత్నం చేయాల్సిందే!" అన్నాడు.

సాయంకాలం కావడంతో, చంద్రాపీడుడు మేడమీదకు వెళ్లాడు. ఆలోచిస్తూనే "నేను వెళ్లాలంటే, తల్లిదండ్రుల్ని కష్టపెట్టాల్సి వస్తుంది. వెళ్లకపోతే కాదంబరి ప్రాణత్యాగం చేస్తుంది. ప్రాణంలో ప్రాణం వైశంపాయనుడూ. నా దగ్గర్లో లేడు" అనుకుని, ఎలాగో ఆ రాత్రి తెల్లవారించాడు.

మర్నాడు ఉదయానికి వైశంపాయనుడు వస్తున్నట్లు తెలిసి ఆనందించి, అతడొచ్చే వరకు తాను ఆగదలచాడు. అందువల్ల మేఘనాధుడు, పత్రలేఖలను కేయూరకునితో ముందుగా పంపడానికీ – తాను వైశంపాయనునితో కలిసి యుద్ధసమాచారాలు విన్నాక బయలుదేరడానికి నిర్ణయించుకున్నాడు. పత్రలేఖను అక్కడికి రప్పించిన చంద్రాపీడుడు, కేయూరకునితో, "గంధర్వపుత్రా! నేను పత్రలేఖ ద్వారా కాదంబరికి సందేశం పంపుతున్నాను. ఈమెను కాదంబరి దగ్గరకు తీసుకువెళ్లు! నేను చెప్పాలనుకున్నదంతా ఆమె చెబుతుంది" అన్నాడు.

"పత్రలేఖా! నమస్కారంతో పాటు కాదంబరికి ఇలా విన్నవించు! తొలిచూపులోనే నన్ను అనుగ్రహించిన ఆమెకు ప్రతినమస్కారమైనా చేశానుకాను. ఆమెను ఏమీ అనుకోవద్దని నా మాటగా చెప్పు! నాలో ఏ సుగుణం చూపి నన్ను పరిగ్రహించమని ఆమెను ప్రార్థించను? ఆమె సుగుణాలే నన్ను ఆమె చేత అంగీకరించేలా చేసినవి. ఆ గొప్పదనం ఆమెదే!

ఆమె తన మనస్సు కుదుట పరుచుకొనేలా – తగిన ఆత్మస్థయిర్యం సమకూర్చుకోగలదని నేను ఆశిస్తున్నట్లు చెప్పు!" అని చెప్పవలసిన మాటలు వివరించాడు.

తరువాత పత్రలేఖతో "సఖీ! పత్రలేఖా! నీకంటే కాదంబరి ప్రాణాలు రక్షించడం ముఖ్యం గనుక – నిన్ను ఒంటరిగా పంపుతున్నాను" అని చెప్పాడు. తిరిగి తనను మహాశ్వేత ఆశ్రమంలో కలుసుకోమన్నాడు.

వాళ్లు వెళ్లాక, ఇతడు "వీళ్లు వేగంగా వెళ్తారా? దారిలో ఏదైనా అడ్డంకి రాదు కదా! ఎన్ని రోజులకు వెళ్లి ఆమెను ఊరడిస్తారు?'' అని ఆలోచించసాగాడు.

కొద్దిసేపు శూన్యమైన హృదయంతో అక్కడ ఉండి, శిబిరం ఎంతదూరం? ఎక్కడుందో తెలుసుకొని రమ్మని వార్తాహరుని పంపించాడు. వైశంపాయనునికి ఎదురేగడానికి పంపించవలసిందని అడగడానికి తండ్రి దగ్గరకు వెళ్లాడు.

దూరం నుంచే నమస్కరిస్తూ వస్తున్న పుత్రుని చూసి, తారాపీడుడు, నిబ్బరంగా వాత్సల్యం ఉట్టిపడేలా "వత్సా! రా! రా!" అని చేతులు సాచి కౌగలించుకుని దగ్గర కూర్చుండబెట్టుకుని, ఒళ్లంతా నిమురుతూ దగ్గర్లో ఉన్న ముఖ్యుడైన తన మంత్రితో ఇలా అన్నాడు......

"అయ్యా! శుకనాశా! ఆయుష్మంతుడు చంద్రాపీడుని చూశావా? ఇతనికి యుక్తవయస్సు వచ్చింది. వివాహం యోగ్యమైన దశలో ఉన్నాడు. విలాసవతితో కూడ ఆలోచించి, వీనికి తగిన పిల్లను తెచ్చి పెళ్లి చెయ్యాలి అనడంతో – శుకనాశుడు "దేవా! బాగా ఆలోచించారు. ఈతడు అన్ని విద్యల్లోనూ ఆరితేరాడు. ప్రజలకు సైతం సంతోషాన్ని కలిగించాడు. ఇక మిగిలినది పెళ్లే కదా! తప్పకుండా, దాన్ని గురించి ఆలోచించవలసిందే!" అని పలికాడు.

ఆ సమయంలో చంద్రాపీడుడు సిగ్గుచేత తలవాల్చుకొని, మనస్సులో "భళీ! వీళ్ల మాటలు వింటూంటే నాకు కాదంబరితో సరైన సమయంలోనే సమాగమం ఏర్పడే సూచనలు కనిపిస్తున్నాయి. నా విషయంలో మా తండ్రికి

ఈ సమయంలోనే బుద్ధిపుట్టడం చాలా శుభసూచకం" అనుకున్నాడు.

ఇంతలో వైశంపాయనుడి ప్రసక్తిరాగా, అతడికి ఎదురేగి వెళ్లమని తండ్రి ఆనతిచ్చాడు. చంద్రాపీడుడు ప్రాతఃకాల కృత్యాలు నిర్వర్తించుకుని, తగిన పరివారంతో గుర్రం ఎక్కి, అతివేగంగా యుద్ధశిబిరాల వైపు వెళ్లాడు.

వైశంపాయనుడు ఎక్కడ ఉన్నాడని గద్గద స్వరంతో అడిగాడు. అప్పుడక్కడ ఉన్న భటులు "రాజా! సర్వం నివేదిస్తాం! గుర్రం దిగి ఈ చెట్టు నీడన విశ్రమించండి!" అంటూన్న వాడిపోయిన ముఖాల వారి ముఖాల వంక చూసి, మనస్సులోనే కలవరపడ్డాడు. ఎందుకంటే - అతని వంటి ప్రాణమిత్రుడు దొరకడం దుర్లభం! అతడిని తీసుకెళ్లకుండా తండ్రి ముఖమెలా చూడటం? శుకనాశుని దగ్గరకు ఎలా వెళ్లడం? నీ మిత్రుడేడీ? అని అడిగితే ఏం చెప్పడం? - అనుకుంటూనే "ఇంతకూ అతడు క్షేమంగానే ఉన్నాడా? లేడా? అది చెప్పండి ముందు!" అని అడిగాడు.

"శివశివా! అలా అంటారేం? అతడు జీవించే ఉన్నాడు. ఇంకా నూరేళ్లు జీవించగలడు కూడా!" అని వాళ్లు చెప్పగా చంద్రాపీడునికి ఎంతో ఆనందం కలిగింది.

"వైశంపాయనుడు బ్రతికే ఉంటే, నా ఆజ్ఞ మీరి ఇంకో చోటుకు పోయేవాడు కాడు. ఏదేమైనా మీరు మంచి మాట చెప్పారు. సరే అతడిప్పుడెక్కడికి వెళ్లాడు? అతడ్ని విడిచి మీరు దేవనికి వచ్చారు? వేగముగా చెప్పండి" అని అతడు కోరగా వాళ్లిలా చెప్పసాగారు........

## వైశంపాయనుని కథ

"దేవా! వినండి! వైశంపాయనునితో కూడ కలిసి, మమ్మ్ములను రమ్మని చెప్పి మీరు వెళ్లిపోయారు కదా! ఆ రోజు మేము ప్రయాణ సాధనాలన్నీ సర్దుకుని, మర్నాడుదయం ప్రయాణభేరీ మోగించి, బయల్దేరే సన్నాహాల్లో ఉండగా - వైశంపాయనుడొచ్చి ఆపుతూ "ఈ ప్రాంతాల్లో 'అచ్ఛోదం' అనే పుణ్యమైన సరస్సు ఉంది. అందులో స్నానం చేసి, శివుని పూజించి రేపు వెళ్లవచ్చు! ఈ పుణ్యభూమికి మళ్లీ ఎప్పుడన్నా రాగలమోలేమో!.....అంటూనే

తాను కాలినడకనే ఆ సరస్సు వద్దకు వెళ్లిపోయాడు.

ఆ ప్రాంతమంతా రమణీయంగా ఉండడంతో, అక్కడి ప్రకృతి సోయగాలను చూస్తూ అక్కడక్కడే తిరుగుతూ ఉంటే, ఆ సరస్సున్న ప్రాంతంలో ఒక మణిశిలా మంటపం కన్పించింది. చిరకాలానికి కనిపించిన ఓ ఆత్మీయుణ్ణి చూసినట్లుగా, దాన్ని రెప్పవాల్చకుండా అత్యంత ప్రియంగా చూస్తూ అలాగే నిలబడిపోయాడు. నిర్వికారమైన మనస్సుతో ఏదో ధ్యానిస్తూ ముఖం క్రిందికి పెట్టుకుని, ఆ మంటపంలో కూర్చున్నాడు.

ఆ సౌందర్య వీక్షణ చేసి - చేసి అలా ఏదో ఆలోచిస్తున్నాడనుకుని మేము ఆ స్థితిలో ఉన్న వైశంపాయనుని చూసి కొంతసేపు అక్కడే సద్దుచేయక వేచి ఉన్నాం! కాని ఆయన ఎంతకూ అక్కడ్నుంచి కదలిరాడే! అప్పుడు మేమే వారి వద్దకు వెళ్లి "ఆర్యా! వేళ దాటిపోతోంది! స్నానం చెయ్యండి! సైనికులు సైతం మీ రాకకోసం ఎదురుచూస్తున్నారు. ఈ ప్రదేశపు రమణీయకత అట్లాంటిది. ఎంతసేపు చూసినా చూడాలనే అనిపిస్తుంది. ఇక ఆలస్యం కూడదు! పదండి వెళ్దాం" అన్నాడు.

అయినా ఆతడు కదల్లేదు. మాకు జవాబు చెప్పనూ లేదు. మేమే మళ్లీ మళ్లీ తొందరపెట్టడంతో, మా వైపు చూడకుండానే "నేను రాను! అతడు వెళ్లి చాలాసేపైంది. వేగంగా వెళ్లిపోండి! మీరంతా ఇక్కడ దేనికీ?" అన్నాడు.

అది వైరాగ్యమా! వైముఖ్యమా? అకారణ మోహమా? మాకేమీ అర్థం కాలేదు. బెదిరించి, బతిమాలి, నిష్ఠురాలాడి, "మీకే మోహం తగదు. మిమ్మల్ని వదిలివెళ్తే చంద్రాపీడుడు మమ్మల్ని దండిస్తాడు" అనీ చెప్పాము.

ఎట్టకేలకు అతడు అదోలా నవ్వుతూ "ఇప్పుడు నాకు ఏమీ తెలీడం లేదు. మీరు ఇలా నన్ను మాటి - మాటికీ రమ్మని ఎందుకు వేధిస్తున్నారో అర్థం కావడం లేదు. నేను చంద్రాపీడుని వదలి ఎన్నడయినా ఉన్నానా? నాకు అంతా తెలుస్తూంది. కాని నేను ఏమీ చెయ్యలేకపోతూన్నాను. ఇక్కడ స్థాపించబడిపోయినట్లుగా నా శరీరం కదలనని మొరాయిస్తోంది. కనుక నేను రావడానికి అశక్తుడ్ని. నన్నొకవేళ బలాత్కారంగా తీసుకు పోదామనుకుంటున్నారేమో! అదీ జరగదు. అలా చేస్తే నా ప్రాణాలు పోతాయి. మీరు వెళ్లి జీవితాంతం చంద్రాపీడుని ముఖదర్శనభాగ్యం

పొందుతూండండి! నాకు ఆ సౌఖ్యాన్ని దైవం లేకుండా చేశాడు" అన్నాడు.

మేము అదంతా నటన అనుకుని "చాలించండి మహానుభావా! అలా అంటారేం? చంద్రా పీడుని దగ్గరకు రారా?" అని చాలా సార్లు బ్రతిమలాడాం! "అయ్యయ్యో! చెపితే మీకు అర్థం కాదా? చంద్రాపీడునిపై ఒట్టు! నాకేం తెలీడం లేదు. నేను రావడానికి సమర్థుడిని కాను. కారణం తెలీదు. అంతా చూస్తూనే అడుగుతారేం? వెళ్లండి! వెళ్లండి" అని కొంచెంసేపు ఊరుకున్నాక – అక్కడ లతలూ – పొదలూ తదేకంగా చూసి, వాటి మధ్య తిరుగుతూ, ఆ ఆలయంలోనే ఏదో మర్చిపోయిన వాడిలా వెతుకుతూ, ఏ ఇతర దృష్టి లేక సంచరిస్తున్నాడు.

ఇదంతా మేం పొదల చాటునుంచి చూస్తూ రెండు ఝాములసేపు అట్లాగే గడిపాం! నిస్సందేహంగా ఆయన విరాగి అయిపోయాడు. ఎందుకంటే – మేం మళ్లీ వెళ్లి ఆయన్ని రమ్మన్నాం! అందుకు అతడు "అయ్యో! నన్ను ఈ రీతిన వేధించుకు తింటారేం? నాకు నా జీవితంకంటే కూడా చంద్రాపీడుని ప్రాణాలే ప్రియం కదా! ఇంకా ఎందుకు బ్రతిమాలుతారు? పొండి!" అంటూ స్నానం చేసి, కందమూలాలు తిని వనవాసం స్వీకరించాడు. మేము ఆశ్చర్యపోతూ, ఆయన చర్యలన్నీ కనిపెడుతూ అలా అక్కడే మూడు రోజులు గడిపాం! ఆయన వైఖరిలో మార్పు లేదు. అప్పుడు నిరాశ చెంది, కొందర్ని వారికి కాపుదలగా వుంచి మేం బయల్దేరి వస్తూంటే మిమ్మల్ని చూడడం తటస్థించింది" అని ముగించారు.

ఆ మాటలు చంద్రాపీడునికి బాధనూ – ఆశ్చర్యాన్నీ కూడా కలిగించాయి. "అయ్యో! వైశంపాయనుడికి ఇంతలోనే అంత వైరాగ్యం ఎలా వచ్చింది? అందుకు కారణం ఏమీ కనబడదు. నన్ను ఎలా చూస్తాడో తారాపీడుడు అతడ్ని అలాగే గౌరవిస్తాడు కదా! ప్రజలకు కూడా నా పట్ల ఉన్న అభిమానం కంటె, ఆయన పట్లనే మిక్కిలి ఇష్టం. శుకనాశుడు గాని – మనోరమ గాని అతడ్నీ ఏ విషయంలోనూ మందలించి ఎరుగరు. ప్రశాంతమైన వానప్రస్థాశ్రమం స్వీకరించాల్సిన సమయమూ ఇది కాదు. ఇంతవరకు గృహస్థాశ్రమమే స్వీకరించని వానికి – ఇదేం వింతవైరాగ్యమో!" అని

రకరకాలుగా ఆలోచిస్తూ, అతివేగంగా అక్కడికి వెళ్లాలనుకొని కూడా, తల్లిదండ్రులకు చెప్పకుండా అచ్ఛోదమునకు వెళ్లడానికి ఇష్టపడక, ఆ వెంటనే గుర్రం ఎక్కి త్వరగా పట్నానికి వచ్చాడు చంద్రాపీడుడు.

అయితే - అప్పటికే పట్టణంలోని ప్రజలు వైశంపాయనుని వృత్తాంతం చెప్పుకోసాగారు. "ఈ వార్త నా కంటే ముందుగానే పట్టణంలో ఎలా తెలిసిందో!? అంటే - ఈ సంగతి మా తండ్రి గారిక్కూడా తెలిసే ఉంటుంది కదా! వైశంపాయనుని గురించి ఊరి ప్రజలే ఇంత విచారిస్తుంటే, ఆతని తల్లి దండ్రులకెలా ఉంటుందో?! నన్ను ఏ విధంగా శంకిస్తారో?" అని అనుకొంటూనే 'నన్ను అపార్థం చేసుకోకుండా నేనే చర్య చేపట్టాలి?' అని ఆలోచించాడు.

పట్టణ ద్వారం దగ్గర గుర్రం దిగి, ఆస్థానానికి వెళ్తూంటే - తన తల్లిదండ్రులు శుకనాశుడి ఇంట ఉన్నట్లు చంద్రాపీడునికి తెల్సింది.

అతడు అక్కడికి వెళ్తూంటే, ఆ దగ్గర్లోంచి "హా! వైశంపాయనుడా! అయ్యో పుత్రా! నిన్ను వదలి నిముషమైనా ఉండలేని మేము, ఇది విని ఎలా తట్టుకోగలం అనుకున్నావురా తండ్రీ! చంద్రాపీడుని విడిచి క్షణమైనా ఉండేవాడివి కావు! అట్టి స్నేహమంతా ఏమైపోయింది. ఈ వైరాగ్య బుద్ధి నీకెలా అబ్బింది? " అంటూ దీనాలాపాలు వినవచ్చాయి. అవి మనోరమవే అని గ్రహించాడు చంద్రాపీడుడు. ఆమెను ఓదార్చుతూన్న తండ్రి దగ్గరకు వెళ్లడానికి సిగ్గుపడి, లోపలి కెళ్లినా చంద్రాపీడుడు నమస్కారంతో నిలబడ్డాడు.

"నాయనా! చంద్రాపీడా! నీకు వైశంపాయనుని మీదనే జీవితమ్మీద కంటే ప్రేమ అధికం అని నేనెరుగుదును. కాని, అతని వృత్తాంతం విన్నది మొదలు నీ మీద అనుమానం కలుగుతోంది" అనే సరికి, అక్కడేఉన్న మంత్రి శుకనాశుడు "చంద్రాపీడుడు అటువంటి వాడు కాడు! అతని సుగుణాలు తెలిసీ మిత్ర ఘాతకుడని ఎలా అంటారు ప్రభూ! తమరేనా ఈ మాటలంటున్నది? ఆలోచించబోతే దుర్గుణుడిగా వైశంపాయనుడే తోస్తున్నాడు నాకు. పుత్రులను కనేది దేనికి? వంశవృద్ధికే కదా! తండ్రి అనుమతినైనా తీసుకోక వైరాగ్యం ఎలా పూనాడు వైశంపాయనుడు? తాను దేవర వారిచేత ఎంతో వాత్సల్యంగా పెంచబడిన వాడనే విషయమైనా

గుర్తుకు రాకపోయిందా – ఆ క్షణంలో? వాడి జన్మ మన శోకానికి కారణ భూతమైనట్లుంది" అంటూ కన్నీరు పెట్టుకున్నాడు.

"ఆర్యా! ఊరడిల్లు! నీకు మేము బోధించేవాళ్లమా? ఎంత వివేకి అయినా, దుఃఖాతిశయంలో చిత్తచాంచల్యం చెందకుండా ఉండలేడు. వైశంపాయనుడి గురించి కోపంలో పలికిన మాటలు వినడానికి నాకు బాధగా ఉంది. అతనిపై ఆగ్రహం చెందకు. అతడు గుణవంతుడే! అకారణంగా దేనికి నిందిస్తావు? చంద్రాపీడుడినే అతడి దగ్గరకు స్వయంగా పంపిస్తాను. వెంటనే ఇక్కడికి రప్పిస్తాను. అటువంటి వైరాగ్యమేల కలిగెనో తెలుసుకుందాం! అప్పుడు ఏది న్యాయమైతే అది అవలంబిద్దాం!" అన్నాడు తారాపీడుడు.

దీనికి జవాబుగా "దేవా! వైశంపాయనుడిపై మక్కువతో నువ్వు అలా అంటున్నావు కాని, ఆ ఔదార్యానికి తగినవాడా నా పుత్రుడు?" అన్నాడు శుకనాశుడు.

ఇక తాను కలుగజేసుకోక తప్పదని, శుకనాశుని వద్దకు చేరి "ఆర్యా! వైశంపాయనుని విషయంలో నా దోషం ఏదీ లేదని నాకు తెలుసు! ఎవరెన్ని అనుకున్నా నా హృదయాన్ని నేను మోసం చేసుకోను గదా! నా హృదయం వేరెవ్వరో కాదు! వైశంపాయనుడే! అయినప్పటికీ నా పట్ల మా తండ్రిగారికే అనుమానం తోచిందంటే – ఇక లోకుల నోళ్లు చెప్పనక్కర్లేదు. ఆ లోకాపవాద భీతి నన్ను బాధిస్తుంది. దీనికి ప్రాయశ్చిత్తంగా వైశంపాయనుని తోడ్కొని తీసుకురావడానికి నన్ను నియోగించండి! మరో విధంగా నేనీ అపవాదును బాపుకోలేను. గుర్రం పై తక్షణం వెళ్లడానికి అనుమతిస్తే, నా ప్రియమిత్రుడితో తిరిగి రాగలను. అతడు రాకపోతే నేనూ అక్కడే ఉండిపోతాను" అన్నాడు చంద్రాపీడుడు.

"యువరాజు వెళ్లడానికి అనుమతి ఇవ్వరా?" అని అడిగాడు శుకనాశుడు. తారాపీడుడు, అందుకు జవాబుగా "కానివ్వండి! మనం ఒకటి తలిస్తే దేవుడు – ఇంకొకటి తలచాడు. యువరాజు వెళ్లి తప్పక వైశంపాయనుని తీసుకురావలసిందే! అతడ్ని విడిచి ఇతడు క్షణమైనా ఉండలేడు. అతడిని

తీసుకురావడానికి, నా కుమారుడినే కాదు......అవసరమైతే అతని తల్లి విలాసవతిని కూడా పంపుతాను" అని అప్పటికప్పుడు దైవజ్ఞుల్ని రప్పించి ప్రయాణానికి ముహూర్తం నిర్ణయించాడు.

చంద్రాపీడునితో "నువ్వీ వార్త, మీ తల్లితో కూడ చెప్పి తక్షణం బయల్దేరు" అని అనుజ్ఞ ఇచ్చి, శుకనాశుడితో తన భవనానికి వెళ్లిపోయాడు తారాపీడుడు.

చంద్రాపీడుడు తల్లిదగ్గరకు వెళ్లి, నమస్కరించి, ఆమెకు దగ్గరగా కూర్చున్నాడు. ఎంతో విచారంగా ఉన్న మనోరమతో "తల్లీ! చింతించకు! వైశంపాయనుని తీసుకురావడానికి తండ్రిగారు ఆజ్ఞ ఇచ్చారు. నేను వెంటనే వెళ్లి అతడ్ని తీసుకొస్తాను. నువ్వు అనుమతించాలి" అన్నాడు.

"వత్సా! నాకు వాడి మీద కంటే, నీ మీదనే అధికమైన అనురాగమున్నది. నువ్వు వెళ్లావంటే నేను ఎవర్ని చూసి ధైర్యంగా ఉండగలను? కనుక నీవు వెళ్లవద్దు! దైవానుగ్రహం ఉంటే వాడే తిరిగొస్తాడు. లేదా - ఇంకెవరి మీదా ఒకేలా సమానంగా పుత్రవాత్సల్యం ఉందని అందరూ ఎరిగినదే! వాడిని చూడక నేను మాత్రం ఆగగలనా? అందువల్ల వాడిని ఆపవద్దు! మనం ఆపినా కూడా చంద్రాపీడుడు ఆగేలా లేదు" అనడంతో మనోరమ కూడా ఒప్పుకోక తప్పింది కాదు.

అంతలో సాయంకాలం కావడంతో, చంద్రాపీడుడు ఆ రాత్రి భోజనం చేసి, శయ్యమీద పడుకొని రకరకాలుగా ఆలోచించసాగాడు.

'నేను ముందుగా అచ్ఛోదసరస్సుకు వెళ్లి, వెనకవైపునుండి వైశంపాయనుడి కంఠాన్ని పట్టుకుని ఇంకెక్కడికి వెళ్తావు? అని పట్టుక్కూర్చుంటే నా మాట తోసేయలేక వచ్చేస్తాడు కదా! ఆ తర్వాత మహాశ్వేతా శ్రమానికి వెళ్లి, అక్కడ్నుంచి ఆమెతో కూడ కలసి హేమకూటం వెళ్తాను. అక్కడ కాదంబరి సిగ్గుల మొగ్గ అయి తటాలున నన్ను చూసేలా సార్థకమైన చూపులు తనవేనని భావించేలాగ ఆమె కళ్లబడతాను. చిత్రరథునికి - మదనలేఖ, పత్రలేఖలను రాయబారులుగా పంపి వివాహప్రయత్నం చేయిస్తాను.

తరువాత, ఆమెను పెళ్లాడి, ఆమెతో మన్మథ సుఖాలనుభవించడానికి

రమ్యప్రదేశాలు వెతుక్కుంటాను. యవ్వనాన్ని సార్థకం చేసుకుంటాను. ఆ ప్రకారం కాదంబరికి సంతోషం కలగజేసి, మదనలేఖా వైశంపాయనులకు పెళ్లి చేస్తాను'......

ఇలా సాగుతున్నాయి. చంద్రాపీడుని ఆలోచనలు. ఆ రాత్రి ఏదోలా నిద్రరాకపోయినా గడిపి - ఉదయాన్నే లేచి, తగినంత పరివారం వెంటబెట్టుకుని అచ్ఛోదానికి ప్రయాణమయ్యాడతడు.

దారిలో మేఘనాథుడు కనబడగా "మేఘనాథా! అచ్ఛోదసరస్తీరంలో నీకు వైశంపాయనుడు కనబడ్డాడా? చూసి మాట్లాడావా? ఏమన్నాడు? ఇప్పటికైనా పశ్చాత్తాపం చెంది ఇంటికి రావాలనుకుంటున్నాడా? నా మాట ఏమైనా సందర్భంలో వచ్చిందా? అతనికి తల్లిదండ్రులు జ్ఞాపకం ఉన్నారా?" అని ప్రశ్నల వర్షం కురిపించాడు.

"దేవా! తాము వైశంపాయనునితో మాట్లాడి ఇట్టే వచ్చేస్తాను అని నాతో చెప్పారు కదా! మేము సరేనని మిమ్ము విడిచి వెళ్లి - మీరాక కోసం చూస్తుంటే, ఎంతకూ మీ రాకడ లేదు. అప్పుడు పత్రలేఖ, కేయూరకుడు మీరు పంపగా వచ్చినట్లు చెప్పి "చంద్రాపీడుని తల్లిదండ్రులు, వర్షాకాలం గనుక అతడ్ని రానిచ్చారు కాదు. నీవు ఒక్కడివీ ఇక్కడ ఉండడం దేనికి? ఇంటికి పో!" అని నాతో చెప్పి, వాళ్ళిద్దరూ హేమకూటానికి వెళ్లిపోయారు.

నేను మరికొన్ని రోజులు అక్కడుండి, తిరిగి ఇంటికి బయల్దేరుతూన్నాను. అంతేగాని, వైశంపాయనుని సంగతేమీ నాకు తెలీదు. అసలు అతడు అచ్ఛోదసరస్సుకు వెళ్లాడన్న విషయమైనా నాకు తెలీదు" అని చెప్పాడు.

"సరే! పోనిమ్ము! హేమకూటానికి పత్రలేఖ ఈ పాటికి చేరుతుందో - లేదో చెప్పగలవా?" అని అడిగాడు చంద్రాపీడుడు.

'ప్రభూ! దైవికమైన అంతరాయం ఏదీ ఏర్పడకుండా ఉన్నట్లయితే, ఆమె ఆలస్యం చేసేది మాత్రం కాదు. కనుక ఈ పాటికి ఆమె హేమకూటానికి చేరగలదనే నా విశ్వాసం" అని మేఘనాథుడు అనగా, అందుకు చంద్రాపీడుడు సంతోషించి, వానితో కలిసి వైశంపాయనుని చూడ్డానికి అచ్ఛోద సరస్సుకు వెళ్లి - అక్కడ గుర్రపు రౌతుల్తో "వైశంపాయనుడిక్కడ వైరాగ్య వృత్తి పూని, ఈ వనంలో ఎక్కడో అణిగిమణిగి వున్నాడట! మనల్ని

చూసి పారిపోతాడు. కాబట్టి మీరంతా గుర్రాలతో కూడి అన్ని పూలపొదలు, చెట్ల చాటులు, లతా మంటపాలు జాగ్రత్తగా వెతకండి!" అని ఆజ్ఞ ఇచ్చి, తాను కూడా అన్ని ప్రాంతాలూ గాలించాడు కాని, అతడ్ని కనుక్కోలేక పోయాడు.

దాంతో అతడు బాగా విచారించి, వైశంపాయనుని వార్త మహాశ్వేతకైనా తెలుసో ఏమో! వెళ్తే కాదంబరి విశేషాలు కూడా తెలుస్తాయి. అనుకుని, గుర్రపు రౌతుల్ని ఆ ఆశ్రమానికి కొద్ది దూరంలో ఉండమని, 'ఇంద్రాయుధ' మనే తన గుర్రం ఎక్కి మహాశ్వేత ఆశ్రమానికి వెళ్లి, గుహ ముందు దిగి, పలుచని వస్త్రాలు ధరించి లోపలకు వెళ్లాడు.

అక్కడకు చంద్రాపీడుడు వెళ్లేసరికి, పరిస్థితి ఇదీ; తరళికను కౌగలించుకుని మహాశ్వేత ఏకధారగా ఏడుస్తోంది. ఆ స్థితిలో ఉన్న ఆమెను చూస్తూ ఆశ్చర్యపోయి కాదంబరికి ఏదైనా జరగరానిది జరిగిందేమోనని భయపడుతూ, మెల్లగా దగ్గరకెళ్లి "తరళికా! ఈమె ఇలా ఉందేం?" అని అడిగాడు.

తరళిక ఏమీ చెప్పకుండా మహాశ్వేత ముఖంలోకి చూసింది. అప్పుడామె మెల్లగా శోకాన్ని అణచుకొని, గద్గద స్వరంతో "రాజకుమారా! సిగ్గులేని ఈ పాపాత్మురాలు ఏం చెప్పగలదు! అయినప్పటికీ ఈ దీనురాలి వాక్కు వినండి! కేయూరకుడి ద్వారా మీరు ఉజ్జయిని వెళ్లిన వార్త విని, మనస్సులో చింతించాను. మదిర - చిత్రరథుల కోరిక తీర్చలేకపోయాను. కాదంబరి కోరిక సఫలం చేయలేకపోయాను. రాజకుమారుని కోరికా తీరింది కాదు. నేను వచ్చి చేసిందేమిటి?" అని సిగ్గుపడుతూ కాదంబరితో స్నేహపాశాన్ని తెంపుకొని, మళ్లీ తపస్సు చేసుకోవడానికి ఈ ఆశ్రమానికి వచ్చాను. ఇక్కడ మిమ్మల్నే పోలివున్న ఒక బ్రాహ్మణకుమారుడు కనిపించాడు. అతడేదో వెదకుతూన్నట్లుగా శూన్యహృదయుడై ఉన్నాడు. అతడు మెల్లగా నన్ను చేరి, నన్నెప్పుడో ఎరిగి వున్న వాడిలా రెప్పవాల్చకుండా చూడసాగాడు.

లోకంలో తమ జన్మకూ - వయసుకూ రూపానికీ తగినట్లుగా ప్రవర్తిస్తే

నిందాపాత్రులు కారు. నువ్వు అట్లా చేయకుండా తగని ప్రయత్నాన్ని చేస్తున్నావేం? తపస్సుతో శరీరాన్ని కృశింపచేసుకుంటున్నావేం? ఇది నాకెంతో విచారాన్ని కలిగిస్తోంది. నీవు దారి చూపావని ఇంకో స్త్రీ గనుక ఇలాగే ఇంద్రియసుఖాలు నిరసించి వైరాగ్యం పూనినట్లయితే ఇక మన్మథ బాణాలు వ్యర్థమే! చంద్రోదయాలూ వృథాయే! వసంతకాలం, చల్లని పిల్లగాలులూ నిరర్థకమే! మనోహరమైన ఉద్యానభూములు సైతం వ్యర్థం!" అంటూ ఎన్నో చెప్పాడు.

పుండరీకుని కథ జరిగింది మొదలు, నేను ఉత్సాహం కోల్పోయి ఉన్నాను. కనుక – అతని మాటలు విని, "నువ్వెవరు? నీ పేరేమిటి? నీ వృత్తాంతం ఏమిటి? నాతో ఇలా మాట్లాడుతున్నావు దేనికి?" అనైనా నేను అడక్కుండానే అక్కడ్నుంచి లేచి సమీపంలో పూలు కోస్తున్న తరళికను చేరుకున్నాను.

"తరళికా! ఈ యువకుడెవరే? ఆకారం చూస్తే బ్రాహ్మణ కుమారుడనిపిస్తున్నాడు. నన్ను చూడగానే, వీడి మనసులో వెర్రిచేష్టలు పుడుతున్నట్లున్నాయి. నన్నంటి పెట్టుకు తిరగాలని చూస్తున్నాడేమో! ఇతడు మళ్లీ ఇక్కడకు రాకుండా చెయ్యి! వద్దన్నా మళ్లీ వచ్చాడంటే తగిన రీతిన దండన పొందగలడు" అన్నాను. అది కూడా అతడితో అదే చెప్పింది. కాని మన్మథ బాధతో దహించబడుతున్న అతని మనస్సు మరల్లేదు.

కొన్నాళ్లు గడిచాయి. ఒకనాటి రాత్రి లోకమంతా వెన్నెల చల్లదనంతో నిండి వుంది. నేను ఇదిగో! ఈ శిలాతలం మీదనే పడుకొని ఆ చల్లని వాతావరణంలో సైతం నిద్రరాక, పుండరీకుని వృత్తాంతమే తలపోస్తూ చంద్రబింబం వంక చూస్తున్నాను.

అప్పుడా బ్రాహ్మణ కుమారుడు మదనావేశంతో మెల్లగా అడుగులు వేస్తూ నా దగ్గరకు వచ్చాడు. నిస్పృహరాలినైనా అతడ్ని చూసినంతనే ఎంతో భయపడుతూ "అయ్యయ్యో! ఆపద తటస్థించిందే! వీడు నన్ను గాని తాకితే, ప్రాణాలు విడవాల్సిందే కదా! పుండరీకుని రాక కోసం ఇన్ని రోజులు నిరీక్షించి ప్రాణాలు నిలుపుకున్నదాన్ని! అదంతా వృథా అయిపోవలసిందేనా?" అని ఆలోచిస్తుంటే, అతడు నా దగ్గరగా వచ్చి "ఇందుముఖీ! చంద్రుడిప్పుడు మన్మథునితో కూడి నన్ను చంపడానికి ప్రయత్నిస్తున్నాడు. కనుక నిన్ను

శరణు వేడుతున్నాను. రక్షించు! నన్నీ మదనుడి బారినుండి కాపాడు! శరణాగతుల్ని రక్షించడం తాపసుల ధర్మం కదా! నువ్వు నన్ను ఇప్పుడు రక్షించకపోతే నీకు బ్రహ్మహత్యాపాతకం చుట్టుకోగలదు" అన్నాడు.

అప్పుడు నాకు తారాస్థాయిలో కోపం వచ్చింది. చూపులతోనే భస్మం చేసేదానిలా చూస్తూ, ఆ కోపంలో నన్ను నేనే మరిచి "ఓరీ దురాత్మా! నన్ను ఇలా అనడానికి నీకు నోరెలా వచ్చింది? పిడుగుపడ్డట్లు నీ తల వందముక్కలు కాదేం? నువ్వింకా ఎలా బతికున్నావు? మూఢుడా? ఇటువంటి కామప్రవృత్తి పశువులకే తప్ప మనుషులకుండదు. నువ్వీ మానుషజాతిలో ఎలా జన్మించావు? సమయమూ - సందర్భమూ లేకుండా, విధి చేత పలికించబడిన చిలకలా పలుకుతున్నావు. చిలుకగా అయినా పుట్టకపోయావేం? అలా జరిగి వున్నా నువ్వు నన్ను కామించే వాడివి కాదు గదా!" అంటూ చంద్రమండలం వైపు చూసి "దేవా! లోకపాలకా! నేను పుండరీకుని చూసినది మొదలు, ఏ ఇతర దృష్టి లేనిదాన్ని అయితే, నా పంచప్రాణాలూ అతని మీదనే నిల్పుకున్నదాన్ని అయితే - "వీడు నా శాపం తగిలి, హీన జాతి యందు జన్మించుగాక!" అన్నాను.

కారణం తెలీదు గాని..........పాప వినాశం వల్లనో, నా శాపం వల్లనో, మదన తాపం వల్లనో మొదలు నరికిన చెట్టులా నేల కూలాడు అతడు. అతడు అలా ప్రాణాలు పోగొట్టుకోవడంతో అతని పరిజనం పెద్ద పెట్టున రోదించడం ప్రారంభించారు. ఆ ఆక్రందనల వల్లనే అతడు మీ మిత్రుడని తెలిసింది......" అని మహాశ్వేత తలవంచుకొని ఏడ్వసాగింది.

ఆ మాటలకు చంద్రాపీడుడు కళ్లు మూసుకొని "భగవతీ! కాదంబరితో నన్ను కూర్చడానికి నువ్వు చాలా శ్రమించావు. కాని, అదృష్టహీనుడినైన నాకు అలాంటి యోగ్యత లేనప్పుడు నువ్వు మాత్రం ఏం చెయ్యగలవు? వచ్చేజన్మలో అయినా కాదంబరి నాకు లభించేలా అనుగ్రహించు!" అంటూనే హృదయం బ్రద్దలై నిలబడే ప్రాణాలు వదిలాడతడు.

స్నేహితుడి మరణ వార్త వినడంతో హృదయం పగిలి మరణించిన

చంద్రాపీడుని చూసింది తరళిక. మహాశ్వేతను వదలి, అతడ్ని పట్టుకొని "ఇతడు ప్రాణాలు విడిచాడని తోస్తోంది సఖీ! ఇంకా సిగ్గేమిటి? ఇటు రా! అయ్యయ్యో! ఇతని శిరస్సు ప్రక్కకు వ్రేలాడిపోతూన్నదే! శ్వాస ఆడడం లేదు. హా చంద్రాపీడా! కాదంబరీ మనోమన్మధా! ఈమెను వదలి ఎక్కడికిపోయావు? ఆ ప్రేమంతా ఏమైపోయింది?" అంటూ ఏడుస్తూంటే, మహాశ్వేత కూడా దగ్గర కొచ్చి చూసింది. చంద్రాపీడుని ముఖం వివర్ణం కావడం గమనించి, తాను కూడా గాఢమయిన శోకంతో చేష్టలుడిగి స్పృహ తప్పింది.

అప్పుడతని పరిజనం అది తెలుసుకొని, మహాశ్వేతను నిందిస్తూ గట్టిగా "హా రాజకుమారా! అయ్యో వైశంపాయనా! హా తారాపీడా! హా శుకనాశా! హా విలాసవతీ! అయ్యో మనోరమా! మీకు ఎలాంటి ఆపద సంభవించింది? ప్రజలెంత భాగ్యహీనులో కదా! కటకటా! ధరణి అనాధ అయింది కదా!" అంటూ రకరకాలుగా విలపించారు. చంద్రాపీడుని గుర్రం కూడా దీనంగా సకిలిస్తూ, మాటి మాటికీ అతని ముఖాన్నే చూస్తూ, విచారసూచకంగా చిందులు త్రొక్కుతూంటే, దాని కాళ్ల తాకిడికి ఇసుక రేణువులు ఎగరసాగాయి.

అని చెప్పేవరకు, వేళ అతిక్రమించడంతో, మణిసిద్ధుడు పై మజిలీ చేరి, తరువాత వృత్తాంతాన్ని ఇలా చెప్పసాగాడు.



# కాశీ మజిలీ కథలు

## మహాశ్వేత

### (ప్రతీ సమాగమం)

గోపా! విను........

హేమకూటంలో – పత్రలేఖ వల్ల చంద్రాపీడుని ఆగమనవార్తను తెలుసుకున్న కాదంబరి ఎంతో ఆనందించింది. తల్లిదండ్రులకు ఏదో సాకు చెప్పి, అందంగా అలంకరించుకుని, పరిచారికలు సుగంధద్రవ్యాలతో వెంటరాగా – కేయూరకుడు దారి చూపుతుండగా – పత్రలేఖ చేయి పట్టుకుని నడుస్తూ 'మదనలేఖా! ఈ పత్రలేఖ అంటూన్న మాటలు వింటున్నావా! చంద్రాపీడుని విషయంలో నేను అశ్రద్ధ చేశానట! నా అవస్థ అంతా చూసి కూడా, ఆ శీతల గృహంలో – నైపుణ్యంగా ఆనాడతడన్న వక్రభాషణలు నీకు జ్ఞాపకం ఉన్నాయి కదా! నువ్వూ అతనికి తగినట్లుగా జవాబిచ్చావు. అటువంటి చంద్రాపీడుడు – చూడు! నన్నెలా విమర్శించాడో!?

పోనీ! తానే ప్రయాణం ఆపుకోవచ్చుగా! తన కోసం నేను అలమటించిపోతున్నానుకుంటున్నాడేమో! నాకు మాత్రమే అంత ఆతృత ఉందనుకుంటున్నాడేమో! ప్రియురాలి హృదయాన్ని గ్రహించలేని, అతనితో నేను మాట్లాడనే మాట్లాడను. ఆఁ! అంతే! పాదాల మీద పడినా అనుగ్రహించను! ఇంకేం నేను వినను మదనలేఖా! చాలా చిక్కులు పెట్టాక........అప్పుడు పలుకుతాను'' అంటూ తానెలా అలుక వహించదల్చుకున్నదీ చెపుతూనే, చంద్రాపీడుని చూడటానికి ఓ పక్క తొందర పడుతూనే మహాశ్వేత ఆశ్రమానికి వడివడిగా అడుగులేస్తూ నడిచింది.

వచ్చేసరికి - ఏముంది? శోక వాతావరణం తప్ప........

విగతజీవుడై పడి ఉన్న చంద్రాపీడుని చూసి, కాదంబరి "అయ్యో! ఇదేమి విపరీతం?" అంటూ స్పృహతప్పి కూలబడిపోతూండగా, ఆమె పడిపోకుండా తటాలున మదనలేఖ పట్టుకొన్నదామెను. ఇక పత్రలేఖ సంగతి సరే సరి! కాదంబరి చెయ్యి వదిలేసి, ఆక్రోశిస్తూ వొళ్లు తెలీక నేలకొరిగిపోయింది.

కొంతసేపటికి, కాదంబరి తెప్పరిల్లి, ఏమీ అర్థంకాక ఊపిరితీసుకోవడం కూడా మరిచిపోయి, రెప్పవాల్చకుండా నిశ్చలమైన దృష్టితో అతని ముఖమే చూస్తూ చిత్తరువులాగ - ఒక ప్రతిమలాగ కదలకుండా అలాగే నిలిచి ఉండడం చూసి, మదనలేఖ ఆమె పాదాల మీద పడి "సఖీ! శోకం విడువు! నీ హృదయం ఇంత విచారాన్ని భరించలేక బ్రద్దలయిపోగలదు సుమా! ఇతడు చైతన్యం కోల్పోయి పరలోకాని కేగినట్లు కనిపిస్తోంది. ఇంక ఇతని గురించి చింతించడం ఎందుకు? ఇంటికిపోయి తల్లిదండ్రులకు ఆనందం కలుగజెయ్యి! నిన్ను చూడకుండా వారు నిముషమైనా ఉండలేరు" అంది.

ఆ మాటలకు కాదంబరి నిర్లిప్తంగా మందహాసం చేసింది.

"అయ్యో! పిచ్చిదానిలా ఉన్నావే! బద్దలైపోయేంత సుకుమారంగా ఉందా నా హృదయం? వజ్రం కంటే కఠినమైనదిగా లేదూ? మృదువుగానే ఉంటే - పగిలిపోయేదే కదా, ఈసరికే! నేను కనీసం దుఃఖించనైనా దుఃఖించడం లేదు. ఎందుకంటే నేను ఏడిస్తే ఇతనికి అమంగళం అవుతుంది. అయినా, స్వర్గం చేరుకున్న వారి గురించి ఏడవడం ఏమి? నేనూ, ఈ మహానుభావుని పాదాలనుసరించి పోతాను. ఎవరినీ లెక్కచెయ్యక, మహాశ్వేత గురించి చేసిన శపథాన్ని సైతం వదలిపెట్టి ఎవరికోసం ప్రయత్నించానో అతడే నా నిమిత్తం ప్రాణాలు విడిచాక, నేను ఇంకెలా జీవించను? ఏ ఆశతో జీవించమంటావు? నాపై నీకు ఏమన్నా దయ ఉంటే - నేను ఏది చెప్పన్నానో అది చెయ్యడానికి ప్రయత్నించు!

**గీ. శూన్యమగు నాదు భవనంబు జూచి చూచి**
**సఖులు పరిచరులును బంధుజనము లెట్లు**
**వగవక అట వేడ్కఁ బూర్వంబు వలె మెలంగు**
**దురొ యటులు సేయు మిదియ నా కరయ హితము.**

క. నా దగు భవనాంగణమున
బోది వెలయనొప్పు చూత పోతకమునకుం
బ్రైఁ దనరు మాధవీలత
కాదరమునఁ బెండ్లి సేయు మనుకొనిన గతిన్.

సీ. పడ కటింటను దలప్రక్కఁ గట్టిన కామ
పటము వ్రక్కలు చేసి పారవేయు
యువిద! ముద్దుగ బెంచుచున్న నా లేడి పి
ల్లను విడు మొక తపోవనము నందు
గలికి! నా క్రీడానగము నా(శమము గాగ
నర్పించు మొక్క మహా తపస్వి
కలవేణి! శుక శారికల స్వేచ్ఛ విహరింప
ఇడువుము నా మేని తోడవు లెల్ల

గీ. విప్రకాంతల కిమ్ము నా వీణ నీవు
పుచ్చుకొని పాడుకొను చుందు మిచ్చ వచ్చి
నట్లు చేయుము తక్కిన యన్ని వస్తు
వును నాకుఁ బ్రియంబుగా జెలియ నీవు.

ఇంకా.....

క. ఆ వని మానుషి తాపసిఁ
బో విడువుము కాన కేను బోషించెడు
జీవం జీవక మిధునము
గావంగాఁ దగును కేళికా శైలమునన్!

( నేను లేని నా భవనం చూసినా, నా వాళ్లు విచారించకుండా మునుపటిలా ఉంటేనే నాకు ఇష్టం! మామిడిచెట్టుకీ మాధవీలతకూ వివాహం చేయి, పడకటింట్లో తలవైపున వేలాడదీసిన కామపటాన్ని ముక్కలు – ముక్కలుగా చేసెయ్యి! నేను ముద్దుగా పెంచిన లేడి పిల్లలను తపోవనంలో వదిలిపెట్టు! నా క్రీడా పవర్వతాన్ని ఒక మహాతపస్వికి ఆశ్రమంగా సమర్పించు! చిలుకలను స్వేచ్ఛగా విడిచిపెట్టు! నా అలంకారాలను బ్రాహ్మణ వనితలకు

ఇచ్చేయ్! నా వీణ నువ్వు స్వంతం చేసుకొని పాడుకో! మిగిలిన వస్తువులను నీ ఇష్టం వచ్చినట్లుగా చేసుకోవచ్చు!)

అంతేకాదు! నాతోపాటు నా వెంట వెంట తిరిగే హంసను ఏ ఒక్కరి వల్ల అపాయం కలగకుండా రక్షించు! ప్రాణసఖీ! నువ్వే నాకు పుత్రుని వలె జలాలు విడువు - పరలోకగతురాలినైనందువల్ల - నేనీ చంద్రాపీడుని కంఠాన్ని కౌగలించుకుని ప్రాణాలు విడుస్తాను" అని పలుకుతూ, ఆ ప్రాంతంలో నిశ్చేష్ఠురాలైపడివున్న మహాశ్వేతను చూసి కౌగలించుకుని ఇంకా ఇలా అంది.......

"ప్రియసఖీ! నువ్వూ - నీ ప్రియుడూ మళ్లీ వస్తాడని ఎన్నెన్నో శ్రమదమాలకు ఓర్చి ప్రాణాలు నిలుపుకొని ఆశతో ఉన్నావు. నాకు అట్టి ఆశ కూడా లేదు కదా! కనుక నేను మరణించడానికి అనుజ్ఞ ఇవ్వు! జన్మాంతరంలోనైనా నీ స్నేహం నాకు కలిగేలా ఉండాలని కోరుకుంటున్నాను. నా తప్పులు మన్నించు!" అని పలుకుతూ లేచింది. వనపుష్పాలతో అతనికి పాదపూజ చేసిన కాదంబరి, చంద్రాపీడుని తలను మృదువుగా తన హస్తాలతో తొడ మీద పెట్టుకొని కూర్చుంది.

ఆమె హస్త స్పర్శవల్ల, చంద్రాపీడుని దేహం నుంచి అద్భుతమైన తేజస్సు ఒకటి బయలుదేరి, ఆ ప్రాంతమంతా శీతలమయం చేస్తూ అంతరిక్షంలో కలిసి అశరీరంగా ఇలా పలికింది.......

"కాదంబరీ! నువ్వు చింతించవద్దు! చంద్రాపీడుడు శాపకారణంగా ప్రాణాలు పోగొట్టుకున్నాడు. అతడి శరీరాన్ని నువ్వు విడవకుండా కాపాడుతూ ఉండు! శాపాంతం జరిగినపుడు తిరిగి జీవిస్తాడు. కనుక ఈ శరీరానికి అగ్ని సంస్కారం చేయొద్దు! నీ చేతి స్పర్శవల్ల ఈ తేజస్సు తప్పకుండా ఇలానే నిలిచి ఉంటుంది" అని వినిపించేసరికి, అందరూ రెప్పలు వాల్చక ఆకాశంవైపు తల ఎత్తి చూడసాగారు.

ఆ తుషార శీతలానికి, తేజస్సుకు పత్రలేఖ కూడా తెప్పరిల్లి లేచి, ఏదో ఆవేశించిన దానిలా పరుగులు తీసి, 'ఇంద్రాయుధం' అనే గుర్రం కళ్లెం పట్టుకుని లాక్కుపోతూ 'చంద్రాపీడుడే లేకపోయాక - ఇక నువ్వూ - నేనూ దేనికే? అంటూ దాంతో కూడ ఆ సరస్సులో దూకింది.

ఆ వెంటనే – అందులోంచి మునికుమారుడొకడు బైటికి వచ్చి, దూరంగా వుండి చూస్తున్న మహాశ్వేత దగ్గరకెళ్లి శోకగద్గదస్వర ముట్టిపడుతూండగా "గంధర్వరాజపుత్రీ! నన్ను ఎరుగుదువా?" అని అడిగాడు.

అప్పుడామె ఆనందం – శోకం మధ్య ఊగిసలాడుతూ, గబగబాలేచి, అతనికి నమస్కరిస్తూ "దేవా! కపింజలా! పాపాత్మురాలైన నేను ఇట్లా సిగ్గులేక పుండరీకుడు స్వర్గగతుడైనా జీవిస్తున్నాను. అతడెక్కడికి పోయాడు? ఎందున ఉన్నాడు? నీవు ఆయన్ని చూశావా? అతడ్ని విడిచి నువ్వొక్కడివే వచ్చావేం?" అని అడిగింది.

అప్పుడు చంద్రాపీడుని పరిజనులు అతన్ని చుట్టుముట్టి వింతగా చూడసాగారు. ఆమెతో కపింజలుడు ఇలా అన్నాడు.......

## కపింజలుని కథ

గంధర్వరాజపుత్రీ! విను!

"నువ్వు అలా శోక సంద్రంలో మునిగి ఉండగా గగన వాణిని అనుసరించి నేను ఎగిరాను కదా! అతడు నాకు జవాబు చెప్పకుండానే ఆకాశమార్గాన వెళ్లి వెళ్లి క్రమంగా చంద్రలోకం చేరి, అక్కడ 'మహోశయం' అనే పేరు గల సభలో ఉన్న మంచం మీద పుండరీకుని శరీరాన్ని పడేసి "కపింజలా! నేను ఎవరో తెలుసా? చంద్రుడిని! నేను లోకోపకారం నిమిత్తం ఉదయించి ప్రకాశిస్తూన్నవాడ్ని! అయితే – నీ ప్రియమిత్రుడు పుండరీకుడు కామాపరాధం వల్ల దేహాన్ని వదుల్తూ నన్ను చూసి 'హంతకా! నీ వల్లనే కదా నేను ప్రియసంగమ సుఖం అనుభవించకుండానే ప్రాణాలు వదుల్తున్నాను. కనుక – నువ్వు కూడా ఇలాగే కర్మభూమి అయిన భారత దేశంలో జన్మించు! జన్మ – జన్మలకు అనురాగం కలిగి ఉంటూ ప్రియసమాగమ సుఖం అనుభవించక తీవ్రమైన విరహవేదనను అనుభవించి మరణిస్తూండు!' అని శపించాడు.

అప్పుడు......నేను 'అయ్యో! అపరాధం ఏమీ లేకుండానే, నన్నిలా శపించావేం? అని కోపంతో 'నాలాంటి కష్టాలే నువ్వూ అనుభవించెదవు గాక!' అని తిరిగి శపించాను.

కాని, అంతలోనే కోపం అణచుకొని, వివేకం తెచ్చుకుంటూ, మహాశ్వేత నా కిరణాల వల్ల పుట్టిన అప్సరసల కులంలో పుట్టిన గౌరికి జన్మించింది కదా! అందువల్ల నాకు ఆమె ఆప్తురాలు! అట్టి మహాశ్వేత వరించిన ఈ మునికుమారుడు సైతం నాకు బంధువవుతాడు. అది మరచి ఆవేశం కొద్దీ నేనూ ఆగ్రహించానే! నిష్కారణంగానే శపించానే! కానియ్!......జన్మజన్మకూ అన్న పదాన్ని సవరిద్దాం! రెండు జన్మలు చాలు! నాతో కూడా ఇతడు మానుషలోకంలో రెండు జన్మలు ఎత్తుతాడు' అని తలుచుకుని ఇలా అన్నాను.

పూర్వం అతని శరీరం గ్రహించి, అశరీరవాణి చేత మహాశ్వేత నూరడించి ఇక్కడికొచ్చాను. ఇది పుండరీకుని శరీరం. శాపాంతం వరకూ ఇక్కడే ఉంటుంది. నువ్వు పోయి శ్వేతకేతుడికి ఈ వృత్తాంతమంతా చెప్పు! ఆ మహానుభావుడు ఏదైనా ప్రతిక్రియ చేయగలుగుతాడు" అని చెప్పి నన్ను వదిలాడు.

అప్పుడు నేను ఆతృతలోను - మిత్రశోకంతోను ఆకాశమార్గాన పరుగులెత్తుతూ చూడకనే, ఒక వైమానికుని దాటాను.

అందుకతడు కోపించి, నన్ను చురచురా చూస్తూ "దురాత్మా! మిధ్యాతపోబల గర్వితుడా! ఇరుకుగా లేక ఎంతో విశాలమై ఉన్న ఆకాశంలో కూడా నన్ను గుర్రంలా దాటావు. నీకు ఇలా నా పై నుంచి దాటి వెళ్లడం కంటే చోటే దొరకలేదా? నీకు అలా దాటి వెళ్తూండడం సరదాగా ఉంది కాబోలు! కానియ్! నువ్వూ గుర్రానివై భూలోకంలో జన్మించెదవు గాక!" అని శపించాడు.

నేను కన్నీళ్లు ఉబికిరాగా, ఆయనకు నమస్కరించి "దేవా! నేను మిత్ర శోకంతో వేరే దిక్కూ - దారీ చూసుకోకనే పరుగులిడుతూన్నందున పొరపాటు వల్ల నిన్ను దాటాను. అంతేగాని తిరస్కారంతో మాత్రం కాదు. దయతలచి శాపాన్ని ఉపసంహరించండి" అంటూ వేడుకున్నాడు.

అతడు "ఆర్యా! నా శాపం మరలించనలవి కానిది. నువ్వు గుర్రం జన్మ ఎత్తక తప్పదు. అయితే నువ్వు గుర్రంగా ఎవర్ని మోస్తావో అతని మరణంతో - నువ్వు స్నానం చేస్తే చాలు! విముక్తుడివి కాగలవు! ఇదొక్కటే నేను నీకు చేయగలిగిన ఉపకారం" అన్నాడు.

"దేవా! అలా అయితే నా మనవి వినండి! శాపకారణంగానే, నా మిత్రుడు ఇప్పుడు చంద్రుడితో కూడ భూమి మీద పుట్టవలసి ఉంది. కనుక తాము దివ్యదృష్టితో చూసి – అశ్వజన్మలో కూడా ఆతనితో కలిసి కాలం గడిపేటట్లుగా చూడండి! ఇదే నా కోరిక" అన్నాను. అతడు కొంచెం ఆలోచించి "భూలోకంలోని ఉజ్జయినీ నగరంలో సంతానం కోసం తపస్సు చేస్తున్న తారాపీడునికి చంద్రాపీడుడనే పుత్రుడిగా చంద్రుడు జన్మిస్తాడు. నీ మిత్రుడు పుండరీకుడు కూడా తారాపీడుని మంత్రి అయిన శుకనాశుడికి పుత్రునిగా జన్మిస్తాడు. కనుక – నువ్వు ఆ రాజపుత్రునికి అశ్వంగా అవతరించు! అతడు నిన్నే వాహనంగా చేసుకొనేలా అనుగ్రహిస్తున్నాను. నీ మీద ప్రేమ కొద్దీ ఇంతగా ఆలోచించాను! ఇక పొమ్ము!" అనగానే, నేను కిందికి చూసి సముద్రంలో పడి గుర్రంగా జన్మించాను. ఆ జన్మలో కూడా నాకు జాతి స్మృతి ఉంది. పూర్వజన్మ జ్ఞానం నశించలేదు. కనుకను అశ్వముఖ మిధునం కనబడ్డంతోనే వెంటబడి ఈ భూమికి తీసుకొచ్చాను. చంద్రాపీడుడు చంద్రుని అవతారం. గతజన్మలోని అనురాగం వల్ల నిన్ను అభిలషించాడు. నీ శాపాగ్నికి దగ్ధుడైన వైశంపాయనుడే ఆ పుండరీకుడు" అని పూర్వజన్మగాధలు త్రవ్వి ముగించాడు. కపింజలా ముఖనిర్గతమైన ఈ వృత్తాంతమంతా విన్న మహాశ్వేతతోపాటు అందరూ ఆశ్చర్యపోయారు.

అతడు చెప్పిందంతా విన్న మహాశ్వేత "హా దేవా! హా పుండరీకుడా! నువ్వు మరో లోకం పోయినా, నిన్నే స్మరించుకుంటూ వున్నాన్నేను. ఈ రాక్షసితో నీకేం ప్రయోజనం ఉంది? నేను వినాశనం కోసమే జన్మించాను కాబోలు! నేను లేకపోతే, ఈ ఆపదే రాకపోను! ఇప్పుడు నేనేం చేసేది? ఎవరితో చెప్పుకునేది. ఈ ఆపదే రాకపోను! ఇప్పుడు నేనేం చేసేది?ఎవరితో చెప్పుకునేది? నన్ను రక్షించేదెవరు?" అని ఎన్నో విధాల విలపిస్తూ – తలబాదుకుని దుఃఖిస్తూ నేలమీద పడిపోవడం చూసి కపింజలుడు "గంధర్వరాజపుత్రీ! నువ్విలా నిన్ను నువ్వే నిందించుకుంటావేం? నీలో తప్పేముంది? ఇంకా దుఃఖించవలసిన అవసరం ఏముంది? మీ ఇద్దరూ శాపాంతంలో భర్తలను కలుసుకుంటారు. అశరీరవాణిని మీరు విన్నారు

కదా! అంతవరకూ తపస్సును ఆచరించండి! అందువల్ల అన్ని కార్యాలూ చక్కబడతాయి! చింతించకండి!" అని ఓదార్చాడు. ఆ మాటలకు వారు కొంతదూరం ఊరడిల్లారు.

కాదంబరి, కపింజలుడిని ఇలా అడిగింది.........."మహాత్మా! పత్రలేఖ నిన్ను తీసుకుని గదా సరస్సులోకి దూకింది. ఆమె ఏమైనట్లు - మరి?" అని అడిగింది.

"దేవీ! నీటిలో పడ్డాక ఏం జరిగిందన్నది నాకు తెలీదు. నేనిప్పుడు త్రికాలవేది. అయిన శ్వేతకేతుని వద్దకు వెళ్ళి చంద్రాపీడుని ఆత్మ ఎక్కడుందో, పుండరీకుని మలిజన్మ అయిన వైశంపాయనుడేమయ్యాడో, పత్రలేఖ ఎక్కడికి పోయిందో అడిగి తెలుసుకొని వస్తాను" అంటూనే ఆకాశమార్గంలో ఎగిరిపోయాడు.

అతడలా వెళ్ళాక కాదంబరి, మహాశ్వేతను చూస్తూ "ప్రియసఖీ! మన ఇద్దరికీ సమానంగా శోకం కలుగచేసిన భగవంతుడు నన్ను ఇప్పుడు ఇంకా బతికి ఉండేలా చేశాడు. నువ్వు నాకు ప్రియసఖివి! నెచ్చెలివి! నువ్వు ఇప్పుడు నాకు ఉపదేశించదగి ఉన్నావు. నేనిపుడేం చెయ్యాలి. నువ్వు ఆలోచించి కర్తవ్యం ఉపదేశించు!" అంది.

"ఈ విషయంలో చెప్పడానికీ, వినడానికీ ఏముంది సఖీ! కపింజలుడు పుండరీకుని వృత్తాంతం స్పష్టం చేశాడు కదా! నువ్వు మాత్రం ఏం చేస్తావు? చంద్రాపీడుని శరీరాన్ని నీ తొడపైన ఉంచుకొని, విడవక వినాశనం చెందనివ్వక అర్చిస్తూ ఉండు! కర్రచేతనో, రాళ్ళ చేతనో నిర్మించబడిన ప్రతిమలను - అదృశ్యదేవతలను సేవించడం కంటే, ప్రత్యక్షదైవమైన, ఈ చంద్రాపీడుని దేహాన్ని అర్చించడం మేలు! కనుక అలా చెయ్యి! ఎప్పటికైనా ఏ దేవుడికైనా అనుగ్రహం కలగకపోతుందా?" అన్నదా మహాశ్వేత.

కాదంబరి లేచి, తరళికా - మదనలేఖల సహాయంతో చంద్రాపీడుని దేహాన్ని సాయం పట్టి మెల్లగా ఒక శిలాఫలకం మీదకు చేర్చి - అక్కడ ఎండ, వాన, చలి, తదితర దోషాలు సోకకుండా జాగ్రత్తపరచింది.

శృంగారోచితమైన వేషాన్ని విసర్జించింది. పరిశుద్ధమైనట్టి ఒక తెల్లని వస్త్రాన్ని ధరించింది. మాటి మాటికీ దుఃఖితురాలౌతూనే ; మన్మధ సేవ

నిమిత్తం తెచ్చిన పూలు, గంధం, అంగరాగం మొదలైన అర్చనాద్రవ్యాలతోనే చంద్రాపీడుని ఆరాధిస్తూ నియమాలు పాటిస్తూన్నది. మూర్తీభవించిన శోకదేవతాకృతి అయి - మరణం కంటే క్లిష్టతరమైన వేదనావస్థ అనుభవిస్తున్నది. ఆహారమైనా ముట్టక, అతని పాదాలు తన తొడపైన ఉంచుకొని ఎట్లెట్లో ఒక పగలూ - రేయీ గడిపింది.

మరునాడు ఉదయం........

చంద్రాపీడుని శరీరం నూతన తేజంతో వెలుగొందుతూండటం గమనించింది కాదంబరి.

అది చూసి ఆశ్చర్యపోతూ, మదనలేఖతో "ఇతడి దేహం ఎంత వింతగా కాంతిని ప్రసరిస్తున్నదో చూశావా! ప్రేమ వల్లనే నాకు అలా అనిపిస్తోందా? నీకూ అటువంటి కాంతి కనిపిస్తోందా? ముఖప్రీతి మాట్లాడక నిజంగా చెప్పు!" అని అడిగింది.

"ఇందులో ముఖప్రీతి మాటలాడవలసిన పని ఏముందీ? పరీక్షించి చెప్పాల్సిన స్థితీ ఏమీ లేదు. నిజంగా ఉన్నదున్నట్లుగానే చెపుతున్నాను. చైతన్యం ఒక్కటే తక్కువ. కాని యథాతథంగా ఉన్నాడు. దీని వల్ల కపింజలుడు చెప్పిన మాట యదార్థమని స్పష్టం అవుతోంది. లేకపోతే మృతి చెందినవాడు....అందునా మానవుడన్నవాడు ఇలా ఉండడం ఎక్కడన్నా - ఎప్పుడన్నా చూశామా? ఇది శాపదోషమే తప్ప వేరేమీ కాదు!" అని ఊరడించింది మదనలేఖ.

కాదంబరి ప్రతిరోజూ మూడుపూటలా (త్రిసంధ్యలలోను) ఆ చంద్రాపీడుని శరీరాన్ని, దేవతావిగ్రహం అర్చిస్తూన్నట్లుగా పూజచేస్తూ శాపం తీరే కాలం కోసం ఎదురుచూడసాగింది.

కొన్ని రోజులకు - చారుల వల్ల ఆ వృత్తాంతం అంతా తారాపీడునికి చేరింది. విషయం విన్న వెంటనే అతడు ఎంతో ఆరాటపడుతూ మనోరమా - శుకనాశులు వెంటరాగా, తన భార్య విలాసవతితో కలిసి తగిన పరివారంతో ఆశ్రమానికి వచ్చాడు.

అక్కడే తన పుత్రుని అవస్థ చూసి, ఎంతో విచారించి శాపవృత్తాంతం తెలిసినవాడు కనుక - ఎట్టకేలకు శుకనాశుడిచే బోధించబడి వైరాగ్యం

వహించాడు. రాజ్యభారాన్ని మంత్రుల మీద ఉంచి, భార్యతో సహా ఆ ప్రాంతంలోనే ఉన్న అడవిలో మునిలాగ కాలక్షేపం చెయ్యసాగాడు....” అని చెప్పి – జాబాలి మహర్షి ఫక్కున నవ్వాడు. హారీతుడు మొదలైన వారిని చూస్తూ “మునులారా! ఆ కథారసం ఎంత వింతగా వుందో విన్నారా? చెప్పవలసినది పక్కనబెట్టి, చాలా దూరం వెళ్లిపోయినట్లున్నాను” అని క్షణం ఆగి మళ్లీ ఇట్లా చెప్పసాగాడు..........

“ఆ పుండరీకుడు కామంతో నిండిన మనసుతో, తాను చేసిన అవినయకృత్య దోషం వల్ల దివ్యలోకంలో ఉండగల అవకాశం కోల్పోయి, భూమ్మీద శుకనాశుడికి పుత్రుడై వైశంపాయనుడిగా జన్మాంచాడు. అతడే మరోశాపం తగిలి, మహాశ్వేత చేత శపించబడినందు వల్ల ఇలా చిలుకగా జన్మించాడు”

అని చెప్పేసరికి – నాకు నిద్ర నుంచి మెలకువ కలిగినట్లుగా పూర్వ స్మృతి కలిగి, గత జన్మ విద్యలన్నీ స్ఫురించాయి. కనుకనే చిలుకగా ఉన్నప్పటికీ – మనుషుల్లాగ స్పష్టంగా మాట్లాడటం, విద్యలు ఉపదేశించగల కౌశల్యం, వస్తు గుణదోష జ్ఞానం, వివేచన అన్నీ లభించాయి. ఇన్ని మాటలెందుకు? దేహం ఒక్కటి తప్ప, మిగతా చర్యలన్నీ మనుషుల లాగానే చేయగల సామర్థ్యం కలిగింది. అలాటి జ్ఞానం ఉండి కూడా, నా వృత్తాంతం వినడం వల్ల కలిగిన సిగ్గు చేత కొంతసేపు ఊరుకుని, తల దించుకుని జాబాలి మహర్షితో ఇలా అన్నాను. “ఋషీశ్వరా! నీ అనుగ్రహం వల్ల నాకు పూర్వజన్మ గాథ యావత్తూ స్ఫురణకు వచ్చింది. ఆప్తులను స్మరించుకున్నాను. నా మరణోదంతం విన్నంత మాత్రాన హృదయం బ్రద్దలై చైతన్యహీనుడైన చంద్రాపీడుడు తదుపరి జన్మలో ఏ దేహం దాల్చాడు? దయచేసి చెప్పండి! అతడ్ని కలుసుకోగలిగితే, ఎక్కడైనా నాకు సంతోషమే”.

అప్పుడా మహర్షి కళ్లెర్ర చేస్తూ నన్ను చూసి “దురాత్మా! నీకింకా చిత్తచాంచల్యం వదిలినట్లు లేదే! దాని మూలంగానే గదా – ఇటువంటి అవస్థ అనుభవిస్తున్నావు. నీకు ఇంకా రెక్కలైనా పూర్తిగా రాలేదే! అంత తొందరపడతావేం? ఎగరడానికి సామర్థ్యం వచ్చినపుడు అడిగితే చెప్పగలను లెమ్ము” అన్నాడు.

అప్పుడు హారీతకుడు "తాతా! ఇతడు మునిజాతిలో జన్మించినా జీవితాన్ని వదిలేంతగా మదన వేదన ఎలా పొందాడు? దివ్యలోకులకు ఆయువు అధికం కదా! అట్లాంటి ఈ దివ్యలోక సంభూతునికి అల్పాయువు కలగడం ఏమిటి? ఆశ్చర్యంగా ఉంది" అని తన సందేహాన్ని వెలిబుచ్చాడు.

"అదా! ఇతడు కామరాగప్రవర్ధనం, మోహమయం, అల్పమైన సారం ఉండే స్త్రీ వీర్యం వల్ల పుట్టడంతో అలా అయ్యాడు. ఆ విధమైన అల్పసార స్త్రీ శోణితం వల్ల పుట్టింది ఏదైనా గర్భంలోనే చనిపోవడమో, మృతరూపంలో ప్రసవం కావడమో, లేక పుట్టినప్పటికీ ఎక్కువ ఆయువు ఉండకపోవడమో సంభవిస్తుందని ఆయుర్వేదంలో స్పష్టంగా చెప్పబడి ఉంది. అందులో ఆశ్చర్యపోవలసిందేమీ లేదు. ఆ దోషం వల్లనే ఇతడు కామపీడితుడై మదన జ్వరం వల్ల వేగంగా మృతిచెందాడు. అయితేనేం?.....శాపం తీరగానే దీర్ఘాయుష్మంతుడవుతాడు" అన్నాడు జాబాలి.

అప్పుడు నేను "మహాత్మా! నేను పాపాత్ముడినై ఇలా జన్మించాను. నీ అనుగ్రహం వల్ల నాకు పూర్వజన్మ జ్ఞానం - పలికే శక్తీ లభించాయి. ఏ దుష్కృతం వల్ల నాకీ రూపం వచ్చినా, ఏ పుణ్యం వల్ల నాకీ రూపం పోతుంది? ఆయువు ఎలా వర్ధిల్లుతుంది? నేనేం చేయాలో దయ ఉంచి చెప్పండి" అని ప్రార్థించాను.

జాబాలి ముని నలుదిశలా చూస్తూ "అయ్యయ్యో! ఈ కథ మూలంగా తెల్లారిపోయింది. అనుష్ఠాన వేళ దాటిపోయేలా వుంది" అంటూ నా ప్రశ్నకు బదులు ఇవ్వకుండానే గోష్ఠి చాలించి లేవడంతో అందరూ తమ తమ నివాసాలకు వెళ్లిపోయారు.

హారీతకుడు నన్ను మెల్లగా చేతిమీదికి ఎక్కించుకొని పర్ణశాలలో ఒక గట్టు మీద ఉంచి, వారు స్నానం చేయడానికి వెళ్లాడు.

అప్పుడు నేను మనసులో "అయ్యో! ఎంతో పుణ్యం చేసుకుంటే తప్ప మానవ జన్మ లభించదు. అందులోనూ సకల జాతులలోకెల్లా విశిష్టమైనట్టి బ్రాహ్మణ జన్మ ఇంకా దుర్లభం! అందులోనూ ఇంకా శ్రేష్ఠమైన మునిత్వం మరీ దుర్లభం. దివ్యలోక నివాసం అంత కంటే అతి గొప్పది. అంతటి

మహోన్నత దివ్యపదంలో ఉండవలసిన నేను స్వదోషమూలంగా పక్షిజాతిలో పుట్టాను. అయ్యో! ఎంతటి దుర్దశ నాది! ఛీ! ఇక నాకీ జీవితంతో పనేమిటి? ఎట్లాగైనా ఈ శరీరాన్ని వదిలేయాలి" అని నిర్ణయించుకున్నాను.

అంతలో హారీతకుడొచ్చి "అన్నా వైశంపాయనా! నీ పుణ్యం మంచిది. నీ తండ్రి వద్ద నుంచి కపింజలుడు నిన్ను వెతుక్కుంటూ ఇక్కడికొచ్చాడు ఇప్పుడే" అని చెప్పడంతో నాకు అమితసంతోషం కలిగింది. కాని రెక్కలైనా రాని నేనెలా అతడ్ని తక్షణమే దర్శించుకోగలను? అందువల్ల అతడిప్పుడెక్కడున్నాడని అడిగాను.

"మా తండ్రిగారితో సంభాషిస్తున్నాడు" అన్నాడు మునికుమారుడు.

"ఆర్యా! అతడ్ని చూడాలని నా హృదయం చాలా తపించిపోతుంది. నన్ను త్వరగా అతడి దగ్గరకు తీసుకెళ్ళు!" అని నేను ప్రార్థిస్తూండగానే, కపింజలుడు ఆకాశమార్గాన పూర్వపు రూపంతో నా దగ్గరకు వచ్చాడు.

అతడ్ని చూసి నేను కన్నీరుకారుస్తూ, ఎదురేగడానికి ప్రయత్నించినా, రెక్కలు రాని కారణంగా నా శరీరం కదల్లేదు.

అప్పుడు - "మిత్రమా! కపింజలా! నీ రాక చూసి ఎదురేగి స్వాగతించడానికీ - ఆశ్లేషించుకోడానికీ - నీ చేయి అందుకుని సుఖాసనాశీనుని చేయడానికీ - నీకు మార్గాయాసం తీర్చడానికే నాకు యోగం లేకపోయెనే" అని విచారిస్తూంటే, కపింజలుడు నన్ను రెండు చేతులతోనూ ఎత్తి తన హృదయానికి దగ్గరగా ఉంచుకొని దుఃఖించాడు.

అతన్ని ఊరడిస్తూ "కపింజలా! ఎన్నో కష్టాలు చుట్టు ముట్టి వున్న నేను శోకించాలి గాని, నువ్వు దుఃఖించడం ఏమిటి? సామాన్యుడి వలె విలపించక ప్రశాంతంగా కూర్చొని చెప్పు! మా తండ్రి క్షేమంగానే ఉన్నాడా? నన్ను ఎప్పుడైనా తలుచుకుంటాడా? ఈ వృత్తాంతం విని ఏమన్నాడు? కోపగించాడా?" అని అడిగిన నన్ను తన తొడ మీద ఉంచుకొని, హారీతకుడిచ్చిన నీళ్లతో ముఖం కడుక్కున్నాడు.

"మిత్రమా! మీ తండ్రి కుశలమే!మన వృత్తాంతం అంతా దివ్యదృష్టితో చూసి ప్రతిక్రియకోసం ప్రయత్నిస్తున్నాడు. అంతలో నేను గుర్రపు రూపు విడిచి ఆయన వద్దకు వెళ్లాను. దూరాన్నుంచే నన్ను చూసి ఆయన కన్నీరు

పెట్టుకొని, భయపడుతూన్న నన్ను చేరబిలిచి ఆదరిస్తూ "వత్సా! కపింజలా! విచారించకు! ఈ తప్పు నాది గాని, మీది కాదు! పుండరీకుడు పుట్టినప్పుడే వాడికి ఇటువంటి దోషం ఉందని తెలిసి కూడా, ఆయుష్కారకమైన ప్రతిక్రియ నిర్వహించగలిగితే బాగుండేది. కాని అట్లా చేశాను కాను. ఇప్పుడు ఆ పనిని నిర్వహించాను. కొద్ది రోజులలో ఈ కష్టాలన్నీ తొలగిపోతాయి. అంతవరకూ నువ్వు నా దగ్గర ఉండు!" అని ఆజ్ఞాపించాడు.

అప్పుడు నేను "తాతా! నీకు నా మీద దయ ఉంటే, నా ప్రియమిత్రుడు ఇప్పుడు ఎక్కడ ఉన్నాడో అక్కడకు పోవడానికి నాకు అనుమతిని ఇవ్వు! వాడిని చూడాలని నాకు చాలా ఆత్రంగా ఉంది" అని అడిగాను.

ఆయన దివ్యదృష్టితో చూసి "వాడిప్పుడు చిలకగా పుట్టి ఉన్నాడు. నువ్వు వెళ్లినా, వాడిని తెలుసుకోలేవు. వాడూ నిన్ను తెలుసుకోలేడు. కొన్నాళ్లు పోనీ!" అన్నాడు.

అందువల్ల నేను అక్కడే కొన్నాళ్లుండిపోయాను.

ఈ రోజు ఉదయం నన్ను పిలిచి, ఆయనే స్వయంగా "వత్సా! కపింజలా! నీ మిత్రుడు ఇప్పుడు మహానుభావుడైన జాబాలి ఆశ్రమంలో ఉన్నాడు. వారి అనుగ్రహం వల్ల వాడికిప్పుడు పూర్వజన్మ స్మృతి కూడ కలిగింది. కనుక నువ్విప్పుడు వాటిని చూడటానికి వెళ్లు! కర్మపరిపక్వం అయ్యేదాకా, ఆ మహాత్ముడి ఆశ్రమం వదలొద్దని నా మాటగా చెప్పు!" అని ఉపదేశించాడు. ఇంకా ఆ కపింజలుడు-

"ఇక - నీ తల్లి లక్ష్మి నీ దుఃఖం విని పరితపిస్తూ, నీ విముక్తి కోసం ఆ మునికి పరిచర్య చేస్తూంది. ఆమె కూడా నీకు ఇదే చెప్పమన్నది" అంటూ ఎంతో విచారించాడు కూడా!

అప్పుడు నేనతడిని చూస్తూ "మిత్రమా! ఎందుకు విచారిస్తావు? నేను మందభాగ్యుడ్ని! నా మూలంగా నువ్వు గుర్రమై పుట్టి, అనేక కష్టాలు అనుభవించావు. ఇనుపకళ్లెం తగులుతూ నోటినుంచి రక్తం కారుతూంటే, ఆ బాధ ఎలా భరించావో కదా! సుకుమారుడివైన నువ్వు శరీరమే వాల్చక ఎప్పుడూ నిలబడే ఎలా ఉండేవాడివో - తల్చుకుంటేనే ఒళ్లు గగుర్పాటు

చెందుతోంది.. ....అంటూ కొన్ని క్షణాలపాటునా దుఃఖం మరచిపోయి, అతడ్ని చూడగలిగినందుకు ఆనందించాను.

అంతలో – మధ్యాహ్న సమయమైంది. హారీతకుడు కపింజలుడు నాకు ఆహారం అందించి, తాము కూడా భోజనం ముగించారు. "మిత్రమా! నీకీ వార్త చెప్పి మీ తండ్రి, నన్నక్కడకు వెంటనే రమ్మని ఆజ్ఞాపించాడు. నేనిక వెళ్తాను. కర్మపరిపాకం అయ్యేవరకూ నువ్వీ మహర్షి పాదాలను వదలకూడదు సుమీ!" అన్నాడతడు.

నేను విచారహృదయుడినై "కపింజలా! అంతా తెలిసినవాడవు! ఇటువంటి అవస్థలో ఉన్న నేను తల్లిదండ్రులకేమని సందేశాన్ని పంపేది?" కన్నీరు కార్చాను.

అతడు కూడా నన్ను వదల్లేక, అక్కడ్నుంచి నన్ను కదలనివ్వవద్దని హారీతకుడికి పదేపదే చెప్పి అప్పగించి, నన్ను మళ్లీ ఇంకోసారి హృదయానికి హత్తుకుని, ముని కుమారులంతా ఆశ్చర్యంతో చూస్తుండగా కపింజలుడు ఆకాశంలో కెగిరి అంతర్ధానం అయ్యాడు. అతడలా వెళ్లాక హారీతకుడు నన్ను కంటికి రెప్పలా కాపాడుకుంటూ ఊరడిస్తూ, స్వయంగా నాకు ఆహారం పెడుతూ నాకే లోటూ రాకుండా చూసుకోసాగాడు.

కొన్ని రోజులకు నాకు రెక్కలు వచ్చాయి. కొంచెం ఎగరడానికి సామర్థం రాగానే, నా మిత్రుడైన చంద్రాపీడుడినీ, మహాశ్వేతనీ చూడాలని మనసు తహతహలాడిపోసాగింది. నేనక్కడకు వెళ్లి వారితో కలిసి నివశిస్తే బావుండుననిపించసాగింది. ఒకరోజు పొద్దున్నే విహారానికి వెళ్లినట్లుగా బయలుదేరి, ఉత్తరదిక్కుగా ఎగిరిపోయాను.

అప్పటికి కొద్ది రోజుల కిందటే ఎగరడం నేర్చుకున్నాను. అందువల్ల కొద్దిదూరం ఎగిరేసరికే నాకు అలసట వచ్చేసింది. దాహంతో నాలుక ఎండిపోయింది. ఎగశ్వాస వల్ల రెక్కలు ఆడించలేక – కళ్లు తిరగసాగాయి. ఎక్కడ పడిపోతానో అని భయపడుతూనే, ఎలాగో దగ్గర్లో ఉన్న సరస్సు ఒడ్డున గల నేరేడు చెట్టు మీదకు అతికష్టంగా చేరుకున్నాను. కొంతసేపటికి ఆయాసం తగ్గింది. మెల్లగా చెట్టు దిగి, అక్కడ నీడలో కొద్దిసేపు సేదతీరాను.

దగ్గర్లోని చెరువులో నీరు తృప్తిగా తాగి, ఫలాలు తిని – ఆకలి తీర్చుకున్నాను. చెట్టు మొదటనే కూర్చొని నాకు తెలీకుండా నిద్రలోకి జారిపోయాను.

మెలకువ వచ్చి చూసేసరికి దారాలతో బంధించబడి ఉన్నాను. నా ఎదురుగా మాసిన బట్టలతో – క్రూరమైన రూపంలో ఎర్రని కళ్లతో ఒక మనిషి ఉండడం చూశాను.

వాడ్ని చూడగానే, నాకు జీవితం మీద నిరాశ కలిగింది. అయినా కొద్దిగా ధైర్యం తెచ్చుకొని, "నువ్వెవరివి? నన్నెందుకిలా బంధించావు? మాంసం కోసమైతే నన్ను నిద్రలోనే చంపి ఉండవలసింది. నిరపరాధినైన నాతో నీకేం పని? ఏదో సరదాకోసం పట్టుకున్నానంటావా? ఆ వేడుక తీరింది గదా! ఇంక వదిలేయ్! నేను నా మిత్రులను చూడటానికి చాలా దూరం పోవాలి. నా హృదయం ఆలస్యాన్ని భరించలేదు. నీకు తెలీని ధర్మాలుంటాయా?" అని వినతి చేశాను.

అప్పుడు వాడు "మహాత్మా! నేను జాతిరీత్యా ఛండాలుడిని! క్రూర కర్ముడిని! విలాసానికో – మాంసానికో నిన్ను కట్టలేదు. ఇక్కడి దగ్గరలోని మాలపల్లెలో నా అధికారి ఉన్నాడు. అతని కుమార్తె చిన్న వయసుది. జాబాలి మహర్షి ఆశ్రమంలో మాటలు నేర్చిన చిలక ఉందని ఆమె కెవరో చెప్పారు. అది విని ఆమె చాలా వేడుకపడుతూ నిన్ను పట్టుకొని తీసుకురావడానికి, ఎంతో కాలం క్రితమే చాలా మందిని నియమించింది. నా పుణ్యం కొద్దీ నువ్వు నాకు దొరికావు. నిన్ను ఆమె దగ్గరకు తీసుకుపోతాను. నీ బంధాలు విడిపించడానికి సమర్థురాలు ఆమె" అన్నాడు.

ఆ మాటలు నా శిరస్సున పిడుగుల్లాగే పడ్డాయి. "అయ్యో! నా కర్మవిపాకం ఇంత దారుణమైనదా? మహాలక్ష్మికి పుట్టి, శ్వేతకేతు మహా మునిచేత పెంచబడి దివ్యలోక ఆశ్రమాలలో నివశించిన నేను, ప్రవేశింపదగని మాలపల్లెకు వెళ్లాలా? ఛండాలురతో కలిసి ఉండాలా? వారు పెట్టే ఆహారం తినాలా? వారికి ఆటవస్తువును కావాలా? ఓహోహో! ఈ దురాత్ముని కీశాస్తి కావలసిందే! ఈ జన్మ కడు నింద్యమైనది. మొదట అసలు జన్మించకనే పోయి ఉంటే, ఈ కష్టాలు లేకపోవును కదా!

తల్లీ! లోకమాతా! నన్నీ నరకంలో పడకుండా కాపాడనేలేవా? తండ్రీ! నన్నీ ఆపద నుంచి బైటపడేయలేవా? కపింజలా! వేగంగా వచ్చి రక్షించకపోతే, వచ్చే జన్మలోనైనా నన్ను కలుసుకోలేవు సుమా! అంటూ విలపిస్తూనే, మళ్లీ అతన్ని ఇలా ప్రార్థించాను.

“చంద్రముఖా! నాకు జాతి స్మృతి ఉంది. నేను ఒక మునికుమారుడిని! ఈ సంకటం నుంచి నన్ను రక్షిస్తే నీకూ పుణ్యం వస్తుంది. నన్ను పట్టుకున్నట్లు ఎవరూ చూడలేదు! కనుక – వదిలేసినా నీకొచ్చిన ప్రమాదమేమీ లేదు. కనుక దయ ఉంచి నన్ను విడిచిపెట్టు!” అని పాదాలపై పడగా, వాడు ఫక్కున నవ్వి “ఓరీ మోహాంధుడా! శుభాశుభకర్మలకు సాక్షులైన పంచభూతాలు నీ శరీరంలో లేవా? వాటిని మోసగించగలవా? అకార్యానికి నేను అంగీకరించను. మా స్వామి ఆజ్ఞ చేత నిన్ను పట్టుకున్నాను. వదలడానికి కుదరదు” అంటూ నన్ను పట్టుకుని పక్కణం వైపు పోసాగాడు.

సీ. కుక్కలతో గూడికొని గుంపు గుంపుగా
చండాల బాలకుల్ సంచరింప
దూషిత మాంస మేదో వశా కర్దమ
ప్రాయ కుటీర రాజితములు వెలయ
గుడిసెల చుట్టు బల్ గోటగా కట్టిన
వెదురుకంపల దడుల్ వీధులంట
నస్థిరాసులం జేరి యరపులతో మీరి
కుర్కురంబులు దాడి గ్రుద్దులాడ

గీ. బురద గుంటల పందులు పొర్లులాడ
విస్రగంధి రజో ధూమ వితతమగుచు
దలపఁజూడ నసహ్యమై తనరు నట్టి
పక్కణము గానబడియె నప్పుతగ పతికి.

ఆ మాలపల్లె నరకం కంటే కూడా జుగుప్సావహంగా ఉంది. కుక్కలు, పందులు, బురద గుంతలు, దెబ్బలాడుకుంటున్న కోళ్లు విస్తారంగా ఉన్నాయి. దుర్వాసనలు అక్కడ కరాళ నృత్యం చేస్తున్నాయి. 'ఆ ఛండాల కన్య నన్ను దూరం నుంచే చూసి జాలిపడి వదిలేయమంటుందా?.....ఉహూ! వట్టిమాట! అలా జరుగదు. అది ఆ జాతికి తగనిపని! సరే! కానియ్! నా కర్మ ఇలా ఉంది. నేను నిముషమైనా ఇక్కడ ఉండలేను' అనుకుంటూండగానే, వాడు నన్ను ఆమె వద్దకు తీసుకుపోయి "తల్లీ! ఇదిగో! నువ్వు చెప్పిన చిలకను తెచ్చాను. చూడు!" అంటూ నన్ను చూపించాడు.

ఆమె చాలా సంతోషంతో "మంచి పని చేశావు" అంటూ వాడిని మెచ్చుకుని, నన్ను రెండు చేతులతోనూ పొదివి పట్టుకుని "పుత్రా! ఇన్నాళ్లకు దొరికావు. ఇంకెక్కడకు పోగలవు? నీ కామచార దోషమంతా పోగొడతాను చూడు!" అంది.

అప్పుడో ఛండాల బాలకుడు పరిగెత్తుకుంటూ వెళ్లి ఆవుచర్మంతో కప్పబడి ఉండి, కంపు కొడుతూన్న కఱ్ఱ పంజరం ఒకటి తెచ్చి ఆమె ముందుంచాడు. ఆమె నన్ను అందులోకి తోసి "దీనిలో ఉండు! కదలకు" అంటూ పంజరం తలుపు బిగించింది.

అప్పుడు నేను "ఎంత ఆపదలో చిక్కుకున్నాను? ఈమెకు నమస్కరించి, నా అవస్థ అంతా చెప్పుకుని, వదలమని బతిమాలుకునేదా? సరి! సరి! నేను మాట్లాడతాననే కదా – ఇలా పట్టించి తెప్పించింది. నా బంధనం ఆమెకు బాధాకరమా? నేనేమైనా ఆమెకు బంధువునా? మౌనంగా ఉండటమే మంచిది. అయినా, దీనివల్ల మరింత నష్టం జరుగుతుందేమో! ఏదేమయినా, ఈ ఛండాలురతో మాట్లాడడం అనుచితం! మాట్లాడని మూగచిలక నాకెందుకూ? అని విసుగెత్తి ఆమె వదిలేస్తుంది! మాట్లాడితే మాత్రం వదలదు" అని నిశ్చయించుకున్నాను.

ఆమె పలకరించినా, బెదిరించినా, పొడిచినా, కొట్టినా, తట్టినా నేను ఏమీ బదులు పలకక చాలా నిదానంగా ఉండసాగాను. ఆహారం నీరు అందజేసినా ఉపవాసం ఉన్నాను. మరునాడు ఆమే స్వయంగా ఫలం – జలం తెచ్చి బతిమాలినా నేను ముట్టలేదు.

అప్పుడామె "ఆకలి - దాహాలతో పీడించబడేటపుడు పశువులూ - పక్షులూ ఎలాటి ఆహారమైనా తీసుకుంటాయి. నువ్వు పక్షిజాతికి చెందిన దానివి! నీకు వివక్ష దేనికీ? జాతి స్మృతి వల్ల నేను ఇచ్చిన భోజనం ముట్టడం లేదా? అలా అయితే, అత్యుత్తమమైన తాపసజాతిలో పుట్టినా - పక్షి జాతిలో జన్మించవలసిన పాపకర్మ చేశావు కదా! ఇప్పుడు విచారించి ఏం లాభం? మొదట్లోనే ఈ వివేచన ఉంటే ఈ ముప్పు రాకనేపోయేది. జాతికి తగిన ఆహారం తినడం దోషం కాబోదు. గొప్పవారు కూడా ఆపత్కాలంలో భక్షింపదగనివాటిని తిని ప్రాణాలు నిలుపుకొన్నారు. నీ మాట చెప్పడం ఎందుకు? ఛండాలపు అంశ కలిగిన వేవీ నీకు తీసుకురాలేదు నేను. ఈ పళ్లు తినొచ్చు! ఊరకే ఎందుకు ఆకలి - దాహంతో బాధపడతావు? మునిజనులకైనా ఇవి తినకూడని పదార్థాలు కావు కదా!"అన్నది.

ఛండాలజాతికి తగని ఆమె మాటలకు ఎంతో ఆశ్చర్యపోతూ జుగుప్స వదలి, ఆకలీ - దాహం తీర్చుకోవడం కోసం వాటిని అంగీకరించినా, మౌనవ్రతం మాత్రం వీడలేదు నేను. అలా కొంతకాలం గడిచింది.

ఒకరోజు నేను నిద్రలేచి చూసేసరికి, ఆ కఱ్ఱ పంజరంలో గాక, ఈ బంగారు పంజరంలో ఉన్నాను. ఆ కన్య దివ్యరూపంలో ప్రకాశిస్తోంది. దేవరవారే స్వయంగా చూసి ఉన్నారు కదా! ఆ మాలపల్లె దేవనగరమై భాసిస్తూంటే చూసి, నేను విచారం వదలి ఆశ్చర్యపోతూ "ఇదేమిటి?" అని మౌనం విడిచి ఆమెను అడుగుదామనుకుంటూండగా, ఈమె ఇక్కడికి తీసుకువచ్చింది.

శూద్రక మహారాజా! ఈమె ఎవరో, ఎందుకిట్లా ఛండాల రూపంలోఉందో, నన్ను ఎందుకు పట్టించిందో - ఇక్కడికెందుకు తీసుకొచ్చిందో నాకేమీ తెలీడం లేదు. మీలాగానే నేను కూడా ఆ కథ వినడానికి కుతూహలంగా ఉన్నాను" అంది చిలక.

ఆ కథంతా విన్న మహారాజు ఆ వృత్తాంతం వినాలని ఎంతో ఆతృతపడుతూ, వాకిట్లో ఉన్న మాతంగ కన్యను తీసుకురమ్మని ప్రతీహారిని ఆజ్ఞాపించాడు.

ఆమె లోపలకు రాగా, ఆమె భూమికి తగలకుండానే నిల్చుని ఉండడం గమనించాడు రాజు. ఆమె అతడికంటే ఎక్కువ తేజస్సుతో వెలుగుతూ, ఆ రాజును పరాభవిస్తున్నట్లే చాలా స్పష్టంగా ఇలా అంది.

"రాజా! రోహిణీ నాథా! తారా రమణా! ఆనంద చంద్రా! ఈ దుష్టుడు తనదీ - మీది వృత్తాంతం మీకు వినిపించాడు కదా! జాబాలి ఆశ్రమం విడువవద్దని తండ్రి ఆజ్ఞాపించినా - దాన్ని ఉల్లఘించి కామసంబంధ అనురాగం అధికమై అంధుడై మహాశ్వేత దగ్గరకు పయనమైన సంగతి మీకు తెలిసిందే! తర్వాత జరిగిన కథ ఇది - వినండి!

"నేనీ దురాత్ముడి కన్నతల్లిని - ఇతడు వధువు కోసం వెళ్తూన్నాడని దివ్యదృష్టితో గమనించిన శ్వేతకేతుడు నన్ను పిలిచి 'నీ పుత్రుడింకా అధోగతిని పొందుతూన్నట్లుగా తోస్తోంది. పశ్చాత్తాపంతో కాని, వాడి మనస్సు ఉపశాంతి పొందదు. నువ్వు వెళ్లి వాడికి కర్మ పరిపక్వం అయ్యేదాకా ఒకచోట కట్టేసి అయినా బాధ కలిగేలా చెయ్యి! వేగంగా వెళ్ళు!" అన్నాడు. అప్పుడు నేనే ఈ కల్పనంతా చేశాను.

క. నీవా చంద్రాపీడుడ
వా వైశంపాయనుండె యీ నీ శుకమో
భూవర! మీ కిత్తరి శా
పానిల దోషావ సానమై యెప్పుటచే.

"చంద్రాపీడుడు ఎవరో కాదు. నువ్వే మహారాజా! వైశంపాయనుడు ఈ చిలకే! మీ ఇద్దరూ శాపాలు తీరి సమంగా సుఖపడగలరని, వీనిని నీ దగ్గరకు తీసుకొచ్చాను. ఇప్పుడు మీ ఇద్దరూ జన్మజరా దుఃఖాలకు ఆలవాలమైన మానవదేహాలను వదలి సుఖపడగలరు" అంటూ ఆ మాతంగ కన్య అందెలు ఘల్లున శబ్దం చేసేలా పాదాల్ని నేలతో తట్టి అంతరిక్షానికి ఎగిరి అదృశ్యమై స్వర్గంవైపు వెళ్లిపోయింది.

# శూద్రకుడే చంద్రాపీడుడు

**ఆ** మాతంగకన్య మాటలతో శూద్రక మహారాజుకు పూర్వజన్మ స్మృతి కలిగి, వివాహమాడకుండానే, మొదట్నుంచీ అతడికి స్త్రీల యందు గలిగిన తేలిక భావాన్నే కడవరకూ పెంచుకొని క్రమంగా కాదంబరీ వియోగాన్ని తలుచుకొంటూ కృశించి మన్మధబాధతోనే చివరికి మరణించి, ఆ చిలుకకు కూడ శాపం ముగియడంతో – అదీ అక్కడే మరణించింది.

అక్కడ – కాదంబరి, వసంతకాలంలో కామోత్సవాన్ని జరిపించి, వాడుక ప్రకారం చంద్రాపీడుని శరీరాన్ని అర్చించి అతడి కంఠాన్ని కౌగలించుకుంది. ఇక్కడి శూద్రకుని ప్రాణాలు వెళ్ళి, ఆ చంద్రాపీడుని దేహంలో స్థిరపడటంతో అతనికి పూర్వస్మృతితో పాటు దేహంలో కదలికసైతం మొదలయ్యింది.

మెల్లగా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు పొందాడు. కళ్ళు విడివడ్డాయి. ముఖం పద్మంలా వికసించింది. నిద్రలేచిన వారు లేచినట్లుగా లేస్తూనే కాదంబరిని చూసి, ఆమె కంఠాన్ని ముద్దిడి కౌగలించుకుని ఆమెకు ఆనందం కదలించాడు.

తొట్రుపడుతూన్న ఆమెను అలాగే గట్టిగా పెనవేసుకుని, తన సుమధురమైన స్వరంతో ఆనందం కలుగచేస్తూ "కాదంబరీ! భయపడకు! నీ స్పర్శతో నేను జీవించాను. అమృతకులం అప్సరజాతిలో జన్మించిన దానివి నువ్వు! నీ స్పర్శ నాక్కూడా అమృతత్వాన్ని ప్రసాదించింది.

శాప దోషం వల్ల మనకు ఇన్నాళ్లూ వియోగం కలిగింది. ఇక ఇప్పుడు నేను ఆ విరహ దుఃఖంతో కూడుకొని ఉన్న ప్రమాదకరమైన శూద్రక మహారాజు దేహాన్ని వదిలాను. ఇక నీకు సుఖం కలుగుతుంది. నీ ప్రియసఖి అయిన మహాశ్వేత ప్రియుడు కూడా నాతోపాటే శాపవిముక్తుడయ్యాడు. అందువల్ల ఆమె కూడా సుఖపడుతుంది" అంటూండగానే

స్వర్గలోకం నుంచి కపింజలుడి భుజంపై చేయి వేసి, (మహాశ్వేత మొదట అతడ్ని చూసిన రూపంలో) పుండరీకుడు అక్కడకు వచ్చాడు. దూరంనుంచే అతన్ని చూసిన కాదంబరి చంద్రాపీడుని వక్షంపైనుంచి విడివడి లేచి, అతివేగంగా మహాశ్వేతను కౌగలించుకొని, వారి రాక గురించి చెప్పింది.

కపింజల-పుండరీకులొస్తున్నారన్న వార్తతో ఆమె ఆనందం ఇనుమడించింది. ఇంతలో పుండరీకుడు చంద్రాపీడుని వద్దకు వచ్చి గాఢంగా ఆలింగనం చేసుకున్నాడు.

చంద్రాపీడుడు "మిత్రమా! పూర్వజన్మ సంబంధంలో నువ్వు నాకు అల్లుడివే అయినా మనం తరువాత జన్మలోని సంబంధమే కొనసాగించాలి. కనుక మైత్రీ బంధం మనది" అన్నాడు. "సరే మామా!" అంటూనే, నాలిక్కరుచుకుని "సరే మిత్రమా!" అన్నాడు చంద్రాపీడుడు.

కేయూరకుడు ఆ వార్తను చిత్రరథుడికీ - హంసుడికీ తెలుపుదామని హేమకూటం వెళ్లాడు. మదనలేఖ వేగంగా పోయి, తాపసి వెల మృత్యుంజయ జపాన్ని (పుత్రుడి నిమిత్తం) చేస్తున్న తారాపీడుని వద్దకు వెళ్లి, చంద్రాపీడుడు జీవించిన వైనం తెలియచేసింది.

ఆ మాట విని, తారాపీడుడు విలాసవతిని వెంటబెట్టుకుని, శుకనాశుడు తోడు రాగా మదనలేఖ పరిచర్యలందుకుంటూన్న కొడుకును చూసి ఆనందభాష్పాలు రాలుస్తూ, అతడ్ని కౌగలించుకున్నాడు. తల్లి అతడ్ని చూసి వర్ణనాతీతమైన ఆనందసాగరంలో మునిగింది.

అప్పుడు చంద్రాపీడుడు తల్లిదండ్రులకు నమస్కరిస్తూ, శుకనాశునికీ అభివాదం చేసి ఆశీస్సులందుకొని, పుండరీకుని చూపించి "ఆర్యా! వైశంపాయనుడు ఇతడే! చూడు!" అన్నాడు.

అప్పుడే కపింజలుడు రాగా, శుకనాశునికి ఇలా చెప్పాడు. "ఆర్యా! శ్వేతకేతుడు మీకిలా చెప్పమన్నాడు.

"ఈ పుండరీకుడు నా చేత పెంచబడ్డాడన్నమాటే గానీ, నీకే కొడుకంతటి వాడు. వీడికి నీ మీదనే ప్రేమ అధికం! అందువల్ల వీడ్ని వైశంపాయనుడిగానే భావించి అవినయకార్యాలు చేయనివ్వకు! వీడు నీవాడే! పరుడని తలవకు! అందుకే శాపాంతంలో ఇతడ్ని నీ దగ్గరకు పంపాను. అదీగాక - నా సాత్వికతేజం ఇప్పుడు ఇంతకంటే ఉత్తమలోకానికి పోతూంది".

అది విని శుకనాశుడు వినయంగా ఉన్న పుండరీకుని మరింత చేరువైన హృదయంతో సంభావిస్తూ "కపింజలా! సర్వజ్ఞుడైన శ్వేతకేతుడు ఇలాటి కబురు పంపడం ఏమిటి? స్నేహంలో ఇటువంటి మాటలు సంతోషం

కలిగిస్తాయా? అందరికీ ఆ మహానుభావుడి ఆశ్రయమే కావాలి" అన్నాడు. ఆ ప్రకారం వాళ్లు పూర్వజన్మలను తల్చుకొంటూ, ఆ రోజు గడిపారు. ఆయా జన్మల విశేషాలు ఒకరితో ఒకరు వేడుగ్గా చెప్పుకున్నారు.

మరునాడు........

గంధర్వకుల నాయకులైన చిత్రరధుడు - హంసుడు భార్యలతో కలిసి సపరివారసమేతంగా అక్కడకు వచ్చిన అల్లుళ్ళను - కూతుళ్లను చూసి ఎంతో సంతోషిస్తూ, తారాపీడుడు - శుకనాశులతో మాట్లాడుతూ కొంత కాలక్షేపం చేశారు.

అప్పుడు చిత్రరధుడు తారాపీడుని చూసి "ఆర్యా! ఎంతో వైభవంగల భవనాలుండగా, ఈ అరణ్యంలో ఉండటం దేనికీ? హేమకూటానికి పోదాం! రండి!" అని ఆహ్వానించగా "గంధర్వరాజా! ఎక్కడైతే అత్యధికంగా సుఖం కలుగుతుందో, అదే భవనం. ఇంత సౌఖ్యం నాకు ఎక్కడా లభ్యం కాలేదు. అదీగాక నాకు అన్ని సౌఖ్యాలూ ఈ అల్లుని మూలముగానే ఒనగూడాయి. నాకు ఇక అరణ్యమే శరణ్యం. వధువుతో సహా అతడ్ని తీసుకెళ్లు! అంతేగాని, నన్ను మాత్రం ఇబ్బంది పెట్టకు" అని తారాపీడుడు చెప్పడంతో చిత్రరధుడు సరేనన్నాడు.

చంద్రాపీడుడు తదితరులతో హేమకూటానికి వెళ్లిపోయి - అక్కడ ఓ శుభముహూర్తాన చంద్రాపీడునికి కాదంబరినిచ్చి ఘనంగా వివాహం జరిపించాడు చిత్రరధుడు.

హంసుడు కూడ అలాగే మహాశ్వేతని పుండరీకునికి ఇచ్చి పెళ్లి చేశాడు. చంద్రాపీడ - పుండరీకులు ఆ వనితలను - ఆ గంధర్వ పట్టణాలనూ స్వీకరించి, భార్యలతో సుఖిస్తూ, తమను ఆశ్రయించి వున్న మన్మధునికి సంతృప్తి కలిగించారు. సుఖ సంభోగ కేళిలో కొన్నాళ్లు మన్మధసామ్రాజ్యం ఏలారు.

ఒకరోజు -

కాదంబరి, చంద్రాపీడునితో మాట్లాడుతూ "మనం అంతా మరణించి మళ్లీ బ్రతికాం! కలుసుకున్నాం! కాని, పత్రలేఖ సంగతే నాకు ఆశ్చర్యంగా ఉంది. ఆమె ఆనాడు సరస్సులో పడినా, తిరిగి రాలేదు. ఆమె వృత్తాంతం ఏమిటి?" అని అడిగింది.

అందుకు అతడు "నేను చంద్రాంశ అని నీకు తెల్సుకదా! చంద్రుని భార్య రోహిణి. ఆ రోహిణియే ఈ పత్రలేఖ. ఆమెకు విహితమైన కృత్యం ఆమె చేసింది. నేను పుండరీకుని చేత శపించబడి, భూమ్మీద జన్మించవలసి రావడం గుర్తించింది. అందుకే వదలలేక నా సేవకోసం నాకంటే ముందుగానే భూమిమీద పుట్టింది. ఇంతవరకూ నాకూ తెలీదు. ఇప్పుడు శాపం తొలగిపోయింది గనుక అంతా స్ఫురిస్తోంది" అని చెప్పాడు.

చంద్రాపీడుడు పుండరీకునితో కూడి కొన్ని రోజులు ఉజ్జయినిలోను - కొన్ని రోజులు హేమకూటంలోను - కొన్నాళ్లు చంద్రలోకంలోను - కొంతకాలం లక్ష్మీసరస్సులోను నివశిస్తూ యధేచ్ఛగా దివ్యభోగాలు అనుభవిస్తూ హాయిగా ఉన్నాడు".

- అంటూ కథ సుఖాంతం చేశాడు మణిసిద్ధుడు.

"గోపా! నీవు చూసిన చిత్రఫలకంలోని ఆకృతులు వారివే!" అని అయ్యవారు చెప్పగా, గోపాలుడు సంతృప్తిగా ఆయనకు అనేక నమస్కారాలు చేస్తూ, ఆ కథను మళ్లీ మళ్లీ తల్చుకుంటూ, తదుపరి మజిలీ చేరుకున్నాడు.

**క. కాదంబరీ రసం బా**
**స్వాదించిన నించుకంత పరవశులై సం**
**మోదింతురు జనులనఁ ద**
**న్మాధుర్యం బెరుక పడదె మరి విబుధులకున్ ?**

**(కాదంబరి కథ పండిత పామరులందరికీ పారవశ్యం కలిగిస్తుంది)**

**గీ. బాణకవి చేత రచియింపబడియెఁ గొంత**
**యతని సుతు చేతఁ బూరిత మయ్యె నంత**
**మదియు నిదియుఁ గథా సంగ్రహంబు దప్ప**
**కుండఁ దెనుగించి నాడ గద్యోప సరణి.**

**(బాణ కవిచేత కొంత, అతని పుత్రుని చేత మరికొంత రచితమైన ఈ కమనీయ కాల్పనిక గాథను గద్యంలో కథా సంగ్రహం తప్పని రీతిలో**

సంస్కృతం నుంచి తెలుగులోనికి తీసుకొచ్చాను.)......అంటూ కవిగారీ కృతిని పరమేశ్వరునికి అర్పించారు.

క. నీ కర్పించితి నీ కృతి
గై కొనుమా బాలచంద్ర కలిత లలిత ఫా
లా! కాళీలోలా శై
లాకర శుభకర మహేశ హర విశ్వేశా!

## గద్యము

శ్రీరస్తు. ఇది శ్రీ మద్విశ్వనాథసదనుకంపాసంపాదిత
కవితా విచిత్రా త్రేయ గోత్ర పవిత్ర మధిరకుల కలశ
రాకా కుముద మిత్రా లక్ష్మీనారాయణపౌత్రా
కొండయార్యపుత్ర విబుధజనాభి రక్షిత
సుబ్బన్న దీక్షితకవి విరచితంబగు
కాశీయాత్రాచరిత్రమను
మహాప్రబంధమున
ఆంధ్రీకృతంబైన
కాదంబరి

శ్రీ విశ్వేశ్వరార్పణ మస్తు

# ఐదవభాగం సంపూర్ణం



# కాశీ మజిలీ కథలు
## 6వ భాగము

**57 వ మజిలీ**

శ్రీ కాశీ నగర వరా
లోకమున సమ్మోద మెడఁదలో బలియన్, సు
శ్లోకుడుఁ మణిసిద్ధుండ
య్యేకాంత చ్ఛాత్రు తోడ నేగుచుఁ గడకున్.

ఏభై ఏడవ మజిలీలో- ఆ ప్రదేశంలోని వింతలు చూడబోయిన గోపకుమారుని రాక కోసం ఎదురు చూస్తున్నాడు మణిసిద్ధుడు. కొంత సేపటికి శిష్యుడు అటూ ఇటూ చూస్తూ, ప్రశ్న వెయ్యడానికి తగిన విషయమేదీ కనిపించక- తాము బస చేసిన మఠం గోడమీద రాసివున్న రాతలను చదువుతూ "గాలికి ఊగే దీపాన్ని, నీటి మీద సంతకాన్ని పోలిన చందంగా పెళ్లాడనంటూ భీష్మించుకున్న ఒక స్త్రీ తన వ్రతం తానే భంగం చేసుకుని, ముగ్గురు భర్తలను కోరుకుంది" అనే భావం వచ్చే పద్యాన్ని ఒకవైపు రాసివుండగా చదివాడు. భోజనం చేసి మరీ తీరికగా ఉన్న శిష్యుడు ఆ పద్యం చదివాక, ఆనందంగా వచ్చి మణిసిద్ధుని వద్ద కూర్చుని ఆ వృత్తాంతం చెప్పమని కోరగా- మణి ప్రభావంతో ఆ అయ్యవారు దాని వైనం అంతా తెలుసుకొని, హృదయంలో ఆశ్చర్యరసావేశం కమ్ముకోగా శిష్యునికి ఆ కథ ఇట్లా చెప్పసాగాడు.

# స్వయం ప్రభ కథ

గిరిదుర్గం అనే పట్టణాన్ని ఇంద్రమిత్రుడనే రాజు పరిపాలిస్తున్నాడు. అతని భార్య మనోహారిణి. అతనికి చిరకాలంగా సంతానం లేకపోయేసరికి, సంతాన ప్రాప్తికై కనబడ్డ దేవునికి మొక్కడం– చెయ్యమన్న దానం చెయ్యడం– వెళ్ళమన్న పుణ్యక్షేత్రానికి వెళ్ళడం– ఆచరించమన్న వ్రతమల్లా ఆచరించడంతో చాలా కాలం గడిపాడు. అయినప్పటికీ ఫలితం కనిపించకపోయేసరికి మనసు విరిగి, ధర్మాన్ని నిందించడం మొదలు పెట్టాడు. యాగాలంటే ఏవగించుకోసాగాడు. పుణ్యకార్యాలంటేనే విరక్తి పెంచుకుని అంతటితో ఆగక అవి ఎవరు తలపెట్టినా వాళ్ళను పట్టుకుని శిక్షించసాగాడు.దాంతోపాటు ఒక శాసనాన్ని ఇలా రాయించి కోట ముఖ ద్వారం వద్ద వ్రేలాడదీయించాడు. దానిలో "ఎవరైనాసరే! నాకు ఫలితం కన్పరచే లాగ ఏ చర్య చేపట్టి అయినా, సంతానం కలిగేలాగ చేస్తే సంతోషంగా అర్ధరాజ్యం ఇస్తాను. అలాగాక, నన్ను వృధాగా ఖేదపరిచే ప్రయత్నం చేస్తే వాళ్ళ తల నరికి కోటగుమ్మానికి కడతాను" అని ఉంది.

అది అందరూ చదవడానికి వీలుగా కోటద్వారం దగ్గరే ఉంచడంతో ఎవరూ అటువంటి పనిచేయడానికి సాహసించేవారు కారు. ఇది జరిగిన కొంత కాలం తరువాత, ఒక వసంత ఋతువులో రాజపత్ని మనోహారిణి తన పరిచారిక అయిన పుష్కరిణితో కూడా 'దేవీ పుష్కరిణి' అనే చెరువులో స్నానం చేసి, గురుదత్త మంత్రాన్ని జపించుకుంటూ ఇంటికి పోతూంటే, ఒక పరిచారిక "అమ్మా! మన నగరానికి అతి చేరువగా రత్న కూటం అనే పర్వతం ఉంది కదా! దాని మీద దేవతలు విహరిస్తారని వాడుక. రామాయణగాథ కాలం నాటి స్వయం ప్రభాదేవి గుహ అక్కడ వుండేదట! హనుమంతుడు– తదితర వానర వీరులు అర్చించిన ఈ దేవి అక్కడ ఉండేదనడానికి నిదర్శనంగా, ఆ కొండ దిగువన ఉన్న స్వయం ప్రభాదేవి ఆలయాన్ని నేటికీ చెప్పుకుంటారు. ఆ దేవి ప్రభావం చాలా ఆశ్చర్యకరం అని వాడుక. దంపతులెవరైనా ఆ దేవాలయంలో ఉపవాసం– జాగరణ

చేస్తే, ఆ దేవత వారి కోరిక తప్పకుండా తీరుస్తుందట! అది తెలిసి, అక్కడి అర్చకుల్ని కబురు చేసి రప్పించాను. మీకు ఇష్టమైతే మీ ఎదుటకు తీసుకువస్తాను" అనడంతో మనోహారిణి నవ్వుతూ ఇలా అంది–

"ఓసీ పుష్కరిణీ! నీకింకా ఈ వెర్రిపోలేదా ఏం? చాల్చాలు! నాకీ జన్మకి సంతానం కలగదు. ఇంతకుముందు మనం ఆరాధించిన దేవతలకంటే ఈ దేవి ఏమంత మిన్న అని భావించమంటావు? మన పూర్వ జన్మ కర్మ ఇలా ఉంటే, అందుకు దేవతలేం చేస్తారు– పోనీయ్! ఇక అటువంటి ప్రయత్నాలు చెయ్యదలుచుకోలేదు. నియమాల మాట ఎత్తితే, ప్రభువుల వారికి ఎటువంటి కోపం వస్తుందో నువ్వు చూస్తున్నావు కదా! పిలిపించావు గనుక వాళ్ళు నిరాశపడకుండా, ఏదో ఒక పారితోషికం ఇచ్చి పంపేద్దాములే!" అందా రాజపత్ని.

"దేవీ! నువ్వన్నమాట నిజమే! అయితే, ఏ సమయానికి ఏది జరగ్గలదో ఎవరు చెప్పగరు? ఒక్కోసారి చేసిన ప్రయత్నం విఫలమైనప్పటికీ, మరొక సమయంలో అదే ప్రయత్నం సఫలం కావడం మనకు తెలిసిందే! దశరథునికి ఎన్నేళ్ళకు సంతానం కలుగలేదు? ముందుగా వాళ్ళనిక్కడకు రప్పిద్దాం! దాని వల్ల మనకా దేవి మహిమ ఏమిటనేది తెలుస్తుంది. కర్తవ్యం అప్పుడు ఆలోచించవచ్చు!" అని సమాధాన పరచేసరికి మనోహారిణి అర్ధాంగికారాన్ని సూచిస్తున్నట్లుగా ఊరుకుంది.

పుష్కరిణి, మరో పరిచారికతో ఆ అర్చకుల్ని రాణి ఎదుటికి రప్పించింది. వాళ్ళ విచిత్ర రూపాలు చూసి నవ్వుతూ ఆ రాజపత్ని వారితో ఇలా సంభాషించింది.

రాజపత్ని ఆ అర్చకురాలిపేరు అడగ్గా, ఆమె తన పేరు 'దురద' అంది. రాణి నవ్వేసి అదేం పేరే? అనే సరికి ఆ అర్చకురాలు 'సంపబ్బ' అని చెప్పింది. పక్కనే ఉన్న అర్చకుడ్ని చూపించి "అతడు నీకే మవుతాడు? ఆతని పేరేమిటి?" అని అడగ్గా, అతడందుకుని "నాపేరు బర్గడు. ఈ దురద నాకు పెండలం" అంది.

దానికి పుష్కరిణి నవ్వుతూ "ఏంటయ్యో! దురద కందకు ఉంటుందిగాని, పెండలానికి ఉంటుందా?" అని అడిగింది.

"అయ్యే సానీ! ఇది నా బఱ్రమ్మ" అని చెప్పాడు అమాయకంగా అతడు. రాణి తెల్లబోతూ – వీళ్ళ మాటలు నీకేమైనా బోధపడ్డాయా?" అని అడిగింది.

నవ్వేస్తూ పుష్కరిణి "తెలిశాయమ్మా! వీరు ఆటవికులు కదా! గ్రామ్య భాష అయినా సరిగ్గా మాట్లాడలేరు. దురద అంటే దుర్గ. సంపబ్బ అని చెప్పిన స్వయంప్రభ అనే దేవత దుర్గకు పర్యాయపదం. బర్గడు అనే పేరు భర్గుడని చెప్పాలని ఆమె ఉద్దేశం. పెండ్లాం అని చెప్పాలనే ప్రయత్నంలోనో తిరక్క పెండలం అనేది మనకు విన్పించేసరికి నవ్వొచ్చింది! అది వివరించాలని బఱ్ర అన్నాడు అతడు. భార్య అని చెప్పాలని అతడి తాపత్రయం. నోరు తిరగక వాళ్ళు మాట్లాడే మాటలు మనకు హాస్యాస్పదంగా తోచాయి" అని వివరణ ఇచ్చింది.

"సర్లే! ఇదా సంగతి? ఈ మాటలకే ఇంత వ్యాఖ్యానం కావలసొస్తే, ఇంక మనం అడగవలసిన విషయాలు ఎలా తెలుసుకోవడం? నువ్వే తెలుసుకొని, నాకు చెప్పు" అని రాణి అక్కణ్ణుంచి వెళ్ళిపోగా, ఆ పుష్కరిణి వాళ్లని రకరకాలుగా ప్రశ్నించి పూర్తి సమాచారాన్ని రాబట్టి, ఆ ఆటవిక పూజారి జంటకు పారితోషికం ఇచ్చి పంపేసింది.

తర్వాత, తన యజమానురాలి దగ్గరకు వెళ్ళి "దేవీ! మీ దంపతులొక్కరాత్రి ఆ గుళ్ళో ఉపవాస-జాగరణలు చేస్తే మీ కోరిక తప్పక తీరగలదు" అని ముఖ్య విషయం చెప్పి, ఆ పట్టణంలో ఏయే ప్రముఖులు ఆ దేవిన్ని వ్రత నియమం ప్రకారం అర్చించి అనుగ్రహపాత్రులైనదీ నిదర్శనాలతో కూడా నివేదించేసరికి రాణికి నమ్మకం కుదిరింది.

అప్పుడా మనోహారిణి, తన భర్తతో ఆ దేవి వృత్తాంతం చెప్పే సరికి, మొదట "నీకు ఇటువంటి సలహా ఇచ్చిందెవరో చెప్పు! వాళ్ళ తల తీయించేస్తా" అంటూ అంతెత్తున ఎగిరి, భార్య శాంతవచనాలతో కొంతసేపటికి సమాధానపడి "కాంతా! సంతానం విషయమై నువ్వు చేసే

వ్రతాలన్నీ అయిపోయాయా? ఇంకా ఉన్నాయా? ఏదో నీ చాపల్యం కొద్దీ ఇంకా వెర్రి ప్రయత్నాలు చేస్తున్నావు" అంటూ పరిహాసం ఆడాడు.

భర్త కొంత స్థిమితపడ్డాక, "ఏమండీ! ఇంతవరకు ఎవరెవరో ఏవేవో చెప్తూ వచ్చారు. చేశాం! ఫలితం కనిపించలేదు. కొన్ని సంవత్సరాల పాటు ఈ విషయంలో ఎటువంటి దైవకృత్యాలు చేయకుండానే వదిలేశాం! ఇంతకాలానికి ఎందుకో- ఏ దేవి మన మీద కటాక్షం చూపాలని అనుగ్రహించిందో ఏమోగాని- ఇదొక్కటి మాత్రం ఇంక మిగిలి ఉందనుకోండి!" అని తాను విన్న స్వయంప్రభాదేవి వృత్తాంతమంతా చెప్పింది. భార్య ముచ్చట తీర్చడానికి, వేట అనే సాకుతో అక్కడకు ప్రయాణమై ఆ రాత్రి అక్కడ జాగరణ చేసి నియమాలు పాటించి దంపతులు ఆ దేవిని పూజించి, ఇతరులెవ్వరికీ తెలీకుండా ఇంటికొచ్చారు. వ్రతనియమాల్లో చివరిదైనట్టి బ్రాహ్మణ సంతర్పణకు మరొక సాకు వెతుక్కొని, అదికూడా విధివిధానంగా పూర్తి చేశారు.

ఆ మహాశక్తి యొక్క శక్తి ఎలాంటిదో గాని, వెంటనే రాణిగారిలో గర్భచిహ్నాలు కనిపించాయి. ఇంద్రమిత్రునికి ఈ వార్త తెలియగానే అతడి ఆనందానికి మితి లేకపోయింది. రాజు ఆ దేవత గుడి ప్రాకార మంటపాలను సంతోషపూర్వకంగా నిర్మింపజేశాడు. దేవతా పూజలను నిరసిస్తూ, తాను వేయించిన శాసనాన్ని కోట ముఖద్వారం దగ్గర్నుంచి తొలగింపజేశాడు. ఏ దేవత వర ప్రభావాన జన్మించిందో ఆ దేవత పేరు మీదుగానే, తనకు జన్మించిన పుత్రికకు 'స్వయం ప్రభ' అని నామకరణం చేశాడు రాజు. పుత్ర సంతానమైతే బావుండేది అనుకున్నా, తమకు సంతానం లేకపోయిందన్న చింతను దూరం చేసినందున ఆ శిశువునే అల్లారు ముద్దుగా పెంచి విద్యాబుద్ధులు చెప్పించారా దంపతులు. ఆ బాలక సౌందర్యం అసమానం. అదే ఈడుగల హేమ అనే బాలికను తోడు చేసి, ఇద్దరికీ తగిన విద్యా పరిశ్రమ కలిగించాడా ఇంద్రమిత్రుడు. హేమ కూడా స్వయంప్రభకు సహాధ్యాయురాలిగా- ఇష్టసఖిగా మెలగుతూ స్నేహవాత్సల్యంతో మెలగసాగింది.

ఉపాధ్యాయుల వల్ల స్వయంప్రభాదేవి వరాన తాను పుట్టినట్లు తెలిసికొన్న స్వయం ప్రభ, రామాయణంలో ఉన్న ఆ కథనే చాలా సార్లు చదువుతూ హేమతో ముచ్చటిస్తూ స్వయంప్రభాదేవి మహాత్మ్యాన్ని- సామర్థ్యాన్ని పొగుడుతూ, నియమంగా స్తుతిస్తూ మూడు పూటలా ఆ కథనే పారాయణం చేస్తూ మక్కువ పెంచుకున్నది.

ఓ రోజు పూలతోటలో పూలుకోస్తున్న సమయాన హేమ "అక్కా! నువ్వు నిత్యం స్వయంప్రభా చరితమే చదువుతున్నావని గురుదేవులకోపం చేస్తున్నారు. చదవాల్సినవి చాలా ఉన్నాయి కదా!" అంది.

"నాటకాలంకారకావ్య గ్రంథాలు- శాస్త్రాలు- పురాణాలు ఏదీ వదలనే లేదు. అన్నీ చదువుకున్నాం కదా!" అంది స్వయంప్రభ.

"అలాక్కాదు! కావ్యాదులు చూచి పడెయ్యడం వేరు. ఒక క్రమ పద్ధతిలో నిత్యం మననం చేసుకుంటూండడం వేరు. ఎన్ని ఏళ్ళు చదివినా చదవాల్సినవే అవి! వాటికి అంతం ఎక్కడ?" అంది హేమ.

"సఖీ! కావ్యనాటకాదుల మీద నాకు అంత అభిరుచి లేదు."

"అయ్యో! వాటి భావం నీకు తెలీక అలా అంటున్నావు. ఆహా!వాటిలోని రసమాధుర్యం అమృతాన్ని మించి ఉంటుంది కదా"

"హేమా! ఆ రసం నాకు ఎక్కలేదు. అది విరసంగా ఉంది"

"అమృతాన్ని సైతం వద్దనుకొనే వాళ్ళుంటారా?"

"అమృతమో- విషమో నాకు తెలీదు. కావ్య నాటకాదులనిండా ఉన్నదల్లా శృంగార రసమే! దాన్ని రసాల్లోనే ఉన్నత స్థానం మీద కూర్చోబెట్టి, చర్మ సౌందర్యం గల్గిన బంగారు బొమ్మల స్త్రీ పురుషావయవాల్ని- వాటి సంయోగాన్ని పొగుడుతూ ఎంతెంతో కల్పన చేస్తున్నారు. అది నా హృదయాన్ని ఆకట్టుకోవడం లేదు. మనం చదువుకున్న పద్యం ఒకటి నాకు నిరంతరం గుర్తొస్తూ వుంటుంది- విను!

ఉ. ఆయువు వీచి చంచలము, యౌవన మల్ప దినో చితంబుపు
ష్ప్రాయుధళి జన్య సుఖ మస్థిర, మర్థము వాంఛ వోలె సా
పాయము, భో గముల్ మెరుపు లట్ల భవాబ్ధి లంఘనో
పాయము బ్రహ్మచింతనము బాయక సేయుడు సజనోత్తముల్"

"బాగుందమ్మా బాగుంది! నీ వాగ్ధాటికి అడ్డు లేకుండా పోయింది. ఇది వేదాంతప్రసంగం చేసే వయస్సా?"

"సఖీ! నీతో నిజం చెప్తున్నాను. విను! ఆ స్వయంప్రభలాగానే దివ్యాశ్రమం ఒకటి ఏర్పాటు చేసుకొని, యోగినిగా మారి తపస్సుచేసుకోవాలని నాకు గొప్ప అభిలాష సుమీ!" అందా రాజపుత్రిక.

"చాల్చాలు! ఇందుకా- నీకు ఆ సుందరి చరిత్ర అంటే అంత ఇష్టం? నీకిటువంటి అసహజమైనట్టి- వయస్సుకు తగనట్టి ఆలోచనలు, కలుగుతున్నాయేం?"

"ఏమో- చెప్పలేను. నా కోరిక తీరుతుందంటావా?"

ఈ ప్రకారంగా వాళ్ళ సంభాషణ సాగుతూంటూ, తమ తల్లిదండ్రులు తనను చూడవచ్చారని ఒక పరిచారిక వర్తమానం తెచ్చింది. హేమతో కూడ తల్లిదండ్రుల్ని చూడబోయింది స్వయంప్రభ.

కూతుర్ని ముద్దుచేత గౌరవించి, ఆ పక్కనే నిలబడ్డ హేమనీ వాత్సల్యంగాచూసి "అమ్మాయీ! బాగా చదువుకొంటున్నారా?" అని కుశల ప్రశ్నలు వేసి "హేమా! మీ ఇష్టసఖికి పెళ్ళి చేద్దామనుకొంటున్నాం! దేశ దేశాల రాకుమారుల చిత్రపటాలు తెప్పించాం! నువ్వు వాటిని బాగా పరిశీలించి, మీ స్నేహితురాలకి ఎవరు తగినవాడో ఏరి చూపించగలవు" అని వరుసగా వంద చిత్రపటాల్ని అక్కడ నిలబెట్టించాడు ఇంద్రమిత్రుడు.

ఆ యా రాజకుమారుల చిత్రపటాల పక్కనే వారి- వారి గుణగణాలన్నీ రాసి వున్నాయి. హేమ అవన్నీ పరిశీలించి, ఒక్కొక్కరిలో ఒక్కో లోపం ఎత్తి చూపి "ప్రభూ! వీరిలో ఎవరూ కూడా నా స్నేహితురాలు వరించదగిన వారు లేరు" అంది.

అప్పుడు రాజు చాలా ఆశ్చర్యపోయి "అలా అంటే ఎలా తల్లీ? ఇప్పుడు రాజ్యాలు చేస్తున్న చక్రవర్తుల పుత్రులందరి చిత్ర పటాలూ ఇవి! ఒక్కరినైనా వదలక అందరిలోనూ తప్పులు పట్టింది హేమ. నువ్వు చూసిన వాళ్ళంతా రేపు రాజ్యం చేయబోయే యువరాజులు. బ్రహ్మ సృష్టిలో లోపం లేని వాళ్లుంటారా? నిదానించి చూసి ఉన్నంతలో మంచి వాళ్ళని ఏరుకోవాలి గానీ! అమ్మాయీ! మరొక్క పర్యాయం విమర్శించిచూసి, ఎవరో ఒకర్ని ఎంపిక చేయగలవు" అన్నాడు. తండ్రి వంటి ప్రభువు మాట తీసెయ్యలేక ఇంకోసారి అందర్ని పరికించిచూసి పెదవి విరిచి "తమరే మన్నా మేలే గాని, వీళ్లలో నా స్నేహితురాలికి తగ్గవాడొక్కడూ లేడు" అని స్పష్టంగా చెప్పేసింది హేమ.

అప్పుడా రాజు "ఇదేం చిత్రమమ్మా? భూ మండలంలో వీరు తప్ప రాజ్యార్హత గల రాజకుమారులు ఇంక లేరు" అని, మరొక దస్తరంలో కట్టి ఉంచిన మరికొన్ని చిత్రఫలకాలు బైటకు తీయించి "వీళ్లందరూ రాజవంశం వాళ్ళేగాని, రాజ్యాధికారం లేని వాళ్ళు" అని చెప్పి వాటినీ చూడమన్నాడు. ఆ పటాలన్నీ పరిశీలించిన హేమ ఒకదానిపై గుర్తుపెట్టి "నా మిత్రురాలు వరించదగిన రాజపుత్రుడు ఇతడు" అని సూచించింది.

"గొప్పవాడినే ఎంచావు తల్లీ" అని రాజు వేళాకోళం చేస్తూ "ఇతడెవరో తెలుసా? భూరిశ్రవుడనే రాజుకి నాలుగో కొడుకు. ఇతనికి రాజ్యాధికారం ఎన్నటికీ సంక్రమించదు. సామ్రాజ్యప్రాప్తి లేని వాడికి నా కుమార్తెనిచ్చి కట్టబెట్టి కష్టాలపాలు చేయలేను" అని కుండబద్ధలు కొట్టినట్లు ప్రభువుల వారనడంతో హేమ మారు మాట్లాడక ఊరకొన్నది.

ఇక్కడ ఇంత చర్చ జరుగుతున్నా స్వయంప్రభ, తనకేమీ పట్టనట్లుగా కళ్ళు మూసుకొని ఏదో ధ్యానించుకుంటూ కూర్చుంది. అప్పుడు రాజు, తన కూతుర్ని చూసి "తల్లీ! నీ అభిప్రాయం ఏమిటో చెప్పావు కాదేం? నీ ఇష్టసఖి అభిప్రాయమే నీది కూడానా?" అని చెప్పమని ఎంతో లాలించి అడిగినప్పటికీ, ఆ చిత్ర పటాల వంక చూడడం గాని, ఒక్కమాటనైనా తన మనసు విప్పి చెప్పడం గాని స్వయం ప్రభ చెయ్యలేదు. రాజపత్ని కూతురికి

మెల్లన నచ్చచెప్పవచ్చునని “మీరింత తొందర చేస్తే ఎలా? అమ్మాయిని ఆలోచించుకోనివ్వండి!” అనడంతో రాజు “అదీ సమంజసంగానే ఉందని, అక్కడ నుంచి బయటపడి విహారానికి వెళ్ళిపోయాడు. ఇంద్రమిత్రుడు వెళ్ళాక, మనోహారిణి కూతుర్ని రకరకాలుగా లాలించి, బుజ్జగించి. బతిమాలి, కోపించి, మందలించి– ఎన్ని తీరులుగా చెప్పాలో అన్ని తీరులుగాను చెప్పింది. అయినప్పటికీ స్వయంప్రభ ఏమీ మాట్లాడేక పోయేసరికి, ఆమె హేమతో “నీ అభిప్రాయమే అమ్మాయికీ ఉన్నట్టుంది. పోనీ! రాజ్యం లేకపోతే నేమిలే? మాకు మాత్రం ఎవరున్నారు? మా రాజ్యమే ఏలుకుంటాడు,” అంది. హేమ తలూపుతూ ఏదో చెప్పబోతూంటే “మూఢురాలా! నిన్ను ఈ మాటలు చెప్పమని నేనెన్నడయినా చెప్పానా? నాకెందుకు పెళ్ళి? పో పోండిక్కడ్నించి” అని పలికి తానే అక్కడ్నించి వెళ్లిపోయింది.

అప్పుడు, కూతురి మాటలకు ఆ తల్లి ఆశ్చర్యాందోళనలు ప్రకటించగా “నేను మెల్లగా చెప్పి చూస్తాను. మీరు పదండి” అని రాజపత్నిని సాగనంపింది. ఆ తర్వాత హేమ, స్వయంప్రభను కలుసుకొని, చిత్రపటంలో తాను చూసిన రాకుమారుడ్ని పొగడ్డం ప్రారంభించగా, ఊరుకున్నంతసేపు ఊరుకొని స్వయంప్రభ “నా ఆశయం గ్రహించకుండానే ఊరక వాగుతావు దేనికి? చర్మం కప్పిన ఎముకల గూడును అంతగా పొగడాలా? నాకు కామమన్నదే లేదు. భోగాల మీద కోరికా లేదు. ఇక పెళ్లి చేసుకుని ఏం ప్రయోజనం? నువ్వు కావాలంటే, నీకు నచ్చినవాణ్ణి పెళ్ళి చేసుకుని సుఖపడు. నేనేదో ఆశ్రమంలో బ్రహ్మచారిణిగా వుంటూ తపస్సు చేసుకుంటాను” అని మళ్ళీ స్పష్టం చేసింది.

అప్పుడు హేమ “స్వయంప్రభా! నీ వేదాంతం అంతా మనోహరాకారుడైన పురుషుడు దొరికేదాకానే! నీ వైరాగ్యాన్ని ఆవలకు పెట్టించగల పురుషుడెక్కడో ఉండే ఉంటాడు. అతడు తారసపడకపోడు! ఎన్ని పురాణాలు చదివాం! ఎక్కడైనా స్త్రీలు పెళ్ళిచేసుకోం అని భీష్మించుక్కూర్చున్న కథ ఉందా? మహాశ్వేత అనే గంధర్వ పుత్రిక, పుండరీకుడనే ముని కుమారుని వరించి. అతని విరహం వల్ల విరక్తి చెందింది. అంతేకాని– మొట్టమొదటే అటువంటి

నియమాన్ని పెట్టుకుని కూర్చున్నదా? నీకు ఎంతో ఇష్టురాలైన ఆ స్వయంప్రభాదేవి మాత్రం, ఇహలోక సుఖాలు కాదని, కేవలం పరతత్త్వ జ్ఞానంతోనే బ్రహ్మచారిణి అయిందా ఏం? ఎక్కడా తనకు తగిన సుందరుడు లేడని, ముకుందుని పెళ్ళాడాలన్న తలంపుతో కదా అటువంటి నియమం పెట్టుకున్నది. విరక్తులకు అలంకారాలెందుకో? శృంగారం వెదజల్లే కనకమణిమయ గృహాలలో నివాసాలు దేనికో? గుహల్లో కూర్చున్నట్లయితే సరిపోదా? దమయంతి, చంద్రమతి, సీత మొదలైన పతివ్రతలకు వచ్చినంత పేరు ప్రఖ్యాతి మహర్షులకైనా రాలేదేం మరి? నువ్వేదో వెర్రి నియమాలు పెట్టుకోవడం వృధా! గొప్ప రాజకుమారుణ్ణి వరించు! పతివ్రతా ధర్మం పాటించు! కీర్తి సంపాదించు! విరాగిణిగా ఉండదగిన సమయం కాదిది" అని సుదీర్ఘంగా బోధపరచింది.

దానికా స్వయంప్రభ నవ్వుతూ "ఇల్లు కాలుతుంటే నూతులు తవ్వే చందంగా నేను ఉండదల్చుకోలేదు. ఈ దేహంలో రోగాలు ప్రవేశించకముందే- ఓపిక ఉడిగిపోకముందే జీవన్ముక్తికి ప్రయత్నిస్తాను" అని తిరిగి చెప్పింది. ఇక హేమకు సహనం నశించి, ఆ ప్రస్తావన అక్కడికి చాలించి, ఆటల గురించి ప్రసంగ కాలక్షేపం చేసింది"

అని చెప్పేసరికి వేళ మించిపోవడంతో, తరువాత కథని ఆవలి మజిలీలో మణిసిద్ధుడు ఇలా చెప్పసాగాడు...



# కాశీ మజిలీ కథలు

## 58వ మజిలీ

### వీణావతి కథ

తన ఎదుట విరిగిపోయిన ఒక వీణ నుంచుకొని "అయ్యో! నా వీణ నీ వల్ల కదా, విద్వాంసులంతా నన్ను సరస్వతీ సమానురాలు అన్నారు. ఎన్ని సభల్లోనో నీ వల్ల విజయం పొంది, నిన్ను ప్రాణంతో సమానంగా చూసుకొంటూన్న నాకు, ఆ రాజపుత్రి చేసిన అమర్యాద నీ పాలిట మృత్యువైపోయెగదా! నాకింక దిక్కేది? తరతరాలనుంచీ నువ్వు మా ఇంట గృహదేవతలాగా పూజింపబడుతున్నావు గదా! నీవల్లనే కదా మా వంశం వాళ్ళంతా సంగీత విద్యా విశారదులని బిరుదు వహించారు. ఆ రాజపుత్రిక నిన్ను త్రొక్కకుండా, నన్ను గట్టిగా కొట్టి విడిచినా నాకు ఇంత చింత ఉండకపోవును కదా! అయ్యయ్యో! నేటితో నీ ఋణం తీరిపోయింది కదా!" అని గాయకురాలు, వేశ్య అయిన వీణావతి, గిరిదుర్గం అనే ఆ పట్టణంలోని ఓ ఇంట్లో విచారిస్తూ కూర్చుంది.

అంతలో ఆమె తల్లి లీలావతి అక్కడకు వచ్చి "అమ్మాయీ! కన్నీళ్ళు తుడుచుకో! రాత్రి నుంచి నువ్వు ఆహారం-నిద్రా లేకుండా వీణ కోసం ఏడుస్తూ కూర్చున్నావని ఆమె తండ్రీ- ఈ పట్టణానికి ప్రభువూ అయిన ఇంద్రమిత్రులతో మనవిచేశాను. ప్రాణ సమానురాలైన ఆ రాజపుత్రికను ఆయన ఎదుటనే నిందించకు సుమీ! ఇప్పుడు నిన్ను ఊరడించడానికి

ఆయనే స్వయంగా ఇక్కడ కొస్తున్నారు" అని చెప్పింది. అంతలో ఆ ప్రభువు అక్కడికి రానేవచ్చాడు. లీలావతి ఆయనకు ఎదురెళ్ళి లోపలకు తీసుకొచ్చింది.

వీణావతి కూడా లేచి నిలబడి ఆ మహారాజుకు నమస్కరించింది. ఆసనంపై కూర్చుంటూ "వీణావతివి నువ్వేనా? నిన్న నీ వీణను మా పుత్రిక స్వయంప్రభ విరగ్గొట్టిందట! ఏం జరిగిందో వివరంగా చెప్పు" అనేసరికి, ఆ వీణావతి కన్నీళ్ళు ఇంకో తెర కమ్ముకురాగా, అవి తుడుచుకొంటూ ఇలా అంది.

"దేవా! దేవర వారి ఆజ్ఞానుసారం సంగీతంతో తమ కుమార్తెకు ఆనందం కలిగించమని హేమ అనే ఇష్ట సఖి నన్ను తమ పుత్రిక అంతఃపురోద్యానంలోని మేడలోకి తీసుకెళ్ళి, అమ్మాయిగారికి పరిచయం చేసి, తమ అనుజ్ఞమేరకు నన్ను అక్కడ ప్రవేశపెట్టినట్లుగాచెప్పింది. నేను తంత్రులు మేళవించుకొనేలోగా ఉద్యానవనంలో విహరించి వచ్చి, ఒక పీఠంపై కూర్చొని, "నీకు పెళ్ళైందా?" అని నన్ను అడిగింది. "లేదు. మా కులంలో చాలా మంది కన్యలుగానే ఉంటారని జవాబు చెప్పాను. తమ పుత్రిక అందుకు ఎంతో సంతోషించినట్లుగా కన్పించింది. తన ఇష్టసఖితో "చూశావా! నా మాటలు నీకు ఎకసెక్కంగానే ఉంటాయి గాని, వీళ్ళకులంలోనే చాలా మంది పెళ్ళికాని కన్యలున్నారు. నాకు లోకానుభవం లేదంటావు ఇదిగో! నువ్వు చెప్పమ్మాయ్! ఈమె 'పెళ్ళాడు-పెళ్ళాడు' అంటూ నన్నూరకనే నిర్బంధిస్తోంది" అంటూనే నా వైపు తిరిగేసరికి, హేమ ఫక్కున నవ్వింది. ఆమెకు తెలుసుననుకుంటాను- మా కళావంతులకు వేశ్యావృత్తి ఉన్నందువల్ల, మాకు పెండ్లిజరగదని. తమ పుత్రికకు పెళ్ళి పట్ల వైముఖ్యమేలనన్నది నాకు తెలీదుకాని, పెండ్లాడని వాళ్ళంటే తగని అభిమానం అని మాత్రం నాకు బోధపడింది.

ఇంతలో హేమనన్ను పాడమంటూ కనుసైగ చేసేసరికి, నేను చక్కని రాగం ఆలాపించి, శృంగార భావజాలాన్ని పెంపొందించే శ్లోకాలు చదివి కొన్ని కృతులు ఆలాపించబోతూంటే, తమ పుత్రి, "భక్తి రసావేశమైన కీర్తనలు

పాడకుండా, బూతు కూతలు పాడతావా?'' అంటూ నా వీణ తుత్తునియలయ్యేలా ఒక్క త్రొక్కు త్రొక్కి అవతలికి వెళ్లిపోయింది. శ్రీరాముడిచేత విరవబడిన శివధనువు ఫెళ్ళున రెండు ముక్కలైనట్లుగానే, ఇదిగో- ఈ వీణ కూడా అలా రెండు ముక్కలైంది. హేమ నాకు ఏది నిర్దేశించిందో అది నేను పాడడం నా తప్పా?" అని నిగ్గదీసింది. రాజు చాలా విచారించి "అయ్యో! అలాగా వీణలకేం కొదువ? నీకు దీనికి తగ్గ నష్టపరిహారం ఇప్పిస్తానులే! ఇంతకూ నా కూతురికి వైరాగ్యబుద్ధి మరలింది కాదు" అని నిట్టూర్చి అతడు గుర్రమెక్కి ఇంటికి వెళ్లిపోయాడు.

ఆయన వెళ్లాక వీణావతి తల్లితో "అమ్మా! రాజుగారికీ వీణ గొప్పదనం ఏం తెలుస్తుంది? అంగట్లో దొరికే సాధారణ వీణ అనుకుంటున్నారు ఆయన. లక్షలు పోసినా దీనికి సరితూగగల- ఇట్లాటి మేళన సౌలభ్యం గల వీణ సంపాదించగలమా? గ్రహచారం చాలక ఆ పిల్ల పాలబడి, దీనికి మూడింది" అంటూనే, పశ్చాత్తాపం చెందుతూ తాను సంస్కార రహితంగా ప్రవర్తించినందుకు క్షమాపణ చెబుతూ- స్వయంప్రభ మరొక్కసారి వీణావతిని తన మేడకు రప్పించి, తానే స్వయంగా తన మెడలోని రత్నాలహారం తీసి వీణావతి మెడలో వేసి "ఇది నీ వీణ వెలకంటే ఎన్నో రెట్లు విలువైనదిగా గ్రహించు! నీకు నచ్చిన రత్న పరీక్షకుని చూపిస్తే దీని వెల ఎంతటిదో అతడే చెప్పగలడు" అని కొంత దుఃఖం ఉపశమింపజేసి, వెళ్లిరమ్మంది. ఆ రాత్రే తల్లీ కూతుళ్లిద్దరూ ఆ నగరం వదిలి వెళ్లిపోయారు.

వీణావతి గొప్ప పాటగత్తె కనుక, ఏదో అవసరార్థం ఓ వీణని కొని, పాడడానికి వాడుతున్నా 'అపురూపమైన ఆ వీణ కోల్పోయానే' అనే బాధనుండి ఎంత కాలానికీ తేరుకోలేకపోతున్నది.

చాలా పట్టణాలు పాడుతూ తిరిగిన వీణావతి ఒక రోజు కాళీ గుప్తమనే పట్టణాన్ని చేరుకున్నది. అక్కడో సత్రంలో బస చేశారా తల్లీ కూతుళ్ళు.

అక్కడొకచోట యౌవన పురుషుని చిత్రం ఒకటి చూసి విస్మయపడి, అందులో పెద్దవీణచూసి, అది తన వీణవలె ఉందని ముచ్చటపడిన వీణావతికి, అది చిత్రకారుని ఊహ అనిపించింది. అది ఆ రాజుగారి

నాలుగవ కొడుకు సహదేవుని చిత్రపటం. అతడు గానప్రియుడు. అతడి గురించి తల్లిని తెలుసుకుని రమ్మని పంపింది వీణావతి. అతడి అందం బొమ్మలో చూసిన దానికంటే ఎక్కువగా ఉంది. ఆమె వెళ్ళేసరికి అతడు అదే వీణను ముందుంచుకొని పాడుతున్నాడు. ఆ సంగీత విద్యా విశారదుని ముందు తన కూతురు పాడగలదో- లేదో అని కూడా ఆమెకు సందేహం కలిగింది. సరిగ్గా అది విరిగిపోయిన వీణావతి వీణను పోలి వుంది. తన కూతుర్ని పాడనివ్వమని అనుమతి అడిగి వచ్చింది- లీలావతి.

ఆ రాత్రి అతడి వీణను మీటి ఆమె పాడేసరికి. అతడు కూడా అలా పాడిన వారిని ఇంతవరకు తాను చూడలేదని- వీణావతి బిరుదు నీకు తగివుందని ప్రశంసించాడు. సందర్భవశాత్తూ తన వీణ భగ్నమైపోయిన తీరు అంతా వివరించి, "కానీ- ఆ రాజపుత్రి స్వయంప్రభ అందం మాత్రం అసమాన్యమైనది" అని చెప్పింది. ఆమె తర్వాత పశ్చాత్తాపంతో తనకిచ్చిన హారం చూపించింది.

అతడామె వీణ తెప్పించి చూసి "ఇది విరగలేదు. నువ్వు చెప్పిన సుందరి యొక్క మృదుపదఘాతానికి మధ్యనున్న అతుకు ఊడింది అంతే! దాన్ని సరిచెయ్యడానికి నాకు ఏం పారితోషికం ఇస్తావు" అని అడిగాడు. అతడారాత్రి అన్నంతపనీ చేశాడు. మర్నాడొచ్చి తన వీణ తిరిగి శృతిపక్వంగా పలకడం చూసిన ఆనందంలో వీణావతి, అందుకు ముందురోజు రాత్రి తాను అతడికి మాట ఇచ్చిన ప్రకారం, అతనికి స్వయంప్రభాదత్తమైన రత్నహారాన్ని కానుకగా అందజేసింది. అక్కడితో ఆగక, ఆయన పాదాలపై సాష్టాంగపడి, "దేవా! నేటి నుంచి జీవితాంతం నేనీ వీణమీద పాడినపుడల్లా మొదట మీ నామమే స్మరించుకుంటాను" అని కూడా కృతజ్ఞత ప్రకటించింది.

"ఏదో మాటవరసకు అన్నాను గానీ- క్షత్రియులం.. మాకీ రత్నహారాలకు ఏం కొదువ? వద్దు- వద్దు తీసుకో" అని సహదేవుడా హారాన్ని ఆమెకు ఇవ్వబోతే, తాను మాట తప్పిన దాని నౌతానంటూ వీణావతి తిరిగి ఆయనకే ఇచ్చేసింది. అప్పుడతడు "మనం మన ధర్మాలకు విరుద్ధంగా ప్రవర్తించకూడదు" అంటూండగా అతని సహోదరి సావిత్రి అనే చిన్నది

అక్కడికొచ్చి వారి వాదం విని "అన్నా! నీకు ఏడాదికి తండ్రిగారి వల్ల వచ్చే పదివేల నిష్కాలు. ఈ వీణావతి కిచ్చావనుకో! అది ఎటూ హారం విలువకు సరితూగదు కనుక ఇద్దరి పంతాలూ చెల్లుతాయి. కానుకగానే ఆమె హారం ఇచ్చినట్లూ అవుతుంది. ఎంతో కొంత వెల చెల్లించినందున ధర్మం తప్పనివాడవు నీవు కాగల్గుతావు" అని మధ్యే మార్గం సూచించింది.

అయితే, తల్లికీ వృత్తాంతం తెలిసి, కూతుర్ని మందలించింది. "అమూల్యమైన హారాన్ని అతని పరం చేశావేం? నీవు భోగం కులానికే మచ్చతెచ్చేలా వున్నావే! అతడు చిర్నవ్వుతో నీ కానుకను తిరస్కరించినపుడయినా, మన కులబుద్ధి చూపావు కాదు!" అంటూ నిష్ఠూరాలాడింది.

అంతా విన్న వీణావతి ''అమ్మా! నేనంత ఆనాలోచితంగా చేశాననుకుంటున్నావా? స్వయంప్రభ హారాన్ని తమ పెద్దలకి తెలీకుండా ఇచ్చినపుడు- రేపెప్పుడైనా దాని ప్రస్తావన వస్తే మనం పట్టుబడతాం అని ఆలా చేశాను" అంది.

తరువాత మజిలీలో మణిసిద్ధుడా కథను ఇట్లా చెప్పసాగాడు.



# కాశీ మజిలీ కథలు

## ౭౭వ మజిలీ

ఆహా! లోకులు ఎలాంటి నిందలు అక్రమంగా మోపగలరో కదా! మా అన్న ఏ పాపం ఎరగని వాడైనా అక్రమ వ్యాపారి అని అపనింద వేశారంటే,ఆ వీణావతి స్నేహం వల్ల కాబోలు! ఈ సంగతి అన్న గారికి చెప్పాలి.. అనుకుంటూ సహదేవుని చెల్లెలు సావిత్రి, అన్నగారి నివాసానికి వెళ్ళింది. అప్పటికి అతడు మంచం మీద పడుకుని ఏదో ఆలోచిస్తున్నాడు.

"అన్నా! మొన్న నువ్వు ఆ వేశ్యకిచ్చిన పదివేల నిష్కాలకు లోకులు పెడర్థాలు తీశారు. తండ్రిగారు నన్ను పిలిచి అడిగారు. నేను ఆ అపవాదు ఎందుకొచ్చిందో సవివరంగా చెప్పాను. నీకు పెళ్ళి చేద్దామని తల్లిదండ్రులు ఆలోచిస్తున్నారు. వారిని ఆ చింత ఎక్కువగా బాధిస్తోంది. నువ్వు కోరాలేగాని, నిన్ను వరించని స్త్రీ ఉంటుందా? నిందల పాలయ్యేకంటే దేశాటనం చేసి అయినా నీకు నచ్చిన కన్యను పెళ్ళాడవచ్చు కదా!" అని బోధచేసింది.

"సహోదరీ! నీ ఆదరమెంతో మెచ్చదగింది. వీణావతి వల్ల స్వయంప్రభ వృత్తాంతం నువ్వూ విన్నావు కదా! నాకు మొదట్నుంచీ రూపవతి అయివుండీ, వైరాగ్యవతి అయిన సతి ఉండాలని అభిలాష. నీకు అవకాశం వుంటే, ఆ రాచకన్నెతోనాకు పెళ్ళి జరిగించు! నీ కంటే నాకు అంతరంగికులెవరు?" అన్నాడు సహదేవుడు.

"అన్నా! నీ సంకల్పం, మొన్న ఆహారం నువ్వు దక్కించుకున్నప్పుడే నేను గ్రహించాను. ఆమె ఎంత వైరాగ్యవతి అయినప్పటికీ– తనంత తానుగా వచ్చి నిన్ను వరించేలా చేస్తాను. నా బుద్ధి బలం చూడు! ఉపాయానికి సాధ్యంకాని పనులుంటాయా?

నువ్వు ముందుగా అక్కడికి వెళ్ళు! ఆమె చర్యలన్నీ పరిశీలించి నాకు తెలియచెయ్యి! తర్వాత కర్తవ్యం ఆలోచిద్దాం!" అంటూ ఏమేమో చెప్పింది. ఆ పలుకులు అమృత బిందువులై సోకగా, అతడు ఆనందపడి "చెల్లీ!నీ బుద్ధిబలాన్ని ఎరుగబట్టే, నా గుట్టు- నా లోపలి ఆలోచనలు నీకు చెప్పాను. స్త్రీ లోలులను చూసి పరిహసించేవాడినే! అయినప్పటికీ నాకెందుకో ఈ స్త్రీ మీద లాలస కలిగింది. ఇది పరిహాసాస్పదం కాకపోదు. విరహసంతాపం కూడ క్షణక్షణానికీ అధికమవుతోంది. కాలయాపనం సైపను. పెళ్ళి మాట తలపులోనికి వచ్చినంతనే, మన్మధచేష్టల్తో ఆ కాంత నన్ను కవ్విస్తున్నట్లుగా ఏవేవో ఊహలు వస్తున్నాయి. ఆమె తనకు తానై వచ్చి వరించేలా చేస్తానంటున్నావు. అది ఎలా నీకు సాధ్యమో నాకు తెలీడం లేదు. నిజం చెప్పు! ఇదేదో నన్ను ఓదార్చడానికి అనే మాట కాదు గదా!" అంటూ అడిగిన మాటనే అడుగుతూ, పిచ్చివాడిలా ప్రలాపాలు చేస్తుంటే, అతడెలా మెలగాలో- ఏమేమి చెయ్యాల్సి ఉంటుందో బోధించి ఓదార్చింది సావిత్రి.

ఆమె తమ తల్లిదండ్రుల వద్ద కూడ "సోదరునికి తగ్గ కన్య లభిస్తే పెళ్లాడకుండా ఎందుకుంటాడు?" అని వాదించింది. సోదరునికి ఆమె, తానిచ్చిన మాట నిలబెట్టుకోడానికి త్రికరణ శుద్ధిగా కట్టుబడింది.

మిగతా కథను ఆవలి మజిలీలో చెప్పడానికి, గోపాలుని ఒప్పించి అక్కడనుంచి బయలుదేరాడు మణిసిద్ధుడు.



# కాశీ మజిలీ కథలు

## ౧౦ వ మజిలీ

### స్వయంప్రభా విరక్తి కథ

"సాధ్వీ! స్వయంప్రభ చేసిన పని గురించి విన్నావా? వీణావతి అనే వేశ్య పాడిన సంగీతంలో, శృంగార శ్లోకాలొచ్చాయని, పంతానికి ఆమె వీణ విరగ్గొట్టిందట! దాని బుద్ధి మరల్చే మార్గం ఏమిటో నాకేమీ అంతుపట్టడం లేదు. దానికీ వైరాగ్యం ఎవరుపదేశించారో ఏమిటో?" అన్నాడు ఇంద్రమిత్రుడు తన భార్యతో. ఈసారి గట్టిగా మందలిస్తానని అంది మనోహారిణి.

ఆమె మర్నాడు తన కుమార్తె ఉన్న సౌధానికి వెళ్లేసరికి, స్వయంప్రభ ఎప్పటిలాగానే తన చెలికత్తె హేమకు పెళ్లి పట్ల తన విముఖత గురించి చెప్తోంది. ఆమె కూతుర్ని అక్కున చేర్చుకుని "తల్లీ! నిన్ను కనడానికి మేము పడినపాట్లు ఇతరులు పడి ఉండరని నిస్సంకోచంగా చెప్పగలను. నీకు ఎప్పుడెప్పుడు పెళ్ళి ఈడొస్తుందా? నీ పెళ్లి వైభవంగా చేద్దామా? అని మేము ఉవ్విళ్లూరాం! నీకు యుక్తవయసొచ్చింది. పెళ్ళాడి నీ యవ్వనం సార్థకం చేసుకో! సంగీతం పాడిన బోగందాని వీణ విరగ్గొట్టావట! ఇదేం ఆగడమే! పెళ్ళిమాట ఎవరెత్తినా తిడుతున్నావట!" అని కూతురి మెడలోని హారాన్ని సవరిస్తూ తటాలున ఏదో జ్ఞాపకం వచ్చిన దానిలా "ఏమే! నీ మెడలో విలువైన రత్నహారం వుండాలి! విరక్తి కొద్దీ అది కూడా తీసిపారేశావా ఏమి? నీ మీదగల ప్రేమ ఎక్కువై, నీ తండ్రికి కూడా చెప్పకుండా, ఆభరణాలుంచిన పెట్టెలోంచి దాన్ని తీసి నీ మెడలో వేశాను. నీకు అక్కర్లేకపోతే అది తిరిగి పెట్టెలో పడేస్తాను. దానికేదో గొప్పశక్తి ఉందనీ అది

కులక్రమాగతంగా తరతరాలుగా వస్తోందని చెప్పారాయన. దాని శక్తి సంగతి నాకు ఏమాత్రం గుర్తు లేదు. పాత నగ మోటుగా ఉందని పారేశావా? నిజానికి దాన్ని ధరించడానికి ఎవ్వర్నీ అనుమతించడాయన" అని తొందరగా ఆ హారం సంగతి అడిగేసరికి హేమ తెల్లబోతూ "ఇంకెక్కడుందా హారం? వీణ విరగ్గొట్టినందుకు నష్టపరిహారంగా, దాన్ని ఆనాడే వీణావతి పరం చేస్తేనూ?" అంటూ అసలు సంగతి చెప్పేసరికి, ఆ రాజపత్ని ముఖం కళతప్పింది.

భర్తకీ సంగతి తెలిస్తే ఎంత రగడ అవుతుందో- కానీ, చెప్పక తప్పదు కదా! అని నిట్టూర్చి, మెల్లగా అక్కడ్నుంచి బయలు దేరింది. ఇంద్రమిత్రుడు అంతఃపురానికి విచ్చేశాక, సేదతీర్చి హారం విషయం చెప్పేసరికి, అతడు హాహాకారం చేసి మూర్ఛపోయాడు.

ఎన్నో ఉపచారాల తర్వాత, అతడు కొద్దిగా తెప్పరిల్లి "ఛీ! మీ ఆడజాతికెన్నటికీ వివేకం కలగదేం? అతి రహస్య వస్తువు అని చెప్పినా దాన్ని పైకి తీసిన నీ బుద్ధి మాంద్యత నేమనాలి? అయ్యయ్యో! హారం చేజారడం కాదు- నా సామ్రాజ్యానికీ అన్యాధీన యోగం తటస్థించింది" అని దుఃఖించసాగాడు. దాంతో ఆమెకూడా విలపించసాగింది.

ఆ హారం ఎవరి దగ్గరకు చేరితే వాళ్ళు ఆరుమాసాల్లోగానే, ఆ రాజ్యానికి రాజులవుతారుగనుక, వీణావతియే స్వయంప్రభని ప్రలోభపరచి రత్నహారాన్ని ఎత్తుకుపోయిందని మంత్రులకు చెప్తూ, ఆ వారకాంత ఎక్కడున్నా పట్టి తెమ్మని భటుల్ని నలుదిక్కులా పంపాడారాజు". అని చెప్పేవరకు వేళ అతిక్రమించడంతో, తర్వాత కథ అవ్వలి మజిలీలో చెప్పసాగాడు మణిసిద్ధుడు.



# కాశీ మజిలీ కథలు

## 61వ మజిలీ

"సఖీ! అది వెల అధికంగా వుండే వస్తువు అయితే కావచ్చు అనుకున్నాంగానీ- అంత మహిమగలదని మాత్రం అనుకోలేకపోయాం! నా బుద్ధి కూడా అప్పుడు మొద్దుబోయింది. 'బుద్ధిః కర్మానుసారిణి' అని పెద్దలమాట! అది తప్పుతుందా! ఆ హారం ఎవరిదగ్గర ఉంటే, వారే ఈ దేశాన్ని పరిపాలిస్తారట! మన ఎంతో ప్రమాదకరమైన పనిచేశాం! ఈ రాజ్యం ఇక ఆరుమాసాలయ్యాక బోగంది పరిపాలిస్తుందట!.... పురప్రజలు చెప్పుకుంటుంటే తెలిసింది. అంతఃపురంలో ఏకాంతంలో అనుకున్న మాట బయటికెలా వెల్లడైందో తెలీదు. ఏం చేయాలో తోచడం లేదు" అంటూ హేమ, స్వయంప్రభతో చెప్పి విచారించసాగింది.

అందుకా రాజపుత్రి "కాలగతిని ఎవరు అతిక్రమించగలరు? పోయేదాన్ని మనం ఆపగలమా? పోనీ! అదీ మంచిదే! వైరాగ్యంతో తపస్సు చేసుకోవచ్చు!" అంది నిర్లిప్తంగా.

ఇంతలో- రాచనగరి నుంచి పిలుపురాగా వెళ్ళివచ్చిన హేమ తిరిగొస్తూనే "స్వయంప్రభా! నీ మీద మీ తల్లిదండ్రులకు ఎంత ప్రేమో చూడు! నువ్విలా వైరాగ్యబుద్ధి ప్రదర్శిస్తూంటే- జరిగిందానికి నువ్వెక్కడ బాధపడిపోతున్నావో అనుకుంటూ, నిన్ను ఓదార్చవలసిందిగా, వాళ్ళు నాకు చెప్పి పంపారు. రాజ్యం పోయేంత పని నీవు చేసినా, నీ మీద వారికి అనురాగమే తప్ప ఇసుమంతైనా కోపం లేదు".. అని వస్తూ వస్తూ తాను సేకరించిన ఇంకొక విషయం స్వయంప్రభకు నివేదించింది.

"మన వూరికి దగ్గర్లో గల రత్నగిరి పాదంలో వెలసిన స్వయం ప్రభాదేవి ఆలయానికి ఎవరో యోగి వచ్చి విడిది చేశారట! ఆయన అత్యద్భుత ప్రతిభ కలవాడట! మీ తండ్రిగారు కొద్దిమంది పరిజనంతో రహస్యంగా, ఆ యోగిపుంగవుని దర్శనానికి వెళ్లగా- దర్శనం ఇవ్వకుండానే వీరు వచ్చిన పనంతా చెప్పి " మీ రాజ్యానికి ఎటువంటి భంగమూ ఉండదు. ఆ హారం తిరిగొచ్చి మీ కూతురి కంఠాన్ని అలంకరించగలదు" అని చెప్పి ఓదార్చాడట! అది మీ తండ్రిగారు మీ అమ్మగారికి చెప్పారట! నీకూ చెప్పమన్నారు. ఆ తపస్వి చాలా సత్యవంతుడట!"

యోగులు- తాపసులు- అవధూతలు అంటే ఆసక్తి గల స్వయంప్రభ "ఆ యోగి వరుని చరిత్ర మనం తెలుసుకోవాలి! నువ్వు ఒంటరిగా వెళ్ళి అతని వివరాలు తెలుసుకుని రా" అని ఎంతగానో బతిమలాడింది. హేమనవ్వుతూ

"నీ ధైర్యమే ధైర్యం. రాజ్యం పోతుందంటే భయపడవు. యోగుల చరిత్రలు తెలుసుకోమంటావు. ఆయన వివరాలు- చరిత్రా మనకేల?" అంది- "మహాత్ముల దర్శనం వల్ల ఎన్నో లాభాలున్నాయి. పోయి చూసిరా!" అని చెప్పగా ఆమె తక్షణం వెళ్ళి చూసిరాగా, "దర్శించావా- ఆ మహాత్ముని తపమేమిటి? కుల శీల నామము లెట్టివి? అంతా సవిస్తరంగా చెప్పు!" అని అడిగింది స్వయంప్రభ.

## అద్వైత శివానంద యోగి కథ

**"చె**లీ! అమ్మవారి ఆలయంలో ఈశాన్యాన ఉన్న కల్యాణమంటపం మీద కూర్చొని ఉన్న ఆ యోగిని దర్శించానమ్మా! నువ్విచ్చిన పూలు సమర్పించాను. పక్కనే ఒక యోగిని కూడ కూర్చొని తావళం తిప్పుతోంది. ఆ మహాత్ముడెంత అందగాడనుకున్నావు?" అంటూ హేమ, వర్ణన ప్రారంభించేసరికి "అతని ప్రభావం చెప్పు!చాలు!" అని కసురుకుంది స్వయంప్రభ.

"నేను మెల్లగా వెళ్ళి, ఆయనకు చేరువగా కూర్చోగా, తావళం తిప్పుతున్న యోగిని నేనెవరని ప్రశ్నించింది. నేను జవాబు చెప్పేంతలో యోగిపుంగవులు "నీ పేరు హేమ. నువ్వు స్వయంప్రభ సఖివి" అనడంతో నేను అబ్బురపడి "త్రికాలవేదులు, మీకు తెలీనిదేమున్నది?" అని నమస్కరించాను.

వెంటనే ఆయన శిష్యురాలు కాబోలు- ఆ యోగిని "స్వామి! తపోవిఘ్నం గావించుకుని మరీ స్త్రీతో మాట్లాడడం వింతగా వుంది" అంది.

అప్పుడా జడధారి "సహోదరీ! ఆ రాజుపుత్రిక చిత్త శుద్ధి ఎంత గొప్పదనుకున్నావు? ఆ వైరాగ్యమూ- వేదాంతశ్రవణాసక్తీ- శాంతం మహర్షులకైనా ఉండవు. అదంతా అంతర్ దృష్టితో చూసే ఇలా మాట్లాడాను" అని మళ్ళీ ఆయన ధ్యాన  నిమగ్నుడయ్యాడు.

ఆ యోగిని, అది చూసి "ప్రత్యేక ధ్యానముద్రలో ఉన్నారు స్వామి" అని నన్ను అక్కడ్నుంచి దూరం తీసుకుపోయింది. స్వయంప్రభా! ఇది విన్నావా? ఇల్లూ-వాకిలీ వదిలి ఆయన వెన్నంటి వుండి సపర్యలు చేస్తూన్నా ఆమెతో కూడా అతడు మాట్లాడడట! ఆ భాగ్యం నాకు దక్కింది. ఆయన పేరు అద్వైత శివానంద యోగి అట! చిన్నప్పుడే శంకరుడు ప్రత్యక్షమై మంత్రోపదేశం చేశాడట! వారి చెంత స్త్రీ ప్రసంగం ఇంచుకైనా సహించరు. ఆమెని కూడా ఎన్నో కఠిన పరీక్షల అనంతరం సన్యాసదీక్ష ఇచ్చి సోదరునిగా తండ్రిగా సంరక్షిస్తున్నారట! శిష్యురాళ్ళవుదామని ప్రయత్నించి ఎవ్వరొచ్చినా పంపించేస్తున్నారట!" అనగానే, "చూశావా! లోకంలో కొందరే మహాత్ములుంటారు. మనం ఒకసారి ఆయన్ను దర్శించుకురావాలి. గొప్ప వారి సందర్శనానికి పెద్దల అనుమతి అక్కర్లేదు. దేవతా- మునిజన దర్శనాలకు వాహనమెక్కి వెళ్లరాదు. కనుక కాలినడకనే శ్రమించి అయినా మర్నాడే ఆ మహాత్ముని దర్శించి తీరాలి అంటూ పట్టుపట్టి హేమని ఒప్పించింది స్వయంప్రభ.

వాళ్ళు అక్కడికి వెళ్ళేసరికి యోగిని ఒక్కర్తే మంటపంలో జపం చేసుకుంటోంది. ఆమెనుచూసి స్వయంప్రభ ఆశ్చర్యపోయింది. యోగిని రాజకుమారి చేతిని ముద్దాడి "రాచపుత్రికవైనా నీ వైరాగ్యం ఎవరికీ లేదు"

అని పొగుడుతూంటే, ఆమె "నీ కంటే ధన్యులెవరు;" అని అతి వినయంగా జవాబు చెప్పింది. తరువాత వారిద్దరూ సంభాషించుకోవడంలో- స్వయంప్రభకు మరికొన్ని విషయాలు బోధపడ్డాయి. వాటి సారాంశం ప్రకారం "స్త్రీలు కామ విముఖులు కావడమే అరుదు. కాని విరక్తుడైన వాడినే వరించి పతివ్రత అయి ముక్తి పొందగలదు. విరక్తుడు వివాహానికెలా అంగీకరిస్తాడు? పరోపకారం కోసం పరిణయమాడడం మునులకొక వాడుకగా ఉంది. అగస్త్యుడు అటువంటి వాడే! కామాసక్తితో మాత్రం కాదు" అని.

గురువుగారు ధ్యానంలోంచి లేచే వేళయిందీ- లేనిదీ చూసి వస్తానని యోగిని అటు వెళ్ళగానే, స్వయంప్రభ "ఈమె మాటలు వింటూంటే, ఈ తపస్వి నన్ను కూడా పెళ్లిచేసుకోమంటాడేమిటి?" అంది హేమతో. "దానికింత విచారం దేనికీ? ఒక వేళ ఆయన అలా సెలవిచ్చినపుడు- తమ కంటే విరక్తులెవరూ నాకు దొరకరు. తామే నన్ను భార్యగా స్వీకరించండి-అను! ఎలా వుంటుందో చూద్దాం!" అంది హేమ.

"చాల్చాలు! మునులు ముక్కోపులు! వారితో పరిహాసాలాడమని గొప్ప సలహా చెప్తున్నావే!" అంది స్వయంప్రభ.

ఇంతలో యోగిని, హారం తెచ్చి స్వయంప్రభకు ఇచ్చింది. స్వయంప్రభ ఆశ్చర్యపోయి ఏకంగా ఆమెపై ప్రశ్నల వర్షమే కురిపించింది. దానికా యోగిని చిరునవ్వే సమాధానంగా కొంతసేపు స్వయంప్రభను అలాగే చూసి "రాజపుత్రీ! తపస్సుకు సాధ్యంకానిదంటూ ఏదీ ఉండదు కదా! నీ రాక, మన సంభాషణ, అంతా వారి దివ్యదృష్టికి కనిపించింది కాబోలు! ఈ మణిహారం నా చేతిలో పెట్టి తిరిగి ధ్యానంలోకి వెళ్ళిపోయారు" అందా చిరునవ్వే కొనసాగిస్తూ.

ఆ యోగి పుంగవుని ఆత్రంగా చూడబోయిన స్వయంప్రభ ఉత్సుకత మరికొంత పెంచాక, అప్పుడు ఆయన్ను దర్శనం చేయించేసరికి, ఆ తేజస్సుకి స్వయంప్రభ అలా అట్టే చూస్తూండిపోయి, ఆయన పాదాలపై పడింది. ఆమె చేతిని పట్టుకుని లేవదీసి, మృదువుగా ముద్దుపెట్టుకున్నాడా యోగి.

వెంటనే యోగిని స్వయం ప్రభను అక్కడనుంచి పదమంటూ తొందరచేసి, "ఎవర్నీ కన్నెత్తి అయినా చూడని,ఆ మహాత్ముడు నిన్ను కరుణించాడు. నువ్వు ఇంటికి వెళ్ళు! ప్రసాదం ఇచ్చి హేమను త్వరగా పంపుతాను" అంది. ఆ పూట స్వయంప్రభకు చాలా ఆనందం కలిగింది. ఇంటికి వెళ్ళి హేమ రాకకోసం ఎదురుచూడసాగింది.

హేమ వస్తూనే "సఖీ! నువ్వెళ్ళాక యోగిని ద్వారా గురువరేణ్యుల మనస్సు గ్రహించి మెసలుకోగల విరక్తురాలివి నువ్వేనని మాకు అర్థమైంది. ఆయన నిస్సంగత్వం- నిర్మోహత్వం లోకవిదితం. గాంధర్వ విధిన నీవు ఆయన్ని వివాహమాడు! లోకం దృష్టిలో పెళ్ళైనా మీ- మీ అభీష్టాల మేరకు సంచరించవచ్చు! దీనికి యోగిని సహకారం ఉంది" అని స్వయంప్రభను ఒప్పించింది. తండ్రి, అటువంటి యోగితో పెళ్లికి అంగీకరించడు గనుక, గాంధర్వమే విధి అని ఆ ప్రకారం జరిగించి, మూడు రాత్రులు ఇద్దర్నీ ఒకేచోట వదిలి, హేమ, యోగిని ఆ మంటపం వద్ద నుంచి తప్పుకున్నారు.

తర్వాత కథను పై మజిలీలో ఇట్లా చెప్పాడు మణిసిద్ధుడు...



# కాశీ మజిలీ కథలు

**62వ మజిలీ**

"అయ్యా! మేమేం నేరం చేశాం!? అక్రమంగా మమ్మల్నిలా బంధించి తీసుకుపోతున్నారే! రాజపుత్రిక పారితోషికం ఇవ్వగా తీసుకున్నాం! అది అప్పుడే సహదేవుడనే రాజకుమారుడికి అమ్మేశాం! ఇప్పుడా హారాన్ని తెమ్మంటే మేమెలా తీసుకురాగలం? అవి మణులో- గాజుపూసలో మాకేమన్నా తెలుసా?" అని వేడుకుంటున్నా రాజభటులా వేశ్యాంగన లిద్దరినీ గిరిదుర్గానికి తీసుకువచ్చారు.

అప్పటికి ఇంద్రమిత్రుడు నగరంలో లేకపోవడంతో, వారిని వెంటనే విచారించడానికి వీలుకాక నిర్బంధంలో ఉంచారు. స్వయంప్రభను కలుసుకుని వస్తానని వీణావతి భటుల వద్ద అనుమతి తీసుకుని, ఉద్యానవనానికి వెళ్ళింది. ఆ సమయానికి ఆమె, హేమతో మాట్లాడుతోందని- కొంతసేపు నిరీక్షించవలసి వచ్చింది.

ఈలోగా హేమతో స్వయంప్రభ గత మూడురాత్రులుగా, ఆ యోగిపుంగవుడు తన పట్ల ఎలా ప్రవర్తించిందీ చెప్పసాగింది. "జాణ అయిన ఆ యోగిని పగలంతా నాకు రకరకాలుగా అతని వైరాగ్యవర్తన గురించి ఒక పక్క బోధిస్తూనే- మహాత్ముల చేష్టలు అద్భుతంగా ఉంటాయి. స్త్రీ ప్రశంసనే సహించని వాడు, నీ పక్కలో చేరినందుకు సంతోషించాలి కాని చింతిస్తావా? ఈ రాత్రి అతడు చెప్పినట్లు నడచుకో! అంటూ గత మూడు రోజులూ రాత్రి కాగానే మమ్మల్ని ఏకశయ్యాగతుల్ని చేసి తాను అవతలకి పోయేది. ఆ మహాయోగి, భోగుడై మన్మథలీలలు కొనసాగించడంలో కృతార్థుడవుతున్నాడు. ఆ యోగినీ- నువ్వూ కలిసి పెళ్లి పేరుతో నన్ను

వంచించారు. నన్ను సంసార సాగరంలో ముంచేశారు. ఇలాంటి పాపం చేసి నేను ఇంకా ఎందుకు బతికున్నానా?" అంటూ ఆమె ఏడవసాగింది.

స్వయంప్రభ కోపం చల్లారేవరకు ఉండి, అప్పుడు హేమ "నీ కోపం అర్థరహితమైంది సఖీ! కాని, మణిహారం తిరిగివ్వడమే అతడు మహానుభావుడని నిరూపిస్తోంది. అది ఇస్తూ అతనేమన్నాడు? 'దీని కోసం నీ తండ్రి చాలా పరితపించాడు. దీన్ని నేను తెప్పించకపోతే ఈ రాజ్యం వేశ్యాధీనం అయిపోతుందన్నాడు. ఇదే మనకు బంధుత్వంకలిపింది" అని కదా అతడన్నాడు. అలా అన్నాడని నీవూ చెప్పావు. ఒక్కటి ఆలోచించు! తేరగా హారం దొరికి- దాంతో రాజ్యలాభం ఉంటుందని తెలిసి దాన్ని తృణప్రాయంగా ఎంచినపుడే అతని వైరాగ్యం ఎంతటి ఉన్నతమైనదో మనం గ్రహించవచ్చు! ఇక నీ విషయంలో ప్రవర్తన అంటావా?.... అదీ సమర్థించదగినదే! భారతం తెలిసిన దానివి. పరోపకారార్థం వ్యాస మహర్షి వంటివాడే రాజపత్నులతో క్రీడించలేదా? దాని వల్ల అతడికి గొప్పదనం తగ్గిందా?" అంటూంటే, వీణావతి, రాకను గూర్చి ఒక పరిచారిక తెలియజేసింది. రాజభటులామెను నిర్బంధించడం గురించి హేమ విని, "నువ్వాణిహారం మాకు అందజేసినట్లు ఉత్తరం రాసిస్తాం!"అని పత్రం రాసిచ్చింది. ఈ వ్యవహారం పూర్తయి, హేమద్వారా తిరిగి ఆలయంలో యోగి గురించి ఆరా తీయగా, అతడు వెళ్లిపోయాడని తెలిసింది.

"నాలాగే అతడూ పశ్చాత్తాపపడి, ఇక్కడుంటే మనసుకి వికారం కలుగుతుందని ఎటైనా వెళ్ళిపోయాడు కాబోలు!" అంది స్వయంప్రభ. "అతడు నిజమైన యతో-భూపతో తేలాలి. ఎలాగైనా నువ్వు అదృష్టవంతురాలివే" అంది హేమ.

మణిసిద్ధుడు తర్వాత కథను తదుపరి మజిలీలో చెప్పసాగాడు....

  

# కాశీ మజిలీ కథలు

## ౯౩ వ మజిలీ

"ఆహా! ఈ జగత్తు ఎంత మోహాకాంత్రమై ఉందో కదా! ఇంద్రజాలికుడైన ఆ భగవంతుడు గడ్డి పరకని మేరు సమానంగా, మేరువులాంటి దాన్ని గడ్డిపరకగా చేస్తుంటాడు. అది తెలీని ప్రజలు స్వతంత్రులల్లాగ అన్ని పనులకూ తామే కారణం అనీ- కర్తలం అనీ అనుకుంటూ ఉంటారు. ఇది మన అవివేకం. వచ్చేది వద్దన్నా రాకుండా పోదు. రానిది ఎంత ప్రయత్నించినా రాదు. విచారించీ ప్రయోజనం లేదు. ఇది తెలీకనే ఇన్నాళ్లూ దుఃఖించాను. అయినా నా రాజ్యం అన్యాక్రాంతమేమీ అయిపోలేదు కదా! ఆ యతీశ్వరుడు అభయ ఇచ్చాడు" అని ఆలోచిస్తూ ఇంద్రమిత్రుడు గుర్రం మీద ఆ రత్నగిరి దిక్కువైపు నుంచే తన పట్నం వస్తున్నాడు.

అప్పుడిద్దరు దూతలు అమాత్యుల వల్ల చెప్పబడిన సమాచారం తీసుకుని రాజుకు ఎదురువెళ్ళి "ప్రభూ! రత్నహారం అమ్మాయిగారి మెడలో వచ్చి చేరింది. అమాత్యులవారు చెప్పమన్నారు" అని ఆ శుభవార్త రాజుకు అందించారు.

అంతేగాక- తాము రాజుగారి ఆనతిపై ఆ వేశ్యలిద్దర్నీ పట్టుకున్నట్లూ, ఉజ్జయినిలో వారాహారం అమ్మేశామని చెప్పినట్లూ, ఆయినా వారిని వదలక తాము రాజధానికి తెచ్చినట్లూ చెప్పి "మరి ఏం ఆలోచించుకున్నారోగాని, అది అమ్మాయిగారి కిచ్చినట్లున్నారు. ఇదుగో-వారు హారం ముట్టినట్లు రాసిచ్చిన లేఖ" అని అదీ తీసి చూపించారు.

దాంతో ఇంద్రమిత్రుడికి యతి చెప్పిన మాటపై గురి ఏర్పడింది. ఎట్లాగూ ఆ ప్రాంతానికే తాను వచ్చి ఉన్నందున వారిని దర్శించినట్లుగా ఉంటుందని, గుఱ్ఱాన్ని రత్నగిరి స్వయంప్రభా ఆలయం వైపు నడిపించి, ఆ యతిని దర్శించి, సంతోషంతో ఒక రత్నరుద్రాక్షమాలిక ఆ యోగి మెడలో వేశాడు. అక్కడ నుంచి ఆనందంగా అంతఃపురానికి వచ్చి, హారం తన కూతురి మెడలో ఉన్నట్లు భార్యచేత ధృవపడగా మరింత ఆనందించి “అమ్మాయి వివాహం గురించి ఏమంటోంది ” అని అడగ్గా “పెళ్ళి విషయమై ఇప్పుడు స్వయంప్రభలో కొంత మార్పు కనిపిస్తోంది. మీరు ఇక ఆలస్యం చేయనిదానికి నచ్చినట్లున్న ఆ భూరిశ్రవుని పుత్రుడు సహదేవునికే ఇచ్చేలా శుభలేఖలు రాయించండి” అని చెప్పింది. ఇంత కాలానికి శుభాలపై శుభాలు తనను ఆనందపరుస్తున్నాయని రాజు సంతోషించి, పట్టణమంతా అలంకరించమని ఆజ్ఞ ఇచ్చి, భూరిశ్రవునికి ఆ వర్తమానం శుభలేఖ పంపాడు.

ఇక-అక్కడ ఉద్యానవనంలో హేమతో, స్వయంప్రభ- తనకు గర్భలక్షణాలు కలిగిన విషయం చెప్తూండగా, ఒక చెలికత్తె అది నిజమేనని నిర్ధారించింది. అంతలో అక్కడకు వచ్చిన రాజపత్నికి కూడా ఆ సంగతి తెల్సింది. శకుంతల దుష్యంతుని గాంధర్వ విధిన పెళ్ళాడినట్లు, తమ పుత్రిక ఒక యోగిపుంగవుని వరించి, అతని వల్ల గర్భం దాల్చిందని కూడా విన్న ఆ రాజదంపతుల ఆశ్చర్యానికీ- ఆందోళనకూ మితి లేకపోయింది. కానున్నది కాకపోదని రాజు “పుత్రిక ఆనందమే మన ఆనందం అనుకో! ఆయన్నింటికి రప్పిస్తాను” అని సమాధాన పడ్డాడు. కాని యోగి అక్కడ లేడని. ఎటువెళ్ళాడో తెలీదని హేమ ధృవపరచినా, రాజు నమ్మలేదు. ఇంతలో భూరిశ్రవుని వద్ద నుంచి శుభవర్తమానం రాగా, ఆయనకేం జవాబు రాయాలో అని ఆలోచించి, ‘అనివార్యకారణాల వల్ల ప్రస్తుతానికి ముహూర్తం అపాం అనీ- త్వరలో మళ్ళీ తెలియజేస్తాం అనీ’ కబురుపంపాడు. అంతకు కొద్దిసేపటికి క్రితమే తాను హారం ఇచ్చిన యోగి కోసం రత్నగిరి ఆలయం వద్దకు పల్లకీని పంపిస్తే, అతడా పల్లకి ఎక్కి రాజధానిలో ప్రవేశించాడు.

–అని చెప్పేసరికి వేళ దాటిపోవడంతో మణిసిద్ధుడు అవ్వలి కథ తర్వాత మజిలీలో ఇలా చెప్పసాగాడు....

# కాశీ మజిలీ కథలు

## 64 వ మజిలీ

ఇంద్రమిత్రుని పుత్రికను యోగి వేషంలో వెళ్ళి తానెలా పెళ్లాడిందీ, మిత్రుడైన వసుమిత్రుడితో సహదేవుడు చెప్తుండగా, అతని సోదరి సుభద్ర లోపల్నుంచి కబురు చేసింది. శారిక అనే చెలికత్తెని తోడిచ్చి ఆ పథకం అంతా ఆమె రచించినదే! అది ఎలా ఫలవంతమైనదీ స్వయంగా తన అన్న నోటనే వినాలని లోపలకు పిలిచింది. ఈ వసుమిత్రుడు కూడా సహదేవుని గిరిదుర్గంలో ఉండి సహకరించినవాడే.

సహదేవుడు,చెల్లెలికి గిరిదుర్గంలో ప్రవేశించింది మొదలు, స్వయంప్రభతో మూడు రాత్రులు ముగిసేదాకా ఎలా గడిపిందీ వివరించి "వీణావతివల్ల మనం కొన్న మణిహారమే ఈ కార్యానికి ప్రధాన సాధనమై, మన శారిక సహాయంతో, ఎప్పటికప్పుడు గిరిదుర్గం వార్తలు నాకు చేరవేసే వసుమిత్రుడు సహకారంతో నీ పథక రచన పరిపూర్ణంగా విజయవంతమైనది. ఇంతలో వీణావతిని అక్కడి రాజభటులు పట్టి తీసుకొచ్చారన్న వార్త విని, మా గుట్టు ఎక్కడ బైటపడుతుందో అనుకొంటూ, మా వేషాలు తీసేసి, ఎవరికి వాళ్ళం విడివిడిగా ఇక్కడకు చేరుకున్నాం!" అని చెప్పాడు.

అదంతా విన్నాక- సుభద్ర చాలా సంతోషిస్తూ "అన్నా! ఈ మధ్యలోనే ఒక విశేషం జరిగింది. ఇంద్రమిత్రుడు తన పుత్రిక స్వయంప్రభను నీకు ఇచ్చి చేస్తానంటూ శుభపత్రిక పంపడం-అందుకు తండ్రిగారితో నేను అంగీకార శుభపత్రిక పంపించడం జరిగాయి. అంతలోనే ముహూర్తం తాత్కాలికంగా ఆపామంటూ వర్తమానం వచ్చింది. నీ సంగతి గాని, అక్కడ పొక్కిందేమో!" అనే సరికి, "అది అసాధ్యం"అన్నాడు సహదేవుడు. అయి నప్పటికీ తమ తరఫున ఒక గూఢచారిని అక్కడ వుంచి వచ్చానని చెప్పాడు.

# కపట శివానంద యోగి కథ

అట్లా వాళ్లు మాట్లాడుకుంటూండగానే, ఆ గూఢచారి వచ్చినట్లు ఒక పరిచారిక చెప్పింది. ఈలోగా సుభద్రకేదో పని ఉండి లోపలకు వెళ్ళిపోయింది. సహదేవుడు ఆ గూఢచారిని లోపలకు రమ్మన్నాడు.

అతడొస్తూనే "దేవా! తాడిదన్నే వాడుంటే, వాడి తలదన్నే వాడొకడుంటాడన్న సామెతలా జరిగింది. మనం ఆ స్వయంప్రభను వంచించాంఅని. ఒక పక్క బాధపడుతూంటే, మనల్నింకా బాధించడానికి ఇంకో వంచకుడెవడో ఆ వూర వాడే కాబోలు తయారయ్యాడు. మనం ఆ ప్రాంతంలో పారేసిన గడ్డాలు- మీసాలు తగిలించుకుని యతివలె అక్కడ కూర్చోగా, తన కూతురు వరించింది అతడినే కాబోలు ననుకొని రాజు అతడికి పల్లకీ పంపి రాజమర్యాదలతో నగరంలోనికి ఆహ్వానించి ఊరేగిస్తూంటే, నాకు తల తిరిగినట్లయింది" అని సమాచారం అందించాడు. సుభద్ర పని ముగించుకొని అక్కడికి రాగా, ఆమెకీ విషయం చెప్పాడు సహదేవుడు.

"అన్నా! కంగారేం లేదు. హేమ, స్వయంప్రభలు సామాన్యురాళ్ళు కారు. విమర్శించకుండా తొందరపడరు. పని సానుకూలమయ్యే ఉపాయమేదో నేను చెప్తాగా!" అంటూ, ఒక ఉత్తరం అన్న చేత రాయించింది, వసు మిత్రునిచేత ఆ చీటిని గిరిదుర్గం పంపింది.

వసుమిత్రుడు మారువేషంలో వెళ్ళి హేమను కలుసుకొని, ఆ చీటీ అందించగా, హేమ అతడ్ని తీసుకుని స్వయంప్రభ దగ్గరకు వెళ్ళి "ఇతడు నీ భర్త అందించిన చీటితో వచ్చాడు" అని చెప్పగా ఇద్దరూ అది చదివి "మరి ఆ ఊరేగింపు యోగి ఎవడు? నువ్వు స్వయంగా వెళ్లి చూసిరా!" అని పంపింది.

హేమ అంతకుముందు రాజపత్నికి 'యోగి మహాతేజోవంతుడనీ- గొప్ప అందగాడనీ' వర్ణించి చెప్పగా, ఊరేగివచ్చి అంతఃపురంలో ప్రవేశిస్తూన్నప్పుడు, ఆ యోగి ఎంత అందగాడో చూద్దామని వచ్చిన రాజపత్ని, ఆ జడధారిని

చూస్తూనే 'వీడ్నా నా కూతురు వరించింది! కళా-కాంతీ లేదే' అనుకుంది. హేమ కూడా స్వయంగా చూసి ఇప్పుడదే అనుకుంది. 'ఇతడు ఆ యోగికాడు' అని గ్రహించేసింది. అసలు అద్వైత శివానంద యోగి, లేఖ పంపిన ప్రకారం తమ గురుదేవుని సన్నిధికి వెళ్ళిన మాటే నిజం అని ధృవపరచుకుంది. అయినప్పటికీ- తాను తొందర పడకూడదని ఆ వివేకవతి. వారితో అవసరమైనంత మేరకే మాటాడి, తిరిగొచ్చి "అతడెవడో కపటయోగి, సందేహంలేదు" అని స్వయంప్రభకు చెప్పింది.

అతడ్ని ఎలా వదిలించుకోవచ్చో కూడా రహస్యంగా తన ప్రియసఖికి ఉపదేశించిందా చతురురాలు. మరో రెండు రోజులు అయ్యాక, అతడ్ని రాజ పుత్రికగల ఉద్యానవనంలో ప్రవేశపెట్టగా, అతడు ఆ వేళ రాజపుత్రితో కులకవచ్చునని ఒళ్ళంతా పులకరించిపోగా మహదానందపడి పోసాగాడు.

"స్వామీ! నూతన శయనోత్సవ వేడుక అని మరొక ఆచారం ఉంది. దీని ప్రకారం మిమ్మల్ని -రాకుమార్తెని ఒక శయ్యమీద చేర్చి సఖురాళ్ళంతా వేడుకపనులు చేస్తారు. మీరు కోప్పడకూడదు. అవన్నీ సరదా కోసం మాత్రమేనని ముందుగానే చెపుతున్నాం!" అంటూ రాజపుత్రిక వేషంలో ఒకదాసి నలంకరించారు. ఇద్దర్నీ ఒకచోట కూర్చోబెట్టి ముందుగా చెలులు గంధం పూశారు. తరువాత ఒక సఖి "ఈ జడలు అంటించినట్లున్నాయే" అంటూ జటాజూటం పట్టుకులాగింది. అది ఊడి చేతిలో కొచ్చింది. తర్వాత ఇంకో సఖి "గడ్డం కూడ జడల్లాంటిదేమోనే" అంది అదీ ఊడలాగింది. ఇంకొకతె ఆవుపేడ అద్దింది. వేరొకతె అతని వస్త్రాలు చించింది. దాంతో "అబ్బో! ఇంత సరసం నా వల్ల కాదు" అని పోబోతూంటే, "అన్నన్నా! మా రాకుమార్తెని పెళ్ళాడి, ఇప్పుడు విడిచిపోతానంటే ఒప్పుకుంటామా? నిలు! నిలు!" అని అదలించారంతా.

అని చెప్పేవరకు వేళ అతిక్రమించడంతో, అవ్వలికథ మణిసిద్ధుడు తర్వాత మజిలీలో ఇలా చెప్పసాగాడు....



# కాశీ మజిలీ కథలు

## 65 వ మజిలీ

"అయ్యో! స్వయంప్రభాదేవి వరంతో పుట్టినా, మన పిల్లకి ఈ లోకుల నింద బాధ ఏమిటో?! కొన్నాళ్ళపాటు పెళ్ళాడనన్నది. లోకులు వింతగా చెప్పుకున్నారు. తర్వాత ఒక యోగి పుంగవుని పెళ్లాడానన్నది. అదీ వారు వినోదంగానే చెప్పుకున్నారు. సరేనని ఆ యోగినే భోగిని చేసి తీసుకొస్తే 'అతడు ఇతడు కానే కాడు' అంటోంది. ఇదిలా ఉంటే, మన ఉత్తరం వారికి చేరిందీ లేనిదీ ఇంకా తెలీదుకాని, ఆ భూరిశ్రవుని కూతురు, మన అమ్మాయి వధువు గనుక చూడాలని– మాట్లాడాలనీ బయల్దేరుతోందట! ఇప్పుడేం చెయ్యాలి?" అంటూ కలవర పడసాగాడు. అందుకు రాజపత్ని "అమ్మాయి అబద్ధం ఆడదు. దానికి ఏ పాపం తెలీదు. లోకులకేం? ఎన్నయినా అనుకుంటారు! అమ్మాయి వరించిన యోగి నిజంగానే తేజశ్శాలి అయి ఉంటాడు. మధ్య ఇతడెలా దూరాడో? భూరిశ్రవుని కూతురు వస్తే రానీండి! మర్యాదగా స్వయంప్రభ దగ్గరకే పంపుదాము. హేమ ఎట్లాగూ అక్కడే ఉంటుంది గదా! ఏం చెప్పుకుంటారో– వాళ్ళే చూసుకుంటారు" అని భర్తతో అంది.

వర్తమానం అందినట్లుగానే సావిత్రి గిరిదుర్గం వచ్చింది. ఆమెను స్వయంప్రభ దగ్గరకు పంపారు. ఒకర్నొకరు ఎంతో ఆత్మీయంగా పలకరించుకున్నారు. స్వయంప్రభ గురించి ఏమీ దాచకుండా అంతా వెల్లడించింది హేమ. చివరికి "ఈమె మహాయోగికి ఇల్లాలు–కనుక మీకు వంద్యురాలు" అని కూడా అంది.

ఆ మాటల్లో కొన్ని వినీ విననట్లు నటించి, సావిత్రి తన సోదరుడైన సహదేవుని రూప గుణ విద్యా విశేషాల గురించే గాక వైరాగ్యప్రవృత్తి గురించీ కూడా విశేషంగా చెప్పింది. హిమవత్పర్వత ప్రాంతాలకు సన్యాసులతో కలిసి వెళ్ళాడని కూడా చెప్పింది. "మీ తండ్రిగారంపిన శుభవర్తమానం చూపిస్తే- తన కిదివరకే పెళ్ళయిందని- తన భార్య ఎక్కడో ఉందనీ అన్నాడు. మా తండ్రి గారు ఇదంతా మెట్టవేదాంతం అని కొట్టి పారేసి, అతనికి బలవంతంగానైనా పెళ్ళి చేయదలసి, నిన్ను చూసి రమ్మని నన్ను పంపారు" అంది స్వయంప్రభతో.

ఆ మాటలకు ఇద్దరూ ముఖాలు చూసుకోగా "మరేం లేదు. మా రాజపుత్రిక వరించిన యోగి, మీ అన్నగారేమోనని నాకు సందేహంగా ఉంది" అన్నది- హేమ.

"నిజమే! భగవంతుడు విచిత్ర సంఘటనలు సమకూరుస్తాడు. అద్వైతశివానందయోగి అని పేరు పెట్టుకునే మా అన్న దేశాటనం చేశాడు. ఆఁ!.... అర్థమైంది. "నీకు స్వయంప్రభ అనే రాజపుత్రికతో పెళ్ళి నిశ్చయించాం!" అన్నప్పుడు 'నేనిది వరకే పెళ్ళాడాను' అన్న మాటకు అర్థం ఇదా? తెలిసిందిప్పుడు" అంది సావిత్రి ఆనందంగా. హేమ తన సంతోషం ప్రకటించి, కపటయోగి గురించి చెప్పి "వెంటనే మీ అన్నగార్ని ఇక్కడకు రప్పించు" అని కోరింది.

ఉద్యానవనం చూసే నెపంతో హేమను వెంటబెట్టుకొని, మొత్తంగా తమ వ్యూహం వివరించిందామె. సావిత్రి చెప్పిన వన్నీ విని, "ఈ రహస్యాలు ఎవరిదగ్గరా అనకు" అంది హేమ. ఇద్దరూ స్వయంప్రభ దగ్గరకు తిరిగివెళ్ళి, ఆమె వరించింది. సహదేవుడినే అని యుక్తిగా చెప్పారు. హేమ ఆ వార్త రాజపత్నికి చెప్పాలని ఆమె అంతఃపురం వైపు వెళ్తూంటే- రాజుగారూ అక్కడే ఉన్నారని చెప్పింది ఒక చెలికత్తె.

రాజదంపతులిద్దరూ తమ కూతురి స్థితికి విచారించి, పద్యాలు కట్టి మరీ లోకులు నిందిస్తున్నారని చెప్తూండగా– హేమ "మహారాజా! వెతకబోయిన తీగ కాలికే తగిలింది. విచారించకండి!"అంటూ అసలు యోగీ– సహదేవుడు ఒక్కరేనన్న నిజం వెల్లడించి వారికి ఆనందం కలిగించింది.

కపటయోగి వృత్తాంతం తెలుసుకోడానికి రాజు గూఢచారుల్ని నియమించాడు. అప్పటికి వేళ మించడంతో, మణిసిద్ధుడు తర్వాత కథను పై మజిలీలో ఇట్లా చెప్పసాగాడు.



# కాశీ మజిలీ కథలు

## 66 వ మజిలీ

"పుత్రీ! మీనాక్షీ! ఇటురా! ఏం పని చేశావే!? తరతరాల నుంచీ దివాణం ఆశ్రయించుకుని ఉన్నాం కదా! అంతఃపుర రహస్యాలు వెల్లడి చేయవచ్చా? ఇప్పుడు మన జీవితాలకే అపకారం జరిగేలా వుంది. గొప్ప అపరాధమేననీ మీద పడింది. మాధవస్వామి ఆలయ అర్చకుడి కొడుకట! అతడెవడు? వాడితో నీకు పరిచయం ఎప్పుడు కలిగింది? అందులో నిజానిజాలేమిటి? ఇప్పుడు ముప్పు వచ్చింది కనుక, అడుగుతున్నాను....." అంటూన్న తల్లి మాటలకు భయపడుతూన్నది ఆ దాసీ పుత్రిక.

"అమ్మా! నా మీద పడిన నేరం ఏమిటి? అర్చకుడి అల్లుడైన ఆ శ్రీనివాసాచార్యుల మాట ఎందుకొచ్చింది?" అని అడిగింది.

"నీకేం తెలియదా? మొన్న ఏనుగు మీద ఊరేగివచ్చిన యోగి రాజపుత్రుడు వరించిన యోగి కాడట! సహదేవుడనే రాజపుత్రుడు వైరాగ్యంతో యోగి కాగా, రాజపుత్రిక అతడ్ని వరించిందట! అతడొచ్చి శ్రీనివాసాచార్యులతో తగవు పెట్టుకున్నాడు. స్వయంప్రభ తన భర్త ఎలా ఉండేదీ తెలుసు కనుక- ప్రవర్తనను బట్టి తాను వరించినది సహదేవుడినే అని చెప్పింది. అప్పుడు రాజభటులు ఆ కపటయోగిన్ని దండిస్తే, ఆ దెబ్బల బాధకు తాళలేక, "నేను మాధవస్వామి అర్చకుడి అల్లుడిని! నా కాపురం కంచి. మీనాక్షి అనే దాసి పుత్రిక ప్రేరణతో ఇలాంటి కపట వేషం వేశాను" అంటూ నిజం చెప్పేశాడు. దాంతో- నిన్ను కూడా పట్టి తీసుకురమ్మని ప్రభువుల వారు భటుల్ని పంపారు- ఆ వార్త నాకు కొంత ముందుగా తెలిసే సరికి హడలిపోతూ ఇలా వచ్చాను" అంది.

# చక్రపాణి కథ

"అమ్మా! నీ దగ్గర నిజం దాస్తానా? ఆ అర్చకుని అల్లుడు చక్రపాణి అనే అతడు అత్తవారింటి కొచ్చాట్ట! పూలు కోయడానికి స్వామివారి ఆలయానికి వెళ్ళేదాన్నిగా! పరిచయం పెరిగింది- ఇద్దరికీ సంబంధం ఏర్పడింది. రూపం, హొయలు, వయసు అన్నీ అతడు భాగ్యవంతుడని పించేలా ఉండేసరికి- నేనూ అడ్డు చెప్పలేదు. నిజంగానే అతడు నాకు చాలా విలువైనట్టి బహుమతులు ఇచ్చాడు. నిజానికి అతడు నాతో స్నేహబంధం పెంచుకున్నది, యువరాణి వారి వివరాలు లాగాలనే! ఆ సంగతి నాకు ఆ తర్వాతగాని తెలీలేదు. స్త్రీ సహజ చాపల్యం చేత నేను ఆమె వివరాలన్నీ అతడికి చెప్పేశాను. నేను రాణిగారి ఉద్యానవనంలో పని చేస్తానని తెలిసే, అతడు నాతో సంబంధం పెట్టుకున్నాడట!" అని కూతురు చెప్పేసరికి, తల్లి గుండెలు బాదుకొంటూ, "కొంపముంచావు. అయితే అయిందిలే! ఇప్పుడతడెవరో నాకు ఏ మాత్రం తెలీదని బొంకు" అంటూ బోధించసాగింది ఆమె తల్లి.

మీనాక్షిని- దాని తల్లినీ కూడా రాజభటులు ప్రభువు ఎదుట ప్రవేశపెట్టారు. అప్పుడు సహదేవుడు కూడా అక్కడే ఉన్నాడు. మరోవైపు చక్రపాణిని నిలబెట్టారు. మీనాక్షి- చక్రపాణి ఒకరిమీద ఒకరు నిందలు ఆరోపించుకున్నారు. నువ్వే వేషం వెయ్యమన్నావని అతడంటే, కల్లుతాగి వాగుతున్నావా? అని మీనాక్షి జవాబు. ఈ వివాదం సాగుతూంటే, స్వయంప్రభకి కొడుకు పుట్టాడన్న వర్తమానం తెలిసింది. ఆ వేడుక సమయంలో, వారి అదృష్టం కొద్దీ వారిద్దరూ ప్రభువులచే దండించబడక విడిచిపెట్టబడ్డారు.

అయినప్పటికీ, ఆమె నా గూర్చి లోకులు అనుకున్న మాటలు ఈ పద్యంగా గోడమీద నిలిచిపోయాయి. యోగి, కపటయోగి, చక్రపాణి ముగ్గురని తేల్చారు. ప్రజలు ఉత్ప్రేక్షించి, మణిసిద్ధుడు ఈ విధంగా కథచెప్పి, శిష్యునితో కూడా ఆ రాత్రి అక్కడ వసించి, మర్నాడు తదుపరి మజిలీ చేరాడు.

# కాశీ మజిలీ కథలు

## 67 వ మజిలీ

క. స్వామి! తిరిగితి, నేనీ
గ్రామంబంతయు, వింత గాన్పింపదు కా
శీమహిమ విశేషంబుల
వేమేనిం గలిగినేని నెరింగింపు దయన్ ”

(ఈ ఊరంతా తిరిగినా విశేషాలేం లేవు గనుక, ఈ మజిలీలో కాశీ మహిమ విశేషాలేమన్నా ఉంటే చెప్పండి” అని అడిగాడు గోపాలుడు)

మనం ఆ పుణ్యక్షేత్రానికి చేరడానికి ఇంకా కొన్ని రోజులు పడుతుంది. గనుక కాశీ విశేషాలేమైనా చెప్పండి! లేదా ఈ వూళ్ళో నాకు తోచిన దొకటి చూశాను. అది నాకు అంత వింతగా అన్పించకపోయినప్పటికీ, దాని వెనుక ఏదైనా కథ ఉందేమో చెప్పండి! ఈ పురానికి తూర్పు దిక్కున ఓ వనం ఉంది. అందులో ఏ మొక్కగాని-ఏ చెట్టుగాని రకానికి నాలుగు-నాలుగు చొప్పున మాత్రమే ఉన్నాయి. అవి అలా ఉండడానికి కారణం ఏమి? ఆ వైనం వివరించండి” అని కోరగా, సిద్ధమణి మహిమవల్ల, ఆ మణిసిద్ధుడు, ఆ ఉదంతమంతా ఆకళింపు చేసుకుని ఆశ్చర్యపోతూ “వత్సా! నీలో దేవుడున్నాడు. నువ్వు ఎప్పుడేది అడిగినా, దాని వెనుక ఏదో ఒక విశేషం ఉండకపోదు. ఇప్పుడు నువ్వు అడిగిన ప్రశ్నలు రెండింటికీ సంబంధం ఉండేలా ఒక జవాబు వచ్చే కథ చెప్తాను. నిజంగా ఏదో ఎరిగిన వాళ్ళు అడిగినట్లే అడిగావు. ఇది చాలా చమత్కారంగానూ ఉంటుంది. సావధానంగా విను!” అని ఆ కథ ఇట్లా చెప్పసాగాడు....

# శీల, కళా, విద్యా రూపవతుల కథ

సకల సంపదలకు నెలవైన విశాలపురాన్ని ధర్మపాలుడు అనే రాజు పరిపాలిస్తున్నాడు. ఒకనాడు బ్రహ్మ తేజస్సుతో వెలిగిపోతున్న ఒక బ్రాహ్మణుడు సభకు వచ్చి రాజును ఆశీర్వదించి, సత్కారాలు పొందాక, రాజు ఉత్సాహంతో ఆ బ్రాహ్మణుని వృత్తాంతం అడగ్గా తన వృత్తాంతాన్ని ఇలా వివరించాడతడు.

"మహారాజా! నా జన్మస్థలం ఇదే. నా పేరు యజ్ఞదత్తుడు. చిన్నతనంలోనే తల్లిదండ్రులను కోల్పోయిన నేను కాశీకి వెళ్ళి విద్యాభ్యాసం చేశాను. పురాణాలు, వేదాలు, శాస్త్రాలు అన్నింటిలోనూ కొంచెం పాండిత్యం సంపాదించాను. కాశీలో ఉపాధ్యాయుడిని అనిపించుకున్నాను. ప్రజారంజకంగా, ధర్మస్వరూపులైన మీరు మన దేశాన్ని పాలిస్తున్నారని విని మీ దర్శనం చేసుకోవాలని వచ్చానేగానీ. మరేమీ పనిలేదు" అన్నాడు.

దానికి ధర్మపాలుడు "మహాత్మా! మీ విద్యా, గుణాలూ, స్వదేశాభిమానమూ మెచ్చుకోదగినది. మీ రాక మా అదృష్టం. నేటి నుండి మీరు మా ఆస్థాన విద్వాంసులై, మంత్రులై మాతో ఉండండి" అని ప్రార్థించాడు. కాలక్రమంలో తన పురోహితుడి కూతురైన సురూపనిచ్చి యజ్ఞదత్తుడి వివాహం స్వయంగా జరిపించాడు.

కొంతకాలానికి వారికి ఒక అమ్మాయి పుట్టింది. వారామెకు శీలవతి అని పేరు పెట్టారు. ఒకనాడు ధర్మపాలుని భార్య వారింటికి వచ్చి ఆ ఇంట్లో దీపంలా వెలుగుతున్న ఆ చిన్నారిని చూసి "ఈ పాపాయిని కన్నతల్లి ఎంత అదృష్టవంతురాలో" అని ప్రశంసించింది. "మాకు ఎందుకు ఇంకా అలాంటి అదృష్టం కలగలేదని" బాధపడింది.

పండితుని భార్యకూడా "మహారాణీ! నువ్వు కూడా ఈ ఆనందాన్ని త్వరలో అనుభవించగలవు. కావాలంటే, ఈ అమ్మాయిని తీసుకెళ్ళి మీ ఇంటపెట్టి పెంచుకోవచ్చు!" అంది. ఆమె అలా అనగానే ఆ రాజపత్ని.

పండితుని భార్యను ఆ బాలికతో సహా వచ్చి తన ఇంట కొన్నాళ్ళుండమని కోరింది. దానికా పండిత పత్ని కూడా సమ్మతించింది. కొన్నాళ్ళున్నాక వారికి ఎన్నెన్నో కానుకలిచ్చి, తన ముచ్చట కాదనకుండా తన ఇంటికి వచ్చినందుకు తల్లీకూతుళ్ళను అభినందించి పంపిందా రాజపత్ని. ఈ పరిచర్యవల్లనే కాబోలు ఆమె గర్భవతి అయింది. దాంతో యజ్ఞదత్తుని భార్యసురూప- పుత్రికశీలవతులను ఎవరు ఆదరంగా తమ ఇంట ఉంచుకొని చూసినా సంతానం లేనివారికి సంతానం తథ్యం" అనే మాట బాగా ప్రచారంలోకి వచ్చింది.

రాజపత్నికీ పరిచర్యలవల్ల గర్భం నిలిచిందని వినగానే. అవే పరిచర్యలా తల్లీకూతుళ్ళ పట్ల ఆచరించి సంతానం కనాలని ఒక వర్తకశ్రేష్ఠిజంట, ఒక రైతు జంట కూడా ఉత్సాహపడ్డారు. ఆ ఇద్దరూ ధనపాలుడు, వృషాంకుడు.

కాలక్రమంలో ఆ మూడు జంటలకూ శీలవతిని పోలిన పుత్రికలే జన్మించారు. ఒకరినొకరు అచ్చుదీసి పోత పోశారా అన్నట్లున్నారు. కొందరైతే శీలవతి అంశరూపాలై ఉండవచ్చునన్నారు. ఆముగ్గురు బాలికల్ని చూసి.

రాజపుత్రికి కళావతీ అనీ, వైశ్యపుత్రికకు విద్యావతీ అనీ, శూద్ర (రైతు) పుత్రికకు రూపవతి అని పేర్లు పెట్టి, ఒక గురువు దగ్గర- అదీ యజ్ఞదత్తుని దగ్గర విద్యాభ్యాసానికి పంపించారు. తన పుత్రికతో పాటుగా ముగ్గుర్నీ ఆ ఉపాధ్యాయుడు సమానంగా చూస్తూ విద్య నేర్పాడు. ఈ చాతుర్వర్ణాల వారూ, చదువు దగ్గర ఏ విభేధాలు లేక మైత్రిగా ఉండేవారు. క్రమంగా వారి ఆహార విహారాలు కూడా ఒకే చోట జరిగాయి. అందంలో రంభా, ఊర్వశీ, మేనక, తిలోత్తమలుగా, చదువుల్లో సరస్వతులుగా, వైభవంలో లక్ష్ముల్లా వాళ్ళు ప్రకాశించసాగారు.

అందరికీ యుక్త వయస్సులు రాగా, ధర్మపాలుడు వారు ఉండడానికి ఉద్యానవనంలో క్రీడా సౌధాలు కట్టించాడు. ఒకరోజు అక్కడ తోటలో విహరిస్తూ నలుగురు కన్యలూ ఇలా అనుకున్నారు.

"మన పెళ్లిళ్ల గురించి తల్లిదండ్రులు ఆందోళన చెందుతున్నారు. స్వయంవరం రాజులలో తప్ప బ్రాహ్మణుల్లోను- వైశ్యులలోను లేదు. తల్లిదండ్రులు నిర్ణయించినవారినే వరులుగా అంగీకరించాల్సి వస్తోంది. ఇది నూరేళ్ళ బ్రతుకునకు విఘాత కారణమవుతోంది. అందరికీ అన్యోన్యదాంపత్యం సమకూడదు. నిజానికి మనందరికీ ఏకకాలంలో పెళ్లిళ్లు జరిగితే ఎంత బావుంటుందో కదా!"

ఇలా అనుకోగానే రూపవతి మనలో ఎవతె అయినా, వరుని వరిస్తే, మిగతా ముగ్గురి అనుమతీ తీసుకోవాలి. ఇదీ మన నియమం! మన శపథం ప్రకారం నలుగురికీ ఒక్కసారే వివాహం జరగాలి. ఆ విషయాన్ని మనలో ఎవరేమైనా వరునికి ముందే తెలియజేయాలి. శపథం తప్పితే కాశీలో బ్రహ్మహత్య చేసినంత పాపం! ఇందుకు పంచభూతాలే సాక్షులు" అంది.

వారా శపథం చేసుకున్న మరునాడే, యజ్ఞదత్తుడు పాఠాలు చాలించిన అనంతరం, "అమ్మాయిలూ! మీ సఖీ- నా పుత్రిక అయిన శీలవతికి వరుడిని నిశ్చయించాం! అతడు అన్ని విధాలా అనుకూలుడే! మాకు సంపదలతో నిమిత్తం లేదు కనుక, విద్య చూస్తాం గనుక, అతనికి ప్రాయానికి మించి విద్య ఉంది. కొంచెం కోపదారి మనిషి అయినా అది ఎక్కువకాలం ఉండదులే! వివాహం నేటికి పదిరోజులుంది" అని చెప్పాడు. స్వయంవరానికి అవకాశం లేని శీలవతి తండ్రి తెచ్చిన వరుడ్ని చేసుకోక తప్పదు కదా! అని భావించి రాజపుత్రి ఉపాధ్యాయునితో వాదం పెంచినా, "కుశంక పనికిరాదు! నిన్న శీలవతి కూడా ఇలాగే తల్లితో తర్కం పెట్టుకుని వివాహం వద్దందట ఇప్పుడు" అని ఆచార్యుడు సమాధానం ఇచ్చాడు. ఆ ముహూర్తానికే విద్యావతికీ ఆమె తండ్రి పెళ్ళి నిశ్చయించాడు" అని చెప్పి- తరువాత మజిలీలో మణిసిద్ధుడు ఆ కథ ఇలా చెప్పసాగాడు....



# కాశీ మజిలీ కథలు

## 68 వ మజిలీ

శీలవతి, విద్యావతుల పెళ్ళిళ్ళు ఒకే ముహూర్తంలో చేయాలని నిశ్చయించారు. కానీ పెళ్ళి కూతుళ్ళిద్దరూ సాయంకాలం వేత్రవతీ నదిలో స్నానం చేస్తూ ఉంటే మొసళ్ళు లాగేశాయనే వార్త తెలిసి అందరూ వీధులవెంట పరిగెత్తారు. రాజు, మంత్రులు, పరివారం అంతా నది ఒడ్డున నిలబడి దీనవదనాలతో నదీ ప్రవాహం దిశగా చూస్తున్నారు. ఆ ప్రవాహంలోకి నావలు, దీపాలు, వలలు పట్టుకొని వెళ్ళి వారికోసం గాలిస్తున్నారు. కొందరు గొలుసులు వేస్తున్నారు. ఈతగాళ్ళు కూడా గాలింపు చేస్తున్నారు. రాజకుమార్తె కళావతీ, శూద్రపుత్రిక రూపవతి ఒడ్డున కూర్చొని స్నేహితురాళ్ళ కోసం విలపిస్తుంటే రాజు వారిని బుజ్జగించి "వారిద్దరూ ఎక్కడ మునిగిపోయారో చెప్పండి" అన్నాడు.

"స్నేహితురాళ్ళకు రాత్రికి వివాహం జరగబోతుందనే సంతోషంతో వారిని అలంకరించడానికి పూలు కోయడానికి వచ్చాం. పూలు కోసి-కోసి అలసిపోయి చెమటలు పట్టగా స్నానం చేద్దామని నదిలోకి వచ్చాం. పెళ్లికుమార్తెలు ఇప్పుడు స్నానం చేయకూడదని చెప్పినా వాళ్ళు మా మాటలు వినకుండా నీటిలోకి దిగారు. మేము మాత్రం ఒడ్డునే ఉండిపోయాం. ఇంతలో "అమ్మో! నా పాదాన్ని ఏదో పట్టుకుంది" అని శీలవతి అరుస్తూనే నీటిలో మునిగిపోయింది. "మొసలి - మొసలి" అంటూ ఒడ్డుకు రాబోయి విద్యావతి కూడా మునిగిపోయింది. మేము వారికోసం ఎంతగానో వెదికాం! అదిగో ఆ మూలనే వారు మునిగిపోయారు" అని రాజపుత్రిక ఏడుస్తూ వివరించింది. యజ్ఞదత్తుడు, ఆయన భార్య కూతురిని తలచుకొని దుః

దుఃఖిస్తూంటే రాజు వారిని ఇంటికి తీసుకువెళ్ళి ఎంతగానో ఓదార్చి " నా కూతురు కళావతిని మీ అమ్మాయి శీలవతిగా భావించి మీ ఇంటికి తీసుకెళ్ళండి. ఎప్పటికైనా వాళ్ళు బ్రతికి వస్తారేమో చూద్దాం! మనం ఎన్ని కథలు వినలేదు"! అంటూ వారిని అనునయించాడు.

ఒకరోజు యజ్ఞదత్తుడు కళావతిని పిలిచి "అమ్మా! కళావతీ! నా బాధ తగ్గించడానికి మీ తండ్రి నిన్ను నా దగ్గర ఉంచాడు. కాని మిమ్మల్ని చూసిన దగ్గర నుంచి శీలవతి జ్ఞాపకం వస్తూ మా బాధ మరింత ఎక్కువ అవుతూ వుంది. మీరిలా చదువు మానుకొని మా దగ్గర వుండడం వల్ల వచ్చే ప్రయోజనం ఏమీ లేదు. చదువు చెప్పడానికి నోరు రావడంలేదు. మీరు మరో గురువు దగ్గర చదువుకోండి. మేము ఏ పుణ్యక్షేత్రానికో వెళ్ళి కాలక్షేపం చేస్తాం" అన్నాడు.

ఆ మాటలకు కళావతి "తండ్రీ! నా స్నేహితురాళ్ళు బతికే ఉన్నారని నా మనసు చెబుతోంది" అన్నది. అయినా యజ్ఞదత్తుడు ఆమె మాటలు పట్టించుకోకుండా వారు నిద్రమేలుకోక ముందే ఊరు వదలి వెళ్ళిపోయారు.

రెండు రోజుల తర్వాత ధర్మపాలుడు యజ్ఞదత్తుడి కోసం రాగా ఆ ఇంట్లో ఎవరూ కనిపించలేదు. వారి గురించి చెప్పగలిగిన వారు కూడా కనిపించలేదు. అతను దుఃఖంతో మంత్రులను పిలిపించి అడిగాడు.

ధర్మపాలుడు "యజ్ఞదత్తుని వృత్తాంతం మీకు తెలుసు. అతని బాధను తగ్గిద్దామని రూపవతినీ, కళావతినీ అతనింట ఉంచితే మనతో మాట మాత్రమైనా చెప్పకుండా వారిని ఎక్కడికో తీసుకుపోయాడు. ఇదేం కర్మ" అంటూ వాపోయాడు.

యజ్ఞదత్తుడు ద్రోహం చేసేవాడు కాదు. అయినా వారి జాడ వెదికించి ఇక్కడికి వచ్చేలా చేయండి. దేశం నలుమూలలా తిరిగి దూతలు ఒక శివాలయంలో జపం చేసుకుంటున్న యజ్ఞదత్తుణ్ణి గుర్తుపట్టి రాజశాసనం చూపించారు. యజ్ఞదత్తుడు భార్యతో సహా విశాలపురం వచ్చాడు. ధర్మపాలుడు వారిని సాదరంగా ఆహ్వానించి, సత్కరించి పీఠంవేసి ఆశీనులను చేశాడు.

"అర్యా!కళావతీ, రూపవతులను తీసుకుని మీరు ఎక్కడికి వెళ్ళారు? మీరంతా క్షేమమే కదా! విశేషాలు ఏమిటీ" అని రాజు అడిగాడు. దానికి యజ్ఞదత్తుడు "మహారాజా! మీకు చెప్పకుండా మీ పిల్లలను నేనెందుకు తీసుకువెళతాను? వాళ్ళు మా ఇంట్లో నిద్రిస్తూండగానే మేము వెళ్లిపోయాము. వాళ్ళ విషయం నాకేమీ తెలియదు" అనగా రాజు ఆ మాటలు విని మూర్ఛపోయాడు.

అప్పుడు హితవాది అనే మంత్రి కోపంతో "వారిని వదిలి వెళ్లానని చెబుతున్నావు. మరి వారు కనిపించరేం? వారిని ఎక్కడ దాచావో నిజం చెప్పు. నీ వల్ల రాజుగారు ప్రమాదంలో పడ్డారు" అని అన్నాడు. "శివశివా! ఎంత మాట విన్నాను. కళావతీ, రూపవతులిద్దరూ నీకేం అపకారం చేశారని వారికి నేను ద్రోహం చేస్తాను? నా కన్న బిడ్డకన్నా ఎక్కువగా చూసుకున్నాను. అలాటి మాటలు అనటం కంటే నాకు శిరచ్ఛేదం చేయడం మేలు" అని దుఃఖించాడు.

ఇతర మంత్రులు యజ్ఞదత్తుడు నిరపరాధి అనీ, హితవాది అనే మంత్రి మాత్రం అతను అపరాధి అనీ వాదిస్తున్నారు. రాజు మాత్రం ఏమీ చెప్పలేక విచారిస్తూ ఉండిపోయాడు.

కథను అంతవరకూ చెప్పి ఆపి, మిగిలిన కథను తర్వాత మజిలీలో మణిసిద్ధుడు చెప్పడం ప్రారంభించాడు.



# కాశీ మజిలీ కథలు

## ౯౭ వ మజిలీ

## కృతవర్మ-గుప్తవర్మల కథ

ఒకరోజు మధ్యాహ్నం మనోహరమైన రూపం కలిగిన ఇద్దరు బ్రాహ్మణ కుమారులు బ్రహ్మస్థలం అనే అగ్రహారం పరిసర ప్రాంతాలలో నడుస్తూ ఒక బాటసారి ఎదురుపడగా "ఇక్కడికి గ్రామం ఎంతదూరంలో ఉంది? అక్కడ నివసించడానికి తగిన అవకాశం ఉందా?" అని అడిగారు.

అతను వారి రూపలావణ్యాలకు ఆశ్చర్యపడి, వారిని పొగిడి "ఇక్కడికి దగ్గరలోనే అగ్రహారం ఉందనీ, ఆతిథ్యం ఇచ్చేవారు అక్కడ చాలామంది ఉన్నారని" చెప్పి వారి వృత్తాంతం అడిగాడు.

అందుకు ఆ బ్రాహ్మణ కుమారులు "అయ్యా! మేము బ్రాహ్మణులం. విద్యకోసం కాశీకి వెళుతున్నాము" అన్నారు. దానికి ఆ బాటసారి "మీరు నిజంగా విద్యకోసమే అయితే శ్రమపడి మరీ కాశిదాకా వెళ్ళనక్కరలేదు. బ్రహ్మస్థలంలోనే సోమభట్టారకుడు అనే కాశీ పండితుడు విద్యార్థులను తన ఇంట్లోనే ఉంచుకొని విద్యాబుద్ధులు నేర్పుతాడు. ఆయన దగ్గరకు వెళ్ళండి" అని వారికి సోమభట్టారకుని ఇంటికి దారి చెప్పాడు.

వారుఆయన ఇంటికి వెళ్ళినవారు వచ్చిన పనిని గురించి చెప్పగా, సోమభట్టారకుడువారి కులగోత్రాలు ఇతర విశేషాలు అడిగి తెలుసుకున్నాడు.

"ఆచార్యా! మాది దక్షిణ దేశం. బ్రాహ్మణ కుమారులం. విద్యార్థులమై మీ దగ్గరకు వచ్చాం. దయతో మమ్మల్ని కూడా మీ శిష్యకోటిలో చేర్చుకోండి"

అని వినయంగా ప్రార్థించారు. సోమభట్టారకుడు వారి విద్యలను కొంతవరకూ పరీక్షచేసి, మెచ్చుకొని వారిని శిష్యులుగా స్వీకరించాడు.

కొన్నాళ్ళు గడిచాక గురువుగారు వారిని ఒక రహస్య ప్రదేశానికి తీసుకువెళ్ళి "నాయనా! మీరు దగ్గరకు విద్యకోసం వచ్చి చాలా తక్కువ కాలమే అయింది. అయినప్పటికీ మీ విద్యానైపుణ్యం, వినయవిధేయతలు, గుణాలు, గౌరవం వంటివి ప్రశంసించదగినవి. మిమ్మల్ని చూసి అందరూ రాకుమారులనే అనుకుంటారు. మీరు నా దగ్గర విద్యావిశేషాలను ఎక్కువగా నేర్చుకోనప్పటికీ కూడా నా శిష్యులే. మీరు నాకొక ఉపకారం చేసిపెట్టాలి. అది ఉపేక్షించరానిది. ఎంతో ఉపాయం ఉంటేనే గాని సాధించలేరు. అతి రహస్యమైనది. మీరు ఆ పనిని చేస్తానంటే చెబుతాను" అన్నాడు.

దానికి ఆ బ్రాహ్మణ కుమారులు వినయంగా "గురుదేవా! మా ప్రాణాలిచ్చి అయినా మీరు చెప్పిన పనిని చేస్తాం" అని మాటిచ్చారు. అప్పుడు సోమభట్టారకుడు ఇలా చెప్పసాగాడు.

## సత్యవతి కథ

"**నా** పూర్వజన్మ పుణ్యం ఎలాంటిదో నాకు తెలియదు కానీ నాకు లేక-లేక ఒక ఆడపిల్ల పుట్టింది. ఆమె చాలా కురూపి కావడంతో బాధపడుతూ, ఆ పిల్లకు సత్యవతి అని పేరు పెట్టాను. తల్లిదండ్రులకే అసహ్యం కలిగించేటంతటి అనాకారి. దానికిప్పుడు వివాహ వయస్సు మించిపోతోంది. దానిని ఇంతకాలం ఇతరులు చూడకుండా కాపాడుతూ వచ్చాను. నా గౌరవం గురించి తెలుసుకొని విద్యాభాస్కరుడు అనే బ్రాహ్మణ కుమారుడు దానిని పెళ్ళి చేసుకుంటానని చెప్పి వెళ్లాడు. వచ్చే నెలలోనే ముహూర్తం పిల్లని చూడడానికి వస్తామంటూ జాబు రాశాడు. అతనికి ఏం చెప్పాలో తెలియడం లేదు. ఆ పిల్లను కనుక అతను చూస్తే ససేమిరా పెళ్లి చేసుకోడు. దానికి ఏదో ఒక ఉపాయం ఆలోచించాలి. మీరు స్త్రీల వలె శిరోజాలు పెంచుకున్నారు. మీ రూపాలో ముగ్ధమనోహరంగా ఉన్నాయి. కాబట్టి మీరు ఒకరు స్త్రీ వేషం వేసుకుంటే సత్యవతి అని చెప్పి వారికి

చూపిస్తాను. అతను సంతోషిస్తాడు. తర్వాత వేరే మార్గంలో కార్యం సాధించుకోవచ్చు" అన్నాడు.

దానికి ఆ బ్రాహ్మణ కుమారులు "ఆర్యా! మీ కార్యం సాధించడానికి మేము ఏదైనా చేస్తాం. పెళ్లి చూపులకీ, పీటలమీద కూర్చోడానికి నేను స్త్రీ వేషం వేస్తాను. కాని, అత్తారింటికి వెళ్లాక ఆమే నేనని నమ్మించడం ఎలాగా?" అని సందేహం వెలిబుచ్చాడు గుప్తవర్మ. "పెళ్ళయిన కొన్ని నెలలకు నా కూతురికి స్ఫోటకం వచ్చి అనాకారిగా మారిందని చెబుతాను" అంటూ వారికి సర్ది చెప్పి చేయవలసిందిగా వివరించాడు.

ఆ పిల్ల సౌందర్యం చూసి పెళ్లికొడుకు ఎంతో సంతోషించి వెళ్ళాడు. సోమభట్టారకుడు వైభవంగా పెళ్లి ఏర్పాట్లు చేయించాడు. కపట సత్యవతితో గౌరీ పూజ చేయించి, ఆ గంపని చీకటి గదిలోకి తీసుకెళ్ళడం తమ ఆచారమని చెప్పాడు. పురోహితుడు ముహూర్త సమయం మించిపోతోందని తొందర పెట్టడంతో చీకటి గదిలో ఏ గంపలో సత్యవతి ఉన్నదో తెలియక అక్కడ ఉన్న మరొక గంపను మోసుకొచ్చారు. పెళ్ళికూతురు తలవంచుకునే కార్యక్రమాలన్నీ చేసింది.

అప్పుడు సోమభట్టారకుడు పెళ్లికూతురు ముఖం చూడగా అక్కడ మంగళ సూత్రం కట్టబడిన గుప్తవర్మ కనిపించాడు. ఆయన బాధపడుతూ చీకటి గదిలోకి వెళ్ళి గంపను తడిమి చూడగా సత్యవతి ఆ గంపలోనే ఉంది" తననెవ్వరూ తీసుకువెళ్లలేదని" చెప్పింది.

కూతురికి పెళ్లిచేయలేకపోయిన తన దౌర్భాగ్యానికీ, ఆమె దురదృష్టానికీ విచారించి మిగిలిన కార్యక్రమాలు జరిపించాడు. నాలుగు రోజులు వైభవంగా జరిగాయి. కాని ఆ రహస్యం మాత్రం ఎవరికి తెలియదు. నాకబలి అయిన తర్వాత సోమభట్టారకుడు ఒక చోట కూర్చొని ధ్యానించుకుంటూ ఉండగా ఒక శిష్యుడు వచ్చి "ఆచార్యా! యజ్ఞదత్తుడట. మీ సహాధ్యాయ. కాశీకి వెళ్తూ భార్యతో సహా వచ్చి ఉన్నాడు. మిమ్మల్ని చూడాలంటున్నాడు" అని విన్నవించాడు.

అతను సంతోషంతో యజ్ఞదత్తుడికి స్వాగతం పలికి, కౌగిలించుకొని, "మిత్రమా! కాశీ నుండి వచ్చాక నీ గురించి తెలియనేలేదు.ఎక్కడ ఉంటున్నావు? పిల్లలు ఎంతమంది? మన సహాధ్యాయి విద్యుతేస్కరి గురించి నీకేమైనా తెలుసా?" అంటూ పూర్వ విషయాలు అడిగాడు.

దానికి యజ్ఞదత్తుడు "నేస్తమా! ఇప్పుడు నేనున్న పరిస్థితి మానవ మాత్రుడికి రాకూడదు. నా గురించి ఎందుకు అడుగుతావులే. నువ్వు అదృష్టవంతుడివి. నీ గురించి చెప్పు" అన్నాడు. సోమభట్టారకుడు బలవంతం చేయగా తన కథను చెప్పి బాధపడ్డాడు. సోమభట్టారకుడు కూడా స్నేహితుని కష్టానికీ ఎంతగానో విచారించాడు. తర్వాత యజ్ఞదత్తుడు పెళ్ళికూతురిని చూస్తాననగా తన మిత్రుడేఅనీ, సిగ్గుపడకుండా అతని ముందుకు రావచ్చునని కబురు పంపాడు. శిష్యుడు గురువుగారితో రహస్యంగా "పెళ్ళికూతురు ఎక్కడ దాగుందో తెలియడం లేదు? ఎంత వెదికినా కనిపించడం లేదు" అన్నాడు. గుప్తవర్మ, కృతవర్మ కూడా కనిపించట్లేదు. భార్యను అడిగితే ఆమెకేమీ తెలియదంది. అంతలో ఏవో కేకలు వినిపించడంతో అదేమిటో తెలుసుకుని రమ్మని శిష్యుని పంపాడు. అతను వెళ్ళి విషయం తెలుసుకుని వచ్చి "గురుదేవా! దేవి అమ్మగారిని ఆవహించింది. పెళ్ళికూతురి రూపు మారిపోయి చాలా అసహ్యంగా ఉంది" అని చెప్పడంతో అందరూ లోపలికి పరిగెత్తారు.

అతని భార్య తలవిరబోసుకుని, శివమాడుతూ, సోమభట్టారకుని చూసి "మూర్ఖుడా! చాలాకాలం నుండి నిన్ను కాపాడుతున్న కులదేవతనే మరచిపోతావా? నీకు తగిన ప్రాయశ్చిత్తం చేశాను చూసుకో" అంటూ సత్యవతిని అతని ముందుకుతోసింది."ఇదెవరు?"అంటూ అతను భయపడుతూ ఉంటే "ఈమె నీ కూతురు సత్యవతి. నీ మీద కోపంతో ఇలా చేశాను" అన్నది.

దానికి సోమభట్టారకుడు "తల్లీ!రక్షించు. అపరాధం చేశాను. బిడ్డ మీద తల్లి కోపగించుకోవచ్చునా? నా చక్కని కూతురిని నాకు ఇవ్వు. నువ్వు చెప్పినట్లు చేస్తాను" అని బ్రతిమాలాడు. ఆ విషయం విని వచ్చిన పెళ్ళికొడుకు సత్యవతి వికృతరూపం చూసి బాధపడుతూ తనుకూడా దేవిని ప్రార్థించాడు.

అప్పటికి దేవి వారి ప్రార్థనలు విని అంగీకరించినట్లుగా కొంచెం శాంతించి "మూర్ఖులారా! మీరు పండితులైనప్పటికీ పామరుల్లా నన్ను మరిచారు. దీనిని మొదటి తప్పుగా మన్నిస్తున్నాను. నేను చెప్పేది జాగ్రత్తగా విని ఆ విధంగా చేయండి.

ముందుగా నన్ను పూజించి, సత్యవతికి పాణిగ్రహణ విధిని అంతా మళ్ళీ జరిపించండి. వివాహ దీక్ష అయిన తరువాత నీ కూతురు మునుపటి రూపం పొందుతుంది. ఏ మాత్రం తేడా చేసినా క్షమించను" అంది. దానికి విద్యాభాస్కరుడు సంతోషించి "మామగారూ! అమ్మవారికి మన మీద దయ కలిగింది. పదండి. మళ్ళీ వివాహ మహోత్సవం చేసుకుందాం" అన్నాడు. సోమభట్టారకుడు గృహదేవతని ఆరాధించి పెళ్ళికి తతంగం అంతా మళ్ళీ జరిపించాడు. విద్యాభాస్కరుడు సత్యవతి మెడలో మంగళసూత్రం కట్టి భార్యగా స్వీకరించాడు.

దీక్ష పూర్తయిన తర్వాత సత్యవతి రూపం ఎలా మారుతుందో చూద్దామని వచ్చిన బందువులంతా ఉండిపోయారు. మామా అల్లుళ్ళు సత్యవతికి మామూలు రూపం ఇవ్వమని ప్రార్థించారు. సోమభట్టారకునిభార్య మళ్ళీ శివమెత్తి "మూర్ఖుడా! పండితుడివైనప్పటికీ నా మహిమ తెలుసుకోలేకపోయావు. క్షుద్రదేవతలా పూజించి నా పట్ల చాలా అపచారం చేశావు. నాకు నీ మీద దయకలుగలేదు. ఇక నా కూతురు ఈ జన్మంతా ఇలాగే వికృతంగా ఉంటుంది" అంది.

అప్పుడు ఆ పండితులు భోరున విలపిస్తూ "అయ్యో! భగవంతుడా! నా కూతురు ఇలాగే వికృతంగా ఉంటే ఎవరు భరిస్తారు. దీనికి దిక్కెవరు? దీని బ్రతుకెలా గడుస్తుంది. అనుకుంటూ ఉండగా అల్లుడు అతని చేతులు పట్టుకుని"మామగారూ! బాధ పడకండి. ఈమెను కట్టుకున్న వాడిని కనుక ఇకపై మీ అమ్మాయి భారమంతా నాదే. దేవుడు చేసిన దానికి మనం మాత్రం ఏం చెయ్యగలం? ఈమెను ప్రేమగా చూసుకుంటాను. మీరు విచారించకండి" అని చెప్పి రజకునికి మాట ఇచ్చాడు.

"నేనిక్కడికి వస్తే అక్కడికి కష్టాలు కూడా తోడుగా వస్తున్నాయి" అని బాధపడుతూ యజ్ఞదత్తుడు మిత్రుణ్ణి ఓదార్చి భార్యతో సహా వెళ్ళి పోయాడు.

# కాశీ మజిలీ కథలు

## 70 వ మజిలీ

### శశాంక- మకరాంకుల కథ

“రూపవతీ! మనం ఇల్లు వదిలి వచ్చి మూడు రోజులైంది. ఊరు వదిలి చాలా దూరం వచ్చేశాం. కానీ గురువుగారు గానీ, ఆయన భార్యగానీ కనిపించలేదు. మన స్నేహితులు మన కోసం ఎదురుచూస్తూ ఉంటారు. మనం వస్తామన్న రోజు కూడా దాటిపోయింది. వాళ్ళేం చేస్తున్నారో? మనం ఒకరినొకరం కలుసుకోలేక చిక్కులు పడతామేమో? వాళ్ళ పెళ్ళి చేసుకోబోతూంటే వారించి మనం ఇలా చేస్తున్నాం.

పుత్రికాశోకంలో ఉన్న గురువుగారిని ఓదార్చలేకపోయాం. తరువాత అయినా తల్లిదండ్రులకు చెప్పకుండా, లోక విరుద్ధంగా ఇల్లు వదిలి వచ్చేశాం. ఇదంతా దైవ మాయలా అనిపిస్తూ ఉంది. ఇప్పటికైనా మనం ఇంటికి వెళ్లిపోవటం మంచిదేమో” అంది కళావతి.

దానికి రూపవతి“చెలీ! మన ప్రయత్నం వృధా అయినప్పటికీ ఇప్పుడు పశ్చాత్తాపపడి ప్రయోజనం లేదు. ఇప్పుడు మనం ఇంటికి వెళితే ప్రజలు, బంధువులు అందరూ నిందిస్తారు. మనకి అలాంటి బుద్ధి పుట్టించిన దేవుడు ఎలా నడిపిస్తే అలా నడుద్దాం.పురుష వేషాలలో ఉన్నాం కనుక మనల్ని ఎవరూ గుర్తించలేరు. నీ పేరు శశాంకుడు, నా పేరు మకరాంకుడు” అని ఉత్సాహంగా చెప్పింది.

“యవ్వనంలోకి అడుగుపెడుతన్న మనల్ని ఈ పాటికి అంతఃపురంలో బంధించేవారు. దేశాలను ఎలా చూడగలుగుతాం? ఒక విధంగా ఇదీ మంచిదేలే. నడకే శరణ్యం. తూర్పువైపున అడవులు ఎక్కువ అంటారు.

కానీ మనం ముందటే అటే అనుకున్నాం కనుక ఆ వైపుగా వెళ్లవలసిందే" అన్నది కళావతి.

ఇద్దరూ సాయంత్రం వరకూ నడిచినప్పటికీ దట్టమైన అడవిలోకి ప్రవేశించారేగానీ గ్రామమనేది కనిపించలేదు. గుండెను రాయి చేసుకుని ఆ రాత్రికి ఒక చెట్టు క్రింద పడుకున్నారు. అలా నాలుగురోజులు నడిచినా వాళ్లకి ఏ దారీ కనిపించలేదు. ఆహారపదార్థాలు కూడా అయిపోయాయి. కాళ్లు నొప్పి పెడుతున్నాయి. వాళ్లు చాలా అలసిపోయినప్పటికీ రూపవతి ప్రోత్సాహంతో ముందుకు నడిచారు. అలా కొంత దూరం వెళ్లగా ఒక వైపు నుండి"కొట్టండి,పొడవండి" అంటూ కేకలు వినిపించాయి. ఒక పంది అటువైపుగా పరిగెత్తుకు వచ్చి రూపవతిని వెంట తరిమింది. రూపవతి దానికి అందకుండా ఒక చెట్టు చుట్టూ తిరుగుతూ ఉంటే కళావతి ఒక కర్రతీసుకుని ఆ పందిని బెదిరించసాగింది. రూపవతి అలసిపోయి పడిపోగా ఆ పంది ఆమె వీపుపై గోళ్లతో గీరింది. కళావతి కర్రతో కొట్టడంతో అది పారిపోయింది. రూపవతిలో చలనం లేకపోవడంతో ఆమె చనిపోయిందనుకొని కళావతి విలపించింది. కానీ కొంత సేపటికి ఆమె కళ్లు తెరిచి దాహంగా ఉందని సూచించింది.

నీటికోసం తిరిగి-తిరిగి కళావతి తాను వచ్చిన దారి మరిచిపోయింది. అటూ ఇటూ తిరిగి చివరికి ఒక చెట్టు ఎక్కి నాలుగువైపులా చూసింది. దూరంగా వేటగాళ్ల సందడి వినిపించడంతో వారితో వెళ్లిపోయింది.

అక్కడ విశాలమైన ఎడారిలో చాలా గుడారాలు వేయబడిఉన్నయి. వాటి చుట్టూ సైన్యం ఉంది. ఆమె "దాహం, దాహం" అని అరువగా కిన్నెరదత్తుడు అనే రాజు ఆ మాటలు విని తన దగ్గరకు తీసుకురమ్మన్నాడు. ఆ రాజు "నాయనా! నువ్వు ఏ ప్రాంతం వాడివి? ఎందుకు వచ్చావు? అసలు నీ వృత్తాంతం ఏమిటి?". అని ప్రశ్నించాడు. "దేవా! నేను బ్రాహ్మణ కుమారుడిని, నేను,నా స్నేహితుడు కాశీలో విద్యాభ్యాసం చేసి ఇంటికి వెళుతూ ఈ అడవిలో పోతున్నాం. నా మిత్రుడు వరాహం చేత దెబ్బతిని మూర్ఛపోయాడు. అతనికి వెంటనే నీరు అందివ్వాలి. లేకపోతే బ్రతకడు. నా పేరు శశాంకుడు.

ఒక పాత్రలో నీరు ఇస్తే తీసుకువెళ్లి అతనిని రక్షించుకుంటాను. నా ప్రాణాలనైనా వదులుతానుగానీ అతనికి దాహం తీర్చకుండా నేనేమీ ముట్టుకోను. ఆ ప్రదేశం ఇక్కడికి చాలా దూరం? ఎప్పుడు వెళతానో? ఎప్పుడు చూస్తానో? మళ్లీ కనిపిస్తాడో? లేదో? అంటూ కళావతి తన వృత్తాంతం వివరించింది.

రాజు మకరాంకుడిని వెదకడానికి ఇద్దరు రౌతులను పంపించాడు. ఆ అడవిలో ఎంత వెదికినప్పటికీ అతడు కనిపించక పోవడంతో సంధ్యవేళకి వాళ్లు వెనక్కి తిరిగి వచ్చేశారు.

కిన్నెర దత్తుడు శశాంకుడిని చూసి"ఈ బ్రాహ్మణ కుమారుడు చాలా సుకుమారుడిలా వున్నాడు. ఎంతసేద తీరినప్పటికీ ఇంత వరకూ అతనికి తెలివిరాలేదు. వైద్యులు పరీక్షించి చాలా రోజుల నుండి నిద్రాహారాలు లేకపోవడంతో ఇలా ఉన్నాడు అన్నారు. ఇతను గుణసంపన్నుడు అని ఇతను దాహమైనా తీసుకోలేడు. ఇతను చెప్పినట్లుగా మకరాంకుడు ఏ క్రూరజంతువుల బారినో పడి ఉంటాడు.

ఈ బ్రాహ్మణ కుమారుని మన రాజధానికి తీసుకువెళ్ళి మంచి స్థితిని కల్పిద్దాం. ఇవాళ రాత్రికే ప్రయాణం ఏర్పాటు చేయండి" అంటూ మంత్రులను ఆదేశించాడు.

శోభావతి అనే తన రాజధానికి చేరుకున్నాక శశాంకుడి పల్లకీని కూడా అంతఃపురం తీసుకువెళ్లి తన భార్యతో "దేవీ! ఈ బాలుని పేరు శశాంకుడు. ఇతని విద్యాగుణ విశేషాలు చాలా గొప్పవి. దైవికంగా అడవిలో దారితప్పి మన సేనలో చేరాడు. సంతానం లేని మనకు ఇతనిని దైవమే వరంగా ఇచ్చాడు అనుకుందాం. నా రాజ్యం వీడికి అప్పగిస్తాను. నువ్వు మీ అన్న కూతురు తారావళిని పెంచుతున్నావు కదా! ఆమెను ఇతనికిచ్చి వివాహం జరిపిద్దాం. అన్నీ ఆలోచించే ఈ నిర్ణయం తీసుకున్నాను" అన్నాడు.

ఆ మాటలు విని మహారాణి చాలా సంతోషించింది. ఆమె శశాంకుడికి సపర్యలు చేస్తూ ఉంటే "హా! రూపవతీ! సఖీ! అని కలవరించడం విని ఆశ్చర్యపోయింది. నాలుగురోజుల తరువాత శశాంకుడికి స్పృహ వచ్చింది. కళ్లు తెరిచి ఎదురుగాఉన్న రాజపత్నిని చూసి "అమ్మా! మీరెవరు? నేనిక్కడికి ఎలా వచ్చాను? ఇది కలా, నిజమా? అని అడిగాడు దానికి ఆమె" నువ్వు నన్ను అమ్మా అని పిలిచావు కదా? నేను మీ అమ్మనే అనుకో, నువ్వు నా కొడుకువి. ఈ తారావళి నీకు భార్య, నువ్వు చాలా అలసిపోయి వున్నావు. అన్ని విషయాలు తరువాత చెబుతాను" అంటూ అతనికి మధురమైన పదార్థాలను అందించింది.

శశాంకుడికి కొంచెం ఓపిక రాగానే గతం గుర్తొచ్చి రూపవతికోసం పరుగెత్తబోగా ఆ తల్లి అతన్ని ఆపింది. అతను తన మిత్రుని గురించి చెప్పగా, రాజు ముందుగానే ఇదంతా చెప్పి ఉండటంతో "నీ స్నేహితుని కోసం దూతలు వెళ్ళారు. అతనిని ఇక్కడికే తీసుకువస్తారు. బాధపడకు" అంటూ ఓదార్చింది.

ఇంతలో రాజు అక్కడికి వచ్చాడు.

శశాంకుడు రాజును గుర్తుపట్టి "తండ్రీ! నా మిత్రునికి నీరు పంపారా? అతను ఎక్కడ ఉన్నాడు" అని ఆత్రంగా అడిగాడు.

దానికి రాజు "నాయనా! మా రౌతు అతనిని వెదికి పట్టుకుని దాహం తీర్చి నీవున్న చోటికి తీసుకువెళతానని ఎంతగా చెప్పినప్పటికీ వినకుండా మరో దారిలో వెళ్ళాలని ప్రయత్నించాడట. "నువ్వీ అడవిలో నడవలేవు. గుర్రం మీద కూర్చో, అడవి దాటిస్తానని చెప్పి, అడవి దాటించి వచ్చాడట. నువ్వు అతనికోసం బాధపడనక్కరలేదు" అని అనునయించాడు.

"మిత్రుడు ఆపదతో ఉండగా వదిలి వచ్చేసిన నన్ను కృతఘ్నుడిగా భావించి వుంటాడు. మరొకరిని పంపిస్తే మాత్రం వస్తాడా" అనుకుని రాజుతో "తండ్రీ!

మీరు నాకు ప్రాణ దానం చేశారు. జీవితాంతం మీకు రుణపడి ఉంటాను. నాకు సెలవిప్పిస్తే పోయి వస్తాను" అన్నాడు. దానికి కిన్నెరదత్తుడు"నాయనా! నీ గుణగణాలన్నీ సార్వభౌమత్వాన్ని సూచిస్తున్నాయి. నాకు సంతానం లేదు. నిన్ను నా కుమారుడిగా భావించి రాజ్యం అప్పగిస్తాను. నేను వృద్ధుడిని అవడం వల్ల రాజ్య భారం వహించలేను. నువ్వు చిన్నవాడివైనప్పటికీ, నీ బుద్ధిబలం చాలా పెద్దది. నీ గుణ విశేషాలు విని ప్రజలు నిన్ను రాజుగా కోరుకున్నారు. తారా వళిని పెళ్ళి చేసుకుని రాజ్యం ఏలుకో" అన్నాడు.

శశాంకుడు ఎన్ని అభ్యంతరాలు చెప్పినప్పటికీ రాజు యుక్తితో వాటికి ఖండించండంతో ఏ ఉపాయం తోచక, తర్వాత చూసుకుందాంలే" అనుకున్నాడు. ఆ తరువాత రెండు మూడు రోజులకే కిన్నెర దత్తుడు పాము కరిచి చనిపోతూ అందరినీ రప్పించి శశాంకుడిని రాజును చేయమని చెప్పి కన్నుమూశాడు.

శశాంకుడు రాజ్యభారం వహించి ప్రజలను చక్కగా పరిపాలిస్తూ అనతికాలంలోనే పేరు ప్రఖ్యాతులు సంపాదించాడు.

కిన్నెర దత్తుడి భార్య శశాంకుడికి "నాయనా! నువ్వు చక్కగా రాజ్య పాలన చేస్తూ మీ నాన్నగారి పేరు ప్రతిష్టలు మరింత పెంచావు. ప్రజలు నీ పరిపాలనలో సంతోషంగా వున్నారు. దాన్ని అలా ఉంచు. నా అన్న కూతురు తారావళికి తల్లి లేదని నేనే పెంచి పెద్ద చేశాను. దాని గురించి నీకు ఇదివరకే చెప్పి ఉన్నాను. మీ నాన్నగారు తారావళిని నీ పట్టమనిషిని చేసుకోమన్నారు కదా! కనుక ఆమెను పెళ్ళి చేసుకుని గృహస్థుడివి అవు. నేను చాలా సంతోషిస్తాను" అని ఉత్తరం రాసి పంపగా, శశాంకుని రూపంలో ఉన్న కళావతి తన గతాన్ని తలుచుకుంటూ, రాజ్య మదంలో ఆడదాన్ని అయిన నేను మగరూపంలో రాజ్యం ఏలుతున్నాననే విషయాన్నే మరచిపోయాను. ఇప్పుడు వెళ్ళి స్నేహితురాళ్లను కలుసుకుందామన్నా ఈ రాజ్య బంధం కదలనివ్వదు. కాబట్టి వారినే ఇక్కడికి రప్పించేందుకు ప్రయత్నిస్తాను" అనుకొని ఒక పత్రికలో

పిన్నపాప వలన కన్నెలు ముప్వరు
కలిగి రట్టివారు కన్మొరంగి
దెసలcగొసలcదెలియ తిరుగుచు నున్నారు
వారి జాడ తెలియ వలయు మాకు

అని పద్యం రాయించి దూతలకు ఇచ్చి "దేశదేశాలూ తిరుగుతూ ఈ పద్యం చదవండి. దీనికి ఎవరైనా సమాధానం చెబితే వారిని వెంటనే సగౌరవంగా మా దగ్గరకు తీసుకురండి" అని చెప్పి పంపించింది.

మణిసిద్ధుడు అవతలి కథను తరువాత మజిలీలో ఇట్లా చెప్పసాగాడు....



# కాశీ మజిలీ కథలు

## 71 వ మజిలీ

## సత్వవంతునికథ

దూరంగా కొన్ని కొండలు- వాటి మధ్యలో ఒక లోయ. అక్కడ నుంచి కేసరుడు అనే బోయవాడు నీటితో నింపిన వెదురుబొంగును భుజానికి తగించుకుని ఆ దారిన వెళుతూ దాహంతో కొట్టుకుంటున్న మకరాంకుడిని చూసి ఆశ్చర్యపోయి అతని నోటికి నీటిని అందించాడు. ఆ నీటిని త్రాగి మకరాంకుడు లేచికూర్చుని ఆ భిల్లుడిని చూసి అతని కోరికపై తన వృత్తాంతం చెప్పాడు. దానికి ఆ బోయవాడు "ఒక్కడవీ ఈ అడవిలో ఉండలేవు. నాతో పాటు మా ఇంటికి రా,రేపు నీకు దారి చూపిస్తాను" అంటూ అతన్ని తన ఇంటికి తీసుకువెళ్ళాడు.

పులితోళ్లు వంటి రకరకాల చర్మాలతో చక్కగా అలంకరించబడి ఉన్న ఆ బోయపల్లె, వెదురు తడకలతో నిర్మించబడి ఉన్న గుడిసెలు మకరాంకుడిని ఎంతగానో ఆకర్షించాయి. వారికి విద్యలేకపోయినప్పటికీ చక్కని రూప స్వభావాలు కలిగి ఉన్నారని సంతోషించాడు.

ఆ బోయవాడు తన గుడిసెముందు నిలబడి "పింగళికా! అని పిలవగానే తడిక తెరుచుకుని అతని భార్య బయటకు వచ్చి అతనికి నమస్కరించి "ఈ బాలుడెవరు?" అని అడిగింది. బోయవాడు"అతనొక బాటసారి" అని చెప్పి "ఇతను చాలా ఆకలిమీద వున్నాడు. తొందరగా వెదురు బియ్యంతో అన్నం వండి పెట్టు" అన్నాడు. ఆమె క్షణంలో వంటచేసి పండ్లు, తేనె వంటి పదార్థాలతో చక్కని భోజనం పెట్టడం చూసి వారి సంస్కారాన్ని ప్రశంసించాడు.

దానికి ఆ ఇల్లాలు "నాయనా! మమ్మల్ని పొగుడుతున్నావా? మాకూ, మృగాలకూ తేడా లేదు. నాకొక కొడుకు వున్నాడు. అడవికి వెళ్లాడు" అని చెబుతూ ఉండగానే వింటికి పులిపిల్లని తగిలించుకుని బోయపిల్లవాడు వచ్చాడు. ఆ తల్లి దాన్ని చూసి" ఈ పులిపిల్లను ఎందుకు చంపావు? దీని కోసం దీని తల్లి ఎంత బాధపడుతుందో? మృగాలని చంపకూడదని నేను చెప్పిన విషయం మరచిపోయావా? అంటూ మందలించింది.

"అమ్మా! నేను నీ మాటలు మరచిపోతానా? ఈ పులిపిల్ల దాని తల్లితో విడిపోయి నాకు అడ్డం పడింది. నేనెంత తప్పించుకోవాలని చూసినా వదల లేదు. ప్రాణాపాయంగా పరిణమించడం వలన దీనిని చంపవలసి వచ్చింది? నేను చేసింది తప్పా?" అన్నాడు.

వారి మాటలు విన్న మకరాంకుడు "ఈ మహారాణ్యంలో, పచ్చి మాంసం తినే ఈ కిరాతకులలో కూడా ఇలాంటి గుణవంతులు ఉండడం ఆశ్చర్యంగా ఉంది. ఈ పిల్లవాడు సార్వభౌముల ఇంట్లో పుట్టవలసినవాడు. చక్కని రూపం కలిగినవాడు. కాని విద్యలేనట్లుగా కనిపిస్తున్నాడు" అంటూ ఆ పిల్లవాడినిని పిలిచి "నీపేరు ఏమిటి" అని అడిగాడు. వాడు తల్లి అనుమతితో "సత్వవంతుడు' అని చెప్పాడు. చదువు విషయం అడగ్గానే "అదేమిటి" అని ఆశ్చర్యపోయాడు. ఆ పిల్లవాడు భోజనం చేశాక మకరాంకుడు. విద్య గురించి, విశేషంగా చెప్పి వాడిలో ఆసక్తిని కలిగించాడు.

అప్పటి నుండి ఆ పిల్లవాడు విద్యనేర్పమని మకరాంకుడిని వేధించసాగాడు. మకరాంకుడిని వేధించసాగాడు. మకరాంకుడు విద్యనేర్పించసాగాడు. ఏకసంధాగ్రాహి అయిన సత్వవంతుడు మకరాంకుడికి వచ్చిన విద్యలన్నింటినీ సంవత్సరంలోపే నేర్చుకున్నాడు. ఒక రోజు మకరాంకుడు వింటూ వుండగా తల్లి తండ్రులతో"ఈ భూమి మీద ఎన్నో వింతలున్నాయి.మనం విద్యనేర్చుకోక పోవటం వల్లనే ఈ అడవిలో ఉంటున్నాం. విద్యలేనివాడు కళ్లున్నా చూడలేని గుడ్డివాడితో సమానం. ఈ మహాత్ముని దయ వలన సకల విద్యారహస్యాలను తెలుసుకోగలిగాను. ఇక మనం ఇక్కడ ఉండనక్కరలేదు. జనావాసానికి పోదాం. నా విద్యలతో మిమ్మల్ని రాజతుల్ని చేస్తాను" అన్నాడు.

అందుకు ఆ దంపతులు నవ్వుతూ "మేము పట్నాలని ఒక సారి చూశాం. చాటు, మాటూగా అంటూ వుండవు. వాకిట్లో నిలబడనివ్వరు 'పొండి-పొండి' అంటూ తరిమేస్తారు. ఎక్కడ చూసినా మనుషులే. దానికంటే ఈ అడవే నయం" అన్నారు.

సత్వవంతుడు "పట్నం చూసి వస్తాను"అంటే మకరాంకుని తోడుగా పంపారు. వారిద్దరూ మర్నాడు ఆనందంతో ఏనుబోతులమీద ఎక్కి అరణ్యాలు దాటి జనావాసాలు చూసుకుంటూ ఒక నాడు మధ్యాహ్నవేళకి శోభావతీ నగరం చేరుకుని అక్కడి బజార్లలో తిరగసాగారు.

సత్వవంతుని రూపం, విల్లమ్ములు చూసి అక్కడి ప్రజలు ఆశ్చర్యపోయారు. కొందరు రాజ భటులు యుద్ధ సన్నాహంతో వచ్చి అతన్ని చూసి"నువ్వెవ్వరివీ? వీరుడివా? లేక పిట్టలు కొట్టేవాడివా?" అని పరిహసించగా, సత్యవంతుడు కోపగించుకుని, "నేను వీరుడినే కానీ మిమ్మల్నందరినీ పిట్టల్ని కొట్టినట్లు కట్టగలను" అన్నాడు. వారు దానికి మరింత కోపంగా"నీచుడా! మేం రాజుగారి సైనికుల ప్రధానమైన వీరులం. యుద్ధానికి వెళుతున్నాం. మాకు మొక్కులేకపోతే నీ శిరస్సును భూతబలిగా సమర్పిస్తాం" అన్నారు.

దానితో సత్వవంతునికి కోపం వచ్చి బాణాలు సంధించి వారిని నలువైపులా పరిగెత్తించాడు. ఆ విషయం విన్న రాజు"అలాంటి వీరుని మీద కోపం తగదు. అతను అర్జునుడి లాంటివాడు కాకపోతే ఒక్కడే పదిమందితో ఢీ కొంటాడా"? అని మంత్రులకు చెప్పి అతన్ని తీసుకురమ్మన్నాడు. మంత్రులు వెళ్ళి అతన్ని రమ్మని పిలువగా"నా మిత్రుడు ఏదో పనుందని వెళ్లాడు అతను వచ్చాక వస్తాను. అతనికి ఇక్కడ జరిగిన విషయం గురించి తెలియదు" అంటూ సత్వవంతుడు వారితో మాటల్లో పడ్డాడు.

చాలా సేపు ఎదురు చూసినప్పటికీ మకరాంకుడు రాకపోవడంతో పెద్దలు తన కోసం నిరీక్షిస్తున్నారనే మొహమాటంతో తొందరగా వచ్చేద్దామని వారితోపాటు రాజు దగ్గరికి వెళ్లాడు.

శశాంకుడు అతన్ని దూరం నుంచి చూసే మోహపరవశుడయ్యాడు. కానీ ఆ విషయం బయటపడకుండా అతనికి ఎదురెళ్లి స్వాగతం పలికి, తన ఎదురుగా కూర్చోబెట్టుకున్నాడు. మంత్రులు సత్వవంతుడి గుణవిశేషాలను గూర్చి వివరించారు.

అప్పుడు శశాంకుడు"సత్వవంతా! ఇక్కడికి పదియోజనాలదూరంలో సౌగంధిక అనే నగరం ఉంది. దాని రాజైన ప్రభాసాగరుడు మా తండ్రిగారికి అత్యంత ప్రీతిపాత్రుడు. అతని మీదకి చాలా మంది రాజులు యుద్ధానికి రాబోతున్నారనే విషయం తెలుసుకుని అతనికి సాయంగా మా సైన్యాన్ని పంపుతున్నాను. నువ్వు సేనానాయకుడివై అక్కడికి వెళ్ళి శత్రువులను జయించి విజయంతో రా" అంటూ పొగిడాడు.

దానికి సత్వవంతుడు అంగీకరించడంతో సర్వసేనాధిపత్యానికి పట్టాభిషిక్తుడిని చేసి ఒక మంచి గుర్రాన్ని ఇచ్చాడు. సత్వవంతుడు రాజాజ్ఞ ప్రకారం ఒక శుభముహూర్తంలో సర్వసేనలతో సౌగంధిక నగరం బయలుదేరాడు. ఆ హడావిడిలో అతనికి మకరాంకుని విషయం గుర్తుకురాలేదు.

సేనలతో సహావెళుతూ ఉండగా సౌగంధిక నగరం నుండి రాజ ప్రముఖులు వారికి ఎదురొచ్చి"దేవా! మా రాజుగారు ప్రభాసాగరుడు మీ రాక కోసం ఎదురు చూస్తూ ఉన్నారు. రాజ పుత్రులందరూ ఏకమై వచ్చి ఆయనతో యుద్ధం చేస్తున్నారు. సముద్రంలా ఎగిసి పడుతున్న శత్రుసైన్యాన్ని ఎదిరించగలిగే సైన్యం మా దగ్గర లేదు. మిమ్మల్ని తొందరగా తీసుకురమ్మని మమ్మల్ని పంపించారు. త్వరగా పదండి" అన్నారు.

సత్వవంతుడు చిరునవ్వుతో"మీ రాజు కేమీ భయం లేదు. నేను వచ్చి మీకు విజయం కలిగిస్తాను. కానీ మీ రాజుకు అంతమందితో వైరం ఎందుకు వచ్చినట్టు"? అని అడిగాడు.

దానికి వారు ఇలా చెప్పసాగారు.

# సౌగంధిక కథ

"మా రాజుగారికి లేక-లేక కలిగిన సంతానం సౌగంధిక. ప్రాయం వచ్చేసరికి అత్యంత సౌందర్యవతిగా ప్రసిద్ధి చెందింది. ఆమెకు వివాహం చేయదలచి ఎందరు రాకుమారుల చిత్రపటాలు తెప్పించి చూపించినప్పటికీ ఆమె వాటిని నిరసించేది. చివరకు ఎలాగో కష్టపడి ఆమెను ఒప్పించి స్వయంవరం చాటింపు వేయగా ఎందరో రాకుమారులు తరలివచ్చారు.

ఆమె వారి వివరాలు వింటూ, వారిని చూస్తూ సభాభవనం దాటి వెళ్లి అక్కడ ఒక అశోకవనంక్రింద ఆ స్వయంవరం వింత చూస్తూ నిలబడిన బ్రాహ్మణ కుమారుని చూసి, అతని వివరాలైనా అడక్కుండా అతని మెడలో వరమాల వేసింది. అతను లేచిన వేళావిశేషం మంచిదే అయి వుంటుంది. అతను ఒక బ్రాహ్మణ కుమారుడు. విద్యాభ్యాసంకోసం కాశీ పట్టణానికి వెళుతున్నాడు. రాజు జరిగిన ఈ సంఘటనకు సౌగంధికను ఏమీ అనలేకపోయాడు. కానీ స్వయంవరానికి వచ్చిన రాకుమారులందరూ కోపగించుకుని ఏకమై నగరాన్ని చుట్టుముట్టారు. రాజుగారు ఒంటరిగా వారితో పోరాడలేక వారికి అత్యంత ఆప్తుడైన కిన్నెర దత్తుని పుత్రునికి ఈ విషయం తెలియజేశారు. వారు మిమ్మల్ని పంపుతున్నారు" అని తెలియజేశారు.

అది విని సత్వవంతుడు వేగంగా సౌగంధిక చేరుకున్నాడు. అప్పటికే శత్రురాజులు ఆయన్ని ఓడించి బంధువులతో సహా బంధించారనే వార్త తెలిసింది. సత్వవంతుడు సౌగంధిక చేరుకుని అడ్డం వచ్చిన వారినందరినీ చంపి కోటలో ప్రవేశించాడు. అక్కడ కొందరు రాజపుత్రులను చంపి, కొందరిని కొట్టి, మరి కొందరిని బంధించి ఒక్కపూటలో శత్రువులనందరినీ జయించి ప్రభాసాగరునికి సింహాసనం అప్పగించాడు.

అప్పటికి బలగాలు నగరంలోకి ప్రవేశించాయి. పౌరులు సత్వవంతుణ్ణి ఎంతగానో పొగిడారు. ప్రభాసాగరుడు"మహాత్మా! నువ్వు మా కిన్నెర దత్తునికి

ఎలాంటి బంధువో నాకు తెలియదు. అయినా నా పాలిటి దైవంలా వచ్చి నన్ను కాపాడావు. నీ రుణం తీర్చుకోలేను. నా అర్ధరాజ్యాన్ని నువ్వు పాలించు" అన్నాడు.

దానికి సత్వవంతుడు"మహారాజా! నా పేరు సత్వవంతుడు. కిన్నెర దత్తని కుమారుడైన శశాంకుని స్నేహితుడిని. నాకు మీ రాజ్యంతో పని లేదు. సెలవిప్పిస్తే వెళ్ళొస్తాను"అన్నాడు. "ఒక్కడివి ఇంత మందిని జయించావంటే నువ్వు నిజంగానే దైవసమానుడివి. ఈ విజయాన్ని పురస్కరించుకుని ఎల్లుండి సభ ఏర్పాటు చేశాను. అప్పుడు మేమందించే సత్కారాలు స్వీకరించి మమ్మల్ని ఆనందపరుచు" అని వేడుకున్నాడు ప్రభాసాగరుడు.

అప్పటితో వేళ మించిపోయిందని మిగిలిన కథను తరువాత మజిలీలో చెబుతానని మణిసిద్ధుడు అన్నాడు.....



# కాశీ మజిలీ కథలు

## 72 వ మజిలీ

### కమల కథ

ప్రభావతీ పురంలో ఎంతో పెద్దదయిన ఒక విశ్వేశ్వరాలయం ఉంది. అక్కడ వ్యాసమఠం అనే పేరుతో ఒక ఆశ్రమం ఉంది. ఆ మఠంలో సన్యాసులు, విరాగులు, బైరాగులు చాలామంది ఉండేవారు. దీని ప్రక్కనే ఒక సత్రం కూడా ఉంది. అక్కడికి ఒకనాడు కమల అనే పేరుగల అందమైన బాలయోగిని వచ్చింది. ఆమెను చూసి అందరు“ఇంత అందమైనది చిన్నతనంలోనే ఎందుకు విరక్తి చెందినట్లు?” ఆమె ఎవరికిసేవ చేస్తుందో గానీ అతడు ధన్యుడు” అనుకున్నారు.

కమల ఆ మఠం అంతా తిరిగి, అక్కడ ఉండే అందరి గురించి తెలుసుకుని చిదంబర యోగి ఉత్తముడని విని ఆయనకు నమస్కరించింది. ఆయన ఆమె వృత్తాంతం అడగగా “స్వామీ! నేను విరక్తి చెంది మీ పాదాలను ఆశ్రయించాను. కొంత కాలం మీకు శుశ్రూష చేస్తాను. ఈ యోగులందరిలో మీరే ఉత్తములనివిన్నాను” అంది.

చిదంబర యోగి ఆమెను శిష్యురాలిగా అంగీకరించాడు. ఆమె ఆయన నుండి వేదాంత తత్త్వవిశేషాలు తెలుసుకోసాగింది. ఆమె ఆ ఆశ్రమంలో చేరిన దగ్గర నుండి మిగిలిన యోగులు జపతపాలు మానేసి ఆమెనే చూస్తూ, ఏదో ఒక వంకతో చిదంబరయోగి దగ్గరకు వచ్చి కూర్చోవడం మొదలుపెట్టారు. ఆమె ఆ విషయాలేమీ పట్టించుకోకుండా ముసుగు వేసుకుని జపం చేసుకునేది.

ఒకనాడు కిన్నెరదత్తుని భార్య తారావళితో సహా రహస్యంగా ఆ ఆశ్రమానికి వచ్చి అందరికీ నమస్కరించి చిదంబరయోగి దగ్గరకు వెళ్లింది. ఆమె వృద్ధ రాజుగారిభార్య అని తెలుసుకుని ఆయన ఆమెనెంతో గౌరవించి ఆ ఆశ్రమం ఏలోటూ లేకుండా చక్కగా నడుస్తోందనీ, అది కట్టించినవారి వంశాన్ని పొగిడి, ఆమెకేదైనా కోరిక ఉందేమో అడిగి తెలుసుకున్నాడు.

ఆమె తారావళి గురించి వివరాలు చెప్పి "రాజు చేరదీసినప్పటికీ శశాంకుడు ఈమెనెందుకు పెళ్లి చేసుకోకుండా ఎందుకు దాటవేస్తున్నాడో తెలియడం లేదు? సర్వజ్ఞులైన మీరే ఈ విషయం గురించి చెప్పాలి. అలాగే మా పని సక్రమంగా జరిగేలా చూడాలి" అని వేడుకుంది.

అదే సమయంలో కమల స్నానం చేసి జపం చేసుకోవటానికి అక్కడికి వచ్చింది. రాణి కమలను చూసి"ఈమె ఎవరు" అని చిదంబరయోగిని అడిగింది. దానికి ఆయన తన శిష్యురాలని జవాబిచ్చాడు. "అమ్మా! నువ్వెందుకు ఇంత చిన్న వయస్సులోనే విరక్తి చెందావు? నీ తల్లిదండ్రులు ఎవరు? నీకు పెళ్లయిందా?" అంటూ మహారాణి నేరుగా కమలనే ప్రశ్నించింది.

దానికి కమల నవ్వుతూ"మహారాణీ! నా వెనుకటి వృత్తాంతం చెప్పకూడదు. కనీసం తలుచుకోకూడదు. నాకు ఒకప్పుడు అందరూ వుండేవారు. ఇప్పుడు ఎవ్వరూలేరు. విరక్తికి వయస్సుతో నిమిత్తం లేదు" అంది.

రాణి ఆమె మాటలకు సంతోషించి ఆమె మీదప్రేమతో మంచాలు, పరుపులు వంటివి పంపించింది. వాటిని చూసి కమల "గురువుగారు నేలమీద పడుకుంటే శిష్యురాలినైన నేను మంచంపైన ఎలా పడుకోగలను". అని అనడంతో వ్రత విరుద్ధమైనప్పటికీ అప్పటి నుంచీ చిదంబరయోగి కూడా మంచంపైనే పడుకోసాగాడు.

# స్థూలజంఘ తామ్రకేశులకథ

స్థూలజంఘుడు, తాత్రకేశుడు ఇద్దరూ విటులు. ఒక వేశ్య సొమ్మును దొంగిలించి, రాజభటులు వారిని అపరాధులుగా నిరూపించడంతో పారిపోయి సన్యాసుల వేషాలలో ఈ ఆశ్రమానికి వచ్చి యోగులకు సేవ చేస్తున్నారు. కమల వచ్చిన దగ్గర నుండి వారు ఆమెపై వలపు చెంది చిదంబరయోగికి ఎక్కువగా సేవలు చేయడం మొదలుపెట్టారు. ఆమె ఆ విషయాన్ని గ్రహించి వారి నుండి తప్పించుకునేది.

ఒకరోజు రాత్రి ఆమెను మంచంతో సహా ఎత్తుకుపోయి ఒక పాడుబడిన గుడిలో ఉంచి ఆమెను పొందాలనుకున్నారు. అర్థరాత్రి కావడంతో కమల అని పొరపాటు పడి కాషాయ వస్త్రాల్లో ఉన్న చిందబరయోగిని మంచంతో సహా ఎత్తుకొచ్చి ఆశ్రమానికి దూరంగా ఉన్న శివాలయంలో ఉంచారు. "నేను ముందు వెళతానంటే, నేను ముందు వెళతాను" అని వారిద్దరూ తగువు లాడుకోసాగారు. చివరకు తామ్రకేశుడు ముందుగా వెళ్లడానికి అంగీకరించినప్పటికీ అతను లోపలికి వెళ్లగానే స్థూలజంఘుడు"తామ్రకేశా! ఒకసారి తలుపుతీయి.నీతో ఒక మాట చెప్పాలి. అంటూ తలుపు రంధ్రంలో నుంచి అరిచాడు. అతనిది వినిపించుకోకుండా చీకట్లో ఏమీ కనిపించక ఊపిరి బట్టి ఊహించి కాషాయవస్త్రాలు తొలగించి ముఖం మీద దంతక్షతాలు నాటించాడు.

అప్పుడు చిదంబరయోగి అదిరిపడి లేచి "ఎవర్రా అది! నా మొహం కరుస్తున్నాడు?" అని అరిచాడు. అలా మాట్లాడి తమ గురువుగారని గ్రహించి తామ్రకేవుడు మంచంక్రింద దూరి దాక్కున్నాడు. ఆ విషయం తెలియని స్థూలజంఘుడు "తామ్రకేశా! తలుపులు తియ్యవేమి? తలారులను తీసుకొస్తాను చూడు" అంటూ గట్టిగా అరిచాడు. అది విని యోగి ఆశ్చర్యపోయి "అక్కడ మాట్లాడేది ఎవరు? ఇక్కడేమీ కనిపించంలేదు. దీపం తీసుకురండి" అన్నాడు.

ఆ కంఠం తమ గురువుగారిదని స్థూలజంఘుడు గ్రహించి బయటగొళ్లెం పెట్టి పారిపోయాడు. ఆ యోగి మంచందిగి, నాలుగుమూలులా తడుముకుంటూ చూసి గోడలు తగిలేసరికి అది చెరసాల అనుకుని "నేనిక్కడికి ఎలా వచ్చాను?" నా బుగ్గ కరిచిందెవరు? ఇక్కడేమైనా భూతాలున్నాయా?"అనుకుంటూ ఉండగా మంచం క్రింద నుండి తామ్రకేశుడు "హు.....హు" అని మూలగడం మొదలుపెట్టాడు. పిశాచభయం భ్రాంతి వల్ల కలుగుతుందని తెలిసినప్పటికీ వేదాంతి అయినా ఆ యోగి ప్రాణభయంతో మంచం ఎక్కి"పిశాచమా! నన్ను ఇక్కడికి ఎందుకు తీసుకొచ్చావు? సంసారులను పీడిస్తే నీ కోరికలు తీరుతాయి గానీ నాలాంటి సన్యాసిని పీడిస్తే నీకేం ప్రయోజనం ఉంటుంది" అంటూ ఆ రాత్రి అంతా ఆంజనేయదండకం, శివస్తుతి, పఠించసాగాడు. తెల్లవారినప్పటికీ అక్కడంతా చీకటిగానే ఉంది.

ఇంతలో ఆశ్రమంలో గురువుగారు కనిపించకపోయే సరికి"అయ్యో! గురువుగారు నూరేళ్ల వృద్ధుడు. అగ్నిశాలను విడిచి ఎప్పుడూ ఎక్కడికీ వెళ్లరు. అలాంటిది ఈ వేళ ఎక్కడికి వెళ్లినట్లు" అని బాధపడుతూ వచ్చి "కమలా! చిదంబర స్వామి శూన్య శివాలయంలో ఉన్నట్లు నాకు కలవచ్చింది" అన్నాడు.

కమల వెంటనే వెళ్లి పిలువగా "అమ్మా! కమలా! నేనిక్కడ ఉన్నాను. తలుపులు తియ్యి" అని అరిచాడు. ఆమె తలుపులు తీసి మంచం మీదున్న చిదంబరయోగిని చూసి"స్వామీ! మీరు ఇక్కడ ఉన్నారేం" అని అడిగింది. "ఇది దైవమాయేమో మంచం క్రింద నుండి ఏదో అరుస్తూ నన్ను భయపెడుతోంది" అని సంజ్ఞ చేస్తూంటే తామ్రకేశుడు తటాలున బయటకు వచ్చి తలుపులు గొళ్లెంపెట్టి పరిగెత్తుకువచ్చి స్థూలసంఘుడిని కలుసుకున్నాడు.

"నువ్వు మిత్రద్రోహివి. నీతో అస్సలు మాట్లాడకూడదు. నేను లోపలుండగా తలుపులు వేసి వచ్చేస్తావా? సమయానికి కమల వచ్చి తలుపులు తీయకపోయి ఉండుంటే నేనెంత చిక్కుల్లో పడేవాడినో తెలుసా!"అంటూ స్థూలజంఘుడిపై కోపగించుకున్నాడు" ఉపకారం చేస్తే

ఇలాగే ఉంటుంది. అక్కడికి కమలని పంపించింది నేనే. ఆమె తలుపులు తియ్యగానే గురువుగారిని బయటికి తోసి, కమలను లోపలికి లాక్కుంటావనుకున్నాను. దొరికిన అవకాశాన్ని వదులుకొని నన్ను నిందిస్తావేంటి? ఇంతకీ అక్కడేం జరిగింది?" అని ప్రశ్నించాడు.

తామ్రకేశుడు జరిగినదంతా వివరించాడు. స్థూలజంఘుడు వాడిని మెచ్చుకుని" "మంచిపని చేశావు మిత్రమా. రాత్రవనీ చూసుకుందాం" అంటూ ఉండగానే ఒక భటుడు వచ్చి "రాజుగారు మంత్రులతో సహా వస్తున్నారు. సద్దు చేయకండి" అన్నాడు. ఆ ఆశ్రమంలోని వారు ఎక్కరివారక్కడ నిశ్శబ్దంగా జపం చేసుకుంటూ కూర్చున్నారు. రాజు శశాంకుడు ఆశ్రమానికి వచ్చి అక్కడి వారి యోగ క్షేమాలు అడిగి తెలుసుకున్నాడు. రాజు ఆశ్రమంలో తిరుగుతూ ఉంటే అంతఃపుర కావలివాడు సౌవిదుల్లుడు వచ్చి"అమ్మగారు చిదంబర స్వామి నుండి మంత్రభస్మం తెమ్మన్నారు. కానీ స్వామి వారు కనిపించడంలేదు" అని విన్నవించాడు. రాజు భటులను పిలిచి వారిని వెదకమంటూ ఉంటే స్థూలజంఘుడు వచ్చి వారిని గుడికి తీసుకువెళ్ళి తలుపులు తీసి "ఈయనే మా గురువుగారు. శిష్యురాలికి రహస్యంగా మంత్రోపదేశం చేస్తున్నారు" అన్నాడు.

మంచం మీద చిదంబర యోగినీ, ఆ ప్రక్కనే నిలబడి ఉన్న కమలను చూసి ఈ వృద్ధ తాపసుడేమిటి? ఈ బాలయోగిని ఏమిటి? అని ఆశ్చర్యపోతూ "యోగీంద్రా! మీరిక్కడ ఎలా చిక్కుకున్నారు" అని పరిహాసంగా అడిగాడు. ఆయన జరిగినదంతా వివరించినప్పటికీ రాజు నమ్మలేదు.

దానికి మంత్రులు "మహారాజా! ఇక్కడ ఉన్న యోగులంతా ఇలాంటి వారే! ప్రతీ యోగికీ ఒక శిష్యురాలుంటుంది. పనీ, పాటూ లేకుండా ఈ సత్రంలో తింటున్నారు. అందర్నీ బయటకు పంపించి సత్రం మూసేయండి" అన్నారు. దానికి శశాంకుడు అంగీకరించలేదు. ఇక నుంచి ఈ ఆశ్రమంలో యోగినులు ఉండకూడదు. అందరూ పదిరోజుల్లోగా వెళ్ళిపోవాలని ఆదేశించాడు.

ఆ ఆజ్ఞ విని "అయ్యో! నా వల్ల మీ అందరికీ ఆపదవచ్చింది. ఇక్కడ నూరేళ్ల యోగిని కూడా అనుమానిస్తున్నారు. ఈ కపట శిష్యులవల్లనే ఇదంతా జరిగింది. నా మంచం కనుక స్థలం మార్చుకుని ఉండకపోతే నన్ను కూడా మోసం చేసేవారు. ఛీ! నేను ఆడరూపం ధరించడం వల్లనే ఇలా జరిగింది. సత్వంతుడు ఇక రాడు. నేను వాడిని చూడలేను. గురువుగారెలాగూ నన్ను కాశీకి వెళ్లమన్నారు కదా! అదే చేస్తాను" అనుకుంటూ కమల అనే పేరుతో ఉన్న రూపవతి మళ్లీ పురుషవేషం ధరించి కాశీకి వెళ్లిపోయింది.



# కాశీ మజిలీ కథలు

## 73 వ మజిలీ

### స్థూల జంఘు- తామ్రకేశులకథ

ఒకనాటి ఉషోదయ వేళ ఘటికాచలం అనే నగరంలో కృతవర్మ ఒక గృహస్థుని వీధి అరుగుమీద కూర్చొని" విధిఎంత బలీయమైనది. గొప్పవారింట్లో పుట్టినప్పటికీ సుఖపడలేకపోయాం. కన్నవారిని బాధపెట్టి ఇల్లు వదిలి వచ్చేం. కళావతీ, రూపవతీ మమ్మల్ని కలుపుకున్నారు. వాళ్లు బయలుదేరడానికి తగిన అవకాశం దొరికిందో, లేదో? సోమభట్టారకుని ఇంటికి యజ్ఞదత్తుడు వచ్చాడని విని ఇద్దరం వెళ్లాం. ఇంటికి వెళ్లిపోదామని నేనెంతగా చెప్పినా వినకుండా శీలవతి ఇలా లాక్కొచ్చింది. రాత్రి ఇద్దరం ఇక్కడే పడుకున్నాం. తెల్లారేసరికి ఆమె ఏమైందో" అని ఆలోచించడం మొదలుపెట్టాడు.

మేఘనాథుడు అనే ఆ ఇంటి యజమాని బయటకు వచ్చి అతన్ని చూసి వృత్తాంతం అడిగాడు. అతను తన వివరాలు చెప్పి "అయ్యా! ఇక్కడ మృగాల బెడద లేదు కదా! రాత్రి నేనూ, నా స్నేహితుడూ ఇద్దరం ఇక్కడ పడుకున్నాం. తెల్లవారే సరికి అతనే మయ్యాడో తెలియట్లేదు" అన్నాడు.

దానికి ఆ ఇంటి యజమాని "నాయనా! ఇక్కడ మృగాల బెడద లేదు. మీరేం చదువుకున్నారు? ఇంకా ఏం చదువు కోవాలని కాశీకి వెళుతున్నారు?" అని అడిగాడు. కృతవర్మ వినయంగా సమాధానాలు చెప్పాడు. ఆ ఇంటి యజమాని సంతోషించి "మేము బ్రాహ్మణులమే. మా నాన్నగారు చాలా ఆస్తి సంపాదించారు. నేను కూడా దాన్ని వృద్ధి చేశాను. నేను కొన్ని నాటకాలను రాసి, ప్రదర్శిస్తున్నాను. ఇప్పుడు నాటక సమాజంతో దేశాటనం

చేయాలనుకుంటున్నాను. మాకు కొందరు స్త్రీ వేషధారులు కావాలి. మీరు మా సమాజంలో చేరితే మీ విద్య మాకు ఉపయోగిపడుతుంది. కాశీ, ప్రయాగ వంటి నగరాలు తిరుగుదాం. మీ ఖర్చులన్నీ మేమే భరిస్తాం. దయచేసి మాతో రండి" అని అడిగాడు.,

దానికి కృతవర్మ "అయ్యా! మాకూ నాటకాలంటే ఇష్టమే. కొన్నాళ్లు మీతో తిరిగి మాకు చేతనైన సాయం చేస్తాం. నాటకాలు రాయడం, అవసరమైతే వేషధారణ కూడా చేస్తాం. మాకు వేతనం అక్కరలేదు. నా స్నేహితుడిని వెదికి తెప్పించండి చాలు. అతను నాకన్నా అందమైనవాడు" అన్నాడు. దానికి మేఘనాథుడు సంతోషించి అతన్ని వెదకటానికి అప్పటికప్పుడే మనుషులను పంపించాడు. వాళ్లు చీకటి పడే వరకూ వెదికినప్పటికీ అతనెక్కడా కనిపించలేదని వెనక్కి వచ్చేశారు.

" మీ స్నేహితుడు కాశీ రామేశ్వరాల మధ్య ఎక్కడున్నా వెదికి తెప్పిస్తాను" అని అతనికి ఆతిథ్యం ఇచ్చాడు. కొన్నాళ్లు వాళ్లతో ఉండడానికి కృతవర్మ అంగీకరించాడు.

## వినత కథ

మేఘనాథుడి ఒక్కగానొక్క సంతానం వినత. ఆమెనొక సామాన్యునికి ఇచ్చి పెళ్ళి చేసి అల్లుడిని ఇల్లరికం ఉంచుకున్నాడు. నాటకాలు సంగీత శృంగారం రసప్రధానమైనవి కావడంతో వాటిని ఆస్వాదించే మేఘనాథుడి కూతురు వినత కూడా రసికురాలైంది. ఆమె భర్త అసమర్థుడు. అస్వతంత్రుడు కావడంతో వినత స్వతంత్రురాలైంది. సంగీతం, సాహిత్యం, కావ్యాలంటే ఇష్టపడే వినత కృతవర్మ ఒకనాడు పాడుతూ ఉంటే విని, అతన్ని చూసి, ఆ క్షణమే ఆమె మోహంలో పడింది. అప్పటి నుంచి ఆమె రకరకాలుగా తన ఇష్టాన్ని తెలుపుతున్నా కృతవర్మ ఏమీ ఎరుగని వాడిలా ఉండసాగాడు.

ఒకసారి కృతవర్మ ఒంటరిగా కూర్చొని రాసుకుంటూ ఉంటే వినత వింతగా చీరకట్టుకుని, తలకి పట్టు వేసుకుని, తనకి వైద్యం చేయమని అతని దగ్గరకు వచ్చింది. తన చేయి చాపి పరీక్ష చేయించుకుని"నీ చేయి

తగలడంతోనే నా వ్యాధి కూడా తగ్గిపోయింది" అంది. ఈ మధ్య పాడిన పాటను ఒకసారి పాడమంది. తన కోరికను తీర్చమంది. తన హృదయాన్ని అతను లాక్కుపోయాడని తన ఇష్టాన్ని తెలియజేసింది. ఇంతలో మేఘనాధుడు అక్కడికి వచ్చి తలుపు తీయమన్నాడు. తలుపు తీసిన వినత తలకు పట్టును చూసి "అమ్మా! తలనొప్పిగా ఉందా? పట్టు వేశావు" అని అడగ్గా "అవును నాన్నా! ఇప్పుడే తగ్గుతుంది" అని చెప్పింది.

తరువాత ఒకసారి ఆమె తరుచుగా చావడిలోకి రాకూడదనీ, ఆమె పెద్దది అయిందని తండ్రి హితబోధ చేస్తూంటే అమాయకత్వం నటించి "నాకు కృతవర్మ దగ్గర సంగీతం నేర్పించు" అని అడిగింది. కూతురు అమాయకురాలు అని తండ్రి భావిస్తే, తండ్రినే అమాయకుణ్ణి చేశానని వినత నవ్వుకుంది. ఆమె ప్రవర్తనకు కోపగించుకున్న వినత భర్త ఆమె కృతవర్మ గదిలోకి విసిరిందంటూ ఒక పద్యం రాసి ఉన్న కాగితాన్ని మామగారికి ఇచ్చాడు.

మేఘనాధుడు కూతురిని నిలదీయగా "నీ అల్లుడికి పట్టిన అనుమానపిశాచం నీక్కూడా పట్టిందా నాన్నా? ఎవరిచేతనో ఈ పద్యం రాయించుకొచ్చి నీకు చూపిస్తున్నాడు. కృతవర్మ శుకమహర్షి కంటే ఘనుడు".అని బదులు చెప్పింది. అంతలో ప్రయాణానికి ముహూర్తం దగ్గర పడగా మేఘనాధుడు నాటక సమాజంతో దేశాటనం చేయడానికి వెళ్ళిపోయాడు. అనేక పట్టణాల్లో ప్రదర్శన కాశీ చేరాడు.

అంత వరకూ కథ చెప్పి ఆపి మిగిలిన కథను తరువాత మజిలీలో మణిసిద్ధుడు చెప్పడం ప్రారంభించాడు........



# కాశీ మజిలీ కథలు

## 74 వ మజిలీ

### శబర దంపతుల కథ

అమ్మా! తారావళీ! ఆ చిదంబరయోగి వట్టి జారుడట. మంత్రోపదేశం చేస్తానంటూ కమల అనే బాలయోగిని చేరదీశాడట. అతని మంత్రభస్మం ఏం పనిచేస్తుంది కానీ. నువ్వు చక్కగా అలంకరించుకో. నిన్నుచూశాక వాడే పెళ్లికి అంగీకరిస్తాడు" అని చెప్పి కిన్నెరదత్తుని భార్య తారావళిని శశాంకుడి దగ్గరకు తీసుకువెళ్ళింది. "నాయనా! శశాంకా! ఈమెను వివాహం చేసుకుని మన కులాన్ని ఉద్ధరించు ఇదే నాకోరిక" అని చెప్పింది.

అది విని శశాంకుడు వినయంగా "అమ్మా! నీ ఇష్టప్రకారమే నడుచుకుంటాను. ఈ మధ్యన ప్రభాసాగరుడికి సాయంగా పంపిన సత్వవంతుడు అనే సేనానాయకుడు శత్రువులందరినీ పారద్రోలినాడు. దాని వల్ల మనం ఇతర రాజులకు విరోధులమయ్యాం. ప్రభాసాగరుడు సత్వవంతుడిని తన దగ్గర ఉంచుకోవాలనుకుంటున్నట్లు వార్త పంపాడు. అతన్ని తీసుకు రావడానికి నేను సౌగంధిక వెళుతున్నాను. అక్కడి నుంచి వచ్చాక ఈ విషయం గురించి ఆలోచిద్దాం" అన్నాడు.

దానికి ఆమె చాలా సంతోషించి తారావళికి ఏదో సైగచేయగా ఆమె ఒక పూలదండను శశాంకుడి మెడలో వేసింది. తరువాత అంతఃపురానికి వెళ్లాక ఆమె తన అత్తతో "అత్తయ్యా! శశాంకుడు ఆడది.కానీ మగాడిలా కనిపిస్తున్నాడు. అతడి గొంతు, లక్షణాలు, అన్నీ అలా వున్నాయి. అని చెప్పింది. రాజపత్ని కొంత సేపు ఆలోచించి ఆ విషయం ఏమిటో

పరీక్షించమని చురిక అనే దాదిని రహస్యంగా నియమించింది. సత్వవంతుడిని తీసుకురావాలని శశాంకుడు పరివారంతో సహా సౌగంధిక నగరానికి వెళుతూఉండంటే దారిలో వారికి ఒక బోయ జంట ఎదురుపడి నమస్కరించి“మహారాజా! మేము బోయవాళ్లం. మా ఒక్కగానొక్క కొడుకు సత్వవంతుడు. వాడెప్పుడు కొండదిగి ఎరగడు. అలాంటి వాడిని మీరెక్కడికో పంపించారని మావాళ్లు చెప్పారు. వాడినేం చేశారు? మా బిడ్డ బ్రతికే వున్నాడా?” అని అడిగారు.

అది విని శశాంకుడు“సత్వవంతుడు మీ కొడుకా! అతను సుఖంగానే ఉన్నాడు. చాలా మంచి దశలో ఉన్నాడు. అని చెప్పి సత్వవంతుడి గురించి మరిన్ని వివరాలడిగాడు. దానికి ఆ బోయ దంపతులు మకరాంకుడి దగ్గర విద్యలన్నీ నేర్చుకున్నాడని చెప్పారు. “అయ్యో! సత్వవంతుడిని కనుక వివరాలు అడిగి ఉండుంటే మకరాంకుని ఆచూకీ తెలిసి ఉండేది కదా! అని బాధపడుతూ “మీరు కూడా మాతో పాటే రండి. మేము సత్వవంతుడిని దగ్గరకే వెళుతున్నాము” అని చెప్పి వారిని కూడా సౌగంధిక తీసుకువెళ్ళాడు.

ప్రభాసాగరుడు శశాంకునికి ఎదురొచ్చి స్వాగతం పలికి, చేసిన సాయానికి కృతజ్ఞతలు చెప్పి, వారిని ఎంతగానో సత్కరించాడు. అప్పుడు శశాంకుడు “రాజా! సౌగంధికకు వివాహం చేశారా? మీ అల్లుడు ఏడి? మా సత్వవంతుడు ఎక్కడున్నాడు? అని అడిగాడు.

దానికి ప్రభాసాగరుడు“శశాంకా! సౌగంధికకు ఇంకా పెళ్లి చేయలేదు. ఆమె వరించిన గుప్తవర్మతో సత్వవంతుడికి స్నేహం కుదిరింది. గుప్తవర్మ కాశీనుండి వచ్చాక పెళ్లి చేసుకుంటానన్నాడు. వారిద్దరూ కాశీకి వెళ్లి ఇంతవరకూ రాలేదు. గుప్తవర్మ అందమైన వాడే కానీ పరాక్రమం లేనివాడు” అని చెప్పాడు.

అప్పుడు అక్కడికి ఇద్దరు దూతలు వచ్చి శశాంకుడికి నమస్కరించి “మహారాజా! మీరిచ్చిన పద్యపటాన్ని అన్నిదేశాలు తిప్పాం, చివరికి కాశీలో వ్యాసమఠంలో ఒక చిన్నవాడు ఈ పద్యం విని కొంతసేపు ఆలోచించి, కన్నీరు పెట్టుకుంటూ ఈ పద్యం రాసిచ్చి “ఈ పద్యం ఎవరు రాసి పంపారో

వారికే దీనిని చదివి వినిపించండి" అని చెప్పాడు. మేమంతగా బ్రతిమాలినప్పటికీ అతను రాలేదు" అని జరిగినది చెప్పి ఆ పద్యం అతని చేతికిచ్చారు.

**తెలిసి కొంటి నీదు నెలవు నేఁడువయస్య**

**గాశిఁ జెంది తుదకు గాశిఁ జెంది**

**తిరుగుఁ చుంటి నొక తె నెరుగఁవేమిటి కింత**

**మొదటి చింత కష్టములకు గంత**

ఆ పద్యం చదివి శశాంకుడు "అయ్యో! రాజ్యమదంలో నేను గతమంతా మరచిపోయాను. ఈ పద్యం రాసింది రూపవతి. ఐదుసంవత్సరాలు దాటిపోతే అంతా కాశీ చేరాలనుకున్నాం. ఇప్పటికి నా మిత్రురాళ్లందరూ కాశీ చేరుకుని ఉంటారు. నేను కూడా వెంటనే వెళ్లిపోవాలి" అనుకుంటూ ఆ బోయ దంపతులను వెంట బెట్టుకుని కాశీ చేరాడు. తన వారికోసం వెదుకుతూ అక్కడ కొన్ని రోజులు గడిపాడు.

ఒక రోజు దివ్యరూపాలతో వచ్చిన బోయదంపతులను చూసి"మీరింతకు ముందు మాతో వచ్చిన శబరదంపతులే అనుకుంటున్నాను. మీ రూపాలు మారిపోయి బ్రాహ్మణ తేజస్సుతో వెలిగిపోతున్నారు. మీరు నిజంగా బోయదంపతులేనా? లేక మరొకరా? దయచేసి తెలియజేయండి" అని అడిగాడు. అప్పుడు శశాంకుడికి కాసరుడు ఇలా చెప్పడం మొదలుపెట్టాడు.

## సిద్ధ తీర్థము కథ

"మహారాజా! మా కథ చాలా విచిత్రమైనది. ముగ్గురం బాలురం దారిలో కలుసుకుని ఇక్కడికి వచ్చి సహాధ్యాయులమై విద్యాభ్యాసం చేశాం. తక్కువ సమయంతోనే విద్యారహస్యాలన్నీ గ్రహించిన మమ్మల్ని మెచ్చుకుంటూ మా గురువుగారు ఒకరికి విద్యుత్కేసరీ అనీ, ఒకరికి సోమభట్టారకుడు అనీ, మరొకరికి యజ్ఞదత్తుడు అని బిరుదులిచ్చారు.

యవ్వన మదం, విద్యామదంతో ఒళ్లు తెలియకుండా ప్రవర్తించి పండితులను ఎదిరిస్తూ, వితండవాదాలు చేస్తూ తిరగసాగాం. ఒకనాడు మేమీ ప్రాంతంలో తిరుగుతూ ఉంటే ఒక పౌరాణికుడు ఈ తీర్థ ప్రభావాన్ని గురించి“జనులు కోరిన కోరికలు సిద్ధింపచేస్తాడు కాబట్టి ఈయన్ని సిద్ధేశ్వరుడు అంటారనీ, ఈ క్షేత్రాన్ని సిద్ధతీర్థం” అంటారనీ వివరించాడు. అది విని సోమభట్టారకుడు నవ్వుతూ“తీర్థానికి వచ్చిన వారిని మోసం చేసి ధనం లాగడానికి ఏవేవో కథలు చెబుతూ ఉంటారు. కోరికలన్నీ దేవుడే తీర్చేస్తే ప్రజలకు కృషితో పనే వుండదు” అన్నాడు. ఈ విషయంమీద మా ముగ్గురి మధ్యా వాదోపవాదాలు జరిగాయి.

నా వాదాన్ని నెగ్గించుకునేందుకు నేను సిద్ధతీర్థంలో మునిగి “స్వామీ! సిద్ధేశ్వరా! నాకు మంచి భార్య దొరకాలి. ఆమెతో అడవిలో ఉన్నా స్వర్గంలో ఉన్నంత సంతోషం కలగాలి. మాకు ఒక్కడే కొడుకు పుట్టాలి. వాడు ఒక్క సంవత్సరంలోనే విద్యాలన్నీ నేర్చుకోవాలి. వాడు సత్వవంతుడై నాలుగువైపులా రాజ్యాలను జయించాలి. నీ మహిమతో నా కోరికలన్నీ తీరాలి” అనుకున్నాను.

అలా నేను కోరుకోవడం విని యజ్ఞదత్తుడు నవ్వుతూ“మిత్రమా! చాలా తక్కువే కోరుకున్నావు” అని తాను కూడా స్నానం చేసి వచ్చి స్వామికి నమస్కరించి“స్వామీ! ఈ విద్యుత్కేసరి కోరికను కనుక నీవు తీరిస్తే అతని కొడుక్కి తగిన భార్య కావాలి కదా! అందుకు నాలుగుజాతుల అందం కలిగి శీలవతి, రూపవతి, కళావతి, విద్యావతి అయిన కుమార్తెను నాకు ప్రసాదించు” అని కోరుకున్నాడు.

మా ఇద్దరి కోరికలూ విని సోమభట్టారకుడు పకపకా నవ్వుతూ “స్వామీ! సిద్ధేశ్వరా! నీకు నిజంగా శక్తులే కనుక ఉంటే నాకు మసిమంగలం లాంటి అనాకారి అయిన ఆడపిల్లనివ్వు. అప్పుడే నీ మహిమను నేను నమ్ముతాను”అని కోరుకున్నాడు.

అది విని నేను "తథాస్తు. దేవా! నువ్వు వీడి కోరికను ముందుగానే తీర్చాలి" అన్నాను. దానికి భట్టారకుడు కోపగించుకుని "నిజంగా నీకు చక్రవర్తి కాగల కొడుకు పుడతాడనీ, నాకు కురూపి అయిన కూతురు పుడుతుందనుకుంటున్నావా? ఇలాంటి రాళ్లకే కనుక అలాంటి శక్తులే వుంటే లోకాలు నిలుస్తాయా? సరే, నేను మరొక కోరిక కోరుకుంటాను. "స్వామీ! ఈ కేసరి చక్కని భార్యను పొందడంతోటే మతి చెడి, విద్యలన్నీ మరచిపోయి కొండల్లో కిరాతకుడిగా బ్రతకాలి. యజ్ఞదత్తుడికి అలాంటి మంచి కూతురే కనుక పుట్టినట్లయితే ఆమె వల్ల అతను అనేక కష్టాలు పడాలి. ఈ నా కోరికలు నీవు తీర్చకపోతే నువ్వు సిద్ధేశ్వరుడవే కావు" అని కోరాడు. అది విని నేను అతన్ని నిందిస్తూ "దేవతలు నీ మాటలను మన్నించరు. ఒక వేళ నువ్వు కోరినట్లే కనుక జరిగితే కాశీకి వచ్చి సిద్ధలింగాన్ని ఆరాధించి నా కిరాతకత్వం పోగొట్టుకుంటాను" అన్నాను.

మా ఇద్దరి తగువునూ సర్దిచెబుతూ యజ్ఞదత్తుడు "భట్టారకా! కోరికలు తీరినా, మానినా మంచి కోరికలే కోరుకోవాలి. సరే. నువ్వు కోరినట్లుగానే నీకుకురూపి అయిన కూతురు పుడితే ఆమెపెళ్లి ఎలాచేస్తావు?"అని అడిగాడు.

దానికి సోమభట్టారకుడు "మీ కోరికలు తీరినట్లే మాట్లాడుతూన్నారే. అప్పుడు చూసుకుందాంలే" అన్నాడు. మేము ఈ విషయంపై కొంతసేపు కలహించుకున్నప్పటికీ మళ్లీ కలిసిపోయాం. కాశీనుండి ముందుగానే నేను మా దేశం వెళ్ళిపోయాను. చక్కని పిల్లను చూసుకుని పెళ్ళి చేసుకున్నాను. ఆమె కాపురానికి రాగానే మేము పూర్వస్మృతులు మర్చిపోయి అడవుల పాలయ్యాం. ఆ వేళ అతని తిట్లన్నీ నిజమయ్యాయి. సిద్ధేశ్వరుడి దయ వల్ల నా కొడుకు అలాంటి వాడే అయినప్పటికీ మీ వల్ల వాడి పరాక్రమం తెలిసింది. వెనుకటి విషయాలు గుర్తులేకపోయినా నీ దయవల్ల ఈ క్షేత్రానికి రావడం, సిద్ధతీర్థంలో స్నానం చేయడం జరిగాయి. దాంతో నాకు పూర్వవృత్తాంతం, నేర్చుకున్న విద్యలూ అన్నీ గుర్తొచ్చాయి. రాజా! సిద్ధేశ్వర ప్రభావం ఎలాంటిదో చూశారా?" అని తన కథనంతా వివరించాడు.

శశాంకుడు ఆశ్చర్యపడి, కొంతసేపు ఆలోచించి, “ఆర్యా! సర్వకార్యాలూ దేవుడే చక్కబెడతాడు. మీరు కోరిన విధంగానే అంతా జరుగుతుందనడంలో సందేహం లేదు. యజ్ఞదత్తుడు నాకు బాగా తెలుసు. మీ కోడలు ఇప్పటికి పుట్టే వుంటుంది. ఆ విషయం అంతా తర్వాత చెబుతాను. మీ కుమారుడు సత్వవంతుడు ఇక్కడే ఉన్నాడు. కనుక వెదకడం మంచిది” అన్నాడు.

అంత వరకూ కథ చెప్పి ఆపి తర్వాత కథను తదుపరి మజిలో చెబుతానని మణిసిద్ధుడు అన్నాడు......



# కాశీ మజిలీ కథలు

## 75 వ మజిలీ

## మాయా తురగము కథ

ఇల్లు వదిలి వెళ్ళేప్పుడు ఎవరెక్కడ ఎలా తిరిగినప్పటికీ ఐదు సంవత్సరాలు అయ్యేసరికి కాశీపట్నం చేరుకోవాలనుకున్నాం. ఆ పరిమితి దాటిపోయి కూడా చాలా కాలమే అయ్యింది. అదీకాక స్త్రీ వేషంతో తిరుగుదామంటే వ్యాసమతంలో లాగనిందపడాల్సి వస్తుందేమో! ఈ పురుష వేషంలో తిరగడం చాలా ఇబ్బందిగా ఉంది. ఈ కాశీక్షేత్రంలో తనువు చాలిస్తే పుణ్యం" అనుకుంటూ మకరాంకుడి రూపంతో ఉన్న రూపవతి మణికర్ణికా ఘట్టానికి వెళ్ళి పావన గంగలోకి దూకింది.

గంగానది ఒడ్డున చల్లగాలి సేవిస్తూ సత్వవంతుడు, గుప్తవర్మ విహరిస్తున్నాడు. రూపవతి పావనగంగలో దూకడం చూసి సత్వవంతుడు వెంటనే వెళ్లి ఆమెను రక్షించి"అమ్మా! నువ్వెవరివి? నీకు చావాల్సిన అవసరం ఏమొచ్చింది?" అని అడిగాడు. దానికి రూపవతి"ముక్తికోసం" అని ముక్తసరిగా సమాధానం చెప్పేసరికి "చాలు చాలు. మా గురువు మకరాంకుడు ఆత్మహత్య మహాపాపం అని చెప్పారు. ముక్తి పొందడానికి నీకు మరొక మార్గం దొరకలేదా?" అన్నాడు సత్వవంతుడు.

ఆ మాట విని మకరాంకుడు "నువ్వు సత్వవంతుడివా"? అని అడిగాడు. దానికి సత్వవంతుడు "నా పేరు నీకెలా తెలుసు? అసలు నువ్వెవ్వరు?" అంటూ ఎదురు ప్రశ్నించాడు. అంతేకాక నీ గొంతు ఎప్పుడో విన్నట్లు, నీతో బాగా పరిచయం ఉన్నట్లు తోస్తోంది. నువ్వు మా గురువు మకరాంకుడివి కాదుకదా!" అన్నాడు. మకరాంకుడు మౌనం వహించడంతో

అతన్ని కౌగలించుకొని "నేను కృతఘ్నుడినని కాబోలు నాతో మాట్లాడడంలేదు. ఆ సమయంలో దైవికంగా అలా విడిపోవలసి వచ్చింది. అప్పటి నుండి ఇప్పటిదాకా నీ కోసమే వెదుకుతున్నాను" అన్నాడు.

ఈలోగా గుప్తవర్మ అతన్ని రమ్మని పిలువగా "మిత్రమా! ఒకసారి ఇటురా. నా గురువు మకరాంకుడు. ఇక్కడ దైవికంగా కలిశాడు" అని సత్వవంతుడు పిలిచాడు. గుప్తవర్మ వచ్చి మకరాంకుని చూసి "అయ్యా! మా సత్వవంతుడు మిమ్మల్ని తలుచుకోని క్షణమంటూ లేదు. మిమ్మల్ని వదిలి వచ్చినందుకు బాధపడుతూ మీ కోసం దేశదేశాలు వెదుకుతున్నాడు" అన్నాడు. "మీకెలా తెలుసు? మీరెవరు?" అని అడిగాడు.

" ఆ కథ చాలా పెద్దది. ఇంటికి వెళ్లాక చెప్పుకుందాం" అంటూ సత్వవంతుడు, మకరాంకుడు, గుప్తవర్మ నడవసాగారు. "గురుదేవా! ఇతని కోసమే శశాంకుడు నన్ను సౌగంధిక నగరం పంపాడు. స్వయంవరానికి వచ్చిన రాజపుత్రులందరినీ కాదని సౌగంధిక ఇతన్నే వరించింది. మీలో లాగానే ఇతనిలో కూడా మంచి గుణాలెన్నో వున్నాయి. మేము కలుసుకున్న దగ్గరనుంచీ మంచి స్నేహితులమయ్యాం. అతను తన స్నేహితులను కలుసుకోవడానికి కాశీకి వస్తే, మీరు కనిపిస్తారేమోననే ఆశతో నేను కూడా వచ్చాను. ఇతను నాకు మిత్రుడు కనుక మీకూ మిత్రుడే" అన్నాడు. సత్వవంతుడు. ఆ రాత్రి భోజనాలు చేసిన తరువాత ముగ్గరూ మేడ మీదకు వెళ్లి ఈ విధంగా మాట్లాడుకోసాగారు.

"మకరాంకా! నీ వృత్తాంతాన్ని గుప్తవర్మ తెలుసుకోవాలనుకుంటున్నాడు. నీ కథనంతా చెప్పు" అన్నాడు సత్వవంతుడు. దానికి మకరాంకుడు "మిత్రమా! నీ దగ్గర నాకు రహస్యం ఏమిటి? నా జన్మస్థలం విశాలపురం. మేం నలుగురు స్నేహితులం. దేశాలు చూడాలని తల్లితండ్రులను వదిలివచ్చేశాం. అందరం తలో దారీ అయ్యాం. వారిని కలుసుకోవాలని తిరుగుతున్నాను" అని చెప్పాడు.

అది విని గుప్తశర్మ "అయ్యా! తమ పేరు మొదట్నుంచీ ఇదేనా?" అని రూపవతి నుద్దేశించి అడిగాడు. ఆమె శీలవతి కాబోలు అని అనుమానించి,

అలా అడిగావేం అన్నాడు మకరాంకుడు. గుప్తవర్మ అభిప్రాయం ప్రకారం బుద్ధిమంతులు కాలానుగుణంగా వేషభాషలు మార్చుకుంటారు. అలా ఏమన్నా శీలవతి మార్చుకున్నదేమో అని గుప్తవర్మనుద్దేశించి అడిగాడు మకరాంకుడు. ఈ నగరం చేరుకోవాలని వారు చేసుకున్న నియమాన్ని బట్టి గుప్తవర్మ వారెవరో పోల్చుకున్నాడు. అప్పుడు శశాంక మకరాంకులు ఎవరో ఇట్టే తెలిసి పోయింది - గుప్తవర్మకు" నిజం చెప్పకుండా నన్ను ఇంత వేధిస్తావా రూపవతీ" అంటూ ఆమెను గుప్తవర్మ కౌగలించుకున్నాడు,

"శీలవతీ! నువ్వే మకరాంకుడివని తెలీక తొట్రుపాటుపడుతున్నాను" అంటూ రూపవతి ఆమెను కౌగలించుకుని దుఃఖించసాగింది.

అది చూసి సత్వవంతుడు ఆశ్చర్యపోతూ "రూపవతా? ఆమె ఎవరు? మీరు దుఃఖించడానికి కారణమేమిటి?" అన్నాడు.

శీలవతి, కళావతి, విద్యావతి, రూపవతి అనే పేర్లున్న మేము నలుగురము స్నేహితురాళ్లం! మాలో శీలవతి- విద్యావతులకు పెళ్లి చేయాలని తల్లితండ్రులు తల పెట్టడంతో అందుకు అంగీకరించక వాళ్లని ఊరు దాటించి నదిలో పడిపోయారని చెప్పి కళావతి-రూపవతి అనే మాలో ఇద్దరు ఆప్తులందర్ని కష్టాలుపాలు చేశారు. వారిలో నేను శీలవతిని! ఈమె రూపవతి. దేశాటనం చెయ్యాలన్న మా అబిలాష కొద్దీ నేనూ - విద్యావతీ పురుషవేషాలు వేసుకున్నాం! గుర్రంపై తెల్లారేసరికే చాలా దూరం వెళ్లిపోయాం! సోమభట్టారకుల వారి ఇంట విద్యాభ్యాసం అనే నెపంతో చేరి స్నేహితురాళ్లకోసం ఎదురుచూశాం! ఆయన కురూపి కుమార్తె పరిణయానికి, మా తండ్రి యజ్ఞదత్తుడు రావడంతో ఆయనకెందుకో వైరాగ్యం కలిగిందని చూచాయగా గ్రహించి, అక్కడ నుంచి పారిపోయాం! మేము చేరిన ఊళ్ళో విద్యావతికి ఒక చోట గాఢంగా నిద్రపోయినా నాకు నిద్రపట్టలేదు.

అర్ధరాత్రి ఓ గుర్రం అటుగా పరుగెత్తడం, కొందరు దాన్ని పట్టుకోండి' అని తరమడం చూసి ఎట్టకేలకు దాని వెనక వెళ్లి దాన్ని స్వాధీనం చేసుకునేసరికి- అది నన్ను సౌగంధిక నగరం పొలిమేరల వరకు తెచ్చేసింది. నేను దాన్ని దిగి విశ్రాంతి తీసుకుని ఊళ్లో కెళ్ళాను.

అక్కడ చిత్రశాలలో సౌగంధిక అనే రాజ పుత్రిక స్వయం వరం జరిగి, ఆమె నన్నే వరించింది. నన్ను పురుషుడనుకుని వరించినా, ఆమెను తప్పించుకుని, యాత్ర నెపంతో బయటపడ్డాను. ఆమె పై కోపగించిన రాజకుమారులంతా కోటను ముట్టడించారు. మీ సాయంతో ఆ ఆపద అంతమైంది. కృతవర్మ పేరుతో ఉన్న విద్యావతి ఏమైందో?" అనే సరికి, రూపవతి కూడ, తాను ఇల్లు వదిలింది మొదలు అంత వరకూ జరిగినదంతా వివరించింది.

ఇంతలో తెల్లవారింది.......

అప్పుడు రూపవతి "శీలవతక్కా! ఆ మధ్య ఎవరో ఒక పద్యం తీసుకొచ్చి చదవగా -అది కళావతే రాసిందని, ఆమెను రమ్మని నేనూ బదులు పద్యం రాశాను. మన సఖురాళ్ళంతా ఇక్కడికి చేరుకునే ఉంటారు. కాశీపట్నంలోనే జాగ్రత్తగా వెతికితే కనిపించకపోరు" అంది.

## విద్వత్కేసరి కథ

**అ**ందుకు ఆమె అంగీకరించింది. శీలవతీ- రూపవతి లిద్దరూ కల్సి స్నానం నెపం మీద గంగానదికి వెళ్లగా, అక్కడ స్నానం చేస్తున్న విద్వత్కేసరి రూపవతిని చూసి గుర్తుపట్టి "మకరాంకా! నేను గుర్తున్నానా?" అనడంతో ఆమె తెల్లబోయింది. అప్పుడతడు తాను సత్వవంతుడి తండ్రి కాసరుడినని చెప్పి, శాపం వల్ల అప్పుడట్లా ఉన్నాను. ఈ క్షేత్రంలో నాకు శాపవిమోచనం జరిగింది". అని చెప్పగా. ఆమె స్నానం చేస్తున్న సత్వవంతుడ్ని చూపించింది. కాని అతడే తన తండ్రిని పోల్చుకో లేకపోయాడు. తండ్రి కాళ్లకు నమస్కరించి, అతడు ఎలా శాప విముక్తుడైందీ తెలుసుకున్నాడు. విద్వత్కేసరి వారిని వెంటబెట్టుకు శశాంక మహారాజు సౌధానికి వెళ్లాడు.

రూపవతి, దూరం నుంచే శశాంకుడ్ని చూసి, అతడ్ని కళావతిగా గుర్తుపట్టింది. శీలవతికి కూడా చూపిస్తూ " ఆ శశాంకుడు మన కళావతే! సందేహంలేదు. దీన్నిబట్టి విద్యావతి కూడా ఇక్కడే ఉండి ఉంటుంది" అని

చెప్పింది. అప్పుడు విద్వత్కేసరి "మహారాజా! సత్వవంతుడు గంగానదిలో స్నానం చేస్తూ కనిపించాడు. అతడికి విద్యనేర్పిన మకరాంకుడు ఇతడే"! అంటూంటే శశాంకుడు పరీక్షగా చూసి "అరణ్యంలో అలా ఒంటరిగా వదిలి వచ్చేశానని కోపమా! రూపవతీ నా తప్పు మన్నించు" అంటూ కౌగలించుకుని ఆనందించిన తరువాత శీలవతిని చూపిస్తూ గుప్తవర్మగా ఇతడ్ని నువ్వెరుగకపోవచ్చు! ఇది శీలవతి" అని చెప్పడంతో, శశాంకుని రూపంలో ఉన్న కళావతి ఆశ్చర్యంగా ఆశ్లేషించింది.

సత్వవంతుడు ఆ స్త్రీల సాహసానికి అచ్చెరవొంది "పోలికను బట్టి, శశాంకుడు మీ స్నేహితురాళ్లలో ఒకరినీ- మీకు మీరే సాటి అని మెచ్చుకున్నాడు.

విద్యావతి జాడే ఇంకా తెలియవలసి ఉందనుకున్నారు.

## విచిత్ర నాటకం కథ

మరునాడు వాళ్లు నాటకప్రదర్శనకు సంబంధించిన ప్రకటన పత్రిక నొకదాన్ని చూశారు. అందులో ఆ నాటకం కృతవర్మ రచన అని ఉంది. పైగా కరుణ రస ప్రదానమైనదీ, ఎంతో విద్వత్తును ఆర్జించిన నలుగురు కన్యలకు సంబంధించి నదీ అని ఉంది. శీలవతి, విద్యావతులనే ఇద్దరు కన్యలకు పెళ్లి చెయ్యబోగా, వారికి అది ఇష్టంలేదని తెలిసిన మిగిలిన ఇద్దరు కన్యలు కళావతి-రూపవతులు వాళ్లని ఊరు దాటించేసి, నదిలో మునిగిపోయినట్లు కల్పించబడిన అద్భుత ప్రధాననాటకం అనీ, శీలవతి పెళ్లి కూతురు వేషం వేసుకుని, గురుపుత్రికకు పెళ్లి చేయబోయే హాస్యరస నాటకం అనీ కథాసంగ్రహంలో ఉంది.

ఆ నాటకకర్త తమ సఖురాలు విద్యావతేనని వాళ్లకు అర్థమైంది. కృతవర్మ పేరిట ఆమె ఎక్కడ ఉన్నదో తెలుసుకు రమ్మని, ఒక సేవకుని నాటకశాలకు పంపగా, అక్కడ అతడ్ని లెక్క చేసే వారే లేకపోయారని, నాటక సంఘం వారి వైభవం మహారాజుల తలదన్నేలా ఉందనీ తెలిసింది.

అందువల్ల శీలవతి, రూపవతి, కళావతి ముగ్గురూ పురుషవేషాల్లోనే నాటకశాలలో ప్రవేశించారు. ప్రదర్శన అద్భుతంగా సాగింది. ఆ ప్రదర్శనకు యజ్ఞదత్త, ధనపాలురు కూడా వచ్చారు. వృషాంకుడూ వచ్చాడు. వారికి తెలీని కొన్ని సందేహాలు మిగిలిపోయాయి. నాటక ప్రదర్శన పూర్తఅయ్యాక, వారు ఆ ఆ నాటక ప్రదర్శన శాలలోనే లేచి నిలబడి తమ సందేహాలు సమాజం వారికి ఎరుకపరచగా "రచయిత కృతవర్మ అనారోగ్యకారణంగా ఉన్నందున మర్నాడు మధ్యాహ్నం జరగబోయే సభకు సందేహాలున్నవారు అవి తీర్చుకోడానికి రావచ్చునని చెప్పారు.

అయితే, కృతవర్మకి అనారోగ్యమేమీ లేదు. ఆ వేషంలో ఉన్న విద్యావతి, తాను ఆశించిన ప్రయోజనం పొందగలిగింది. ఆమె ఊహించినట్లుగానే, ఆ ప్రదర్శనకు పురుషవేషాల్లో వెళ్ళిన శీల, కళా, రూపవతులు ముగ్గురూ నాటకం అంతం కాగానే, లోపలకు కబురుచేసి కృతవర్మని రప్పించారు. గుప్తవర్మగా ఉన్న శీలవతిని గుర్తుపట్టిన విద్యావతి (కృతవర్మ) ఆశ్చర్యంగా కౌగలించుకోగా, అందరూ కలిసి శశాంక నివాసానికి పోయి మేడపై విశ్రాంతిగా కూర్చొని ఒకరికొకరు తమ కథలు చెప్పుకున్నారు.

"మన నలుగురి తల్లిదండ్రులు ఇక్కడే ఉన్నారని, ఇందాకనే నాటక ప్రదర్శనానంతరం తెలిసింది కదా! రేపు మనల్ని వారు కలుసుకుంటారా" అని అడిగింది రూపవతి.

"ఇంకా చెప్పకుండా ఎన్నాళ్లు దాస్తాం? ఇప్పటికి పడిన పాట్లు చాలవా" అంది శీలవతి.

"మనంతట మనం పోకుండా, ఆ కేసరిని పంపించి, మన తల్లిదండ్రుల్ని ఇక్కడకు రప్పించాలి. అతడు మనల్నింకా పురుషులనే అనుకుంటున్నాడు. అయితే సత్వవంతుడికి మాత్రం మనం స్త్రీలమని తెలుసు! మనం అతడ్ని వరించడం అందరికీ ఇష్టమే కదా!" అంది కళావతి. రూపవతి "మనదేముంది? అంతా ఆ భగవద్విలాసం" అంటూండగా, సత్వవంతుడు అక్కడికొస్తూ "మీ రహస్యాలకు అంతరాయం కలిగించానా?' అని అడిగాడు.

అందుకు సమాధానంగా శీలవతి "మీ దగ్గర రహస్యాలేం లేవు మాకు. మీరు చేసిన ఉపకారానికి మీకు ప్రత్యుపకారమేమి చేయాలా? అని ఆలోచించాం! ఇంకేల? తాము ఉత్తమ బ్రాహ్మణ పుత్రులు కనుక- తమకు మేమంతా పరిచారికలమై ఉంటాం!" అన్నారు. ఆ మాటకు అతడు సంతోషించి, వారిని వివాహం చేసుకోడానికి అంగీకరించాడు.

అంతలో తెల్లవారింది.

విద్వత్కేసరికి, నలుగురు మిత్రురాళ్ళు విషయమంతా వివరించి రహస్యభేదనం చేశారు. తమ-తమ తల్లిదండ్రులను తీసుకురమ్మని అతనికి కొన్ని సంగతులు చెప్పి పంపారు.

విద్వత్కేసరికి యజ్ఞదత్తుడు గుర్తించి "నా బాల్యమిత్రుడు ఇన్నాళ్ళకు కనిపించాడు" అని చెంతనున్న ధర్మపాలునితో చెప్పి "ఏమయ్యా. ఎన్నాళ్ళ క్కనిపించావు? ఎక్కడ్నుంచి వస్తున్నావు? పిల్లలెందరు?" అని కుశల ప్రశ్నలు వేస్తూనే, అతడ్ని ఉచితాసనం మీద కూర్చుండజేసి, రాజుకు ఆ విద్వత్కేసరి వృత్తాంతమంతా చెప్పాడు.

అప్పుడాకేసరి ఆ రాజునాశీర్వదించి, ధర్మపాలునితో 'తాము బాల్యమిత్రులమని- యజ్ఞదత్తుడు అతని కూతుర్ని తనకు కోడలుగా చేస్తానన్నాడని- ఇప్పుడా సమయం వచ్చిందనీ' చెప్పాడు. తాను తన పుత్రుని కూడా తీసుకొచ్చానని అన్నాడు.

అయితే- విషయం తెలియని ధర్మపాలుడు "అయ్యో! ఈ యజ్ఞదత్తుని కూతురు శీలవతి నదిలోపడి మరణించడం వల్లనే- విరక్తులమై మేమంతా తిరుగుతూన్నాం!" అన్నాడు.

దానికా విద్వత్కేసరి నవ్వుతూ "రాజా! మీరు కూడా తబ్బిబ్బు పడుతున్నారే! ఇంతకు ముందే కదా- వీరి పుత్రికని నేను చూశాను. ఇష్టం లేకపోతే, ఇంకోమాట చెప్పండి! అమంగళాలు పలక్కండి" అన్నాడు. వాళ్ళంతా ఆశ్చర్యంతో "అలాగా! ఎక్కడ?" అని ఆత్రంగా అడగ్గా తనతోపాటు వారిని తీసుకెళ్ళాడు- చూపించడానికి.

శీల, కళా, విద్యా,రూపవతులు నలుగురూ తమతమ పూర్వపు వేషాలతో కూర్చొని మాట్లాడుకుంటుండగా యజ్ఞదత్తుడు, ధర్మపాలుడు మొదలైన వారంతా అక్కడకు వచ్చారు.

తమ తల్లిదండ్రులకు నమస్కారాలు ఆచరించి "మా పొరపాట్లు మన్నించండి! బాల్య చాపల్యం కొద్దీ మిమ్మల్ని చాలా కష్టాలపాల్జేశాం! ఇలా జరగడానికి అంతటికీ కారణం- కాశీపురంలోని సిద్ధతీర్థంలో ఆనాడు మా గురువులు కోరిన వరాలే!" అంటూ తమ తమ వృత్తాంతాలు చెప్పి, కరుణ సంతోష విస్మయ రసాల్లో అందర్నీ ముంచెత్తారు.

సత్త్వవంతుని శౌర్యసాహసాలు ముందే విన్నందున, ధర్మపాలుడు సుముహూర్తం అప్పుడే నిశ్చయించి సౌగంధికను- తారావళిని కూడా అక్కడకు రప్పించి కాశీ విశ్వేశ్వరుని సమక్షంలో వైభవంగా వివాహాలు జరిపించారు.

సత్త్వవంతుడు మొదట శీలవతిని పెళ్ళాడాడు. తరువాత తారావళీ- సౌగంధికలకు మంగళసూత్రాలు కట్టాడు. ఆ పిమ్మట విద్యావతీ- రూపవతులను స్వీకరించాడు. ఆయా కన్యలకు వచ్చే రాజ్యభాగాలతోపాటు, తన భుజబలంతో కొన్ని రాజ్యాలు సంపాదించి, పూర్వపు రాజులు పాలించినట్లే ధర్మబద్ధంగా రాజ్యపాలన చేశాడు. అతని చరిత్రనే విద్వాంసులు గ్రంథాలుగా రాశారు.

గోపా! విను! ఆ సత్త్వవంతుడు శీల, కళా, విద్యా, రూపవతులలో కొంతకాలం ఈ నగరాన్ని పరిపాలించాడు. అతని భార్యలు నల్గురూ ఈ తోటలో విహరిస్తూ, ఈ మొక్కలు- చెట్లు తమ తమ పేర్లతో నాటించారు. అందువల్ల దీనిలో ఏ జాతి వృక్షమైనా, లత అయినా రకానికి నాలుగు చొప్పున ఉండటానికి కారణమైంది. దీనివల్ల సిద్ధతీర్థ ప్రభావం కూడా తెలిసింది కదా! రెండింటికీ ఈ కథే సమాధానం" అని చెప్పగా, ఆ శిష్యుడు సంతోషించి గురుదేవునితో కూడా ఆ రాత్రి సుఖంగా వెళ్ళించాడు.

తదుపరి మణిసిద్ధుడు-గోపాలుడు, మరొక మజిలీకి చేరుకున్నారు.

# కాశీ మజిలీ కథలు

## 76 వ మజిలీ

"గురువరా! ఈ పట్టణంలోని ముఖ్యమైన నాలుగు రహదారుల కూడలిలో జనులు ఒకచోట మూగి చూస్తూంటే, నేనూ అక్కడికెళ్ళి చూశాను. కొందరు దొమ్మరి వాళ్ళు ఢమరు- ఢక్క వంటి వాద్యాలు మోగిస్తూ మనోహరమైన విన్యాసాలు చూపిస్తున్నారు. ఆహా! ఆ దొమ్మరివాడు తాను అంతకుముందే ఒక ఖాళీ సంచిలోంచి వెండి, బంగారం, నాణాలు, పాత్రలు పళ్ళేలు, కుప్పెలు పైకి తీసి విరజిమ్మసాగాడు. వాడి సామర్థ్యానికి నాకు చాలా ఆశ్చర్యం వేసింది. తరువాత ఆ దొమ్మరి లేచి పళ్ళెం పట్టుకొని అందరినీ అడుక్కున్నాడు. తలా ఒక కాణీ ఆ పళ్ళెంలో వేశారు. స్వామీ! వాడు స్వయంగా రూపాయలు చేసుకోగలడు కదా! మళ్ళీ ఒకళ్ళను అతడెందుకు యాచించడం? వాడికి ఆ శక్తి ఎలా కలిగింది? మీరట్లా సంచీలో చేయిపెట్టి, వస్తువులు తెప్పించగలరా?" అన్న శౌనకుని మాటలు విని నవ్వుతూ మణిసిద్ధుడు ఇలా అన్నాడు.

"గోపా! మాకు అలాంటి సామర్థ్యం లేదు. ఇంద్రజాలాది మాయా విద్యలవల్ల అలాటి వస్తువులు చూపిస్తుంటారు. అవి నిలిచేవి కావు. అయినా, దొమ్మరివాళ్ళకు ఆ మహా విద్యలు ఎలా వస్తాయి? వాళ్ళు హస్తలాఘవం నేర్చుకున్నవాళ్ళకు అంతకుముందు మనం గ్రహించలేని రీతిలోనే అందు వస్తువులుంచి చూపిస్తుంటారు. అవి నిలిచే వస్తువులు కావని మొదటనే చెప్పాను కదా! అందువల్లనే అతడు ప్రజలను ఆడుక్కున్నాడు".

అప్పుడు గోపాలుడు నవ్వుతూ "మహాత్మా! ఇంద్రజాలాది మహావిద్యలవల్ల వింతలు చూపించవచ్చునని చెప్పారు.ఆ విద్యలు ఎట్లాంటివో వానిని

గురించి జరిగిన కథలు ఏవైనా వక్కాణించి నేడు కాలక్షేపం చేయండి" అని వేడుకున్నాడు.

ఆ యతి పతి "ఔరా! నువ్వు అడిగిన ప్రశ్నకు జవాబు ఇచ్చాను కదా! ఇక జపం చేసుకుందాం అనుకున్నాను. నువ్వు ఊరకే వదుల్తావా? నీకీ కథల జీతం ముట్టజెప్పక ఒప్పుకొనేలా లేవే" అని నవ్వుతూ అని, తన మణిని ఎదుట పెట్టుకుని అలాటి కథను ధ్యానంతో మనసులో తోచేలా చేసుకుని, వింత పొడగట్టగా వాడి ముఖం చూస్తూ "మంచి కథ చెప్తున్నాను. సావధానంగా విను!" అని ఇట్లా చెప్పసాగాడు.

## కామగ్రీవుని కథ

అరవయ్యేళ్ళ వయస్సు కలిగినవాడూ తపస్సు చేత కలిగిన తేజస్సున్నప్పటికీ పండిన వెంట్రుకలు- ముడుతలు పడిన చర్మం కలిగిన వాడూ అయిన కామగ్రీవుడనే బ్రాహ్మణుడు విప్రకూటం అనే అగ్రహారం నడివీధిలోకి అల్లంత ప్రొద్దెక్కాక అడుగుపెట్టాడు. ఊతకోసం తెచ్చుకున్న కర్రని విలాసంగా తిప్పుతూ, వార్ధక్యాన్ని కప్పి పుచ్చాలనే అతడి ప్రయత్నం తెలుసుకున్నవారు ముసిముసిగా నవ్వుకుంటున్నారు.

అతడికి, అంతకు ముందు రాత్రి భోజనం లేదు. ఆకలి బాధిస్తోంది. ఆ ఊరి స్త్రీలు అటూ ఇటూ చెరువువైపు వెళ్తూ- వస్తూ అతడి కళ్ళకు విందు చేశారు తప్ప, ఒక్కరూ భోజనం చేస్తారా? అని అడిగిన వాళ్ళు లేరు. ఏవూరు? ఎక్కడ్నుంచొస్తున్నారు? ఎక్కడికి వెళ్తున్నారు? అంటూ వివరాలు అడిగే వారే గాని, ఒక్కరికైనా భూతదయలేదని అతడు వారిని మదిలోనే నిందిస్తూ కొంత దూరం నడిచాడు.

ఒక ఇంట్లో నుంచి చక్కని బాలిక వచ్చింది- బయటకు. ఆ పిల్లని చూసి 'దీనికి పన్నెండేళ్ళుంటాయి. దాటికూడా ఉండొచ్చు! పెళ్ళి చేసుకుంటే ఆర్నెల్లకే కాపురానికొస్తుంది. ఇంకో ఏడాదిలోగానే సంతానం కలుగుతుంది. దీన్ని నాకు ఇస్తారేమో అడిగి చూస్తే ఎలా ఉంటుంది? తల నెరిసింది తప్ప,

నేను వృద్ధుడిలాగ కనిపించను. నా విద్యా సంపద చూసి ఆమె తండ్రి నాకు పిల్లను ఇవ్వకపోడు. ఈ పూట వీళ్లింట్లో తిని స్నేహం కలిపి మెల్లగా పిల్లనిమ్మని అడుగుతాను" అనుకుని "బాలా! నాకీ పూట భోజనం పెడతావా?" అని అడిగాడు.

"రండి తాతగారూ! ఇలా విశ్రమించండి! ఒక్కపూట మాత్రమేనా? పది పూటలుండండి! మా తండ్రి చెరువుకు వెళ్ళారు. వచ్చేస్తారు" అని ఆమె అతన్ని అతిథిగా ఆదరించింది. ఆమె చెంబుతో నీళ్ళు అందించగా, అతడా చెంబు పట్టుకుని వెళ్తూంటే చేతులు వణికి చెంబు జారి పడిపోయింది.

"తాతగారూ! మీరు పెద్దలు కదా! చెంబు జారింది. మళ్ళీ తెస్తాను" అని ఆమె అనేసరికి, కామగ్రీవుడు "పిల్లా! నన్ను తాతగారని పలుమార్లు పిలుస్తోంటే నాకు ఏదోలా ఉంది. నేను అంత పెద్దవాడిని అనుకుంటున్నావా ఏమిటి? ఈ మధ్య ఆరోగ్యంలో లోపం వచ్చి ఏదో అక్కడక్కడ తల నెరిసింది. ఇప్పుడు బాగా ఆరోగ్యవంతుణ్ణయ్యాననుకో! అంతే తప్ప ఇంకోటికాదు" అని సంజాయిషీ ఇచ్చుకుంటూంటే, ఆ పిల్ల ఫక్కుమని నవ్వింది. "అయ్యో! మీకు తలనెరిసింది. దేహంలోనికి వణుకు ప్రవేశించింది. కర్రచేతికి వచ్చింది. దంతాలు ఊడాయి. ఇంకా 'తాత' అంటే కోపం చేస్తారేం?" అని అడిగింది.

అందుకతడు "బాలామణీ! నీ పలుకు చాలా ఇంపుగా ఉంది. నా పళ్లన్నీ గట్టిగానే ఉన్నాయి. మధ్య పన్నొక్కటే ఊడింది. దానికీ కారణం ఉంది. అది తరువాత చెప్తాను. ఇక ఈ కర్రంటావా? ఇది విలాసం కోసం ధరించాను తప్ప బలహీనం చేత మాత్రం కాదు! ఇక చెంబు వణుకువల్ల జారిపడలేదు. పట్టు తప్పి జారింది"... అని జవాబు చెపుతుంటే "సరే! పోనీలేండి! ఏదేమైనా మీరు బాగా బడలిక చెందారు. ఇక్కడ విశ్రమించండి" అని పలికింది. అతడు విశ్రాంతి తీసుకుంటూంటే తాటాకుల విసనకర్రతో విసరసాగింది.

కామగ్రీవుడు, ఆమె పట్ల కుతూహలం కొద్దీ వివరాలు అడగ్గా, ఆమె చెప్పింది. "సరే! అన్నీ బాగానే ఉన్నాయి కాని, సావిత్రీ! మీ తండ్రి భట్టపాదుడు సకల శాస్త్రాలు చదివినవాడూ- పండితుడూ అయినా, నీకింకా పెళ్ళి చెయ్యలేదేం? పదేళ్ళు దాటిన పిల్ల రజస్వల అయిన దానితో సమానమని

శాస్త్రాలు చెబుతున్నాయి కదా! మంచి సంబంధాలేం దొరకలేదా?" అని అడిగేసరికి, ఆమె జవాబివ్వడానికి ఇష్టపడక వెళ్ళిపోయింది.

అంతలో భట్టపాదుడు విద్యార్థులతో కూడా స్నానం చేసొచ్చి అతిథినీ స్నానానికి లెమ్మని కూతురితో "అమ్మాయీ! అతిథి మర్యాద చాలా బాగా చేశావు" అంటూ మెచ్చుకున్నాడు. సావిత్రీ "తండ్రీ! ఆయనను తాతగారు అంటే ఆయనకు కోపం వచ్చింది. తాను ఇంకా యువకుడినంటున్నాడాయన" అని అంతకుముందు జరిగిన సంభాషణ చెప్పి నవ్వింది. అతిథితోసహా అందరి భోజనాలు అయ్యాక- ఆయన వివరాలడిగాడు భట్టపాదుడు.

"లోపలికెళ్దాం పదండి! మీకో రహస్యం చెప్పాలి" అని ఇంకో గదిలోకి తీసుకెళ్ళి తన కథ ఇలా చెప్పసాగాడు-

"నా కాపురం కాంచీపురం! నేను పుట్టిన కొద్దికాలానికే, నా తల్లిదండ్రులిద్దరూ కాలం చేశారు. కొంతకాలం బంధువుల ఇంట గడిపి ఇక వారిక్కూడా భారం కావడం ఇష్టం లేక పాండిత్యం అబ్బక, ధనసంపాదన నిమిత్తమై ఓ పండితుని ఆశ్రయించగా- 'నాయనా! పూర్వపుణ్యం తప్ప భాగ్యం లభించదు. అయినప్పటికీ తపస్సుతో అది సాధించవచ్చు! కాశీకి అవతల హిమవత్పర్వతం మీద ఎందరెందరో యోగులు తపస్సు చేస్తుంటారు. వారిని ఆశ్రయిస్తే, ఎవరికైనా నీ పట్ల కరుణ కలిగితే, అనాయాస ధనప్రాప్తికేదో మార్గం చెప్పకపోరు" అని సూచించాడు.

నేను అష్టకష్టాలు పడి, హిమాలయాలు చేరుకుని ఎందర్నో ఆశ్రయించాను. శుశ్రూష చేశాను. పండితుడు చెప్పినట్లుగా నన్నెవ్వరూ కరుణించకపోయేసరికి నేను మందభాగ్యుడిని కాబోలు! అని, బతుకు మీద విరక్తి జనించి, శ్రీకూటపర్వతం మీద ఉన్న ఒక సాలవృక్షంపై నుంచి ఆత్మహత్య చేసుకోబోతూంటే, ఆ చెట్టు మొదట్లో తపస్సు చేసుకుంటున్న ఒక జడధారి నా ప్రయత్నం విరమింపజేసి 'నాకు రెండు విద్యలు తెలుసు! ఒకటి- ఇంద్రజాలం, రెండోది- పరకాయప్రవేశం, మొదటిదాని వల్ల అపారంగా ధనం సంపాదించినా, రాజునికాలేక సుఖభోగాలనుభవించలేక,

ఈ విద్యలున్నా ఏం ప్రయోజనం అనుకుని వయస్సు మీద పడుతున్నందున వైరాగ్యం పూని ఇక్కడ తపస్సు చేసుకుంటున్నాను" అని చెప్పేసరికి నా కెలాగయినా ఆ రెండు విద్యలూ కావాలనిపించి, ఆ జడధారి వద్ద-వారిగురువుగారి వద్ద అవి పొందాను. అంతా జరిగేసరికి నాకు ముప్పయ్యేళ్ళ ప్రాయం గడిచిపోయింది. అయితే ఆ విద్యలు నాకు దంతాలున్నప్పుడు మాత్రమే పనిచేస్తాయి. ఒక్కపన్ను ఊడినా పని చెయ్యవు. అది గుర్వాజ్ఞ కాబోలు- నా దురదృష్ట వశాన కాశీలో గంగాస్నానం చేస్తూంటే కాలుజారి పన్నూడిపోయేసరికి, ఇక నాకా విద్యలు పనిచెయ్యవని- కనీసం నా పుత్రుడికైనా వాటిని ఉపదేశిద్దామని, పెళ్లి చేసుకుందామని ఇలా వచ్చాను. శీతల దేశంలో ఉన్నందున అధిక వయసున్నవాడిలా కన్పిస్తున్నాను. మీ పుత్రికనిచ్చి వివాహం చేస్తే, నా పాండిత్యంవల్ల, సుఖించవచ్చు!" అన్నాడు. భట్టపాదుడు అతడి వృత్తాంతమంతా విని, "నీ మాటలు వింటూంటే నాకొక పూర్వగాథ జ్ఞాపకానికొచ్చింది" అంటూ, తాను ఒక కథ చెప్పసాగాడు.

## కౌశికుని కథ

"అచ్చం నీ మాదిరిగానే కౌశికుడు అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతను చిన్నతనంలోనే తల్లిదండ్రులని కోల్పోయి ఆలనా, పాలనా చూసేవారు లేకపోవడంతో స్వేచ్ఛగా తిరుగుతూ, విద్యను నేర్చుకోకుండా, విటులతో కలిసి, జూదరులలో మేటియై దొంగలకు నాయకుడై సత్రం భోజనం, మఠం నిద్రగా కాలం గడిపేవాడు. అలాంటి వాడికి ఎవరైనా పిల్లనిస్తారా? చాలా కాలం పెళ్ళి కాకుండానే ఉండిపోయాడు. అతనిలో వార్ధక్య చిహ్నాలు కనుపించసాగాయి. పండు వెంట్రుకలు పొడచూసాయి. తనకి పెళ్ళి కాలేదని బాధతో ఒక రాత్రి అగ్రహారానికి వచ్చి ఒక బ్రాహ్మణుని ఇంటి ముంగిట వీధి అరుగుపై పడుకుని ఉండగా లోపలి నుండి ఈ విధంగా సంవాదం వినిపించింది.

ఆ ఇంటి బ్రాహ్మణుడు తన భార్యతో "నీ కూతురికి సంబంధం గురించి నీకు బోలెడన్ని ఆశలు ఉండవచ్చు. కాని అవన్నీ జరిగేవికావు. దేశమంతా

తిరిగాను. చివరకు ఆ పెద్దన్న కొడుక్కే ఇచ్చి చేయాలేమో" అన్నాడు. దానికి ఆ ఇంటి ఇల్లాలు " నీప్రాణం ఉండగా అతనికి నా కూతురిని ఇవ్వను. కట్న కానులకు భయపడను. దీని అదృష్టం బాగుందనీ, మన అమ్మాయికి పుట్టేవాడు రాజు అవుతాడనీ హయగ్రీవ సోమయాజి చెప్పాడు. అయినా ఆ పెద్దన్న భార్య చాలా గయ్యాళి. అలాటి అత్తగారు ఉన్నచోట నా కూతురు ఏం కాపురం చేయగలదు? మన ఇంటికి వచ్చే అతిథికైనా ఇస్తాను గానీ, ఆ పెద్దన్న కొడుక్కి మాత్రం నా కూతురునికి ఇవ్వను" అని గట్టిగా చెప్పింది.

ఈ సంభాషణంతా విని కౌశికుడు ఆనందించి పొద్దున్నే లేచి విభూతి రేఖలు మెరిసేలా పెట్టుకొని పరమ శ్రోత్రీయుడిలా తయారైవచ్చి "అయ్యా! కర్దముడు అంటే తమరేనా? మీ కోసం ఎంతో దూరం నుండి వెదుక్కుంటూ వచ్చాను!" అన్నాడు. దానికి ఆ బ్రాహ్మణుడు "అవును కర్దముడు అంటే నేనే! నా కోసం మీరు అంత దూరం నుండి ఎందుకు వచ్చారు? మీ రూపంలో తేజస్సు ఉంది. మీ లాంటి వారికి నా మీద దయ కలగడానికి కారణం తెలుసుకోవాలని ఉంది" అన్నాడు.

దానికి కౌశికుడు "అయ్యా! మీకు పెళ్ళి చేయవలసిన కుమార్తె ఉన్నదా? దానికి సమాధానం చెప్పాక నా గురించి మీకు చెబుతాను" అన్నాడు. కర్దముడు ఉందని చెప్పాడు. అప్పుడు కౌశికుడు "నేను పశ్చిమ దేశస్తుడిని. సకల శాస్త్రాలు చదివాను. ఇరవై సంవత్సరాలు ఘోరతపస్సు చేయగా-ఈశ్వరుడు ప్రత్యక్షమై వరం అడగమంటే అప్రయత్నంగా నా నోటి వెంట 'చక్రవర్తి కాగల కొడుకు కావాలి' అనేమాట వచ్చింది. శంకరుడు నవ్వుతూ ద్రవిడ దేశంలో తామ్రచూడం అనే అగ్రహారంలో కర్దముడు అనే బ్రాహ్మణుడు ఉన్నాడు. ఆయన కుమార్తె పెళ్ళీడుకు వచ్చింది. నా మాటగా చెప్పి పిల్లను అడుగు" అని చెప్పాడు. అంతే కాకుండా "వారు ఆ పిల్లని నీకిచ్చి పెళ్లి చేస్తారు. ఆమెకు కూడా రాజుకాగల కుమారుడు జన్మిస్తాడనే వరం ఉంది. అందువల్ల నీ కోరిక ఆమెవల్ల ఏడాదిలోగానే తీరుతుంది" అన్నాడు.

అప్పుడు నేను అలాంటి కోరిక కోరినందుకు పశ్చాత్తాపపడి 'దారాపుత్రులు స్థిరంలేనివారు. నాకు మోక్షం ప్రసాదించు అని వేడుకొనగా శివుడు దానికి

అంగీకరించలేదు. ఆ బ్రాహ్మణుని కూతురు ఉత్తమురాలు. మంచి లక్షణాలు కలిగి ఉంది. ఆమెను నువ్వు తప్పకుండా వివాహం చేసుకోవాలి" అని చెప్పి అంతర్ధానమయ్యాడు. ఏం చేయాలో తెలియక మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చాను" అని చెప్పాడు.

కర్దముడు ఆశ్చర్యపోతూ ఈ విషయాన్నంతా తన భార్యకు చెప్పాడు. ఇక ఆ దంపతుల సంతోషానికి హద్దులేకపోయింది. "వివాహం అయిన తర్వాత కానీ ఈ రహస్యం బయటపెట్టరాదని ఈశ్వరుడు చెప్పాడు. కనుక జాగ్రత్త" అని కౌశికుడు వారిని హెచ్చరించాడు.

ఆ మర్నాడే ముహూర్తం నిర్ణయించి ఆ రాత్రే రహస్యంగా పెళ్ళి జరిపించారు. కనీసం బంధువులనైనా పిలువలేదు. నాలుగు రోజుల తర్వాత కర్దముని అత్తగారు వచ్చి జరిగినదంతా తెలుసుకొని "అయ్యో! ఆ మాయలతొత్తుకొడుకు మాటలు మీరెందుకు నమ్మారే? బంగారంలాంటి పిల్లని ఆ నిర్భాగ్యుడికి ఇచ్చారా! ఏం చూసి పిల్లనిచ్చారు? వాడికి నలభై ఏళ్ళుదాటిపోయాయి. చదువు లేదు, ధనం లేదు. గుణం లేదు. ఉత్తర దేశంలో వీడు చేయని వెధవ పనులంటూ లేవట! వీడి గురించి అందరూ ఎంత నీచంగా చెప్పుకుంటున్నారో తెలుసా!" అంటూ బాధపడింది.

దానికి ఆ పిల్లతల్లి "అమ్మా! నీతో ఆ మాటలు చెప్పింది ఎవరో చెప్పు? మాకు మంచి సంబంధం వచ్చిందనే అసూయతో వాళ్ళు అలా చెప్పి ఉండవచ్చు" అంది. "నీ నోటికి జడిసే ఎవరూ నీ ముందు నిజం చెప్పలేకపోతున్నారు. అసలు నీ అల్లుడి ఆస్తి ఏమిటో చూపించు! వాడు మిమ్మల్ని మోసం చేసి రత్నం లాంటి పిల్లను పెళ్లి చేసుకున్నాడు. వాడు రోగాలపుట్ట. వాడికి సంతానం కలుగుతుందా? అన్యాయంగా పిల్లగొంతు కోశారు కదా!" అని ఏడుస్తూ ఉంటే అక్కడికి కౌశికుడు వచ్చాడు.

కర్దముడు కూడా వచ్చి "అల్లుడూ! నీకు శివుడు ప్రత్యక్షమయ్యాడన్నావు కదా! మా అత్తగారికి నిదర్శనం చూపించు" అన్నాడు. దానికి కౌశికుడు ఆరువేళ్ళు చూపించి "ఆరు నెలల్లో తెలుస్తుంది" అన్నాడు. వాళ్ళు నెత్తీ, నోరు బాదుకున్నారు. బంధువులకు విరోధులు అయ్యారుకూడా.

కొన్నాళ్ళకు కౌశికుని కొడుకుపుట్టగా వాడికి 'చక్రవర్తి' అని పేరు పెట్టారు. "రాజ్యం ఎక్కడ" అని మామగారు అడిగితే "ఎవరింటికి వారే చక్రవర్తులు, వారికి రాజ్యంతో పనిలేదు" అని జవాబిచ్చాడు. "మరి నీ వరం ఏమైంది?" అని అడిగితే "ఈశ్వరుడు నన్ను మోసం చేశాడు" అన్నాడు.

కాబట్టి "ఓ కామగ్రీవుడా! నువ్వు కూడా కౌశికునిలా మోసం చేయడానికి వచ్చావేమో? మేము అలాంటి మాయలో పడడం! నీ దారి నువ్వు చూసుకో! మా పిల్లని ఇవ్వం! అదీగాక-

శ్లో వర్ణం సితం శిరసి వీక్ష్యశిరోరుహాణాం।
స్థానం జరా పరిభవిష్య తద్యాపు మాంసం॥
ఆరోపితాస్థి శకలం పరిహృత్యయాంతి।
ఛండాల కూపమివదూర తరం తరుణః॥ ఇట్టి వృద్ధుడివి కదా" అని ఎరిగించే సరికి రాత్రివేళ అతిక్రమించడంతో, తరువాత కథను తదనంతర మజిలీలో ఇట్లా చెప్పసాగాడు....



# కాశీ మజిలీ కథలు

## 77 వ మజిలీ

## కరభ శరభుల కథ

శరభుడు, కరభుడు అనే ఇద్దరు బండ శిష్యులున్నారు. భట్టపాదునికి ఎన్నేళ్లయినా వాళ్లకి సంస్కృతంలో ఓనమాలు కడా ఒంటపట్టలేదు. శబ్దమంజరి వల్లె వేయించాలని చూస్తే 'రామశబ్దం' సైతం పట్టుబడలేదు. చాలా రహస్యంగా కామగ్రీవ- భట్టపాదుల సంభాషణంతా విన్న ఆ మొద్దు శిష్యులకు కోరికలు మాత్రం కోటలు దాటేటంత పెద్దవి. అవి తీరడానికి డబ్బు కావాలి. అదీ అనాయాసంగా రావాలి. అదెలాసాధ్యం?

కామగ్రీవునికి రెండు గొప్ప విద్యలు పరకాయప్రవేశం, ఇంద్రజాలం తెలుసుననీ- అయితే దంతం ఊడిపోవడం వల్ల అవి అతడికి పనికిరావనీ అర్థమైనందున ఆ ఇద్దరూ ఒక పథకం ప్రకారం , కామగ్రీవుని వద్ద శిష్యుల్లా చేరి, అతని అభిమానం పొందారు. కామగ్రీవుని పెళ్లిబలహీనతను ఆసరా చేసుకుని, అతడ్ని నానాదేశాలూ తిప్పుతూ అతడి వెంట తిరగసాగారు. ఈలోగా సంవత్సరాలు గడిచిపోయాయి.

కామగ్రీవుని మరణం ఆసన్నమైంది. ఇక పెళ్ళి ప్రస్తావనెత్తే అవకాశం లేదు కనుక, కరభ-శరభులిద్దరికీ చెరో విద్యా ఇచ్చి కామగ్రీవుడు దేహం చాలించేశాడు.

"శరభా! గురువుగారు నీకు ఇంద్రజాలం- నాకు పరకాయ ప్రవేశ విద్య ఇచ్చారు కదా! మనం ఏ లాభాన్నయినా సమానంగా పంచుకోవడం మంచిది. నాకు ఇంద్రజాల విద్య అంటే చెప్పరానంత ఇష్టం! ఆ విద్యను

నాకు వదిలి, ఈ పరకాయ ప్రవేశ విద్యను నువ్వు తీసుకో!" అన్నాడు కరభుడు. శరభుడు అందుకు ఒప్పుకున్నాడు.

ఇద్దరూ ఒక పట్నం చేరి, తమ ఇంద్రజాల విద్యతో, ఆ పట్నపు రాజును మెప్పించాలనుకున్నారు. కాని ఆ రాజుకు కలిగిన అస్వస్థతవల్ల- అతడప్పుడు ఇంద్రజాలాది వినోద ప్రదర్శనలు చూసే స్థితిలో లేడు.

ఆ రాజుగానీ రోగంతో రెండు మూడు రోజుల్లో మరణిస్తే కరభునికి పరకాయప్రవేశ విద్య ఉపయోగపడి, అతడు రాజైపోతాడు. నా ఇంద్రజాలం దేనికి పనికొస్తుంది?" అని శరభుడు ఆవేదన చెంది, "కరభా! గురువుగారు మనకు ఏ అభిప్రాయంతో ఈ విద్యలను ఇచ్చారో!? మార్చుకొని తప్పుచేశాం! అది గురుద్రోహం అవుతుంది. అంచేత నా విద్యనాకిచ్చేస్తే- నీ విద్య నీకిచ్చేస్తా" అన్నాడు. దాంతో ఎవరి విద్యలు వారివైనాయి. శరభుడి చేతికి తిరిగి ఇంద్రజాల విద్యరాగా, కరభునికి పరకాయ ప్రవేశ విద్య మళ్లీ లభించింది.

ఇంతలో రాజభటులు వాళ్లను వెతుక్కుంటూ అక్కడకు వచ్చారు. "మా రాజుగారికిప్పుడు వ్యాధి ఉపశమించింది. ఆరోగ్యం చిక్కింది. మీ ఇంద్రజాల విద్య వంటి వినోదాలు చూడాలని కోరుకుంటున్నాడు"అన్నారు వాళ్ళు. ఆ విషయం తెలిశాక కరభుడు నాలిక్కరుచుకున్నాడు. శరభుడు ఈ ఇంద్రజాల విద్యతో బాగా సంపాదించేస్తాడని, కరభుడింకొక్కసారి మాత్రం విద్యలు మార్చే ప్రతిపాదన తెచ్చి ఇద్దరి మధ్యా వాగ్వాదం జరిగాక అందులో కృతకృత్యుడైనాడు. దాంతో కరభుడికి ఇంద్రజాలం దక్కింది. శరభుడికి పరకాయ ప్రవేశ విద్య మిగిలింది.

తన ఇంద్రజాలంతో కరభుడొక మాయా పట్టణాన్ని సృష్టించి, శరభుడ్ని వంచించడంతో, ఇతడి వెంట ఇక తిరగకూడదు. ఏది నిజమో. ఏది ఇంద్రజాలమో తెలీదు' అని అతడ్ని వదిలి తనదారిన తాను మరోదేశం పోయాడు. అని ఎతిగించి, మణిసిద్ధుడాపైకథ తర్వాత మజిలీలో ఇట్లా చెప్తున్నాడు.

# కాశీ మజిలీ కథలు

## 78 వ మజిలీ

## శంతనుని కథ

"అయ్యారే! ఈ పట్టణం ఎంత రమణీయంగా ఉంది? భవనాలన్నీ ఇంద్రభవనాల్లా మెరుస్తున్నాయే! దీన్ని భూమ్మీద స్వర్గం అనుకోవచ్చు!" అనుకుంటూ ఆ పట్టణ సౌందర్యం పరికిస్తూ "ఉత్తమమైన పరకాయ ప్రవేశవిద్య శరభుని పాల్జేసి,ఈ పాడు ఇంద్రజాల విద్య నేను పుచ్చుకున్నాను. ఇందులో ఏదైనా వినోదం ఉన్నదీ అంటే, అది ఇతరులకు ఉపయోగపడటమే తప్ప నాకు ఒక్కటీ కనబడదు. దీంతో సంపాదించే డబ్బు కూడా ఇంద్రజాలం కన్న త్వరగానే ఖర్చయిపోతోంది. నాకింతే ప్రాప్తం కాబోలు! ఏం చేస్తాను? ఈ రాజధానిలో నా విద్య చూసి ధనం సంపాదించాల్సిందే!" అనుకున్నాడు. ఆ పట్టణం పేరు రత్నాకరం.

రాజవీధిలో అతడట్టా నడుస్తుండగా, ఒక సింహద్వారం మీద ఉన్న విలాసాన్ని చూసి అది రాజపురోహితుని గృహమని గ్రహించి, తాను పరదేశిననీ- తనకాపూట ఇంత అన్నం పెట్టమని అడగ్గా, ఎనభైఏళ్ళ వృద్ధురాలైన ఆ రాజ పురోహితుని ఇల్లాలు అతడికి కోడళ్ళ చేత భోజనం ఏర్పాటు చేయించింది. ఆమెకు ముగ్గురు కొడుకులు, ముగ్గురికీ కోటలోనే కొలువులు' అని ఆమె చెప్తూండగా, వారు ముగ్గురూ వచ్చి తల్లికి నమస్కరించారు.

ఆమె కోటలోని విశేషాలు కొడుకుల్ని అడిగింది. "అమ్మా! ఏం చెప్పమంటావు? కోటలో కలకలంగానే వుంది. ఆ వేళ మన రాజుగారికి స్వస్థత కలిగి, మరణపర్యంతమైంది గదా! ఆనాడు వారికి అంతలోనే తిరిగి

స్వస్థత చేకూరింది. అదే ఒక గొప్ప ఆశ్చర్యకర ఘటన అని అంతా చెప్పుకోవడం నీకూ తెలిసిందే! నాటి నుండీ అతని చర్యలు విపరీత ధోరణిలో ఉండడం- వెనుకటి ధర్మగుణం లోపించడం వగైరా చూసిన మంత్రులంతా, పరకాయ ప్రవేశ విద్య తెలిసిన నీచుడెవడో రాజు దేహంలో ప్రవేశించాడనుకుంటున్నారు" అని రెండో పుత్రుడు అనగా "అమ్మా! రాజపత్నికీ అదే సందేహంగా వుంది. తన భర్త ఆనాడే మరణించాడని- తాను విధవనేననీ ఆమె స్పష్టంగా చెప్తున్నది. రాకుమార్తె కాంతి సేనకు పెళ్ళి ప్రయత్నాలు చేయవలసిన ఈ వయసులో, తన పెళ్ళి ముచ్చట్లు గురించి ఆలోచిస్తున్నాడు" అన్నాడు మొదటి పుత్రుడు. అతని పేరు శంతనుడు.

కరభుడు ఆ మాటలన్నీ విన్నాడు. 'ఆనాడే వీడ్ని వదిలించుకుని ఇంకోదేశం పోయాడనుకున్న శరభుడికి, మళ్ళీ కరభుడి వల్ల తిరిగి తిరిగి బెడద ఎదురయ్యే స్థితి వచ్చింది.

ఆ ముగ్గురన్నదమ్ములు భోజనం చేశాక, వారిలో పెద్దవాడైన శంతనునికీ- కరభుడికీ మంచి మైత్రి కుదిరింది. "మీ రాజు ఆ నాడే మరణించిన మాట వాస్తవం. శరభుడనే వాడు పరకాయప్రవేశ విద్య ద్వారా అందులో చేరాడు. అతడ్ని నేనెరుగుదును" అని వివరించేసరికి. కరభుని మీద శంతనునికి అభిమానం ఇంకా అధికమైంది.

కరభుడిని శంతనుడు ఒక రహస్య స్థలానికి తీసుకెళ్ళి "సోదరా! నువ్వేమీ సంకోచించకు! కొన్నాళ్ళు మా ఇంట్లో ఉండు! ఈ రాజు తనకు తగిన కన్యకను తీసుకొని రమ్మని వేపుతున్నాడు. దీనికి ఏదైనా ఉపాయం ఉందా?" అని అడగ్గా "అన్నా!నీవు దానికి ఏమీ భయపడకు! ఇంద్రజాల మహిమచేత వీడ్ని పరాభవిద్దాం!" అన్నాడు. ఏమేమి చెయ్యాలో అతనికి బోధించాడు కరభుడు.

అప్పుడు శంతనుడు నాల్గురోజులు ఆగి, ఆ తరువాత రాజు దగ్గరకు వెళ్ళేసరికి, "శంతనా! పెళ్ళి కూతుర్ని తీసుకుని వచ్చావా? లేదా?" అని అడిగాడు.

కరభుడు ఉపదేశించిన దాని ప్రకారం శంతనుడు– "ఒక దేవకాంత వంటి చిన్నది, మన నగరం వెలుపల ఉద్యానవనంలో ఉంది. స్వయంవరంలో భర్తను వరించాలనే ఆలోచన గల ఆ చిన్నది దేశాలు తిరుగుతూ ఇక్కడకొచ్చింది. దేవరవార్ని చూస్తే వరించకుండా ఉండదు" అని ఆ మూఢుని మనస్సు రంజింపచేసేలా మాట్లాడాడు.

కరభుని ఇంద్రజాల – మహేంద్రజాల ప్రదర్శనా చాతుర్యంతో ఏమీలేని ఎడారి వంటి ఆ ప్రదేశంలో పుష్పోద్యానాలు,రత్న స్తంభాలతో కూడిన మేడలు అద్భుతంగా వెలిశాయి నగరం వెలుపల. అయితే ఏ ఇంద్రజాలమైనా ఒక్కరోజు మించి ఉండనందున, ఎప్పటికప్పుడు అక్కడ కొత్త కొత్త కల్పనలు చేస్తూ, ఆ ఉద్యానవనంలోనే ఒక మేడలో ఒక అందగత్తెని సృష్టించి రోజుకో రీతి సోయగాలతో ఆ మూఢుని అలరించేలా కల్పించాడు. శంతనుడు – ప్రతిరోజూ రాజుతో కలిసి అక్కడకు రావడం, రాజు ఆ సుందరి వద్ద ప్రణయం ఒలకబోయడం, ఆమె కూడా అతడ్ని మోహంలో ముంచెత్తుతూన్న రీతిలో ప్రవర్తించడం – ఇలా పదిరోజులు గడిచాయి.

ప్రజలు తనను వింతగా చూస్తున్నారని రాజుకు అర్థమైంది. మంత్రులూ తనని శంకిస్తూండడంతో కొత్తవారిని తీసుకొని, పాతవారిని ఇంటికి పంపించాడు. వాళ్లంతా శంతనుని రెండో తమ్ముడైన కామందకుని ద్వారా రాజుగారి దుర్నీతిని రాజపత్నికి నివేదించి "అమ్మా! రాజుగారి బొందిలో ఎవడో పరకాయ ప్రవేశం విద్య తెలిసినవాడు చేరాడు. మీ పుత్రిక కాంతిసేనకు పెళ్లి చేయవలసిన ఈ వయసులో, అతడు ఎవతెనో ఒక చిన్నదానిని పెళ్లాడాలనుకుంటున్నాడు. దీనికేదో ఉపాయం ఆలోచించాలి. కరభుడనే బుద్ధిమంతుడు మా ఇంట ఉన్నాడు. అతనితో ఆలోచిద్దాం!" అని, ఆ సాయంత్రం కరభుడ్ని అంతఃపురంలో ప్రవేశింపజేయగా, రాజపత్ని అతడి గురించి అంతా తెలుసుకుని, శరభుడి పీడ వదిలిస్తే చాలునంది. ఇది అవకాశంగా కరభుడికి రాజపుత్రి కాంతిసేనని చూసే అవకాశం నిత్యం కలుగసాగింది.

ఓ రోజున, తన మనస్సులోలో మాట శంతనుడి చెవిన వేసిన కరభుడు "మిత్రమా! కాంతిసేనను పెళ్లాడాలని నా కోరిక" అని స్పష్టం చేశాడు. శంతనుడికి ఎంతకాలంగానో ఇంద్రజాలవిద్య స్వంతం చేసుకోవాలన్న పట్టుదల ఉంది. అతడూ తన కోరిక బయటపెట్టాడు. ఒకరికొకరు సాయం చేసుకోవాలనుకున్నారు. కాంతిసేనని కరభుడికి అనుకూలంగా మలచడానికి శంతనుడు కృషిచేసి, వివాహం వరకూ ఆమెని తీసుకొస్తే తన ఇంద్రజాల విద్య శంతనునికి ధారపోస్తానన్నాడు కరభుడు.

క్రమంగా – శంతనుడు రాజు దగ్గర గొప్ప నమ్మకం సంపాదించి, అది మొదలు తానేది చెప్తే శరభుడు (రాజు) అది చేసేలా చూసుకున్నాడు. అందుక్కారణం – ఒకానొక దేశంలో తాను పరకాయ ప్రవేశం చేసిన సంగతి తనకు తానై అతడే వెల్లడించడం! ఓ రోజు శంతనుడు "దేవా! కాంతిసేనకు వివాహం చేయాలి. మీరు కొంతవరకు ఆ ప్రయత్నం సామరస్యంగా జరిగేలా ముందడుగు వేయకపోతే ప్రజల నుంచి నింద ఎదుర్కోవలసి ఉంటుంది. ఆ చిన్నదాన్ని ఏ రాజుకో ఇచ్చి చేస్తే, అతడు మన గుట్టు తెలుసుకొని రాజ్యం ఆక్రమించుకుంటాడు. అందువల్ల సామాన్యుడికి ఇచ్చిచేద్దాం! వరుడి పేరైనా మనం ఎవరికీ తెలీనివ్వద్దు" అన్నాడు. శరభుడు సరే అన్నాడు. ఇదే విషయంలో – రాజపత్ని ప్రశ్నించినపుడు మాత్రం "కాంతిసేనకు కరభుడి వంటి బుద్ధిచాతుర్యంగలవాడితో వివాహం చేస్తే మీకు అభ్యంతరమా?" అని అడిగి ఆమె చేత అభ్యంతరం లేదని మాట తీసుకున్నాడు.

ఇదంతా కాంతిసేనకి తెలిసి, ఏదో దుష్టపన్నాగం జరుగుతుందని గ్రహించింది. ఆమె విద్యావతి. బుద్ధిమతి. ధైర్యం కోల్పోతున్న తల్లికి ధైర్యం చెప్పి – ఉపాయం ఉంటే అన్నీ తప్పించుకోవచ్చునని – అందుకు నిదర్శనంగా బుద్ధిమతిక కథ చెప్పింది – తల్లికి.

# బుద్ధిమతిక కథ

వినుము! పూర్వం బుద్ధిమతిక అనే ఒక స్త్రీ తన ఇద్దరు పిల్లలతో భర్తతో బండి ఎక్కి అరణ్యమార్గం గుండా వెళ్తోంది. ఇంతలో ఎద్దులు, క్రూరమృగం వాసన పసిగట్టి రివ్వున తాళ్లు తెంచుకుని పారిపోయాయి. వాట్ని పట్టుకోడానికి బండీవాడు, ఆమె భర్త వెళ్లారు. నడి అడవిలో చతికిలబడిన ఆ బండీలోంచి దిగి, తొడలమీద పిల్లలిద్దర్నీ కూర్చోబెట్టుకుని బిక్కు బిక్కుమంటూ ఆమె ఒక చెట్టు కింద కూర్చుంది.

దగ్గర్లోనే పొదలో పొంచి ఉన్న పులి "ఆహా! ఆహారం నాకీ రోజున దైవమే అందించాడు. పైగా మనుష్యమాంసం" అనుకుంటూ, ఆశ్చర్యపోయి అంతలోనే "తొందరపడి దుమికినా ప్రమాదమే! వాళ్లింత నిర్భీతిగా నాకు దగ్గరగా వచ్చి కూర్చున్నారంటే ఏదో కారణం ఉండే ఉంటుంది. ప్రస్తుతం నాకు ఇటువంటి సమయాల్లో సలహా ఇచ్చే జంబుక మంత్రి కూడ లేడు. ఆకలిగా ఉంది! పోనీ! పంజా విసిరి ఓ ప్రయత్నం చేయనా?" అని నాలుక బయటకు పెట్టి వాళ్లవైపు తటాపటాయిస్తూ అడుగువేయసాగింది.

పులి ఎప్పుడైతే తనదైన సహజ శైలిలో ధైర్యంగా పంజా దెబ్బ కొట్టకుండా – మెల్ల మెల్లగా సంశయిస్తున్నట్లు వస్తోందో ఆమెకు పులి తటపటాయిస్తోందని అర్థమై, దాన్నో ఆట ఆడించేసి ఆపద గట్టెక్కాలనుకున్నది. చటుక్కున ఆమెకో ఉపాయం స్ఫురించింది.

తొడమీద నిద్రపోతున్న పిల్లలిద్దర్నీ గిల్లేసరికి, వాళ్ళు ఏడుపు లంకించుకోగా "నేనేం చెయ్యనర్రా! మీరు మారాం చేసి పులి మాంసమే తెమ్మంటారు. అందుకే కదా నేనీ అడవిలోకి వచ్చాను. పులి కనిపించాలి కదా! ఒక్కటి కనిపిస్తే మీకు చెరిసగం, రెండు కనిపిస్తే ఇద్దరికీ చెరొకటి. చంపి దాని మాంసం మీకే ఇస్తాగా!" అని జోకొట్టసాగిందా ఉపాయశాలి.

ఆ మాటతో, ఆకలిగా ఉన్న పులి తన ఆకలి సైతం విస్మరించి, గుండెలదిరి

పరుగుతీస్తూంటే జంబుక మంత్రి ఎదురై విషయం తెలుసుకుంది. అది పులికి బాగా గడ్డిపెట్టి "మీరు ఇలా తయారయ్యారేం? కులానికే కళంకం. ఒక మానవస్త్రీకి భయపడతారా" అని మందలించింది.

అయినా పులికి ధైర్యం చాలకపోతే, "ఇలా ఎన్నాళ్లు పౌరుషహీనంగా, ఈ శరీరం దాచుకుంటూ బతుకుతావు?సింహం తర్వాత అడవికి నీవే రాజువు. దాని జిత్తులు నా దగ్గరా? పద! పద! అంతగా కావాలంటే - మనల్ని మనం ఈ అడవి తీగల్తో ఒకరితో ఒకరికి లంకె ఉండేలా బంధించుకుందాం!" అని, అవి అడవిపూలతీగలతో కట్టు ఏర్పరచుకొని అక్కడికి వెళ్లాయి. పులి వెనక్కు లాగుతూంటే, నక్క ముందరకు లాగడం ఆమె కంట పడింది. దాంతో ఆమె గుండెల్లో రాయి పడింది. పులి నెట్లాగో బోల్తా కొట్టించినా, నక్క జిత్తుల ముందర నా ఉపాయం ఫలిస్తుందా? అయినా చాతుర్యం ఉంటే బుద్ధికి సాధ్యం కానిదేది? అని చకచకా ఒక ఉపాయాన్ని ఆలోచించింది.

"ఓసి నక్కా! ఎంత మోసం చేశావే! ఇద్దరు పిల్లలకూ చెరో పులినీ తెచ్చిస్తానని లంచం తీసుకుని ఇంతవరకు కనిపించావు కాదేం? రెండో పులి ఏదీ? నీ పని పడతానుండు" అని అదిలించేసరికి, ఈ బ్రహ్మాస్త్రం ముందు తన జిత్తులు పారవని నక్క గ్రహించేసింది. బెబ్బులి నక్కని కూడ లాక్కొని ఎంతో దూరం అడవిలోకి పారిపోయి "ఓసీ! నువ్వు నన్నే మోసం చేస్తావా? నీ రక్తం కళ్లజూస్తా" అంటూ దానిమీదకు ఉరికేసరికి, జిత్తులమారి నక్క ఏదో ఒకటి చెప్పి ఆ పిరికి పులి బారినుంచి తప్పించుకు పారిపోయింది. భయస్తులేది చెప్పినా నమ్ముతారని దానికి బాగా తెలుసు" అని కథ ముగించి 'అమ్మా! నేనూ ఏదో ఒక ఉపాయంతో ఈ బ్రాహ్మణ ప్రభువు మాయని జయిస్తా" అంది.

అని చెప్పేసరికి కాలాతీతమైనందున తర్వాత కథను ఆవలి మజిలీలో ఆ యతిపతి ఇలా చెప్పసాగాడు..........

# కాశీ మజిలీ కథలు

## 7౭ వ మజిలీ

### కాంతిసేన కథ

శంతనా! నువ్వింత మతిలేనివాడి వయ్యావేం? కాంతిసేనని కరభుడికి నిశ్చయిస్తే నువ్వెందుకు ఊరుకున్నావు? నువ్వు ఆ బ్రాహ్మణుడివి కావు గదా! చిరకాలంనుంచీ ఏదో పొందాలని ఇక్కడ ఆశ్రయించుకుని ఉన్నవాడివి నువ్వు! ఆ కరభుడు నీకంటే విద్వాంసుడా? సొగసుకాడా?" అని శంతనుడిని నడివీధిలో నిలబెట్టి అడిగేసింది కేసరిణి అనే ఒక పరిచారిక.

"నువ్వు అన్నదీ నిజమే గాని కేసరిణీ! రాజుకు నా మీద ఆదరణ ఉంది. అందువల్ల నా మాట నేను ఆయన దగ్గర ఎత్తి రాజపుత్రిని నాకే ఇచ్చి పెళ్లి చెయ్యండి! నేను సామాన్యుడినే కదా! కరభుని దగ్గర ఇంద్రజాల విద్య ఉన్నందువల్లనే, మేము అక్కడ – రాజుని వంచించ కలుగుతున్నాం! అదీగాక – కరభుడు నాకు ఇంద్రజాల విద్య ఇచ్చేటట్లు; నేను అతనికి కాంతిసేనను కట్టబెట్టేటట్లు ఒప్పందం చేసుకున్నాం! ఎవరితోనూ అనకు సుమా!" అని అసలు రహస్యం ఆమెకు చెప్పేశాడు.

దానికి ఆమె "అయ్యా – వెర్రి బ్రాహ్మడా! రాజవైభవం కంటే ఇంద్రజాలం ఎక్కువా? తొందరపడి వారికి పెళ్లి జరిపించకు! ఎలాగో ఇంకో రెండ్రోజులు గడుపుకో! ఆమె నిన్నే పెళ్లి ఆడేలా చేస్తాను" అంది. క్రమంగా ఆ శంతనుని తన చుట్టూ తిరిగేలా చేసుకుంది.

ఒకరోజు కరభుడు అంతఃపురానికి వెళ్తుంటే, కేసరిణి అడ్డంగా నిలబడి నమస్కరించి "దేవా! నేను రాజపుత్రి సఖిని. నువ్వు రాజపుత్రికను పరిణయ మాడ నిశ్చయించినట్లు తెలిసింది. మీ దగ్గర అద్భుతమైనట్టి ఇంద్రజాల

విద్య ఉందనీ – దాన్ని నీవు శంతనునికి ఇవ్వాలనుకుంటున్నావనీ తెలిసింది. అది ఎవరికీ ఇవ్వొద్దని ఆమె చెప్పింది. నీకు అంత మొహమాటంగా ఉంటే, తన దగ్గర దాచమన్నది" అని యుక్తి పూర్వకంగా మాట్లాడింది.

"రాజపుత్రిక కోసమే కదా – నేనీ విద్య శంతనునికి ఇవ్వాలనుకున్నాను. అటువంటిది ఆమె వద్దంటే అలాటి పనులెందుకు చేస్తాను? ఇష్టమైతే ఇప్పుడే ఆ విద్య ఆమె పరం చేస్తాను" అని ఒళ్లెరగనంత ఆనందంలోఉన్న కరభుడిని రాజపుత్రిక దగ్గరకు తీసుకెళ్లి, అతడి చేత ఆ విద్యని ఆమె చేతిలో ధారపోయించేసింది కేసరిణి.

అప్పట్నుంచీ, కరభుడికి, శంతనుని ముఖం చూడ్డానికి మొహమాటం అడ్డు రావడంతో, అతడ్ని తప్పించుకు తిరగసాగాడు. శంతనుడికి రాజపుత్రిక మీద మనస్సు కల్గించినందున, అతడు కరభుడికి తెలీకుండా కాంతిసేనను కలవాలని అంతఃపురం చుట్టూ తిరగసాగాడు.

ఒకరోజు రాజు శంతనుడితో, ఊరి చివర (మాయా) ఉద్యానవనానికి వెళ్లి 'తనను కౌగలించుకుని మోహంలో పడేసిన' సుందరిని చూడాలన్నాడు. అతడికి అదంతా నిజమేనని భ్రమ. రాజపుత్రికకు శంతనుని వల్ల ఈ సంగతి తెలిసింది. ఆమె మనోహరమైన ఇంద్రజాలం ప్రదర్శించేసరికి శరభుడు ఆ తోట చేరుకున్నాడు.

రాజకుమార్తె చెప్పిన ప్రకారం కరభుడు అతడ్ని రహస్యంగా అనుసరించాడు. ఆ వెనుకనే శంతనునీ పంపింది రాకుమార్తె. కొద్ది సమయం తేడాలో అతడూ అక్కడకూ చేరుకున్నాడు. ఇంద్రజాలం వల్ల శరభునికి ఆ మాయావనిత ఎన్నెన్నో శృంగారలీలలను ప్రదర్శించాక, ఒక మాయా బాలుడ్ని చూపి 'వీడ్ని బతికిస్తేనే నీకూ – నాకూ పెళ్లి' అందామె. చిటికెలో వీడ్ని బతికిస్తానంటూ శరభుడు అవతలకు వెళ్లి తన శరీరాన్ని దాచి ఆ వనిత చూపిన బాలుడి శరీరంలోకి ప్రవేశించాడు. అవకాశం కోసం కాచుకూర్చున్న కరభుడు, శరభుడట్లా శరీరాన్ని వదలగానే, ఆ దేహాన్ని రెండు ముక్కలుగా నరికి పారిపోయాడు. అది నిజమేననుకున్న శంతనుడు రాజునెవరో ఖండించారనుకొని విచారించి, అక్కడ్నించి వచ్చేశాడు. ఎప్పుడైతే శరభుడు

రాజు దేహాన్ని వదిలేశాడో, అది అలనాడు మరణించిన ఆ రత్నాకర పురి ప్రభువు మృతదేహం కనుక – అది ఖండించబడినా శరభుడికి గానీ – అతడి ప్రాణానికి గానీ ఏమీ కాలేదు. కాకపోతే అతడి ప్రాణం ఇంకొక బాలుడి దేహంలో ఇరుక్కుపోయింది. అయితే – ఆ బాలుడు నిజంగానే ఆ నగరంలో పాముకాటు వల్ల మృతిచెంది ఓ కుమ్మరి బాలుడు. రాజపుత్రిక శరభుడి దేహాన్ని కావాలనే అందులోకి ప్రవేశించేలా సన్నివేశం సృష్టించి ఇరికించింది. ఇప్పుడు శరభుడికి దేహం లేకపోవడంతో బాలుడి శరీరంతోనే శంతనుని వద్దకు వెళ్లి తన గోడు చెప్పుకున్నాడు. “అయ్యయ్యో! ఎంత పొరపాటు చేశావు. నాతో చెప్పకుండా శరీరం వదిలేస్తే ఏం చెయ్యగలను? ఇప్పటికైనా జాగ్రత్త” అంటూ శంతనుడు ఊరడించాడు. రాజదేహాన్ని అంతః పురంలో ఉంచి, సకల రాచమర్యాదలతోను అంతిమసంస్కారాలు జరిపారు. అనంతరం – అతనికి పుత్రుల్లేనందున కాంతిసేననే వెనుకటి మంత్రులందరూ రప్పించి యువరాణిగా ఎన్నుకున్నారు. కేసరిణి కుమ్మరి బాలుడి రూపంలోఉన్న శరభుడిని కూడా బోల్తాకొట్టించి, పరకాయ ప్రవేశ విద్య రాజకుమార్తెకు ధారపోసేలా చేయించడంలో కృతకృత్యురాలైంది. ఇప్పుడా యువరాణి దగ్గర అసామన్యమైన రెండు విద్యలూ చేరిపోయాయి. వట్టి ప్రగల్భరాయుడిగా కరభుడు కుమ్మరిబాలుడు దేహంలో శరభుడు మిగిలాడు.

కేసరిణి, శంతన – కరభ – శరభులు ముగ్గురినీ మభ్యపెట్టి, రాజకుమార్తె ఆశచూపి ఒక్కొక్కర్నే వరుసగా వంచిస్తూ పోవడంతో, ఎవరికి వారే ‘తమకు మాత్రమే’ రాజపుత్రి కాంతిసేన భార్య అవుతుందని తలుచుకుంటూ మురిసిపోసాగారు.

అయితే ఒకేచోట ఒకేసారి ముగ్గురూ తారసపడినప్పుడు గాని, తాము ముగ్గురం కేసరిణి వల్ల మోసపోయామని తెలుసుకోలేకపోయారు.

దాంతో ముగ్గురూ ఘర్షణ పడుతూ కేసరిణి దగ్గరకు వెళ్లి మా ముగ్గురిలో కాంతిసేన భర్త ఎవరో చెప్పమని అడిగారు. ఆమె సవిలాసంగా నవ్వుతూ “రేపు సూర్యోదయ సమయానికి ఇక్కడకు రండి” అంది.

మర్నాడు తూర్పు తెల్లారకుండా ముగ్గురూ వచ్చి కూర్చున్నారు. కేసరిణి అక్కడకు రాజభటులను తీసుకొచ్చి "వీళ్లే పెళ్లి కొడుకులు సంకెళ్లు తగిలించండి" అంది. భటులు ఆ ముగ్గురి కాళ్లకూ సంకెళ్లు వేసి "పదండి! మీ పెళ్లి చేస్తాం!" అంటూ లాక్కుపోయారు.

"అది మన ముగ్గుర్నీ వంచించింది. ఇందులో ఇతరులను అనవలసిన పనిలేదు. మనకు మనమే తెచ్చిపెట్టుకున్న ఉపద్రవమిది. వెనుకటి వైరం మరచి ప్రవర్తిద్దాం. ఈ భటులు మనని ఖైదు చేస్తారేమో! నడమంత్రపు సిరిలా రెండు విద్యలు సంపాదించి, ఒక దేహంగా కలసి మెలసి ఉన్న మేం విడిపోయాం! విద్యలు ఎలాగూ పోయాయి కనుక - ఇకనైనా స్నేహంగా కలిసుందాం!" అనుకుని, తాము ఇంతకాలం చేసిన చర్యలకు వాళ్ళలో వాళ్లే నవ్వుకున్నారు. రాజభటులు వారిని ఓడ ఎక్కించి (ద్వీపాంతర వాస శిక్షక గురిచేయడంతో), వారిని ఇంకో ద్వీపంలో దింపి వచ్చారు.

అని చెప్పిన మణిసిద్ధుడు, ఆవలి కథని తదుపరి మజిలీలో ఇట్లా చెప్పసాగాడు.



# కాశీ మజిలీ కథలు

## ౪౦ వ మజిలీ

### వీరసేనుని కథ

"అయ్యో! పురోహితుడినని ఇంచుకైనా కనికరించక రాజపుత్రిక నాక్కూడా ద్వీపాంతర శిక్ష విధించిందే! ఎంత కఠినాత్మురాలు. అక్కటా! ఇక ఈ జన్మానికి, నా జన్మభూమిని చూసే భాగ్యం నాకు లభించదు కాబోలు! పెండ్లి అనగానే అలంకరించుకుని వెళ్లిపోయాం గాని, ఇంత ఇక్కట్లుంటాయని తెలుసుకోలేకపోయాను. మా ఉసురు కాంతిసేనను ఎప్పుడు తగుల్తుందో కదా!" అని శంతనుడు దుఃఖిస్తూంటే, కరభ శరభులు ఓదార్చసాగారు.

"నీకేమయ్యా! పురోహితపుత్రునివి! పంచాంగం చెప్పుకొని అయినా బతికేస్తావు. మా విషయం చూడు! అసామాన్యమైన విద్యలు పోగొట్టుకొని రెక్కలు తెగిన పక్షుల మయ్యాం! పాండిత్యమా? శూన్యం విచారించి చేసేదేముంది?" అంటూ ఆ ద్వీపంలో ఒక పల్లె వైపు నడిచారు. అక్కడున్న జాతి - కిరాతుల జాతి. క్రూరజీవనులు. చేపలు పట్టి జీవనం సాగిస్తూంటారు.

వీరి భాష తెలీనందువల్ల - వీరి సంజ్ఞలను బట్టి ఒక చోట వీరు దాహమిమ్మని అడిగితే సంజ్ఞల ద్వారా అది గ్రహించిన ఓ కిరాతకి పాలు తెచ్చి, వెల అడిగింది. నిర్ధనులు కనుక ఏదో వంక పెట్టి జారుకోగా, ఆమె భర్త వీళ్లని న్యాయాధికారికి పట్టిస్తే, అతడు విచారించి ఈ ముగ్గుర్నీ వదిలేశాడు. దాంతో ఆ మూర్ఖప్రజలు కలహించుకోడానికి కారణం దొరికిందని రెండు వర్గాలుగా చీలిపోయారు.

ఈ అలజడికి కారకులైన ముగ్గురు బ్రాహ్మణుల్నీ ఆ ద్వీపం రాజు కుశధ్వజుడు తన వద్దకు రప్పించాడు. ఆయనతో ఆ ముగ్గురూ తమ తమ వృత్తాంతాలు దాచకుండా చెప్పారు. వాళ్లు కాంతిసేన మోసాన్ని సవివరంగా చెప్పేసరికి, కుశధ్వజుడు తన పుత్రుడైన వీరసేనుడ్ని పిలిచి ఆ బ్రాహ్మణుల్ని క్షోభపెట్టడం తగదని ఆమెను మందలించి, వారి విద్యలు వారికి ఇప్పించమన్నాడు. అతడి మహేంద్రజాల విద్య ముందు, ఆ సామాన్య ఇంద్రజాలం ఏపాటి?

వీరసేనుడు, తండ్రి ఆనతి మేరకు వారిని వెంటపెట్టుకుని రత్నాకర నగరంలో ప్రవేశించాడు. యోగివేషధారణలో కరశ, శరభ, శంతనులు గడ్డాలు పెంచుకొని జపం చేసుకొంటున్నారు. వీరసేనుడు మాత్రం తన మహేంద్రజాల విద్యతో - అక్కడకు సమీపంలోనే ఒక గొప్ప మేడనీ - తోట భటులు సహితంగా సృష్టించి, రత్నాకర రహస్యాలు తెలుసుకోమని తన భటుల్ని పంపాడు. వారు అతడితో పాటు ద్వీపం నుంచి వచ్చిన వారు. తోటలోని మాయాభటులు కారు.

గూఢచారుల వల్ల, ఆ తోట వృత్తాంతం విన్న కాంతిసేన, ఆ విశేషాలు చూసి రమ్మని కేసరిణి పంపగా, అఖండురాలై ఆ చెలికత్తె ఏ విద్యాప్రభావమూ అక్కర్లేకుండానే - తన బుద్ధిచాతుర్యంతో వారి కంటె గొప్ప ఇంద్రజాలవైఖరి ప్రదర్శించి అందరినీ బుట్టలో వేసుకుంది. తిరిగొచ్చిన శంతనుడ్ని గుర్తించింది. అతడి ద్వారానే వీరసేనుడి గురించి సమాచారం అంతా రాబట్టింది. కాంతిసేనని అందంగా అలంకరించి, ఆమె మోహంలో వీరసేనుడు తగుల్కొనేలా చేసింది. స్త్రీ సౌందర్యం అనే మహామహేంద్రజాలం ముందు ఏ విద్య అయినా ఏపాటి? అతడామె ఉచ్చులో పడ్డాడు. అప్పటికీ కరభ, శరభ, శంతనులు అతడ్ని హెచ్చరిస్తూనే ఉన్నారు. మోహంలో - అందులోనూ, తెలివి ఉన్న రాజపుత్రి మైకంలో పడ్డ వాడికి హితోక్తులు తలకెక్కలేదు. రాజకుమార్తెని పెళ్లాడేస్తే తన వశం అయిపోతుందనుకున్నాడు.

అయితే, కాంతిసేన తనలాంటి ......అచ్చు తానే అని భ్రమ కలిగించేలాంటి రాకుమార్తెని సృష్టించి, కేసరిణి తోడుగా ఆ వీరసేనుడున్న ఉద్యానవనానికి పంపి, తాను దగ్గర్లోనే పొంచి ఉంది. కేసరిణి "గాంధర్వ

విధిన కాంతిసేనని పెళ్లాడు" అంటూ వీరసేనుని ప్రోద్బలం చేసి, అతడి చేత మాయా కాంతిసేన మెడలో హారం వేయించింది. ఇద్దర్నీ ఒక చోట చేర్చి తప్పుకుంది. మాయా కాంతిసేనను సుముఖురాలిగా చేసుకోడానికి, వెర్రివాడిలా వీరసేనుడు "నీకేమన్నా కోరికలుంటే అడుగు! తీరుస్తా" అన్నాడు. ఒళ్లెరగనంత మదన తాపంలో ఉన్న వీరసేనుడ్ని పూర్తిగా మత్తులోచిత్తు చేసి మహేంద్రజాలం కావాలని కోరింది. విద్యను ధారపోయించుకోడానికి నీరు తెస్తానని బైటకొచ్చిన మాయాకాంతిసేన మాయమై, పొంచి ఉన్న అసలైన కాంతిసేన లోపలికెళ్లి అతనిచేత మహేంద్రజాల విద్య తన హస్తగతం చేసుకుంది.

ఆ విద్య ఆమె చేతికి రాగానే, అతడి పరిస్థితీ ఆ బ్రాహ్మణులతోపాటే అధ్వాన్నమైంది. ఈసారి నలుగుర్నీ కట్టగట్టి ఆమె కారాగారంలో పడేసేసరికి వీరసేనుడు చాలా పశ్చాత్తాపపడ్డాడు.

"చేతిలో దీపం ఉంచుకొని కూడా, గుడ్డివాడినై చీకటిలోకి నడిచానంటూ' శంతనునితో "ఇప్పుడేం చెయ్యడం? అసలు మా తండ్రిగారికీ వార్త ఎవరు చెప్పారు?" అని అడగ్గా, వీరసేనుడి మీద కోపం కొద్దీ ఏం చేస్తాం! ఇక దాని జోలికెళ్లకు! నీకు అవకాశం ఉంటే ఈ చెరసాలలోంచి తప్పుకోగల మార్గం చూడు" అని మాత్రం అన్నాడు.

వీరసేనుడి భటులు వెళ్లి, ఆ వార్తను కుశధ్వజుడికి అందించగల్గితే, వీరసేనుడి మిత్రులు టక్కరి - టమారీ అనే వాళ్లని అక్కడకు రప్పించగలిగితే ఈ ఆపద గట్టెక్కుతుంది.......అనే సంగతి ఆ బ్రాహ్మణులకు తెలిసింది. కాని అది జరిగేదాకా కారాగారవాసం తప్పనిసరై రోజులు లెక్కబెట్టసాగారు. అని చెప్పి మణిసిద్ధుడు తరువాతి కథను ఆవలి మజిలీలో చెప్పసాగాడు.



81 వ మజిలీ

## టక్కరి టమారీ కథ

"అన్నన్నా! ఆమె వైరులకు మారి గాని, రాజకుమారి కాదు గదా! ఔరా! ఎంతవారిని ఎలా చేసింది? వంచకుల్నే మోసం చెయ్యగల నేర్పు ఆ స్త్రీకి ఉంది. బాపురే! కాంతిసేనా! శెబాసు!" అని వైతాళికులు పొగడసాగారు. అందుకు కారణం లేకపోలేదు.

మహేంద్ర జాల విద్యకంటే మాయల్లో రెండాకులు ఎక్కువ చదివిన టక్కరి – టమారీలనే ఇద్దరు దొంగలు కూడా, కాంతిసేన మాయలో చిక్కి గిలగిలలాడారు. ఆ వైనం ఇదీ.....

అదృష్టవశాత్తు వీరసేన, కరభ, శరభ, శంతనులు చెరసాల నుండి తప్పించుకుని తిరిగి కుశద్వీపం చేరుకోగా, తనకు జరిగిన పరాభవాన్ని వీరసేనుడు తన మిత్రులైన టక్కరి – టమారీలకు చెప్పాడు. కరభాదులను వారికి తోడుగా వెళ్లమన్నాడు. "దేవా! ఈ దొంగలు ఆమెనేమీ చెయ్యలేరు. ఏదో కపటం అవలంబించి ఆమె చేసే మోసం స్వయంగా అనుభవించాం కదా! మమ్మల్నిక్కడే ఉండనివ్వండి" అన్నారు వాళ్లు.

దానికి వాళ్లు ఉక్రోషంతో "మాకెవ్వరి సాయం అవసరం లేదు. ఆ కాంతిసేనను మేము, మా విద్యతో తీసుకొస్తాం" అని శపథం చేసి అన్నమాట ప్రకారం, తమదైన విద్యాప్రదర్శనలో పైచేయి సాధించారు.

రాజపుత్రిని చేజిక్కించుకుని, ఒక మహారణ్యంలో పోతూండగా, ఆమె టక్కరి టమారీలను మోసగించి, తనకు ఎలాగూ పరకాయ ప్రవేశవిద్య

తెలుసు గనుక, ఓ చోట చతికిలపడి తన ప్రాణాలు వదిలేసింది. అది నిజంగానే మరణించింది కాబోలు,ననుకుని, "ఈ శవంతో వీరసేనుడికి మాత్రం ఏం పని?' అని ఆలోచించి - దాన్నక్కడే పారేసి తమ ద్వీపానికి వెళ్లిపోయారు వాళ్లు.

వారి ఘనకార్యం విని, "అయ్యో! చేజిక్కినది సైతం జారవిడిచారే! నేను ముందే చెప్పలేదా! అది దాని శరీరంలోనికే తిరిగి ప్రవేశించి ఈ పాటికి రాజ్యం ఏలుతూ ఉంటుంది" అని పరిహసించాడు శంతనుడు.

అది వాళ్లు అవమానంగా భావించి, ఈసారి కాంతిసేనను ఎలాగైనా చేజిక్కించుకోదలచారు. టక్కరి టమారీలు ఈసారి తనని ఎట్లాగైనా పంతంకొద్దీ తీసుకెళ్లేలా ఉన్నారని గ్రహించుకుంది కాంతిసేన. పెళ్లిపేరుతో వల విసిరి, వాళ్లని కూడా వంచించి వాళ్ల విద్యలను తాను ధారాదత్తం చేసుకుని, టక్కరి - టమారీలను కారాగార బద్ధులను చేయగా, వాళ్లెలాగో బైటపడి తిరిగి కుశద్వీపం చేరుకున్నారు.

రాజపుత్రుడు "శంతనా! మనం ఇక ఆ కాంతిసేనను జయించలేమా? భూమ్మీద మాయాబలసంపన్నులే లేరా? శాంబరీ విద్య అన్నిటికన్నా పెద్దదంటారే! ఎలాగైనా ఆ విద్య తెలిసిన వారిని పట్టుకుని, వారి చేత కాంతిసేనను పరాభవించాలని ఉంది నాకు" అన్నాడు.

"ఎందుకొచ్చిన పంతమిది దేవా! మనం ఇక దాని జోలికి పోక ఇక్కడ సుఖంగా ఉండవచ్చు కదా!" అని జవాబిచ్చాడు శంతనుడు. కాని వీరసేనుడికి మాత్రం ఎలాగైనా ఆమెని సాధించి తీరాలని పట్టుదలగా ఉంది. అని చెప్పి ఆ బ్రహ్మవంశ సంజాతుడైన మణిసిద్ధుడు, అప్పటికి సమయం మించడం వల్ల, తదుపరి కథను తరువాత మజిలీలో ఇట్లా చెప్పసాగాడు.



# కాశీ మజిలీ కథలు

## 82 వ మజిలీ

### కామందకుని కథ

శంతనా! ఈ అగ్రహారంలో జలంధరుడనే బ్రాహ్మణుడు గజకర్ణ – గో కర్ణాలనే మహా మాయా విద్యలు తెలిసిన వాడట! అతడు మహాతపశ్శాలి కావడం వల్ల, వాటిని ఎవరి మీదా ప్రయోగించడట! అతనికి కామందకుడనే కొడుకున్నాడు. అతడు సకల గుణాభిరాముడు. పాపం! ఏ విద్యా – అతడికి అబ్బలేదు. కాని ఆ తండ్రికి అతడొక్కడే కొడుకు గనుక, అతడిపట్ల చాలా ప్రేమ ఉంది జలంధరునికి. మనం ఆ కామందకుని ఆశ్రయించి, కాంతిసేన వృత్తాంతం తెలుసుకుని, దాన్ని వంచించే మార్గం ఆలోచిద్దాం! అదీగాక, కొడుకు ఎలాటివాడైనా, తండ్రి తన కొచ్చిన విద్యల్ని ఉపదేశించకపోడు. ఆ విద్యలు గాని మనకు స్వాధీనాలైతే, రాజపుత్రిక కాంతిసేనని దాసిగా చేసుకోలేకపోము" అన్నాడు వీరసేనుడు. "కానీయ్! నీకు తోచినట్లు చెయ్యి" అనేశాడు శంతనుడు.

కరభ, శరభ, శంతన, వీరసేనులు నలుగురూ ఆ అగ్రహారంలో ప్రవేశించి మెల్లగా కామందకునితో స్నేహం చేశారు. పదిరోజులపాటు కలిసి – మెలసి తిరిగారు.

అప్పుడు వీరసేనుడు అడిగాడు "కామందకా! నీ తండ్రి మహా విద్వాంసుడు కదా! గజకర్ణ గోకర్ణాది మహా విద్యలు తెలిసినవాడు. అట్టి వారి పుత్రునివి! నీకింకా పెళ్లికాకపోవడం ఆశ్చర్యకరంగా ఉంది. నీకు పిల్లనివ్వడానికి ఎవరూ ముందుకు రాలేదా?" అని పౌరుషం కలిగేలాగ ప్రశ్నించాడు.

"నాకు పిల్లనిస్తామని రాకపోవడం ఏమిటి? ఎంతోమంది వచ్చారు. మా వాళ్లు కూడా, పెళ్లి – పెళ్లి అంటూ నిత్యం నిర్బంధిస్తూనే ఉన్నారు. నాకు నచ్చిన పిల్ల దొరక్క పెళ్లాడలేదు నేను. అదీగాక – మా బ్రాహ్మణుల్లో హావభావ విలాసాలు – శృంగార కళా రహస్యాలు తెలిసిన కన్యలుండరు. దీనిక్కారణం – చిన్నప్పట్నుంచీ నిష్ఠలూ, నియమాలూ, చన్నీళ్ల స్నానాలూ దాంతో దేహంలో నిగ్గు కొంత తగ్గుతుంది. ఎక్కడోగాని ఎక్కువమందికి నున్నగా తలదువ్వుకోవడం, ముడేసుకోవడం తప్ప వింత వింత సిగలు అలంకరించుకోవడం రాదు. మడి అంటూ చీర చుట్టబెట్టుకుంటారే తప్ప కుచ్చెళ్లు తీర్చి అందంగా చీర కట్టరు. అమ్మవారిలా పెద్ద బొట్టు పెట్టుకొంటారు గాని, చిన్న తిలకం దిద్దరు. నగలు అలంకరణ రాదు. వగలొలికేలా పలుకులుండవు. వ్రతాలకే తప్ప రతులకు పనికిరారు" అని అందుకే పెళ్లిమాట తలపెట్టలేదన్నాడు కామందకుడు.

అప్పుడు వీరసేనుడు "మిత్రమా! నీ మాటలు వింటూంటే, నువ్వు రసిక శేఖరుడివని తోస్తోంది. నీకు తగిన దొకతె ఉంది. అయితే ......ఆమె క్షత్రియ కన్య. కాంతిసేన. ఆ సొగసు గానీ, ఆ వయ్యారం గానీ, ఆ హొయలు గానీ, ఆ మాయలు గానీ, ఆ విలాసాలు గానీ ప్రపంచంలోఇంకొకరి కుండవు. పైగా ఆమెయే స్వతంత్రంగా రాజ్యం చేస్తోంది. ధనానికీ – దర్పానికీ లోటు లేదు. దానికి ఇంద్రజాల – మహేంద్రజాల – టక్కు – టమారీ విద్యలన్నీ తెలుసు! మీ తండ్రి దగ్గరున్న గజకర్ణ, గోకర్ణ విద్యలు రావు. అవి గనుక నువ్వు ఉపదేశం పొందినట్లయితే, నీవు ఆమెకంటే అధికుడివౌతావు. ఆమె నిన్ను వరిస్తుంది. కాని, దాని మాయకు లోనై నీ విద్యలు మాత్రం ఇవ్వవద్దు! మాలాగే కష్టపడతావు" అంటూ తమ వృత్తాంతాలు చెప్పారు.

కామందకుడ్ని ఇలా రెచ్చగొట్టేసరికి, అతడు "నాకేం తక్కువ? ఇదుగో! ఈ క్షణమే, మా తండ్రి గారి దగ్గర్నుంచి ఆ విద్యలు పొంది, కాంతిసేనను పెళ్లాడతాను" అంటూ ఆవేశంగా తండ్రి వద్దకు వెళ్లి విషయం చెప్పి తనకు ఆ విద్యలు ఉపదేశించమన్నారు.

ఆ తపస్వి ఎరుగని దేముంది? కొడుకు ప్రయత్నం కలిసిరాదనీ, టక్కరి టమారీలనే వంచించిన రాజకుమార్తెని వంచడం అంత తేలిక్కాదనీ సుఖాన ఉన్న ప్రాణం, దుఃఖ పెట్టుకోవడం దేనికనీ బోధించాడా తండ్రి.

అయినా, కామందకుడు వినకుండా 'చనిపోతా' నంటూ బెదిరించేసరికి – ఒక్కడే కొడుకు కావడం వల్ల అటువంటి అమంగళపు పలుకులు విని తట్టుకోలేక "నువ్వు రెండింటికీ తగవు. ఆమెపై ఆధిక్యత కోసం గజకర్ణ విద్య ఉపదేశిస్తాను" అని ఆ విద్యమాత్రం ఇచ్చాడు.

రెట్టించిన ఉత్సాహంతో కామందకుడు కాంతిసేన దగ్గరకు తన నలుగురు మిత్రులతోను బయల్దేరాడు. వారు కామందకుడితో చెప్పవలసిన జాగ్రత్తలన్నీ చెప్పి, పెళ్లాడే వరకు ఆమెకు ఎట్టి పరిస్థితుల్లోనూ విద్య ధారపోయవద్దని చెప్తూ, కొంతదూరం వెళ్లి సాగనంపి వచ్చేశారు.

కామందకుడు కాంతిసేనతో తాను వచ్చినట్లుగా లేఖను పంపగా, ఎప్పటిలాగే అతడ్ని వంచించడానికి కేసరిణిని పంపిందామె వీరసేనుడి ప్రోద్బలంతోనే అతడొచ్చాడని గ్రహించేసింది కేసరిణి. అయితే – ఆమె, వీరసేనుడి కంటే టక్కరి – టమారీలను నానా మాటలూ అని, వాళ్లొచ్చి అల్లరి చేసినందువల్లనే వాళ్లను కారాగారంలో పెట్టించినట్లుగా చెప్పింది. ఆమె క్రూరులకు క్రూరురాలని – మంచి వాళ్లకు మంచిదనీ చెప్పింది. నేర్పుగా దాసీకి కాంతిసేన వేషం వేసి పెళ్లి జరిపించి, నిజమైన కాంతిసేనకతడా విద్య ధారపోయగానే, అతడ్నీ చెరసాలలో పెట్టించింది.

ఆ వార్త గూఢచారుల వల్ల జలంధరుని దృష్టికి వెళ్లినా, అది ముందే ఆయన ఎరిగి వున్నవాడు కావడంతో – "నా మాట విననందువల్ల వాడికిలాంటి ప్రాయశ్చిత్తం జరగవలసిందే! పోనివ్వండి" అన్నాడు. అయితే కామందకుని తల్లి కొడుకును చూసేదాకా భోంచేయను అని పట్టుపట్టేసరికి జలంధరునికేం చెయ్యాలో తోచలేదు.

'నా విద్యను పరులను పీడించడానికి ఉపయోగించను' అని నియమాన్ని ఏర్పరచుకుని, ఆ ప్రకారమే నడుచుకుంటూన్న జలంధరుని వద్ద, తిమ్మరుసు మహామంత్రి మనమడు – శిష్యుడిగా ఉన్నాడు. అతడీ సంగతి విని,

గురువుగారిని వేడుకొని, "అందర్నీ వంచిస్తున్న ఆ కాంతిసేనను నేను లొంగదీస్తాను. మీ పుత్రుని విడిపిస్తాను" అనడంతో, ఆ శిష్యుని ప్రతిభా - తిమ్మరుసంతటి ధీశక్తి యుక్తులూ తెలిసినందున జలంధరుడు గోకర్ణ విద్యను అతనికి ఉపదేశించాడు. ఆ శిష్యుని పేరే - రత్నపాదుడు.

"తిమ్మరుసు వంశోద్భవుడివీ - ఉపాయాల్లో ఆ తాతకు తగ్గ మనవడివీ గనుక నీకు చాతుర్యంలో మేమేమీ నేర్పనక్కర్లేదు. కాని ఎవర్నీ నొప్పించకుండా కార్యం సాధించుకు రా!" అని దీవించి పంపాడు. అతడు విజయుడై తిరిగొస్తాడని అందరూ నమ్మకం పెట్టుకున్నారు.

## రత్నపాదుడి కథ

ఇంద్రజాలాది మాయా విద్యల్లో కెల్లా అధికమైనది గోకర్ణ విద్య. దాన్ని మించిన మాయా విద్య లేనేలేదు. రత్నపాదుడు అట్టి విద్యను సంగ్రహించుకుని, రత్నాకర పురానికి వెళ్లి మాయాబలంతో భేరీ వాద్యాలు దద్దరిల్లచేసే మహా భీకర సేనా వాహిని సృష్టించి ఆ పట్టణాన్ని ముట్టడించేసరికి పురప్రజలు అదంతా నిజమేననుకొని కకావికలై పారిపోయారు.

కాని, అవి మాయాబలాలని - నిజమైన శత్రుసేనలు కావనీ ప్రజలకు ఎంత చెప్పినా కాంతిసేన మాట విన్నవారొక్కరూ లేరు.

రత్నపాదుడు ఇంకోసారి ఇలాంటి చమత్కారాలు మరికొన్ని చేశాడు. ఓసారి భూకంపం సృష్టించాడు. ఇంకోసారి పెనుగాలులు పిడుగుల వర్షం. కలలోంచి మెలకువలో కొచ్చినట్లు తీరా చూస్తే ఏమీ ఉండదక్కడ.

ఓ రోజు పౌరులంతా "ఇలాంటి ఉపద్రవాలు ఎన్నడూ ఎరుగం" అంటూ మొరపెట్టుకున్నారు. సామాన్యప్రజ కనుక, అది ఇంద్రజాలమని ఎంత చెప్పినా వారికి అర్థం కాలేదు. హోమాలో - యాగాలో జరిపించమని కోరారు. వారినెలా సమాధానపరచాలో ఆమెకి అర్థం కాలేదు. అంతమంది ప్రజలకు విశ్వాసం కలిగించడం అంటే మాటలా? "సరే" అని అభయమిచ్చింది.

అలవాటు, మళ్లీ కేసరిణినే రత్నపాదుడి మీదకు ప్రయయోగించింది. ఆమె కూడా రత్నపాదుడ్ని మిగతావారిలాగానే బాగా పొంగవేసి – పొగడ్తల్లో ముంచి కార్యం చక్కబెట్టాలనుకుంది. రాజకుమార్తెతో పెళ్లి అంటూ ఎర వేసింది. అతడామె చరిత్రంతా ఆ కేసరిణి దగ్గర చదివి కరభ– శరభ – శంతన – టక్కరి – టమారీ – వీరసేనాదులను ఆమె ఎలా వంచించిందీ చెప్పుకొచ్చాడు. చివరగా తమ గురుపుత్రుడైన కామందకుని సంగతీ ఎత్తేసరికి ఆమె మాట్లాడలేకపోయింది. “మీ రాజపుత్రిక పెళ్లి సంగతి నా దగ్గర ఎత్తకు. నాకు అలాంటి అభిలాష లేదు” అని నిర్ద్వంద్వంగా తోసిపుచ్చడమే కాక – కాంతిసేన పన్నిన అన్నిరకాల వ్యూహాలనూ భగ్నం చేశాడు. చేసిన ప్రతీ మాయకూ ప్రతిక్రియ చేశాడు.

రాజపుత్రిక స్వయంగా వచ్చి “నా నియమం ప్రకారం నన్నీ విద్యల్లో ఓడించిన మీరే నాకు భర్త” అంది. రత్నపాదుడు అంత తేలిగ్గా విశ్వసిస్తాడా? అలా చేస్తే, అతడు తిమ్మరుసు మనవడెందుకు అవుతాడు?

“ఇంతవరకు నువ్వు సంగ్రహించిన అన్ని విద్యలూ నాకు ధారపోస్తేనే నీతో నా పెళ్లి జరుగుతుంది” అన్నాడు.

అప్పుడు కాంతిసేనకు – అతడు అనన్య సామాన్యుడని బోధపడింది. తాను ఎవరెవరి వద్ద నుంచి ఆ విద్యలను ఎందుకు సంగ్రహించిందీ వివరించింది. అటువంటి దుర్జనుల వద్ద ఇటువంటి ఘనమైన విద్యలుంటే లోకానికి ఎంత కీడో తెలిపింది. ఆమె వివరణలు రత్నపాదుడికీ సంతృప్తి కలిగించాయి. ‘ కాంతిసేన వంచకురాలిగా ముద్రపడటం ఆమె దురదృష్టం. ఆమెను అపార్థం చేసుకున్న వాళ్లే అంతా! నిజానికి ఆమె ధీశాలి. తనకు దీటైనది’ అని రత్నపాదుడు అర్థం చేసుకున్నాడు.

ఆమెను మరికొంత శోధించి, ఆమె నిజమైన అంతరంగాన్ని కనిపెట్టాడు. మహావిద్యలు లోకోపకారానికి ఉపయోగించాలి కాని లోకాపకారానికీ – స్వార్థానికీ కాదనే తన అభిప్రాయంతో ఆమె ఆలోచనలా సరిపోలడంతో అతడామెతో వివాహానికి సమ్మతించాడు.

అప్పటికప్పుడే దూతలను పంపి, కాంతిసేన జలంధర పండితుల వారిని సగౌరవంగా రప్పించింది. "రత్నపాదుడు మీ శిష్యుడు! నాకు మీరే పెద్దలుగా ఉండి వివాహం జరిపించండి!" అని కోరింది. కామందకుడిని భద్రంగా ఆయనకు అప్పగించింది. కాంతిసేనా - రత్నపాదుల వివాహానంతరం కామందకుడు ప్రధానిగా, వీరసేనుడు సహాయకుడుగా, కరభ, శరభ, శంతనులు పరిహాస సఖులుగా తిమ్మరుసు గారి మనమడు ఆ రాజ్యాన్ని చాలాకాలం పాలించాడు.

గోపా! కష్టపడి ఒకరు సంపాదించే ద్రవ్యం వేరొకరు సుఖంగా అనుభవిస్తారని వాడుక. ఇంద్రజాలాది విద్యల ప్రభావం ఇదే సుమీ" అని చెప్పిన మణిసిద్ధుడు శిష్యునితో అవతలి మజిలీ చేరాడు.



# కాశీ మజిలీ కథలు

## ౮౩ వ మజిలీ

చ. నరసుత నేఁడు వింతలు గనంబడవేమియు నిందు యక్షిణీ
వర జనిత ప్రభావనిరనవద్య యశోనిధి రామలింగ ధీ
వరసుతఁ దవ్వ సుంధరుని వార్త వినం గడు వేడ్కఁబుట్టెఁద
చ్చరితము నందు నెందయిన స త్కథ కల్గిన నానతీఁగదే!

("ఈ రోజు వింతలేం కనబడనందున, గొప్ప ప్రతిభాశాలీ, ప్రభావశీలీ అయిన రామలింగకవి కుమారుడు వసుంధరునికి సంబంధించి ఏదైనా మంచి కథ ఉంటే చెప్పండి గురుదేవా") - అని గోపాలుడు అడగ్గా మణిసిద్ధుడు తన ఆత్మీయ మణి ప్రభావము చేత ఆ విశేషాలు పూర్తిగా తెలుసుకుని, "గోపా! నేడు నీ ప్రశ్నకు తగినట్టి ఆశ్చర్య కథ ఒకటి నాకు తోచి వినిపిస్తున్నాను. శ్రద్ధగా విను!" అంటూ ఇలా చెప్పసాగాడు.......

## కౌముదీ - కళావతుల కథ

"తెనాలి రామలింగకవి కుమారుడైన వసుంధరుడు యక్షిణీ వర ప్రభావం వల్ల రాయలవారి కూతురు కళావతినీ, కుముద్వంతుని కూతురు కౌముదినీ వివాహం చేసుకున్నాడు. ఇద్దరు భార్యలతో సుఖంగా ఉంటూ కుముద్వతీ నగరాన్ని పాలిస్తున్నాడనే విషయం నీకు ఇంతకు ముందే చెప్పాను కదా! రాయలవారి భార్య కళానిలయకు వసుంధరుడు కళావతిని పెళ్లి చేసుకోవడం ఇష్టంలేకపోయినప్పటికీ కూతురు వరించడంతో ఆమె మాటను కాదనలేకపోయింది. ఒకరోజు పల్లవిక కూతురు మంజరిక అనే పరిచారికను కళావతి కుముద్వతీ నగరం నుంచి కళానిలయ దగ్గరకు పంపగా, ఆమె

వచ్చి కళానిలయకు నమస్కరించి "కళావతీ, కౌముదీ ఇద్దరూ క్షేమంగా ఉన్నారు. వారు మీ క్షేమసమాచారాలు తెలుసుకురమ్మని నన్ను పంపించారు" అని చెప్పింది.

కళానిలయ ఆనందంతో "కౌముది క్షేమం ఎవరికి కావాలి? నా కూతరు కళావతి ఎలా ఉంది? మందార వల్లి ఆమెను బాగానే చూసుకుంటోందా? నా బిడ్డ ఇంకా విశేషాలేమైనా చెప్పిందా?" అంటూ ఆతృతగా అడిగింది.

దానికి మంజరిక "అమ్మా! వసుంధరుడు కళావతిని ప్రాణంలా చూసుకుంటున్నాడు. మందారవల్లి ఆమెను కన్న కూతురిలా చూసు కుంటోంది. కళావతీ, కౌముదీ ఇద్దరూ ప్రేమగా ఉంటారు. ఇప్పుడు ఇద్దరూ గర్భవతులయ్యారు. ఆ విషయం మీకు చెప్పమని పంపించారు. త్వరలోనే మీకు మనవడు పుట్టబోతున్నాడు" అంటూ తాను వచ్చిన విషయాన్ని చెప్పింది.

ఆ వార్త విని కళానిలయ సంతోషంతో "ఏమిటే! ఇద్దరూ గర్భవతు లయ్యారా? నా కూతురి వేడుకలు ఎవరు చూస్తారు? నెలలు నిండిన పిల్లను పుట్టింటికి పంపాలని మందారవల్లికి తెలియదా? నీకు కడుపునిండి అన్నం పెడుతోందని ఆమెను ఊరికే పొగుడుతున్నావు. ఇక చాలు అయ్యగారి దగ్గరకు వెళ్లి నా బిడ్డను మందారవల్లి పెట్టే కష్టాల గురించి చెప్పు" అంటూ కొన్ని మాటలు చెప్పి పంపింది.

మంజరిక ముందుగా తన తల్లి పల్లవిక దగ్గరకు వెళ్లి కళావతి, కౌముదీల గర్భం విషయం, వారు ఆనందంగానే ఉన్న విషయం చెప్పి, తర్వాత కళానిలయ తనతో అన్న మాటలు గురించి కూడా చెప్పింది. అంతేకాకుండా కౌముదికి గర్భస్రావం అయ్యేటట్లు చూడమందని కూడా చెప్పింది. తాను అలాంటి పాపం చేయలేననీ, నువ్వే ఏదో ఒకటి ఆలోచించుకోమని చెప్పింది.

ఆ మాటలు విని పల్లవిక "అమ్మాయీ! యజమానులు ఏం చెబితే అది చేయడమే కానీ వారి మాటల్లోని మంచి చెడులను నిర్ణయించే పని మనకు లేదు. తరతరాల నుండీ మనం వారిని ఆశ్రయించుకొని ఉన్నాం. కనుక

వారు ఏం చెబితే అది చేయాలి" అని చెప్పి కూతురుని రాయల వారి దగ్గరకు పంపింది. ఆమె మాటలు విని రాయలవారు ఏమీ తేల్చుకోలేక కూతురిని తీసుకురమ్మని మంజరికతోపాటు పల్లకినీ, తగిన పరివారాన్ని పంపించాడు.

కౌముదీ, కళావతులిద్దరూ అక్కచెల్లెళ్ళకన్నా ఎక్కువగా ఉంటూ ఇద్దరూ ఒకేచోట ప్రసవించాలని ముందుగానే నిర్ణయించుకొని ఉండడంతో కళావతి తన కోసం వచ్చిన పరివారాన్ని వెనక్కి పంపించి తరువాత ఎప్పుడో వీలు చూసుకొని వస్తానని ఉత్తరం రాసి పంపింది.

ఒకరోజు మంజరిక వచ్చి "అక్కలారా! ఎక్కడి నుంచో ఒక ఎరుకలసాని వచ్చింది. ఆమె భూత, భవిష్య, వర్తమాన కాలాల విశేషాలను మహర్షుల కంటే బాగా చెప్పగలదట. మీకెలాంటి సంతానం కలుగుతుందో కూడా చెప్పగలదట." అని చెప్పింది. అది విని వారు ఆమెను లోపలికి తీసుకురమ్మన్నారు. ఎరుకలసాని వచ్చి జరిగిన వన్నీ చెప్పి వారికి ఆశ్చర్యం కలిగించి తనపై నమ్మకాన్ని కూడా కలిగించుకుంది.

అప్పుడు ఎరుకలసాని కళావతికి గొప్పవాడు కొడుకుగా పుడతాడనీ, కౌముదీ గర్భంలో భూతం ప్రవేశించి ఉన్నందున కొద్దిరోజుల్లోనే ఆమెకు గర్భస్రావం జరుగుతుందనీ చెప్పింది. అది విని కళావతి బాధపడుతూ "అలాంటి ఘోరం జరగకుండా కాపాడమనీ, తగిన పారితోషికం కూడా ఇస్తానని" చెప్పడంతో దానికి ఎరుకలసాని బాగా ఆలోచించి ఒక వేరు తీసి "రాబోయే గ్రహణం నాడు దానిని అరగదీసి కడుపులోకి పుచ్చుకోమంది" దానిని జాగ్రత్త చేయమని కౌముది పాటలిక అనే పరిచారికకు ఇచ్చింది. కళావతి ఆమెకు కానుకలు ఇచ్చి పంపింది. దానికి ఎరుకలసాని ప్రసవమయ్యాక వచ్చి కానుకలు పుచ్చుకుంటానని చెప్పి వాటిని వెనక్కి పంపి వెళ్లిపోయింది.

గ్రహణం నాడు కౌముదీ గుర్తుంచుకొని మరీ మందిమ్మని పాటలికని అడిగింది. కానీ అది ఆ వేరులో ఏదో మహత్యం ఉందని తలచి దానిని గర్భవతిగా ఉన్న తన కూతురు మాధవికకు అరగదీసి ఇచ్చేసి కౌముదికి

వేరే మందు ఇచ్చింది. కౌముది ఆ మందు తిని పడుకుంది. ఆ మందు తిన్నప్పటి నుండీ మాధవిక కడుపులో ఏదో తెలియని బాధ కలిగి రెండు ఘడియల్లోనే గర్భస్రావం అయింది. పాటలిక మంజరిక దగ్గరకు వెళ్లి జరిగినది చెప్పి "కౌముదికి కొట్టవలసిన పాపం నీ మరదలు మాధవికకు కొట్టింది" అని ఏడ్చింది.

రెండు రోజుల తర్వాత పల్లవిక వచ్చి "ఇక్కడ విశేషాలేమిటి? కౌముదికి గర్భస్రావం అయ్యిందా? కళానిలయ తెలుసుకొని రమ్మంది."అని అడగగా, దానికి మంజరిక భయపడుతూ "అమ్మా! ఇతరులను చెరపాలనుకునేవారు తామే ముందుగా చెడిపోతారు. కౌముదికి ఏ లోపమూ లేదు. కానీ నీ వల్ల నీ కోడలి గర్భమే పోయింది." అంటూ జరిగినదంతా మంజరిక తన తల్లితో చెప్పింది.

పల్లవిక గుండెలు బాదుకుంటూ మనవడు కలుగుతాడని ఆశపడ్డానే ఇప్పుడు ఆ భాగ్యం లేదు" అంటూ ఏడ్చింది. "ఇలా జరగడానికి ఎవర్ని అనుకుంటే మాత్రం ఏం ప్రయోజనం. ఇక మీదటైనా ఇలాంటి పనులు చేయకుండా బుద్ధిగా ఉండు" అంటూ తల్లికి హితబోధ చేసింది మంజరిక. కానీ దానికి పల్లవిక "అమ్మాయి! నీ వేదాంతాలు ఇక కట్టిపెట్టు! నేను కళానిలయకు ప్రధాన దాసిని. ఆమె చెప్పిన పని చేసి తీరుతాను" అంది.

ఇద్దరూ కలిసి కళావతి దగ్గరకు వెళ్లారు. ఆమె పుట్టింటి విశేషాలు అడిగింది పల్లవిక రాయలవారు రాసిచ్చిన ఉత్తరం ఆమెకు ఇచ్చింది. దానికి కళావతి చదివి భర్తకు ఇవ్వగా అతను దానిని చదివి నవ్వుతూ "కళావతీ! నిన్ను పుట్టింటికి పంపనందుకు మీ నాన్నగారు తప్పుగా భావించి ఏమేమో రాశారు. పెద్దవారికి కోపం తెప్పించకూడదు. నువ్వు ఒకసారి పుట్టింటికి వెళ్లి కొద్దికాలం ఉండి పురిటికి తిరిగి ఇక్కడికి రా!" అని చెప్పాడు. కళావతి మర్నాడు పరివారంతో సహా పుట్టింటికి వెళ్లి తన తల్లిని కౌగిలించుకుంది. కూతురు రావడంతో కళానిలయ ఎంతో ఆనందపడింది. "అమ్మా! కళావతీ! తల్లికి పిల్లల మీదుండే ప్రేమ, పిల్లలకి తల్లి మీద ఉండదు.

నీ రాకకోసం నేను బాధపడుతూంటే నువ్వు మందారవల్లి మాయలో పడి నన్ను మరచిపోయావు" అంటూ నిష్ఠూరడింది.

దానికి కళావతి "అమ్మా! నేనక్కడ సుఖంగానే ఉన్నాను. మా అత్తగారు, భర్త, సవతి అందరూ చాలా మంచివారు. నన్ను బాగా చూసుకుంటున్నారు. నేనూ కౌముదీ ఒకేచోట పురుడు పోసుకోవాలి అనుకోవడం వల్ల నేనిక్కడికి రాలేకపోయాను. దీనిలో తప్పేముంది? అని అడిగింది. అది విని కళానిలయ "కౌముది గురించి నీకు తెలియదు. నీ సంతానాన్ని చంపించాలని చూస్తోంది" అని చెప్పింది. ఆ మాటలకు కళావతి "అమ్మా! కౌముది గుణం నీకేం తెలుసు. ఆమెకు అసూయ అనేదే తెలియదు. నా బిడ్డను చంపితే ఆమెకేం లాభం? ఇదంతా నీ భ్రమ" అని చెప్పింది.

"నీకిప్పుడు ఏం చెప్పినా తెలియదు. కౌముది పట్టమనిషి కాబట్టి ఆమెకు కొడుకు పుడితే చక్రవర్తి పుట్టాడు అంటారు. మరి నీకు కొడుకు పుడితే ఏమంటారు? అయినా కూతురు మొదటి ప్రసవం పుట్టింట్లో చేస్తారనే విషయం మీ అత్తగారికి తెలియదా? నీకు మాత్రం తెలియదా? కాబట్టి నువ్వు ఇక్కడే ఉండు" అంది. దానికి కళావతి అంగీకరించలేదు. పదిరోజులు పుట్టింట్లో ఉండి తర్వాత అత్తగారింటికి వెళ్లిపోయింది.

ఆ తరువాత కళానిలయ మంజరికను, పల్లవికను పిలిచి "మన కళావతికి ఏమీ తెలియదు. మందారవల్లి ఏదో మందుపెట్టి ఉంటుంది. అయినా ప్రసవం అయ్యేదాకా మీరు అక్కడే ఉంటారు కదా. మీరు జాగ్రత్తగా ఆలోచించి, ఏదో ఒకటి చేయండి" అంటూ కొన్ని మాటలు రహస్యంగా చెప్పి పంపింది.

అది విని మంజరిక తన తల్లితో "అమ్మా! మనం ప్రయోగించే కపటాలన్నీ మనకే ఎదురుతగులుతున్నాయి. ఇతరులకు అపకారం చేయడం మంచిదికాదు" అన్నది.

దానికి పల్లవిక కూతురి మాటలను కొట్టి పారేస్తూ "అమ్మా! చూడు. నువ్వు చిన్నదానివి. నీకేమీ తెలియదు. మన యజమానురాలికి పుట్టేవాడే చక్రవర్తి కావాలి. అందుకు తగిన ఉపాయం ఆలోచించు" అంటూ బోధించి కళానిలయకు ఆనందం కలిగించింది. తర్వాత వారిద్దరూ కళావతితో కలిసి కుముద్వతీ నగరానికి వెళ్లిపోయారు.

ఈ విధంగా కథ చెప్పి ఆపి, మిగిలిన కథను మణిసిద్ధుడు తర్వాత మజిలీలో చెప్పడం ప్రారంభించాడు..........



# కాశీ మజిలీ కథలు

## 84 వ మజిలీ

### ఘటదత్తుని కథ

అయ్యో! పక్షపాతపు దేవుడు. నాతోటి కోడలికి కడుపునిండా పిల్లనిచ్చి నాకు ఒక బిడ్డనైనా ఇచ్చాడు కాదు. ఎవరేం చెప్పినా చేసి చూశాను. ఫలితం మాత్రం కనబడలేదు. ఆ యోగిని చెప్పినదే ఉండిపోయింది. కాని అర్ధరాత్రి ఈ స్మశానంలోనే అమ్మో! తలచుకుంటేనే వొణుకు పుడుతోంది. నాలాంటిది బ్రతికుండి మాత్రం ఏం ప్రయోజనం? నేను చావనైనా చావాలి. లేదా పిల్లల తల్లినైనా కావాలి" అనుకుంటూ కుముద్వతీ నగరానికి చెందిన శారద అనే బ్రాహ్మణి ఇల్లాలు నిర్ణయించుకుని స్మశానానికి వెళ్లింది.

సగం కాలిన శవాలను పీక్కుతింటున్న నక్కల ఊళలు, చితిలో పేలుళ్ల చప్పుడు, కాళ్లకు గుచ్చుకుంటున్న ఎముకల ముక్కలతో నిండిన స్మశానంలో కొంతసేపు ఆమె తిరిగింది. ఆమె స్నానం చేసి ఒంటి నిండా పసుపు పూసుకొని, తల విరబోసుకొని కాలుతున్న చితి దగ్గరకు వెళ్లింది. అక్కడ కూర్చున్న శవదహనకులు ఆమెను చూసి దయ్యమనుకొని భయపడి పారిపోయారు.

ఆ చితిని ఎలా ఆర్పాలా" అని శారద ఆలోచిస్తూ ఉంటే ఒకవైపు నుండి నెత్తిమీద కుండతో ఒక స్త్రీ రావడం ఆమె గమనించింది. ఆమె నెత్తిమీద కుండను లాక్కోవాలని శారద ఆమెకు ఎదురుగా వెళ్లి గట్టిగా అరిచింది. ఆమె భయపడి కుండను నేలమీద పారేసి వెనక్కి తిరిగి చూడకుండా పరిగెత్తింది.

ఆ కుండ నేలమీద పడి ముక్కలైపోగా అందులోంచి ఒక శిశువు నేలమీదపడి ఏడవడం ప్రారంభించాడు. శారద ఆ పిల్లవాడిని ఎత్తుకొని కాటి వెలుగులో వాడిని పరిశీలించింది. చక్కని రూపంతో, మంచి గుణాలతో ఉన్న ఆ బాలుడిని చూసి "అయ్యో! ఈ పిల్లవాడు చనిపోయాడనుకొని ఆమె ఇక్కడికి తెచ్చి ఉంటుంది. నేను ఆ యోగిని చెప్పినట్లు చేయడంతో దేవుడు దయ తలచి వీడిని బ్రతికించాడు. కడుపున పుడితే మాత్రం ఇంతకంటే ఎక్కువగా చూసుకుంటామా!" ఆమె గర్భవతి అని ప్రచారం చేసి, తర్వాత తనకు కొడుకు పుట్టాడని భార్యని కొడుకుతో సహా ఇంటికి తీసుకొచ్చి, ఆ పిల్లవాడికి ఘటదత్తుడు అని పేరు పెట్టాడు.

ఘటదత్తుడికి పదేళ్లవయస్సు రాకుండానే వాడు విద్యా, రూప, గుణవిశేషాలలో ప్రఖ్యాతిగాంచడం విని వసుంధరుడు ఒకరోజు తండ్రితో సహా పిల్లవాడిని తన ఆస్థానానికి రప్పించి వాడి విద్యలు పరీక్షించి ఆశ్చర్యపోయాడు. తన భార్యలిద్దరూ గర్భవతులైనప్పటికీ తనకు ఇలాంటి సంతానం పొందే భాగ్యం లేకపోయిందే" అనుకొని మిగిలిన విద్యలు తన దగ్గర చదవమని అడిగాడు. దానికి ఘటదత్తుడు వినయంగా అంగీకరించాడు.

ఘటదత్తుడిని శిష్యుడిగా చేసుకొని వసుంధరుడు కేవలం విద్యలనే కాకుండా ఆయుధసాధనం, అశ్వారోహణం వంటి వ్యాయామ విద్యలు కూడా నేర్పాడు. గురువులోని తప్పులనే దిద్దగల అతని బుద్ధికి వసుంధరుడు ఆశ్చర్యపోయి అతడిని తన ప్రధానమంత్రిగా చేసుకొని తనతోపాటు రాజమందిరంలో ఎక్కువకాలం గడిపేలా ఏర్పాటుచేశాడు. ఒకరోజు వసుంధరుడు ఘటదత్తుణ్ణి అంతఃపురానికి తన భార్యలకు చూపించగా కళావతి కన్నీరు పెట్టుకుంది. కౌముది చిరునవ్వు నవ్వింది. వసుంధరుడు కళావతి కన్నీరు ఎందుకు పెట్టుకుందో కారణం అడగ్గా " నా కానుపు అలా కాకపోయి ఉండి ఉంటే ఈ పాటికి మనకి ఇంత వయస్సు గల కొడుకు ఉండేవాడు కదా! ఇలాటి కొడుకు ఉంటే మీరెంతో ఆనందించేవారు కదా!' అని వెనుకటి కథ గుర్తొచ్చి కన్నీరు పెట్టాను" అని చెప్పింది.

మరి కౌముది ఎందుకు నవ్విందో చెప్పమనగా "స్వామీ! మీరు చిన్న విషయాలను కూడా అనుమానిస్తే నేనేమీ చెప్పలేను గానీ ఎంతటి సన్నిహితుడైనా తరుణ వయస్కుడైన అందగాడిని అంతఃపురానికి తీసుకురావడం క్షత్రియులెవ్వరూ సహించరు. మీరు బ్రాహ్మణ ప్రభువులు కాబట్టి అలా చేయగలిగారు. అందుకే నవ్వు వచ్చింది" అని అన్నది.

దానికి వసుంధరుడు మనస్సులో "కొడుకుతో సమానుడనే కదా ఇక్కడికి తీసుకు వచ్చాను. కౌముది వీడి మీద మనస్సు పడినట్లుంది. మాటలలో కూడా ఈ విషయం తొణికిసలాడింది. ఎందుకైనా మంచిది మరోసారి పరీక్షించి ఏం చేయాలో ఆలోచిస్తాను" అనుకున్నాడు.

వసుంధరుడు ఒకసారి రాయలవారి దగ్గరకు వెళ్లవలసిన అవసరం ఉండగా కౌముదిని వదిలేసి కళావతిని మాత్రమే వెంట తీసుకొని వెళ్లాడు. ఘటదత్తుడు వసుంధరుడితో వెళ్లడానికి మొదట అంగీకరించినప్పటికీ ప్రయాణ సమయానికి శూలనొప్పి రావడంతో ప్రయాణం విరమించుకున్నాడు. వసుంధరుడు పదిరోజులయ్యాక తిరిగిరాగా అతనికి మంచం తలవైపు ఒక ఉత్తరం గుచ్చి ఉండడం కంటపడింది.

దానిలో "మహారాజా! సర్వం తెలిసిన మీరు కూడా రూపవంతుడైన ఘటదత్తుడిని అంతఃపురానికి తీసుకొచ్చారు. అదే మీ కొంప ముంచింది. అతను కపట వ్యాధితో మీతో రాకపోవడానికి కారణం ఊహించుకోగలరు. అతను మీ అంతటివాడు. అలాంటివాడిని కాదనేదెవరు?" అని రాసి ఉంది. ఆ ఉత్తరం చదువుకొని వసుంధరుడు కోపంతో పళ్లు కొరుకుతూ "ఓరీ! ఘటదత్తా! నువ్వు ఎంతటి కృతఘ్నుడివి! సాటి బ్రాహ్మణుడవైపోయావు గానీ, లేకపోతే ఈ పాటికి నీ తలను నూరు ముక్కలు చేసేవాడిని" అంటూ కత్తి తీసి మంచి మీదికి ఉరికి, అంతలోనే ఏదో ఆలోచించుకొని అలాగే ఉండిపోయాడు.

ఉదయం ఘటదత్తుడు వచ్చి "మహారాజా! సూర్యోదయం అయినా ఇంకా నిద్రలేవలేదేం?" అని అడిగాడు. దానికి వసుంధరుడు కోపంతో "గురుద్రోహీ! నువ్వు పాపాత్ముడివి. నీ ముఖం చూడకూడదు. తక్షణం

దేశం విడిచివెళ్లిపో. లేకపోతే నీ తలను కోటగుమ్మానికి కట్టిస్తాను” అంటూ అతి ముఖమైనా చూడకుండా అటు తిరిగిపోయాడు.

ఘటదత్తుడు నిర్ఘాంతపోయి రాజమార్గంలో నడవడం ప్రారంభించాడు. భటులు, సామంతులు మొదలైనవారు అతడిని అనుసరించబోతే వారిని వద్దని వారించి చాలా దూరం నడిచి సమీపంలోగల అరణ్యంలోకి ప్రవేశించాడు.

మధ్యాహ్నం వరకూ నడిచి అలసిపోయి ఒకచెట్టు నీడలో కూర్చొని “అయ్యో! దురదృష్టం ఎంతలో వచ్చేసింది! పొద్దున్న వరకూ రాజభోగాలు అనుభవించిన నేను ఇంతలోనే నిర్భాగ్యుడినైపోయాను. రాజుగారు నన్నెంతో ప్రేమగా చూసుకునేవారు. ఆయన నన్ను వెళ్లిపొమ్మన్నప్పుడు నేను చేసిన నేరం ఏమిటి? అని అయినా అడగకుండా వచ్చేశాను. కనీసం తల్లిదండ్రులతో కూడా చెప్పలేదు. ఇది నిజం కాదేమో. కలేమో? లేకపోతే నేను నిజంగానే అడవిలోకి వచ్చేశానా?” అనుకుంటూ నేలమీద కూర్చుండిపోయాడు.

అంతవరకూ కథ చెప్పి ఆపి, గోపాలుణ్ణి వెంటబెట్టుకొని మణిసిద్ధుడు తర్వాత మజిలీ చేరుకున్నాడు...........



# కాశీ మజిలీ కథలు

## 85 వ మజిలీ

### సరోజినీ కథ

"అమ్మా! సరోజినీ! నువ్వు నా మాట వినకుండా వేశ్యావృత్తి నీచం అనుకుంటున్నావు. రంభ, ఊర్వశి వంటివారు కూడా దేవవేశ్యలే కదా! కనుక ఈ వృత్తిని నిరసించకు. ఇప్పుడే ఒక రాకుమారుడు తన పరిచారకులతో వచ్చి నీ రూపలావణ్యాల గురించి విని తాంబూలం ఇచ్చి వెళ్లాడు. నువ్వు గానీ అతన్ని చూస్తే తప్పకుండా మనసు మార్చుకుంటావు. నువ్వు అతనికి తగినదానివి. ఇప్పుడు కాదన్నావో నిన్ను శిక్షించక మానను" అంది. కాళిందీ పురంలోని చంద్రావతీ అనే వృద్ధవేశ్య.

ఆ మాటలు విని సరోజిని బాధపడుతూ "అమ్మా! నువ్వు చాలా మందిని మోసం చేసి డబ్బు సంపాదించావు. మూడు తరాలు కూర్చొని తిన్నా తరగని ఆస్తిని కూడబెట్టావు. నేను మాత్రం మోసం చేసి ధనం సంపాదించలేను. నీచప్రవర్తనకు నా మనస్సు ఒప్పుకోవడం లేదు. నాకు తగిన వాడిని చూసి పెళ్లి చేయి. అతన్నే దైవంగా భావిస్తూ పతివ్రతగా పేరు తెచ్చుకుంటాను. ఇష్టమైతే నాకు పెళ్లి చేయి. లేకపోతే నన్ను చంపేయి" అని చెప్పింది.

దానికి చంద్రావతి "చాలు - చాలు! పెళ్లి వలన స్వేచ్ఛ పోతుంది. ఇవాళ వచ్చే రాకుమారుడు నీకు నచ్చకపోతే ఇంకెప్పుడూ నువ్వు నా మాట వినద్దు. అతడ్ని చూసి కూడా నువ్వు వరించకుండా ఉంటే నీకు తప్పకుండా పెళ్లి చేస్తాను" అంది సరోజిని మౌనంగా ఉండడంతో ఆమె అంగీకారంగా భావించి సరోజినిని చక్కగా అలంకరించింది.

రాకుమారుడు రాగానే చంద్రావతి హారతిచ్చి స్వాగతం పలికింది. అతను హారతి పళ్లెంలో నూరు మాడలు రాల్చడంతో ఆశ్చర్యపోయి అతన్ని సరోజిని గదిలోకి పంపింది. అతనితో వచ్చిన పరిచారకులు ఆమె సౌందర్యాన్ని, ఇంటినీ మెచ్చుకుంటూ ఉంటే ఆనంపడి తన ఇంటిలోని రహస్య గృహాలతో సహా అన్నింటినీ చూపించింది. వారు చంద్రావతితో "నీ ఇల్లు కేబేరుని కోశాగారమే. నీ గురించి విని మరీ ఇక్కడికి వచ్చాం. రేపు ఈ పాటికి నీకు మా ఔదార్యం బాగా తెలుస్తుంది" అంటూ ఆమె మరోసారి పొగిడి వారు పడుకున్నారు.

సరోజిని గదిలోకి వెళ్లిన రాకుమారుడు "ఆహా! నా కథ నాకే ఆశ్చర్యం కలిగిస్తోంది. బ్రాహ్మణకుమారుడినై పుట్టి, రాజాశ్రయం సంపాదించి, చివరికి దొంగలతో కలిసి, విటుడినై ఇక్కడికి వచ్చాను. నమ్మక ద్రోహాని కన్నా మించిన పాపం మరొకటి ఉండదు. ఈ వేశ్యను ఎలా మోసం చేయగలను?" అనుకుంటూ సరోజిని పడుకుని ఏడుస్తూండడం గమనించి ఆమె దగ్గరకు వెళ్లి "అమ్మాయి! ఎందుకు ఏడుస్తున్నావు? అంటూ అనునయంగా అడిగాడు.

దానికి సరోజిని కళ్లు తుడుచుకొని "అన్నా! నన్ను నీ తోబుట్టువుగా భావిస్తానంటే, నా వృత్తాంతం చెబుతాను. అతను ఆమెపై సోదరభావమే ఉందనగా, అన్నా! నా తల్లిండ్రుల గురించి గానీ, కులం గురించి గానీ, నాకు తెలియదు. నాకు ఎనిమిదేళ్లు వచ్చినప్పటి నుండే నా కథ జ్ఞాపకం ఉంది. అంతవరకూ గ్రామ గ్రామానికీ, ఒకరి దగ్గర నుండి ఇంకొకరి దగ్గరికీ తిరుగుతూ ఉన్నాను. విశాల అనే నగరంలో నేనొక నాయకుడి ఇంట్లో ఆడుకుంటూండగా ఒక ఆవిడ వచ్చి నన్ను ముద్దాడి "నిన్ను పెంచుకుంటాం వస్తావా?" అని అడిగింది. నేను ఒప్పుకోలేదు. ఇంతలో నా పెంపుడు తల్లి వచ్చి ఆమెతో ఏదో మాట్లాడి నన్ను నూరుమాడలకు అమ్మేసింది. ఆమె తీసుకొచ్చి నన్ను ఈ చంద్రావతికి ఇచ్చింది. చంద్రావతి నాకు గురువుల దగ్గర సంగీత సాహిత్యాలు, నాట్యం వగైరాలు నేర్పించింది. తొందరలోనే నేనా విద్యల్లో ప్రావీణ్యం సంపాదించాను. అంతలో నాకు

యవ్వనం రాగా నన్ను వేశ్యగా ఉండమని ఆమె నిర్బంధించసాగింది. నాకు ఈ నీచమైన వృత్తిపై ఇష్టం లేదు. పెళ్లి చేసుకోవాలని ఉంది. దానికి చంద్రావతి ఒప్పుకోకపోవడంతో మీ పాదాలపై పడి మిమ్మల్ని బ్రతిమాలు కోవడమే మేలనుకున్నాను. దయతో నా మాట మన్నించండి. మీకు రుణపడి ఉంటాను. మీ వృత్తాంతం ఏమిటో చెప్పండి" అంటూ సరోజిని తన కథను చెప్పింది.

దానికి ఆ రాకుమారుడు "అమ్మా! నా పేరు ఘటదత్తుడు. నేను బ్రాహ్మణుడిని. చిన్నతనంలోనే ప్రధానమంత్రి పదవిని పొంది అకారణంగా నిందలపాలై అడవుల్లో తిరుగుతున్న నన్ను దొంగలు చేరదీసి, బలవంతంగా నన్ను వారితో తిప్పుకుంటున్నారు. చేసేది లేక వారి దగ్గర చోరవిద్యలన్నీ నేర్చుకుంటూ దేశాటనం చేస్తున్నాను. తర్వాత కథ నీకు చెప్పకూడనిదే అయినా నువ్వు చాలా మంచిదానికి కనుక చెబుతున్నాను.

మేము ఈ ఊరు వచ్చి పదిరోజులైంది. ఈ ఊళ్లో ఉండే భాగ్యవంతులందరి గురించి తెలుసుకున్నాం. నీ తల్లి సంపద గురించి విని దాన్ని దోచుకు పోవాలనుకొని, చాకలి వాడింటికి కన్నం వేసి మంచి బట్టలను దోచుకున్నాం. మేమిచ్చిన తాంబూలానికీ, మా వేషాలకీ పొంగిపోయి మీ తల్లి మా రాకని అంగీకరించింది.

"వాళ్లు ఇప్పుడు మీ ఇల్లు కొల్లగొడతారు" అంటూ ఘటదత్తుడు తన కథను చెప్తూండగా, దొంగలు వచ్చి తలుపు తియ్యమనగా ఘటదత్తుడు తలుపులు తీశాడు.

అంతలో దొంగలు లోపలికి వచ్చి "నువ్విక్కడ ఏం చేస్తున్నావు? చంద్రావతిని బంధించి మొత్తం సొమ్ము దోచేశాం. ఈ ఒక్క గదీ మిగిలింది" అని అన్నారు. దానికి ఘటదత్తుడు "ఈమె తన కష్టాలు చెబుతూ ఉంటే వింటున్నాను" అన్నాడు.

దొంగలు తలుపుచాటున దాక్కున్న సరోజినిని చూసి "నువ్వు చేస్తున్నదేమిటి? అసలు మనం అనుకున్నది ఏమిటి? ముందు మూటలు కట్టు" అని అనగా ఒకడు సరోజిని నోట్లో గుడ్డలు కుక్కి భుజం మీద

ఎత్తుకొని వేగంగా వెళ్లిపోగా, మిగిలిన వారు మూటలు తీసుకొని పారిపోయారు. తెల్లవారకముందే ఆ నగరానికి దగ్గరలో గల అడవిలో వారంతా కలుసుకున్నారు. సరోజిని సౌందర్యం చూసిన దొంగలు తమని పెళ్లి చేసుకోమని వేధిస్తూంటే ఆమె గొల్లున ఏడవసాగింది.

అంతలో అక్కడికి ఘటదత్తుడు రావడం చూసి వెళ్లి అతనితో జరిగినది చెప్పింది. దానికి ఘటదత్తుడు దొంగలతో "ఆమెను సోదరిగా భావించా"నన్నాడు. దానికి వారు వేశ్యలకు వావి వరసలు ఉండవన్నారు. అది విని ఘటదత్తుడు ఈమె నన్ను శరణుజొచ్చింది. కనుక ఈమెను రక్షించి తీరుతాను. నన్ను మన్నించి ఈమెను కాపాడండి" అన్నాడు. ఆ మాటలకు ధొంగలకు కోపం వచ్చి కాసుకోమన్నారు.

"మీ మీద విశ్వాసంతో ఇంతవరకూ ఊరుకున్నాను. ఇక మీకు కోపం వచ్చినా నేను పట్టించుకోను. నా ప్రాణం ఉన్నంతవరకూ ఈమెపై చేయి వేయలేరు. దూరంగా వెళ్లండి" అని ఘటదత్తుడు గద్దించాడు. వాళ్లు అతని మీద తిరగబడేసరికి ఒకడి చేతలోని గొడ్డలి లాక్కొని వేటుకొకళ్లని చంపాడు. దాంతో మిగిలిన వాళ్లు భయపడి పారిపోయారు. సరోజిని అతనికి నమస్కరించి "అయ్యా! మీరు పరశురాముడిలా క్షాత్రతేజం కూడా కలిగి ఉన్నారు. నేను ఇక ఆ వేశ్య ఇంటికి వెళ్లను. నన్ను మీ చెల్లెలిగా భావించి మీతో తీసుకువెళ్లండి" అని ప్రార్థించింది.

దానికి ఘటదత్తుడు "అమ్మా! నిన్ను మొదటే నా చెల్లెలిగా భావించాను. నీకు తగిన వరుణ్ణి తెచ్చి వివాహం జరిపిస్తాను. తర్వాత నీ అదృష్టం" అంటూ ఉండగానే పురరక్షకులు వచ్చి చోరీ వస్తువులను చూసి అతనే దొంగ అనుకొని పట్టుకోబోతూండగా అతను కత్తి తీసుకొని వారిని భయపెట్టి తరిమేశాడు. సూర్యోదయం అయిపోతోందనీ, ఇక అక్కడ ఉండడం మంచిదికాదని భావించి సరోజినిని తీసుకొని ఒక దారి వెంట ప్రయాణమయ్యాడు.

"గోపా! తర్వాత మజిలీకి వేళ అయింది. మిగిలిన కథను వచ్చే మజిలీలో సావకాశంగా చెప్పుకుందాం!" అన్నాడు. మణిసిద్ధుడు. గోపాలుడు కావడిని భుజానికి తగిలించుకొని మరో మజిలీకి ప్రయాణమయ్యాడు......

# కాశీ మజిలీ కథలు

## 86 వ మజిలీ

### సుమేధుని కథ

"చెల్లీ! సరోజినీ! మనకు గమ్యస్థానం అంటూ ఏదీ కనిపించడం లేదు. కనీసం తల్లిదండ్రులకైనా చెప్పకుండా వచ్చేశాను. వారు నా కోసం ఎంతో బాధపడుతూ ఉంటారు. రాజుకి నా మీద కోపం ఎందుకు వచ్చిందో అంతుపట్టడం లేదు. ఇప్పుడు మనం కుముద్వతీ నగరం వెళ్లడం మంచిదేనంటావా? నీకు పెళ్లి చేయాలి కదా! నాకు మళ్లీ రాజాశ్రయం లభిస్తే నీ పెళ్లి వైభవంగా చేయగలుగుతాను" అన్నాడు ఘటదత్తుడు.

దానికి సరోజిని "అన్నా! నువ్వెప్పుడైనా అంతఃపురానికి వెళ్లి స్త్రీలతో మాట్లాడావా?' ' అని అడిగింది. అతను "అవునని" చెప్పగా ఆమె నవ్వి "నువ్వు అలా వెళ్లడం వల్లనే ఈ ముప్పు వచ్చింది. రాజుల కోపం చాలా కాలం ఉంటుంది. కాబట్టి ఇప్పుడు కుముద్వతీ నగరం వెళ్లడం మంచిది కాదు. అందుకని మనం వేరే దేశం వెళదాం" అంది. కొన్నాళ్లు వారిద్దరూ ప్రయాణం చేసి శింశుమార నగరానికి చేరుకున్నారు. ఆ నగరాన్ని పాలించే రాజు చంద్రకేతుడు, మంత్రి సుమేధుడు. రాజుకు నలుగురు కొడుకులు. వారు సుముఖుడు, పద్మనాభ, చారుకర్ణ, పింగళాక్షులు. అనేక విద్యలు తెలిసినవారు.

రాకుమారులు నలుగురూ వీరిద్దరినీ చూశారు. ఎందరో రాకుమార్తెలకు వంకలు పెట్టిన సుముఖుడు "ఆమె రాచకన్య అయితే నేను పెళ్లి చేసుకుంటాను" అన్నాడు. వారి వృత్తాంతం తెలుసుకోవడానికి నలుగురూ

గుర్రాలపై వారిని వెంబడించారు. అప్పటికే వారిద్దరూ ఒక బ్రాహ్మణుని ఇంట్లోకి ప్రవేశించడం వల్ల రాకుమారులకు కనబడలేదు.

ఘటదత్తుడు భోజనం చేస్తున్నప్పుడు అక్కడ గల బ్రాహ్మణులు మంత్రి వృత్తాంతం చెప్పుకుంటూంటే ఆ వివరం ఏమిటో అడిగాడు. దానికి వారు "మా రాజుగారికి నలుగురు కొడుకులు. నలుగురూ రాజ్యాలనేల గల సమర్థులు. రాజు వారిలో బుద్ధిమంతుడికే రాజ్యం అప్పగిస్తానన్నాడు. ఆ విషయం తేల్చమని మంత్రిని అడిగాడు. మంత్రి తెలిసో, తెలియకో పెద్దవాడైన సుముఖుడే బుద్ధిమంతుడు అన్నాడు. మిగిలిన ముగ్గురూ మంత్రిపై కోపగించుకొని అది నిరూపించమని తగువు పెట్టుకున్నారు.

మంత్రి తగిన కారణం చెప్పకుండా అతనే బుద్ధిమంతుడని వాదించాడు. అప్పుడు రాకుమారులు మంత్రిని మోసం చేయాలని బంగారం మణులు తాపితం చేయబడిన ముద్రికను దొంగిలించారు. "ఒక నెల వ్యవధిలో ఆ ముద్రికను ఎవరు దొంగిలించారో తేల్చి చెప్పమన్నాడు. అంతేకాకుండా ముందూ - వెనుక ఆలోచించకుండా మాట్లాడేవాడు మంత్రిపదవికి అనర్హుడు. కాబట్టి పదవిలోంచి తీసేస్తాను" అన్నాడు చంద్రకేతుడు.

ఆ ముద్రికను ఎవరు తీశారో మంత్రికి మాత్రం ఏం తెలుసు? ఆయన చాలా మంచివాడు. ధర్మాత్ముడు. అందుకని ప్రజలు రాజు దగ్గరకు వెళ్లి "ఎవరూ చెప్పలేని విషయాలను అడిగి ప్రధానిని మోసం చేయడం రాజనీతికే మచ్చ. అందువల్ల మంత్రి విషయంలో రాజుగారి ఆజ్ఞను వెనక్కి తీసుకోమని విన్నవించుకున్నారు. అయినప్పటికీ రాజు వారి మాటలు వినలేదు. దాంతో మంత్రి దిగులు పెట్టుకొని మంచం పట్టారు. రేపటితో ఆ గడువు ముగుస్తుంది" అని చెప్పారు.

"నలుగురిలో ఎవరు దొంగిలించారో చెప్పలేని వాడు ఇంకేం బుద్ధిమంతుడు?" అని సరోజిని పరిహాసంగా నవ్వింది. "దానికి సమాధానం నువ్వు చెప్పగలవా?" అని ఘటదత్తుడు ఆమెను అడిగాడు. ఇంతలో ఆ

ఇంటి ఇల్లాలు వచ్చి "అమ్మా! నువ్వు సాక్షాత్తూ సరస్వతీ దేవిలా ఉన్నావు. ఏదైనా ఉపాయం చెప్పి ఈ గండం గట్టెక్కించు . ఆ మంత్రి భార్య చాలా మంచిది. ఆమెను నీ దగ్గరకు తీసుకొస్తాను"అంది.

సరోజిని ఘటదత్తుని అంగీకారం కోసం అతనివైపు చూసింది. ఘటదత్తుడు "రాజులకు విశ్వాసం ఉండదు" అని గొణుక్కుంటూనే అంగీకరించాడు. ఆ ఇంటి ఇల్లాలు మంత్రి భార్య దగ్గరకు వెళ్లి "అమ్మా! మా ఇంటికి రాకుమారి లాంటి అమ్మాయి వచ్చింది. మీ కథ విని ఇది చాలా చిన్న సమస్య అంది. మీరొకసారి మా ఇంటికి వస్తే మీ కష్టం తీరిపోయే మార్గం తెలుస్తుంది" అని ఆమెకు సర్దిచెప్పి బండెక్కించి సరోజిని దగ్గరకు తీసుకొచ్చింది.

మంత్రి భార్య సరోజినిని చూసి "అమ్మాయీ! ఈమె నీ గురించి చెప్పింది. మా కష్టం తొలగించడానికి వచ్చిన సరస్వతివో, పార్వతివో అయి ఉంటావు. మరెవరూ కూడా ఈ ప్రశ్నకు సమాధానం చెప్పలేరు" అంది. అప్పుడు సరోజిని "అమ్మా! దీనికి ఇంతగా ఆలోచించాల్సిన పనిలేదు. ఆ నలుగురు రాకుమారుల్నీ నాతో ఒక్క గడియ మాట్లాడేలా చూడు. ఆ ముద్రిక ఎవరు దొంగిలించారో చెబుతాను" అని ఆమెకు కొన్ని మాటలు రహస్యంగా చెప్పి పంపించింది.

ఆవిడ ఆ మాటలను మంత్రి సుమేధునితో చెప్పడంతో ఆయన ఒకింత ఆశ్చర్యంతోనూ ఒకింత సంతోషంతోనూ వారిని తక్షణమే తన ఇంటికి రప్పించుకున్నాడు. "అమ్మా! ఎవరు దొంగిలించారు అనే విషయం ఎలా చెబుతావు? నీ దగ్గర ఏదైనా మహిమ గానీ ఉందా?"అని ప్రశ్నించగా, దానికి సరోజిని అయ్యా! అప్పటికి ఎలా తోస్తే అలా చెబుతాను" అని చెప్పింది.

మరుసటి రోజు మంత్రి రాజు దగ్గరకు వెళ్లి "మహారాజా! మీరడిగిన ప్రశ్నకు నా కూతురు సమాధానం చెప్పగలదు. ఇవాళ సభ ఏర్పాటు చేయించండి. మీ నలుగురు కొడుకులని కూడా రప్పించండి. తెర వెనుక

ఉండి నా కూతురు రాకుమారులతో కొంచెం మాట్లాడి ముద్రికను ఎవరు తీశారో చెబుతుంది" అన్నాడు.

అందుకు రాజు ఒప్పుకుని మంత్రి కోరిక మేరకు సభను ఏర్పాటు చేశాడు. సరోజిని పల్లకిలో సభా భవనానికి వచ్చి తెర చాటున కూర్చుంది. రాజపుత్రులు కూడా సభలో ఆశీనులై ఉన్నారు. "ఇక నువ్వు నీ ఉపన్యాసం ప్రారంభించవచ్చు" అని మంత్రి సరోజినికి అనుమతి ఇవ్వడంతో ఆమె ఇలా చెప్పసాగింది.

## ప్రభావతి కథ

దేవప్రస్థమనే నగరాన్ని కీర్తిచంద్రుడనే రాజు పరిపాలించేవాడు. అతనికి ముసలి వయస్సులో ప్రభావతి అనే కూతురు కలిగింది. ముల్లోకాల్లోనూ అంతటి సౌందర్యవతి లేదనే చెప్పాలి. ఆమెకు ఐదేళ్ల వయస్సులో రాజు సకల విద్యల్లో నిపుణుడైనా కళానిధి అనే బ్రాహ్మణుని దగ్గర విద్య నేర్పించసాగాడు.

ప్రభావతికి ఎనిమిదేళ్లు వచ్చేసరికే పధ్నాలుగు విద్యల సాంప్రదాయాలు క్షుణ్ణంగా తెలుసుకుంది. అప్పటికి ఆమె యవ్వనంలో అడుగుపెట్టగా తండ్రి అనుమతిప్రకారం గురదక్షిణ ఇవ్వడానికి చక్కగా అలంకరించుకొని బంగారు పళ్లెం నిండా దీనారాలు తీసుకువచ్చింది. ప్రభావతిని చూసి గురువే గుర్తుపట్టలేనంత అందంగా ఉంది. ఆమె సౌందర్యం చూసి కళానిధి మోహించి ఈమెను భార్యగా పొందనివాడికి త్రిలోకాధిపత్యం ఉండి మాత్రం ఏం ప్రయోజనం?" అని అనుకున్నాడు.

ప్రభావతి గురువు దగ్గరకు వెళ్లి "గురువర్యా! మీరు నాకు తండ్రితో సమానం. అన్ని విద్యలు నేర్పిన మీకు జీవితాంతం రుణపడి ఉంటాను. ఈ శిష్యురాలిని అనుగ్రహించి గురుదక్షిణ స్వీకరించండి. నేను అంతఃపురం వెళ్లడానికి అనుమతి ఇవ్వండి" అని ప్రార్థించింది. "రాకుమారీ! నువ్వు అన్నట్లుగా గురువు దైవంతో సమానం. కానీ గురుభక్తి గల శిష్యుడు

గురువు ఏం చెప్పినా కాదనకుండా చేస్తాడు. నువ్వు కూడా అలాంటి దానివేనని నాకు తెలుసు. ఈ దీనారాలను నేనేం చేసుకోను? వాటితో నాకు పనిలేదు. ఎవరి మీదా ఎక్కువ మమకారం, ప్రేమా పెంచుకోకూడదు. నువ్వు అంతఃపురానికి వెళతానంటే నాకు చాలా బాధగా ఉంది" అన్నాడు కళానిధి.

దానికి ప్రభావతి "గురుదేవా! గురువు తండ్రిలాంటివాడు. కనుక గురుదర్శనం ఎప్పుడూ తప్పుకాదు. నేను అంతఃపురం వెళ్లిపోయినా మీరు వచ్చి నన్ను చూడవచ్చు. మీ ఇంట్లో ఏ శుభకార్యం జరిగినా నేను తప్పకుండా వస్తాను. దానిలో మీరు బాధపడాల్సిన పనిలేదు. గురుదక్షిణ స్వీకరించి, నన్ను ఆశీర్వదించి పంపించండి' అంది.

కళానిధి ఏదో అస్పష్టంగా మాట్లాడేసరికి "ఆర్యా! నాతో అంత సందేహంగా మాట్లాడతారు ఎందుకు? మీ కోరిక ఏమిటో చెప్పండి. మా తండ్రితో చెప్పి తీరుస్తాను" అంది. దానికి గురువు "నీ దగ్గర నిజం దాచడం ఎందుకు. మదనుడు నీ రూపం ఎరవేసి నన్ను బాధిస్తున్నాడు. నువ్వు లేకపోతే బ్రతకలేను" అన్నాడు.

ఆ మాటలకు ప్రభావతి పళ్లెం వదిలేసి కొంచెంసేపు ఆలోచించి "గురువా! శిష్యురాలికీ, కూతురికీ తేడా లేదా? ఎవరైనా కూతురిని మోహిస్తాడా? నాకు విద్యలు నేర్పిన నీకు ఇది తగిన పనేనా? చాలు - చాలు ఇంద్రియాలను అదుపులో పెట్టుకోవడం మంచిది." అని అతను సిగ్గుపడేలా గట్టిగా చెప్పింది.

దానికి గురువు ఒక్కసారి నిట్టూర్చి "రాకుమారీ! నువ్వు చెప్పినది నిజమే. సకల శాస్త్రాలూ చదివిన నాకు ఇలాంటి ఆలోచన రావడం తప్పే. నేనేం చేయను? బ్రహ్మ తన కూతురు సరస్వతినీ, గౌతముడు అహల్యని వరించిన సంగతి నీకు తెలియదా! నువ్వు కాదంటే మదనాగ్నిలో మాడి మరణిస్తాను" అన్నాడు. అది విని ప్రభావతి "ఆర్యా! నువ్వు చెప్పినదంతా నిజమే. నువ్వు మా తండ్రి నడిగి నన్ను వివాహం చేసుకుంటే నీకు నచ్చినట్లే ప్రవర్తిస్తాను.

నేను అస్వతంత్రురాలిని. ధర్మ విరుద్ధమైన పనులు చేయలేను. నా కోసం అనవసరంగా ప్రాణాల మీదికి తెచ్చుకోకు " అన్నది.

ప్రభావతి మాటలు విని కళానిధి "ప్రభావతీ! సర్వం తెలిసిన నువ్వు కూడా ఇలా మాట్లాడితే నేనేం చేయగలను? మీ తండ్రి నిన్ను నాకిచ్చి వివాహం చేస్తాడా? మనిద్దరి మధ్యా ఎంత వ్యత్యాసం ఉంది? సూర్యుణ్ణి కుంతి కలిసినట్లు నువ్వు నన్ను కలవాలి" అన్నాడు. దానికి "కుంతికి ఉన్నలాంటి వరాలు నాకు లేవు. నీ కోరిక తీరిస్తే నేను అన్నింటికీ చెడతాను. కులటనై అందరిచేత అసహ్యించుకోబడతాను. ఇలాంటి పనులు చేయడానికి మనసొప్పడం లేదు" అని చెప్పింది.

అప్పుడు కళానిధి "మాటలతోను, శాస్త్రాలతోనూ నేను నిన్ను ఒప్పించలేను. ఇది ధర్మమో, అధర్మమో నాకు తెలియదు. నన్ను కనికరించి బ్రతికించు" అని వేడుకున్నాడు. దాంతో ఆమె ఆలోచనలో పడి "ఎంతటి పండితుడు, ఎలాంటి కోరిక కోరుతున్నాడు. నేను కాదంటే మరణిస్తాడు. ఇప్పుడేం చేయాలి? ఎలా తప్పించుకోవాలి? అనుకొని "గురువర్యా! ధర్మసూత్రాలు నేను పట్టించుకోను. కానీ నా కోరికను మరోలా తీరుస్తాను" అంది. అతను వెంటనే లేచి కూర్చొని "ఎలా తీరుస్తావు?" అని అడగ్గా "భర్త అనుమతితో పరపురుషుడితో కలిసినా తప్పులేదు కాబట్టి నాకు వివాహం అయ్యాక తొలిరేయి నా భర్తను ప్రార్థించి నీ దగ్గరకు వస్తాను. అప్పుడు నీ ఇష్టం" అని చెప్పింది.

"రాకుమారీ! భర్త అనుమతి తీసుకొని రావడం అనేది కేవలం నన్ను మభ్యపెట్టడానికే . ఎవరైనా దానికి అనుమతి ఇస్తారా? సరేలే. నువ్వు ఇంటికెళ్లిపో. నేను కాటికిపోతాను" అని కన్నీరు పెట్టుకున్నాడు. "గురుదేవా! ఇక ఎక్కువగా మాట్లాడి ప్రయోజనం లేదు. ఆ వేళ రాత్రి నేను మీ దగ్గరకు రాకపోతే గురుహత్యాపాతకానికి గురి అవుతాను. ఇంతకంటే నేనేమీ చెప్పలేను" అంటూ తాను తీసుకొచ్చి దీనారాలను ఇచ్చి విస - విసా వెళ్లిపోయింది.

కీర్తిచంద్రుడు తొందరలోనే ఒక రాకుమారుడికిచ్చి ప్రభావతి వివాహం జరిపించాడు. చాలా అందంగా అలంకరించుకొని మొదటి రాత్రి భర్తకు ప్రీతి కలుగజేస్తూ కొంచెం పరిచయం కాగానే సిగ్గును వెనక్కి పెట్టి "స్వామీ! మిమ్మల్ని భర్తగా పొందడం నాపూర్వ జన్మ పుణ్యం. అన్ని ధర్మాలూ తెలిసిన మీకు నేనేమీ చెప్పనవసరం లేదు. నా కోరిక తీరుస్తానంటే చెబుతాను" అని వినయంగా అడిగింది.

ఆమె మాటలకు అతను ఆనందించి "నీ కోరిక ఏమిటో త్వరగా చెప్పు. అని అడిగాడు. దానికి ప్రభావతి "నా కోరిక మీకు కోపం తెప్పిస్తుందని తెలుసు. అయినా ధైర్యం చేసి అడుగుతున్నాను. ధర్మసూక్ష్మాలు ఆలోచించి నన్ను మన్నించండి" అంటూ జరిగినదంతా తన భర్తతో చెప్పింది.

అది విని రాకుమారుడు ఆశ్చర్యపోయి "ఇదా నీ కోరిక! మంచి దానివే!" అంటూ ఎగతాళిగాను, నిష్ఠూరంగాను మాట్లాడాడు "రాకుమారా! ఏ భార్యకైనా తన భర్తే దైవం. గురువు మరణిస్తాడేమో అనే భయంతో అలా చెప్పవలసి వచ్చింది. నన్ను కామిని అని పొరబడితే ఇప్పుడే మీ పాదాల దగ్గర నా ప్రాణాలు వదులుతాను. పతిమెచ్చని బ్రతుకు కంటే సతికి నీచం మరొకటి ఉండదు" అని విలపించింది. పెళ్లికి ముందే ఇలాంటి శపథం చేశావంటే చాలా ఆశ్చర్యంగా ఉంది. మగడు మాట వినని వాడైతే అప్పుడు ఏం చేసేదానివి" అని అడిగాడు.

"నా వ్రతానికి దైవం సహాయపడతాడనీ, త్రికరణ శుద్ధిగా భర్తను దైవంలా భావించే భార్య మాటను భర్త తప్పకుండా వింటాడని నా చిత్తశుద్ధే నాతో అలాంటి శపథం చేయించింది" అని చెప్పింది. ప్రభావతి మాటలకు సంతోషించి, ఆమె ఔదార్యం అర్థం చేసుకొని "నువ్వు ఇచ్చిన మాట చెల్లించుకొని రా" అని చెప్పి పంపించాడు.

ఆమె భర్త మాటకు సంతోషించి బంగారు పళ్లెంలో ఫలహారాలు పట్టుకొని

చీకట్లో గురువు ఇంటికి బయలుదేరింది. దారిలో కొందరు దొంగలు ఆమెను అడ్డగించి "నగలు ఇవ్వమని" గద్దించారు. దానికి ఆమె భయపడి "అన్నలారా! నేను గురుకార్యం మీద వెళుతున్నాను. రెండు గడియలు ఆగండి. ఈ నగలన్నీ మీకు ఇచ్చేస్తాను. ప్రస్తుతం నన్ను వెళ్లనివ్వండి" అని వేడుకుంది.

దొంగలు ఆ మాటలకు నవ్వి "అమ్మాయీ! నీ మాటలు విచిత్రంగాఉన్నాయి. మేం నీ మాటలు నమ్మం. దొంగలమైన మాకు దయ ఉండదు. గురువుగారి పనికి నగలెందుకు?" అన్నారు. ఆమె తన కథనంతా చెప్పి, పంచభూతాల మీద ఒట్టువేసి, తను ఇచ్చిన మాట నిలుపుకుందుకు సాయం చెయ్యమని" అడిగింది.

ఆమె మాటలు వినేసరికి దొంగలకు దయ కలిగి "వేగంగా వెళ్లిరా. లేకపోతే నీ పని పడతాం!" అని హెచ్చరించారు. ప్రభావతి వెంటనే గురువు దగ్గరకు వెళ్లింది. ఆమె వెళ్లేసరికి గురువు కళానిధి మంచి నిద్రలో ఉన్నాడు. ప్రభావతి అతన్ని మేల్కొలిపేసరికి ఆమెను చూసి గుర్తుపట్టలేక భూతమేమో అనుకొని పారిపోబోతూ ఉంటే "గురుదేవా! నేను ప్రభావతిని. భర్త అనుమతి తీసుకొనివచ్చాను. మీ కోరిక తీర్చుకోండి" అంది.

అతను ఆమ పాదాలపై పడి "అమ్మా! నువ్వు మహాపతివ్రతవి. నేను వివేకం కోల్పోయి ఆనాడు అలా కోరుకున్నాను. నిన్ను తాకి నేను బ్రతకగలనా?" అంటూ ఆమెను పొగిడి, ఆమె తెచ్చిన కానుకలు తీసుకోకుండా, తానే ప్రభావతికి కొత్తబట్టలు పెట్టి మరీ పంపించాడు. తర్వాత ప్రభావతి దొంగలున్న చోటికి వచ్చి "సోదరులారా! నా నగలు తీసుకోండి. నేను వెంటనే యింటికి వెళ్లాలి" అంది. దానికి ఆ దొంగలు "తల్లీ ! నువ్వెవరో లక్ష్మివో, పార్వతివో అయి ఉంటావు. నీ దర్శన భాగ్యం వల్ల మాకు చాలా ధనం దొరికింది. నీ నగలు మాకొద్దు. నువ్వు మా తోబుట్టువులాంటిదానివి. మేమే నీకు కానుకలు ఇస్తాం" అన్నారు.

వారి మాటలకు ప్రభావతి "అన్నలారా! దొంగలకు ఉండని దయాదాక్షిణ్యాలు చూపిస్తున్నారు. అదే నాకు పదివేలు. సహాయం చేసిన అన్నలకు ఈ మాత్రం సొమ్ములు ఇవ్వడం మంచిది" అంటూ ఆమె నగలు ఇవ్వబోగా వారు వాటిని తిరస్కరించి, బలవంతంగా కొన్ని నగలు ఆమె కొంగున ముడివేసి ఇంటివరకూ సాగనంపి మరీ వెళ్లాడు. ప్రభావతి రహస్యంగా అనుసరించి జరిగినవన్నీ చూసి ఆమె పాతివ్రత్యానికి సంతోషిస్తూ ఏమీ తెలియని వాడిలా నిద్రపోతున్నట్లు నటిస్తున్న భర్తను మేల్కొలపడానికి ఆమె వీణ తీసుకొని సంగీతం పాడడం ప్రారంభించింది.

రాకుమారుడు కళ్ళు తెరచి చూసి "వెళ్లి వచ్చావా? గురుదక్షిణ చెల్లించావా? ఆయన్ని సంతోషపెట్టావా?" అని అడిగాడు. ఆమె జరిగినదంతా చెప్పింది. అతను ఆమె మాటలు నమ్మనట్లు నటించి "ఆడవాళ్ల మాటల్లో నిజమనేదే ఉండదు. చేసిన పని చెబితే తప్పేముంది? నీకు దొంగలు ఊరికే నగలు ఇచ్చారంటే నమ్మాలా? మొదట నిన్ను కోరుకున్న గురువు అంతలోనే వద్దన్నాడా? నువ్వు భూతదయ కలిగినదానివి కదా! అడిగిన వారి కోరికలను తీరుస్తుంటాను" అని ఆపేక్షించాడు.

దానికి ప్రభావతి కన్నీరు పెట్టుకొని "స్వామీ! నేను చెప్పింది నిజమేనని అగ్నిపరీక్ష పెట్టి మరీ తేల్చుకోండి. లేనిపోని అనుమానాలతో బాధించకండి." అని దీనంగా ప్రార్ధించింది. రాకుమారుడు ఆమెను కౌగిలించుకొని "ప్రభావతీ! బాధపడకు. నీ వెనకే రహస్యంగా వచ్చి నీ శీలాన్ని పరీక్షించాను. నా కంతా తెలుసు. నిన్ను వివాహం చేసుకున్న నేను ఎంతో అదృష్టవంతుడిని, మా వంశం పావనమైంది" అన్నాడు.

అతను ప్రభావతితో కలిసి చాలాకాలం జీవించాడు. అని చెప్పి "రాకుమారులారా! కథనంతా విన్నారు కదా! ప్రభావతీ, ఆమె భర్గ, గురువైన కళానిధి, దొంగలు. వీరిలో ఎవరు ఉత్తములో గుణదోషాలు విమర్శించి

మరీ చెప్పండి. మీ బుద్ధిబలం ఎంత గొప్పదో చూస్తాను" అని సరోజిని అడిగింది.

వెంటనే సుముఖుడు లేచి "ప్రభావతే ఉత్తమురాలు ఎందుకంటే సత్యవ్రతంలో హరిశ్చంద్రుడిని మించిపోయింది" అని చెప్పాడు. ఆ తర్వాత రెండవరాకుమారుడు పద్మనాభుడు లేచి "ప్రభావతి లాంటి పతివ్రతలు చాలామందే ఉంటారు. కానీ ఆమె భర్త లాంటి శాంతస్వభావుడు మరొకరు ఉండరు" అని చెప్పాడు. దానికి మూడవవాడైన చారుకర్ణుడు లేచి "మన్మథుని జయించి ధర్మబుద్ధితో ప్రభావతిని పంపించేసిన గురువే ఉత్తముడు" అన్నాడు. "సోదరులారా! మీరు ఒక విషయం గమనించినట్లు లేరు. ప్రభావతీ ఆమె భర్త, గురువు విద్యావంతులు కాబట్టి వారు అంత నీతిగా ప్రవర్తించడంలో తప్పులేదు. కానీ ధర్మాధర్మ విచక్షణ లేకుండా దొంగతనం చేసేవారు అంత దయగా ప్రవర్తించడం గొప్ప విషయం. కాబట్టి ఈ నలుగురిలో దొంగలే ఉత్తములు" అని ఆఖరివాడైన పింగళాక్షుడు అన్నాడు.

నలుగురు రాకుమారులు ఈ విషయంపై చాలాసేపు వాదించుకున్నారు. వారి వాదనను వింటున్న సరోజిని "పింగళాక్షా! నువ్వే ఆ ముద్రికను దొంగిలించావు. కాబట్టి తెచ్చివ్వు" అంది. ఆ మాటకు పింగళాక్షుడు నివ్వెరబోయి అన్నలవైపు చూశాడు. "తమ్ముడూ! నువ్వు నిజంగా ఆ ముద్రికను తీస్తే దాచకుండా తెచ్చివ్వు. ఈ విషయంలో మంత్రిగారి కూతురు చాలా తెలివైందని మనం అంగీకరించవలసిందే" అన్నారు వారు. దానికి పింగళాక్షుడు "దేవీ! నేనే దొంగిలించానన్నావు. దానికి నిదర్శనం ఏమిటో చెప్పు!" అన్నాడు.

"రాకుమారా! సూక్ష్మ విషయాల వల్లనే బుద్ధిమంతులు దోషవిమర్శ చేస్తారు. దానికి కారణాలు హృదయానికి మాత్రమే తెలుస్తాయి. మా తండ్రిగారు మీ అన్నదమ్ములందరిలో సుముఖుడే బుద్ధిమంతుడు అని

చెప్పినట్లుగానే నేను కూడా ఊహించి చెప్పాను. దానిలో నిజానిజాలు మీకు తెలియాలి" అంది అయినా పింగళాక్షుడు పట్టువదలకుండా "నిజం చెప్పుమని" కుతూహలం ప్రదర్శించడంతో "నేను ఈ విషయాన్ని ఎలా చెప్పగలిగానో మీరే ఆలోచించండి. చెప్పిన వారే బుద్ధిమంతులు. అంది. పద్మనాభుడు, చారుకర్ణుడు, పింగళాక్షుడు ఆలోచించినప్పటికీ సమాధానం చెప్పలేకపోయారు.

అప్పుడు సుముఖుడు "నువ్వు చెప్పిన కథలోని దొంగలే మంచివారని పింగళాక్షుడు అనడంతో అతనే ఈ దొంగతనం చేసి ఉంటాడని ఊహించి ఉంటావు" అన్నాడు. దానికి సరోజిని "ఔను. నిజమే. ఏ పని చేసేవారికి ఆ పనిమీద ఆసక్తి ఉంటుంది. అందుకే మీ తమ్ముడు దొంగలని మంచి వాళ్లు అన్నాడు. మీరు ఆ విషయాన్ని చక్కగా గ్రహించారు. అందుకే మా నాన్నగారు సుముఖుడే బుద్ధిమంతుడని చెప్పారు. ఇప్పటికైనా మీరు నమ్ముతారా?" అని అడిగింది. మిగిలిన ముగ్గురు రాకుమారులు సిగ్గుతో తలవంచుకున్నారు.

అప్పుడు మహారాజు చంద్రకేతుడు మంత్రిని కౌగలించుకుని "మంత్రివర్యా! నీ బుద్ధిబలం నాకు తెలుసు. ఆ విషయం వాళ్లకి కూడా తెలియాలని అలా కట్టడి చేశాను. నువ్వూ, నీకూతురు వీళ్ళకి బాగా బుద్ధి చెప్పారు. ఒకవేళ నువ్వు అలా చేయకపోయినా నిన్ను నేను శిక్షించను" అని మంత్రిని ఓదార్చి, వెంటనే సుముఖుడికి పట్టాభిషేకం చేయడానికి నిర్ణయించుకున్నాడు. అంతటితో ఆనాటి సభ ముగిసింది. సరోజిని పల్లకీలో మంత్రిగారి ఇంటికి వెళ్లిపోయింది.

అప్పటివరకూ కథ చెప్పి ఆపాడు మణిసిద్ధుడు.



# కాశీ మజిలీ కథలు

## 87 వ మజిలీ

### సుముఖుని కథ

పూబాణి, చకోరాక్షి అనే పరిచారికలు రాజసభలో జరిగిన విశేషాలను గురించి చెప్పుకున్న తర్వాత వారిద్దరూ ఇలా మాట్లాడకోసాగారు. "చకోరాక్షీ! మొన్నటి సభలో మన మంత్రి సుమేధుని కూతురని చెప్పుకొని – రాకుమారులతో పింగళాక్షుడే ముద్రికను తీశాడని చెప్పిన అమ్మాయి నిజంగా మంత్రికూతరు కాదట. కానీ ఆమె బుద్ధికుశలతకీ, సౌందర్యానికీ మెచ్చి మన సుముఖుడు ఆమెను పెళ్లి చేసుకోవాలనుకున్నాడు." అని పూబోణీ చెప్పింది. అది విని చకోరాక్షి "మరి ఆ అమ్మాయి క్షత్రియ కన్యకా? బ్రాహ్మణ కన్యకా? చాలా అందంగా ఉంది కదా!" అంది దానికి పూబోణి ఆమె ఎవరో చెబుతాను విను. ఘటదత్తుడు అనేవాడు, సరోజినీ ఈ ఊరు వచ్చి బ్రాహ్మణులం అని చెప్పి, అన్నాచెల్లెళ్ళం అవుతామని నమ్మించి ఈ వీధిలో ఉంటూ మన మంత్రిగారికి వచ్చిన కష్టం గట్టెక్కించింది. సుముఖుడు ఆమెను చూసి మోహించి ఆమె వెంట తిరుగుతూ మంత్రిని ఆశ్రయించి"మంత్రివర్యా! మీకు సంతానం లేదని విన్నామే. మరి ఈమె నీ కూతురు ఎలా అయ్యింది" అని అడిగాడు.

మంత్రి నిజం చెప్పాడు. సుముఖుడు సరోజిని పట్ల విరహంతో ఆమెను పెళ్లి చేసుకుంటేనే గానీ జీవించలేనన్నాడు. మంత్రి ఆమె అన్నతో మాట్లాడి వారిద్దరికీ వివాహం చేయడానికి ఒప్పించాడు. అయితే ఆమె బ్రాహ్మణ కన్య కాదు. వెలయాలు చంద్రవతి కూతురు. ఘటదత్తుడు ఆమె అన్న కాదు. అతను ఏ కులం వాడో తెలియదు కానీ దొంగలకు నాయకుడట.

చంద్రవతి దగ్గర ఉన్న సంపదను దోచుకోవడానికి దొంగలతో కలిసి విటుడిగా ప్రవేశించి, ఆమె ధనమంతా దోచుకొని, సరోజినిని ఎత్తుకొని పారిపోయి వచ్చాడట.

చంద్రవతి ఆ దేశపు రాజుతో జరిగినదంతా మొరపెట్టుకోగా ఆయన గుర్తులు చెప్పి దూతలను పంపించాడు. వారు జాడ తెలుసుకొని వచ్చి రాజభటులు ఘటదత్తుడిని పట్టుకున్నారు. పత్రికల వలన మంత్రి వారి విషయం అంతా తెలుసుకొని అక్కడి రాజశాసనానికి భయపడి దూతలకి లంచం ఇచ్చి రహస్యంగా వారిద్దరినీ ఎక్కడికో పంపించేశాడు.

ఆమె వేశ్యాపుత్రిక కావడంతో వివాహం చేసుకోవడానికి కుదరదనీ, వారిద్దరూ ఎక్కడికో వెళ్లిపోయారని సుమేధుడు సుముఖునితో చెప్పాడు. అయినా సుముఖుడు మనసు మార్చుకోలేదు. రాకుమారుడు వారిని వెదుకుతూ వెళ్లాడు. రాణీగారు పెద్దకొడుకు కోసం పరితపిస్తోంది" అంటూ చెప్పింది.

"ఘటదత్తుడు సరోజినిని వలచి తెచ్చి చెల్లెలని ఎందుకు చెప్పాడు? సుముఖునితో పెళ్లికి ఎందుకు అంగీకరించాడు" అని చకోరాక్షి అడిగింది. దానికి పూబోణి "మంచి ప్రశ్నే వేశావు. చెల్లెలని చెబితేనే గానీ సుముఖుడు ఆమెను పెళ్లి చేసుకోడు. సుముఖుడు రాజై ఆమె మహారాణి అయితే అతనికి ఏదో ఒక సాయం చెయ్యకపోతుందా? ఇదంతా వారు ఒక పథకం ప్రకారమే చేశారు" అంది.

ఘటదత్తుడు, సరోజినీ, మంత్రి వల్ల రాజభటులను తప్పించుకొని ఆ ఊరు వదిలి నడుస్తూ "చెల్లెలా! నీకు మంచి భర్త లభిస్తే నా భారం తొలగుతుందనుకున్నాను. కానీ నువ్వు వేశ్యాపుత్రికవని తెలిసి రాకుమారుడు నిన్ను పెళ్లి చేసుకుంటాడా? పోన్లే మరో దారి చూసుకుందాం" అన్నాడు ఘటదత్తుడు.

దానికి సరోజిని "అన్నా! నా గురించి శ్రమపడకు. ఏదైనా ఉద్యోగం చూసుకొని మంచి పిల్లని చూసుకొని పెళ్లి చేసుకో. నేను నీ దగ్గర దాసిగా ఉండిపోతాను" అంది. నీ కంత కర్మ పట్టలేదు. నీ విద్యా, గుణాలకు తగిన

వరుణ్ణి చూసి పెళ్లి చేస్తాను. మహారాణివి కావాల్సిన లక్షణాలు నీలో ఉన్నాయి. బాధపడకు" అని ఓదార్చాడు. కొన్నాళ్ళు ప్రయాణించినవారు కమల అనే నగరం చేరుకున్నారు. ఎవరూ గుర్తుపట్టకుండా వారు ముఖాలకు ఏదో బూడిద పూసుకున్నారు. తర్వాత వాళ్లు సుమతి అనే వర్తకుని ఇంట్లో బస చేశారు. వికృతమైన ఘటదత్తుడి రూపం చూసి మొదట అతను సామాన్యుడు అనుకున్నా, అతనితో మాట్లాడాక అతని విద్యా విశేషాను మెచ్చుకుని వాళ్లింట్లో కొన్నాళ్ళు ఉండమని సుమతి బలవంతపెట్టాడు. ఘటదత్తుడు పగలంతా పురవీధులలో తిరుగుతూ, అక్కడి వింతలు చూసి, రాత్రివేళలల్లో పురాణగాథలు చెబుతూ ఉండేవాడు. సరోజినితో ఒకనాడు అతను పురవిశేషాలను చెప్పడం ప్రారంభించాడు.

## ఇంద్రదత్త కథ

చెల్లీ! ఈ నగరానికి రాజు విజయదేవుడు. రాణి శర్వాణి. అతను మహేంద్రయాగం చేసినా కూతురు మాత్రము పుట్టింది. ఆమె పేరు ఇంద్రదత్త. చాలా అందమైనది." అని చెప్పాడు ఘటదత్తుడు. సరోజిని నవ్వి "ఆమెనంతగా వర్ణిస్తున్నావు. పెళ్లి చేసుకోవాలని ఉందా?" అని అడిగింది. "మానవుల యౌవ్వనం స్థిరం కానిది కనుక మనుషులను పెళ్లి చేసుకోదట. వసంతుడు, జయంతుడు, నలకుబేరుడు వంటి వారినే పెళ్లాడుతుందట. భూలోక చక్రవర్తులని చేసుకోమని తండ్రి ఎంత చెప్పినా వినిపించుకోని ఆమెని నేనెలా చేపట్టగలను" అన్నాడు.

దానికి సరోజిపి "అన్నా! నీ చెల్లెలి బుద్ధిబలం నీకు తెలుసుండి కూడా అలా మాట్లాడతావేం? నీకలాంటి కోరిక ఉంటే తప్పకుండా తీరుస్తాను" అని చెప్పి, సరోజిని మర్నాడు చిత్రలేఖన సామాగ్రిని తీసుకొని వికృత వేషంతోనే ఇంద్రదత్త అంతఃపురానికి వెళ్లి ఆమె దర్శనం కోరింది. ఇంద్రదత్త వెంటనే అనుమతి ఇచ్చింది. ఇంద్రదత్త సరోజిని వికృత రూపం చూసి పరిహసించి వెంటనే పంపించెయ్యమనగా సరోజిని 'అమ్మా! నా రూపం చూసి అలా మాట్లాడకు. చిత్రలేఖనంలో నా నైపుణ్యం చూడు" అంటూ

రాకుమార్తె దగ్గర ఉన్న కంతు, వసంతు, జయంతుల చిత్రాలను యథాతథంగా చిత్రించింది. సరోజిని వేసిన చిత్రాలను చూసి రాకుమారి ఆశ్చర్యపోయింది. సరోజిని రాకుమారిని చూసి "అమ్మా! ఈ చిత్రపటాలు ఎవరివి "అని అడగ్గా దానికి ఇంద్రదత్త "వీరెవరో తెలియకుండానే చిత్రలేఖనంలో నీ అంతటి వారు లేరని విర్రవీగావా?" అని ఆపేక్షించింది. "వారంతా దేవపురుషులని వారిని పొగిడింది. అప్పుడు సరోజిని "రాకుమారీ! దేవతలు రెప్పలు వేయరు. బొల్లి వ్యాధి వచ్చినట్లు శరీరమంతా తెలుపు, మన పెద్దలు దేవతలపై గౌరవంతో వారిని సుందరులు అని పొగిడారే గానీ వారికన్నా అందమైన వారు మన భూలోక చక్రవర్తులు. వారినే చూసే కదా మహాశ్వేత పుండరీకుడినీ, కాదంబరి చంద్రాపీడుని కోసం ఎన్నో బాధలు అనుభవించింది" అంటూ కొన్ని ఉదాహరణలు చెప్పింది.

సరోజిని మాటలతో ఇంద్రదత్తు దేవతల మీదుండే ఆరాధనను తొలగించుకొని, ఆమెతో ఏ విషయంలోనూ వాదించలేకపోయింది. " నీ ఆకారాన్ని చూసి సామాన్యురాలివనుకున్నాను. కానీ అఖండురాలివే" అంటూ పొగిడింది. సరోజిని వృత్తాంతం అడిగింది. సరోజిని దానికి ఏదో సమాధానం చెప్పి "ఇంద్రదత్తా! నీ దేవపురుషులు ఇతని ముందు నిలబడగలరేమో చూడు" అంటూ ఒక చిత్రపటం వేసి చూపింది.

ఆ పటం చూసి రాకుమారి ఆశ్చర్యపోయి "ఇది నిజంగా ప్రతిరూపమేనా? లేక ఊహించి వేశావా?" అంటూ ప్రశ్నించింది. ఆ మాటలకు సరోజిని "మనుషులలో కూడా ఎంత అందమైన వారు ఉన్నారో చూశావా? ఇతని చరిత్ర అద్భుతమైనది" అని చెప్పి వెళ్లడానికి అనుమతి కోరింది. రాకుమారి ఆ చిత్రపటాన్ని తన దగ్గరే ఉంచమని చెప్పి ఆమె వెళ్లడానికి అంగీకరించింది.

"రాకుమారీ! నేను సుమతి అనే వర్తకుడి ఇంట్లో ఉంటున్నాను. రేపు వచ్చి కలుస్తాను" అని చెప్పి ఇంటికి వచ్చేసింది. ఘటదత్తుడు ఆత్రంగా ఆమెకు ఎదురెళ్లి "చెల్లీ! ఏం జరిగింది? అక్కడి విశేషాలేమిటీ?" అంటూ ప్రశ్నించాడు. దానికి సరోజిని "అన్నా! తొందరపడకు. అని అక్కడ జరిగినదంతా వివరించింది. ఘటదత్తుడు ఆనందంతో పొంగిపోయాడు.

మర్నాడు సరోజిని అంతఃపురం వెళ్లేసరికి ఇంద్రదత్త ఆ చిత్రపటాన్నే చూస్తూ కూర్చుంది. సరోజినిని చూసి ఆమెని సాదరంగా ఆహ్వానించి "ఇది నిజంగా నువ్వు ఊహించిందా? లేకపోతే ఎక్కడైనా చూశావా? ఇంతటి అందమైన వాడు భూమ్మీద ఉన్నాడంటే నేను నమ్మలేకపోతున్నాను" అని అడిగింది. "ఇంద్రదత్తా! దీనిలో కల్పితం ఏమీ లేదు. ఇతను ఈ ఊళ్లోనే ఉన్నాడు. కావాలంటే చూడు" అంది సరోజిని. "ఇతను ఇక్కడికి ఎందుకు వచ్చాడు? ఏ దేశంవాడు? అతన్నెలలా చూడగలను?" అంది.

"అమ్మా! అతని వివరాలు నాకు తెలియవు. ఒక ఇంట్లో ఉంటే చూసి, అతని అందానికి మెచ్చుకొని ఈ చిత్రం గీశాను. నీకు నచ్చితే దౌత్యం చేస్తాను" అంది. రాకుమారి కొంచెంసేపు ఆలోచించి "సరోజినీ! ఎల్లుండి శుక్రవారం సాయంకాలం దుర్గాదేవి గుడికి వస్తాను. అప్పటికి అతన్ని అక్కడికి తీసుకొనిరాగలవా? అని అడిగింది. దానికి సరోజిని "నాకూ కొత్తవాడే కదా! అయినా ప్రయత్నించి చూస్తాను" అంది. వెంటనే ఇంటికి వచ్చిన ఘటదత్తుడితో జరిగినది చెప్పింది. ఘటదత్తుడు కష్టంగా ఆ రెండు రోజులు గడిపి శుక్రవారం నాడు అందంగా తయారై దుర్గాదేవి ఆలయానికి వెళ్లి రాకుమారి కోసం ఎదురుచూడసాగాడు. సరోజిని అంతకు ముందే ఇంద్రదత్త దగ్గరకు వెళ్లింది.

ఆమెను చూడగానే రాకుమారి అతని గురించి విశేషాలు అడిగింది. "రాకుమారీ! అతని కోసం చాలా శ్రమపడి పట్టుకున్నాను. అతన్ని కష్టపడి ఒప్పించాను. నువ్వు అదృష్టవంతురాలివే! ఆలస్యం చేయకుండా తొందరగా బయలుదేరు" అంది. ఇంద్రదత్త చక్కగా అలంకరించుకుని గుడికి వెళ్లింది. రాజభటులు విచ్చ ఆ గుడిలో పురుషులెవ్వరూ ఉండకూడదని అందరినీ తరిమివేయడంతో ఘటదత్తుడు అంతకుముందే ఆ ఆవరణలో ఉన్న భైరవాలయంలోకి వెళ్లి తలుపేసుకొని విగ్రహం దగ్గర కూర్చున్నాడు. ఇంద్రదత్త గుడిలో ప్రదక్షిణ చేస్తూండగా ఆమెను చూసి పరితపించాడు.

ఇంద్రదత్త అమ్మవారి పూజ ముగించుకున్నాడు. సరోజిని ఆవరణలోని విశేషాలను చూద్దామనే నెపంతో పక్కకు తీసుకువెళ్లి భైరవాలయంలోని

ఘటదత్తుడిని చూపించింది. సుందరుడైన అతడ్ని చూసి ఇంద్రదత్త ఏదో ఆలోచిస్తూ దేవుడి కోసం తెచ్చిన పూలమాలను ఘటదత్తుడి మెడలో వేసి నమస్కరించి ఇవతలకి వచ్చేసింది. పరిచారికలు తొందరచేయగా రథమెక్కుతూ “సరోజినీ! రేపు తొందరగా రా! నీతో కొంచెం మట్లాడాలి” అని చెప్పి వెళ్లిపోయింది.

సరోజిని ఘటదత్తుడి దగ్గరకు వచ్చి “రాకుమారి వెళ్లిపోయింది. చీకటి పడింది'2 అని చెప్పి అతన్ని బయటకు తీసుకొచ్చింది. “రాకుమారి ఏమంది? అంగీకరించిందా?” అని అడగ్గా “దానికి సమాధానం నీ మెడలోని పూమాలను అడుగు” అని నవ్వింది. మర్నాడు సరోజిని అంతఃపురానికి వెళ్లేసరికి రాకుమార్తె ఘటదత్తుని చిత్రపటాన్నే తదేకంగా చూస్తూ కూర్చుంది. అంతలో సరోజిని రావడం గమనించి “దొంగలా ఎప్పుడొచ్చావు” అని అడిగింది. “మీ ఆనందానికి అడ్డురాకూడదనే నేను మిమ్మల్ని పలకరించలేదు” అని జవాబిచ్చింది.

“చెలీ! సరోజినీ! ఇతను నాకు తగినవాడేనంటావా? ఇతను అన్నింటిలోనూ అసాధారణమైనవాడు. మా తండ్రి తర్వాత అతనే రాజు అవుతాడు. నీ ఉద్దేశం ఏమిటి?” అని అడిగింది. దానికి ఆమె “రాకుమారీ! నన్ను అడిగే పూలమాల అతని మెడలో వేశావా? నేనొద్దంటే మాత్రం ఆగుతావా? ఇప్పటికైనా నా చిత్రం నిజమేనని ఒప్పుకుంటావా?” అంది.

“నువ్వు చెప్పింది నిజమే. నా పెళ్లి విషయం నేనే మా తల్లి దండ్రులతో మాట్లాడడం పద్ధతి కాదు. ఈసారి వారు ఆ ప్రస్తావన తేగానే ఇతని విషయం చెప్పి ఒప్పిస్తా. అంతవరకూ అతను ఇక్కడే ఉండేటట్లు చూడు” అని ప్రార్థించింది. దేవీ! నిన్ను వదిలి అతను ఎక్కడికిపోగలడు?” అని ఆమెను అనునయించి, ఇంటికి వచ్చేసరికి ఘటదత్తుడు విచారంగా కనిపించాడు.

“అన్నా! అంత విచారంగా ఉన్నావేం? నీకు పెళ్లి నిశ్చయించాను. పదిరోజుల్లో నువ్వు ఈ దేశానికి రాజువి కాగలవు. నీకంటే ఆమెకే ఎక్కువ తొందరగా ఉంది” అని సరోజిని చెప్పింది.

దానికి అతను నిట్టూర్చి "చెల్లీ! మనకింకా మంచి రోజులు రాలేదేమో! మనల్ని వెతుక్కుంటూ రాజభటులు ఇక్కడికి వచ్చారు. మనల్ని పట్టి ఇచ్చిన వారికి పారితోషికం కూడా ప్రకటించారు. మన గతం తెలిస్తే రాకుమారి నీచులుగా భావిస్తుంది. ఆ అపకీర్తి రాకుండానే మనం ఈ ఊరు వదిలి వెళ్లడం మంచిది" అన్నాడు. సరోజిని "అన్నా! ఈ రాజభటులు మనతోపాటే వచ్చి జరగవలసిన శుభకార్యాలను చెడగొడుతున్నారు. లేకపోతే నువ్వే రాజువయ్యేవాడివి. మనం చెప్పకుండా వెళ్లిపోతే ఇంద్రదత్త బాధపడుతుంది. చెబితే ఒప్పుకోదు. కాబట్టి మనం ఊరువదలి వెళ్లిపోవడమే మంచిది" అనుకొని తెల్లవారు ఝామునే ఇద్దరూ ఊరు వదిలి అడవి మార్గంలో పయనించసాగారు.

"చెల్లీ! మనం చాలా దురదృష్టవంతులం. వివాహాలు నిశ్చయమై కూడా చెడిపోయాయి. ఎంతకాలం ఇలా వారిని తప్పించుకొని తిరుగుతాం? ఎంతో బుద్ధిబలం ఉన్న నువ్వు కూడా అడవుల వెంట తిరుగుతున్నావు. వందమందినైనా జయించగల నేను కూడా పిరికివాడిలా పారిపోతున్నాను. ఇదేం కర్మ" అంటూ ఘటదత్తుడు వాపోయాడు.

"అన్నా! మనకీ మంచి సమయం వస్తుంది. అంత దాకా మనం వేచి ఉండడం మంచిది" అని ఊరడించింది. వారు ఒక రోజు మధ్యాహ్నం మర్రిచెట్టు నీడలో పడుకొని తమ గత చరిత్రను తలుచుకుంటూ ఉండగా ఆ చెట్టు మీద దాగి ఉన్న వందమంది రాజభటులూ వారిని ముట్టడించారు.

సరోజిని అపాయం కలుగకుండా ఎలాగో ఆమెను అవతలికి దాటించి నిరాయుధుడిగానే ఘటదత్తుడు ముప్ఫయి మంది దాకా చంపాడు. మిగిలిన వాళ్లు అతడి కాళ్లు, చేతులకు సంకెళ్లు వేసి బంధించి కాళిందీపురం వైపు నడిపించారు. సరోఇజని జాడ మాత్రం తెలుసుకోలేకపోయారు.

అంతవరకూ కథ చెప్పి ఆపి, మిగిలిన కథను తర్వాత మజిలీలో మణిసిద్ధుడు చెప్పడం ప్రారంభించాడు.........

# కాశీ మజిలీ కథలు

## ౮౮ వ మజిలీ

సరోజిని అనే చిత్రలేఖకురాలు సబంధం కలిపినందున తఆను ఘటదత్తుడనే పుణ్యశాలిని వరించినట్లుగా ఇంద్రదత్త తన సఖురాలితో చెప్పుకుంది. అయితే సరోజినిని వెతకడానికి వెళ్లిన ఆ సఖురాలు మురళికి ఎంత వెతికినా సరోజిని కనిపించలేదు.

అయితే, ఘటదత్తుడిని పట్టి ఇచ్చిన వారికి కాళిందీపుర ప్రభువు మూడు గ్రామాలు కానుకగా ఇస్తానని ఎందుకు ప్రకటించాడో వారిద్దరికీ అర్థం కాలేదు. అతడు ఇంకో ఘటదత్తుడు కావచ్చు! సరోజిని అతడి దగ్గరకే వెళ్లిందేమో! అని సంశయించారు.

ఆమె వరించిన ఘటదత్తుడు దొంగలముఠా నాయకుడని, ఆ ఇంద్రదత్త తండ్రి కూతుర్ని తూలనాడాడు. సరోజిని మూలాన తాను వలలో పడ్డాననుకుంది ఇంద్రదత్త. కాని ఇంకొకర్ని పెళ్లాడనని నిర్ణయం మార్చుకోనని స్థిరంగా అన్నది.

సరోజినీ - ఘటదత్తుల్ని వెతికి తెచ్చే భారం తన సఖురాలైన మురళిమీదనే ఉంచింది ఇంద్రదత్త.

ఆమె ఒక గ్రామం చేరి, కథలు చెప్తూ ఓ ఇంటి వద్ద కూర్చొన్న ఒకామెను కలిసింది. ఆ ఇద్దరి సంభాషణంలో ఘటదత్తుడు ఉత్తమకులసంజాతుడనీ - అతడి కథ మొత్తం తెలిపిందామె మురళితో. తీరా ఆరా తీస్తే, మారువేషంలో కథ చెప్తూన్న ఆమే - సరోజిని. ఇంద్రదత్త పడుతున్న బాధంతా సరోజినికి మురళి వివరించి, నా పరోక్షంలో జరిగినందువల్ల, నీ పేరు వినడమే తప్ప నిన్ను చూడలేకపోయాను" అన్నది. నిజమే! నువ్వు ఇంద్రదత్త చెలికత్తెవని

నీవు చెప్పాకనే నాకు తెలిసింది ! సఖురాలివయ్యావు. నిజం చెప్తున్నాను. మేమే మీ వూరి నుంచి వచ్చేస్తూంటే, అడవిలో రాజభటులు మమ్మల్ని అడ్డగించారు. ఘటదత్తుడు వారి బారి నుంచి నన్ను తప్పించి తానొక్కడే ముప్ఫైమందిని సంహరించాడు. కాని మిగిలిన వాళ్లు అతనికి సంకెళ్లు వేశారు. నేను మారువేషంలో అనుసరించాను. అతడు విడిపించబడటం నాకు తెలిసినా నేను అతడ్ని కలుసుకోలేకపోయాను. నేనక్కడ ఉన్నట్లు అతనికి తెలీదు. మిత్రుడితో కలిసి ఘటదత్తుడెట వెళ్లిందీ నాకు అర్థం కాలేదు. నేను అతడ్ని వెతుక్కుంటూ మొన్ననే ఈ పల్లె చేరాను. ఇది నాలుగు రాజ్యాల కూడలి మార్గంలో ఉంది. అందువల్ల అతడు ఏ దారినైనా ఇక్కడకొస్తాడేమోనని ఆశ. దైవవశాన నిన్ను కలుసుకున్నాను. ఈ రహస్యాన్ని ఇంతవరకు నేను ఎవరికీ చెప్పలేదు. అయితే ఒక్కటి మాత్రం చెప్పగలను. ఘటదత్తుడు భూలోకం అంతా ఏలదగిన బలశాలి. ధర్మరాజును మించిన గుణవంతుడు. అతనికి మంచిరోజులు ఎప్పుడొస్తాయో!" అంది సరోజిని.

"ఘటదత్తుడికి ఇంద్రదత్త మీద అనురాగం ఉంది కనుక, మనం ఇంద్రదత్త దగ్గరే ఉంటే, ఆయన్ని అక్కడే కలుసుకోవచ్చు" అని చెప్పి ఒప్పించి, సరోజినిని తీసుకెళ్లి తమ నగరానికి చేరింది మురళి.

మణిసిద్ధుడు తదుపరి మజిలీలో తరువాత కథ ఇలా చెప్పాడు.



# కాశీ మజిలీ కథలు

## ౮౨ వ మజిలీ

### మంజరి కథ

పాటలిక, మంజరిక అనే అంతఃపుర చెలికత్తెలు, అత్తాకోడళ్లు కూడా. ఓ రోజున వారు కలిసి ఇలా మాట్లాడుకుంటూంటే, చాలా విషయాలొకరివొకరికి తెలిశాయి. వాటిని బట్టి –

మహారాజు కౌముది మీద అలిగి అంతఃపురానికి వెళ్లలేదట. కౌముదికి ఆడపిల్ల పుడితే, ఏర్పాటు చేసిన ప్రకారం మృతశిశువుని ఆమెకు చూపి, పుట్టిన పిల్లని అక్కడ్నుంచి తప్పించారు. కౌముది తల్లి అక్కడకొచ్చి కళావతికి కలిగే సంతతిని ఎలాగైనా కడతేర్చమని బోధించింది. పుట్టిన ఆ ఆడశిశువును అంతఃపురం నుంచి దూరం చేయాలని తీసుకువెళ్తూంటే, దార్లో ఆబోతు ఆ దాసి వెంట పడడంతో చేతిలో బిడ్డ జారిపోయింది. ఆబోతు రంకెలు తగ్గాక అక్కడికొచ్చి చూస్తే పిల్ల అక్కడ లేకపోయేసరికి తొక్కి చంపేసి ఉంటుందని అనుకుంది.

కళావతి కన్న మగ శిశువుని దాసి ఓ కుండలో పెట్టుకుని వెళ్తూంటే అర్ధరాత్రి పూట పిశాచం వెంటపడేసరికి ఆమె ఆ కుండని అక్కడే ఎత్తేసి పారిపోయింది. మొత్తం మీద కొద్దిపాటి తేడాతో కౌముది – కళావతులకు జన్మించిన శిశువుల దాసీజనం చేత అంతఃపురానికి దూరంగా

తీసుకుపోబడ్డారు. ఇది ఆనాటికి చాలా క్రితం జరిగిన విషయం.

"ఘటదత్తుడ్ని చూసే కౌముది నవ్వింది అనే అనుమానం ఉంది వసుంధరుడికి. దాంతో అతడు ఘటదత్తుడ్ని ఊరు నుంచి వెళ్లగొట్టి కౌముది ముఖం చూడడం మానేశాడు. కళావతికి పాపం ఇదేం తెలీదు. పాటలిక మంజరికలిద్దరూ ఒకరికి తెలిసిన సంగతులు ఒకరు చెప్పుకుని ఎవరి దారిన వాళ్లు వెళ్లిపోయారు.

మంజరిక కళావతి వద్ద ఉండగా 'శారద' అనే ముత్తయిదువ వచ్చిందక్కడికి. ఆమె భర్త స్వల్పపండితుడు. ఆమెకో కొడుకున్నాడు. అతడ్ని కళావతి భర్తే పెంచి పెద్ద చేశాడు. వాడే ఘటదత్తుడు. అయితే నతడు కొన్ని రోజులుగా ఇంటికి రావడం లేదు. "మీ భర్తగారు ఎక్కడికైనా పంపారా" అని అడగడానికొచ్చిందామె.

నిజానికి అతడామె పెంపుడు కొడుకు. ఆమె యోగిని వల్ల మంత్రోపదేశం పొంది అర్ధరాత్రి శ్మశానానికి వెళ్లడం, కుండలో శిశువు దొరకడం, వాడికి ఘటదత్తుడని పేరు పెట్టి పెంచడం అంతా చెప్పిందామె. ఘటదత్తుడు తన భర్తకు ప్రాణం వంటి వాడనీ - కనుక్కొని మర్నాడు చెబుతాననీ ఆమెను పంపించింది కళావతి.

కౌముది మీద అలుక - ఘటదత్తుని మీద కోపం సంగతి మంజరిక ద్వారా కళావతికి తెలిసింది. అయితే - కౌముది ఉత్తమురాలని కళావతికి పూర్తిగా నమ్మకం ఉంది. అందువల్లనే ఆమె అంతఃపురం పరిచారికలెవరో ఈ కుట్రపన్నారని తనకు అనుమానంగా ఉందన్నది.

ఘటదత్తునిపై అనవసరంగా అనుమానిస్తున్నారనీ చెప్పింది. ఉత్తమ కులంలో పుట్టిన అతడు ద్రోహకృత్యాలు చెయ్యడనీ, అతని జన్మ వృత్తాంతపు నిదర్శనాలు చెప్పి భర్త పశ్చాత్తాపపడేలా చేసింది. అతని పెంపుడు తల్లి వచ్చి, "ఘటదత్తుని ఎక్కడికైనా పంపారా?" అని అడిగివెళ్లింది. ఆమెకేం జవాబు చెపుతారు? అని అడిగింది. దేశాంతర శిక్ష వేశానన్నాడు. మంజరిక - పాటలికలకు ఘటదత్తుని అసలు తల్లి కళావతి అని తెలిసి భయపడసాగారు. వాళ్లిద్దరూ రాత్రికి రాత్రే పారిపోయి, కమలాపురం చేరి, ఇంద్రదత్త దగ్గర చెలికత్తెలుగా కుదిరారు"

అని చెప్పి పై కథను తరువాత మజిలీలో చెప్పసాగాడు మణిసిద్ధుడు.



# కాశీ మజిలీ కథలు

## ౨౦ వ మజిలీ

## కవికంఠ కేక్షేయకుని కథ

"రాజపుత్రా! నువ్వు మాంచి సమయానికే వచ్చి, నాకు ఉపకారాన్ని చేశావు. నీ మేలెన్నటికీ మరువను. ఆనడు నన్ను వీళ్లు పట్టుకుంటారా? నా చెల్లెలు సరోజినికి అపాయం వచ్చునని దానిని దాటిస్తూ, కాచుకోలేకపోయాను, గాని ఈ కత్తి నా చేతిలో ఉంటేనా? ఎంత మంది వీరులకైనా సమాధానం చెప్పుకొందును? ఇక ఏ మరక ఈ కత్తి నిత్యం నాతో ఉంచుకుంటాను. నువ్వు సరోజినిని పెళ్లాడతాననీ మాట ఇచ్చి మానేశావు. ఎవరో వచ్చి భోగం పిల్ల అంటే నమ్మేస్తావా? ఉత్తమ వంశ సంజాత. దాని కథ నా కథ విను!" అని ఘటదత్తుడు సుముఖుడికా వృత్తాంతాలు చెప్పాడు.

అది విన్న సుముఖుడు "బావా! సుమేధుని సలహా అది. నాకేం తెలుసు? నిజం కాబోలనుకున్నాను. అదీగాక కాళిందిపురంలో చంద్రవతి నన్ను తప్పుదారి పట్టించి సరోజినిని భోగం స్త్రీగా చిత్రించేసరికి నమ్మాను. ఆ తర్వాత ఎన్నో ఊళ్లు తిరిగి నిన్నిక్కడ చూడగలిగాను. సరోజినిని పెళ్లిచేసుకోవడం తథ్యం అని సుముఖుడు మాట ఇచ్చాడు.

ఆనాడుసరోజినిని అడవిలో వదిలేశాక, ఆమె ఏ గ్రామం చేరింతో వెతుకుదాం - పదమన్నాడు. కాళిందీపుర రాజును పరాభవించి కసి తీర్చుకోవాలి! నాకు నీ సాయం అవసరం అన్నాడు ఘటదత్తుడు.

"ఆ కాళిందీపుర రాజును కీర్తిసేనుడు. వాడికి సేన చాలా ఉంది. వద్దు. సమస్య శాంతంగా పరిష్కరించుకుందాం! దొంగలచేత పీడించబడే ప్రజల్ని రాజే కాపాడాలి కదా!" అంటూ సుముఖుడు సలహా ఇచ్చాడు.

సరోజినిని వెతుకుతుంటూ దారిలో - ఒక గ్రామంలో ఘటదత్తుని కోసం తిరుగుతున్న కీర్తిసేనుడి సేనలు కనిపించగా,తన కత్తితో వారిలో చాలా మందిని చంపేసి కసి తీర్చుకున్నాడు. తర్వాత మరికొన్ని గ్రామలల్లో వెతుకుతూంటే, ఒక చోట దేవాలయ గోపురానికి కట్టబడిన మూఐదు ప్రకటనలు అతని కంట పడ్డాయి. వాటి సారాంశం అర్థమై "దైవం నాకిప్పుడు కొంత అనుకూలంగా ఉన్నట్లుంది. కుముద్వతీ నగర పాలకుడు వసుంధరుడూ నా పట్ల సుముఖత్వం చూపడం సంతోషదాయకం!" అనుకున్నాడు.

కీర్తిసేనుడి ఆస్థానపండితులతో తలపడటానికి ఘటదత్తుడు - సుముఖుడు పండిత వేషాల్లో బయలుదేరారు. వారితో ఘటదత్తుడు కవికంఠ క్షొక్షేయకుడని పేరుతో చెలరేగి వాదించి, కీర్తిసేనుడి ఆస్థానపండితుల్ని పాదాక్రాంతం చేసుకున్నాడు.

వేషం తీసేసి, అప్పుడు తానెవరో ఆ రాజుకు వెల్లడించేశాడు ఘటదత్తుడు.

కీర్తిసేనుడి ఆశ్చర్యానికి అంతులేదు.........

"ఏమిటీ! నువ్వు ఘటదత్తుడివా? ఇంత పాండిత్యం, పరాక్రమము ఉండి, వారకాంత ధనాన్ని దోచుకున్నావేం? అన్నీ తెలిసిన నీవే పాపకార్యాలు తలపెడితే ఎలా?" అన్నాడు.

అందుకు సుముఖుడు కల్పించుకుని "ఇదీ ఇతని వృత్తాంతం" అని పరిపూర్ణంగా అతని కథ చెప్పేసరికి, అతడింకా ఆశ్చర్యపోయి "మహాత్మా! వసుంధరుడి పాండిత్య ప్రకర్ష మాకు తెలుసు. లోక ప్రసిద్ధి పొందినవాడతడు. నువ్వు ఆయన శిష్యుడవు. నువ్వు కవికంఠకాక్షేయకుడివే! నా దగ్గర ఆస్థానపండితుడిగా ఉండు. నీకు అగ్రహారాలిస్తాను" అంటూ పశ్చాత్తాపపడ్డాడు......"

ఆ తదుపరి చరిత్ర మమతలి మజిలీలో ఇట్లా చెప్పసాగాడు మణిసిద్ధుడు.



# కాశీ మజిలీ కథలు

## 91 వ మజిలీ

మంజరికా! ఈ సరోజిని కౌముది పోలికగా లేదూ? ఈ చిన్నది ఇంద్రదత్తకు ఏమౌతుందో? ఒకవేళ ఆ బాలికే బతికి ఇక్కడికి రాలేదు కదా!" అంటూ పాటలిక ఆశ్చర్యపోయింది. మంజరిక కూడా నాకూ అదే సందేహంగా ఉంది' అన్నది.

సరోజిని ఇంద్రదత్తకు ఘటదత్తుని వృత్తాంతమంతా చెప్పడం వాళ్లిద్దరూ విన్నారు. ఘటదత్తుడ్ని ఆ రాజపుత్రిక వలచిందనీ తెలుసుకున్నారు. కాని అతని జన్మరహస్యం తెలిపితే ఆమెకు ఆనందం కలిగించిన వాళ్లవుతారు. చెప్పడం వల్ల అనర్థం - వారే స్వహస్తాలతో ఆనాడక్కడ అంతఃపురలో చేసిన ద్రోహం బయటపడడం!

దాంతో ఇద్దరూ తమ గొంతులు తామె నొక్కుకుని ఊరుకున్నారు. కాని, ఎక్కువకాలం పాటలిక ఆ రహస్యం దాచలేకపోయింది. ఇంద్రదత్తతో "ఘటదత్తుడు కృష్ణదేవరాయల దౌహిత్రుడైన వసుంధరుని కొడుకు, అతడు

పుట్టినపుడు దాని కుట్రచేసి, శ్మశానంలో పారేయబోగా 'శారద' అనే బ్రాహ్మణ పత్నికి దక్కాడు. ఆమె ప్రేమగా పెంచింది. ఇక ఈ సరోజిని కౌముది కూతురు. దీనికీ పుట్టినపుడు గండం గడిచింది" అని వెల్లడించేసింది.

ఆ మాట ఇంద్రదత్త తన తండ్రికి తెలియజేయడంతో అతడూ ఆనందించాడు. రామలింగకవి పౌత్రుడు, వసుంధరుని పుత్రుడని తెలిసినట్లే, సరోజిని అతనికి చెల్లెలని తెలిసింది.

సరోజిని, ఆ తండ్రీ – కూతుళ్ల సంభాషణ చాటు నుంచి విని, పాటలికకు ఆ సంగతి ఎలా తెలుసు? అని ఆమెను తర్కించి అడిగి ఆనాడు ఆ పని చేసింది. ఆ దాసీయేనని గ్రహించుకుంది.

ఆ తర్వాత సరోజిని, తాను విన్న విశేషాలన్నీ ఘటదత్తునికి వివరించి "అన్నా! నువ్వు కళావతి కుమారుడివి! నేను కౌముది పుత్రికని! ఈ కపటపు పన్లు చేసినది ఈ పాటలిక – మంజరిక" అని చెప్పింది.

అయితే, వారికోసం వెతగ్గా వారు పారిపోయారని తెల్సింది.

తదిరితీలిత – ఆ అన్నాచెల్లెళ్లిద్దర్నీ కమలాపురం రాజు ఆహ్వానించాడు.

అందర్నీ కలుపుకొని, అందరి దగ్గరా వారి వృత్తాంతాలు వినిపించడంతో అపార్థాలు తొలగాయి. అంతా రాజధానికి పయనమయ్యారు.

వసుంధరుడు ఎదురెళ్లి ఘటదత్తుడిని కౌగలించుకుని "చేతికి అందిన రత్నాలు రాయి అనుకుని విసిరేశాను. నీ పరాక్రమం సౌశీల్యం లోకాలన్నీ కీర్తిస్తున్నాయి" అన్నాడు. తరువాత ఆ ఇద్దరు తల్లులూ కౌముదీ – కళావతులు అన్నా చెల్లెళ్లనిద్దర్నీ ముద్దాడారు.

విజయదేవభూపాలుడు ఇంద్రదత్తును ఘటదత్తునికిచ్చి వైభవంగా పెళ్లి చేశాడు. ఆ పెళ్లి వారందరితోనూ వసుంధరుడు తన నగరానికెళ్లి సుముఖునితో సరోజినిని పెళ్లి జరిపించాడు.

చంద్రవతికి, దొంగిలించబడిన ధనమంతా ఇప్పించి ఘటదత్తుడు సంతోషపెట్టాడు. పెంచిన తల్లి పట్ల కృతజ్ఞత ప్రకటించాడు.

ఘటదత్తుడు తదుపరి చాలాకాలం రాజ్యాన్ని జనరంజకంగా పాలించాడు. గోపా! నువ్వడిగిన ప్రశ్నకు ఈ కథ సమాధానమైనదా?" అని మణిసిద్ధుడు అడిగి, వానితో సహా ఆ మజిలీలో సుఖంగా నివశించి, తర్వాత తదుపరి మజిలీ చేరుకున్నాడు.



# కాశీ మజిలీ కథలు

## 212 వ మజిలీ

యతీంద్రా! ఈ నగర అంగడిలో వెళుతుంటే ఒకచోట కొంతమంది విప్రులు భోజుడనే రాజు గురించి చెప్పుకుంటున్నారు. కాస్సేపు వింటేనే అవి చాలా చిత్రంగా అనిపించాయి. మీరింత వరకూ ఆ భోజుడి వృత్తాంతం చెప్పలేదు కాబట్టి ఇప్పుడైనా చెప్పండి" అంటూ గోపాలుడు ప్రార్ధించడంతో అతడి ఉత్సాహానికి ముచ్చటపడ్డ మణిసిద్ధుడు. మణిప్రభావంతో ఆ కధను ఇలా చెప్పడం మొదలుపెట్టాడు.

### మంజుని కథ

ధారా రాజ్యం భూమండలానికే తలమానికమైన రాజ్యం, అటువంటి రాజ్యాన్ని బుద్ధిసాగరుడనే తెలివైన మంత్రి సహాయంతో సింధుడనే రాజు ఏ కష్టమూ లేకుండా పరిపాలించసాగాడు. సింధుడికి చాలాకాలంగా సంతానం లేకపోవడంతో బుద్ధిసాగరుడు అతడి చేత పండితుల సలహాపై బృహస్పతిసవనమనే యజ్ఞం చేయించాడు.

యజ్ఞ ఫలితంగా రాజుకి, రూపంలో మన్మధుని కన్నా అందమైన పుత్రుడు జన్మించాడు. అతడి పేరే భోజుడు.

భోజుడికి ఏడేళ్లు వచ్చేసరికి రాజుకి శారీరక పటుత్వం లోపించింది. తన తమ్ముడు మంజుడు రాజ్యపాలన చేయడానికి సమర్ధవంతుడిగా ఉన్నా భోజుడికే పట్టం కడితే ప్రజలు తిరస్కరించవచ్చు. అంతేగాక పినతండ్రి

నుంచి భోజుడికి ప్రాణహాని కూడా కలిగే అవకాశముందని భావించిన సింధుడు, బుద్ధిసాగరుడిని సలహా అడిగాడు.

అప్పుడు బుద్ధిసాగరుడు - మంజుడు మంచివాడు, మీ మీద ప్రేమాభిమానాలు ఉన్నవాడే కాబట్టి భోజుడికి ఎప్పటికీ హాని తలపెట్టడం. అతడికి యుక్తవయస్సు వచ్చేవరకు రాజ్యభారం మంజుడికే అప్పగించండని చెప్పాడు. దాంతో సింధుడు ఆ ప్రకారమే చూసి, భోజుడిని కూడా తన తమ్ముడికే అప్పగించి కొంతకాలం తర్వాత మరణించాడు. మంజుడు కూడా బుద్ధిసాగరుడి సహాయంతో ధర్మబద్ధంగా రాజ్యపాలన చేస్తూ, తన కొడుకుతో పాటు భోజుడిని కూడా ఒకే దగ్గర చదివించసాగాడు.

ఒకరోజు మంజుడు సభను నిర్వహిస్తున్న సమయంలో ఒక పండితుడు వచ్చి ఆశీర్వదించి, తనను త్రికాలజ్ఞుడిగా పరిచయం చేసుకొని, మంజుడి జీవితంలో అంతవరకు జరిగిన ముఖ్యమైన పరిణామాలనూ, కొన్ని మర్మాలనూ కూడా వివరించడంతో మంజుడికి ఆ పండితుడి మీద నమ్మకం కుదిరింది. ఆ బ్రాహ్మణుడు భోజుడి జాతకం చూసి ఆశ్చర్యపోయి, విద్యాభ్యాసంలో ఉన్న అతణ్ణి పిలిపించి జాగ్రత్తగా పరిశీలించి 'ఇతడు కారణజన్ముడు. ఇతడు ఈ రాజ్యాన్ని యాభైఐదేళ్ల ఏడునెల మూడురోజులు దిగ్విజయంగా పరిపాలిస్తాడు. దానగుణంలో శిబినీ, బలిచక్రవర్తినీ, కర్ణుడినీ కూడా అధిగమిస్తాడు. అన్ని విద్యల్లో ఆరితేరి కీర్తిప్రతిష్ఠల నార్జిస్తాడు" అని చెప్పడంతో మంజుడి మనసులో స్వార్థం, రాజ్యకాంక్ష పెరిగిపోయి 'శత్రువునీ, వ్యాధినీ మొదట్లోనే అంతం చెయ్యాలని' అనుకున్నాడు.

వెంటనే వంగదేశ పాలకుడైన వత్సరాజుని పిలిపించి "నమ్మకమైన సేవకుడిగా నాకొక పని చేసిపెట్టాలి. భోజుణ్ణి అడవిలోకి తీసుకెళ్లి, అక్కడున్న భువనేశ్వరి ఆలయంలో చంపి, అతడి తలను మాత్రం నాకు అప్పగించాలి" అని ఆజ్ఞాపించాడు.

మంజుడి మాటలకు విస్మయం చెందిన వత్సరాజు, భోజుణ్ణి చంపించడానికి గల కారణమేమిటో తెలుసుకున్నాడు. పొట్టకూటికోసం తిరిగే ఒక పండితుని మాటలు నమ్మి అందమైన పుత్రుణ్ణి బలిచేయడం భావ్యం కాదనీ, వశిష్ఠుడంతటివాడే శ్రీరామ పట్టాభిషేకానికి పెట్టిన ముహూర్తమే ఫలించక అదే సమయానికి రాముడు వనవాసం చేయడానికి బయలుదేరవలసి వచ్చిందనీ, భోజుడి మరణవార్త తెలిస్తే అతడి సానుభూతిపరులు సింధుడి అభిమానులు ఆగ్రహిస్తారనీ, అది రాజ్యానికే ప్రమాదమనీ వత్సరాజు మంజుడికి చెప్పి చూసినా ప్రయోజనం లేకపోయింది.

తన మాటను ధిక్కరిస్తున్నామంటూ మంజుడు కోపగించుకోవడంతో మరో దారిలేక వత్సరాజు ఆ పనికి ఒప్పుకుని అక్కణ్ణుంచి వెళ్లిపోయాడు.

భోజుడు విద్యనభ్యసిస్తున్న పాఠశాల దగ్గరకెళ్లి, ముందుగా భోజుడి గురువుతోనూ, మంజుడి కొడుకు జయంతుడితోనూ మాట్లాడిన వత్సరాజు తరువాత భోజుణ్ణి పిలిపించాడు.

దాంతో కోపగించుకున్న భోజుడు తాను రాజకుమారుడిననీ, పిలిపించడానికి నువ్వెరివనీ అంటూ వత్సరాజుని దండించాడు. అప్పుడు వత్సరాజు రాజశాసనం చూపించడంతో భోజుడు అతడి వెంట రథంతో వెళ్లాడు. రథం, అడవిలో ఉన్న భువనేశ్వరీ ఆలయం వైపు వెళ్లసాగింది.

రాజ్యకాంక్షతో మంజుడు, భోజుణ్ణి చంపిస్తున్నాడన్న వార్త ప్రజలలో పాకిపోయింది. ఇది అన్యాయమని కొందరు ప్రజలు, భటులు విమర్శించారు. కొందరు బాధపడ్డారు. ఇంకొందరు అశ్వశాలల్లో, గజశాలల్లో చేరి అల్లరి చేశారు.

భోజకుమారుడి తల్లి సావిత్రికి ఈ విషయం తెలిసి ఎంతగానో బాధపడింది. సింహాసనమెక్కే రోజుకోసం ఎదురుచూస్తున్న తనకి మరణవార్త చెవిన పడటంతో గుండెలవిసేలా విలపించింది. అప్పుడామెని ఒక దాసి ఓదార్చి 'ఇది నిజం కాకపోవచ్చునీ, ఆధారమేదీ దొరకలేదనీ' చెప్పింది.

అదే నిజమైతే ఆమెకి కానుకలిస్తాననీ, అసలు సంగతి తెలుసుకురమ్మనీ సావిత్రి ఆ దాసీని పంపించింది.

అంతవరకు చెప్పిన మణిసిద్ధుడు తరువాతి కథను పై మజిలీలో ఇలా చెప్పసాగాడు.



# కాశీ మజిలీ కథలు

## 218 వ మజిలీ

### జయంతుని కథ

భోజుడి మీద విపరీతమైన ప్రేమాభిమానాలు కలిగిన జయంతుడు, అతడు చనిపోయాడన్న వార్త తెలుసుకుని, చంపించడానికి కారణమేమిటని తండ్రి మంజుడిని ప్రశ్నించాడు. చిన్నవాళ్లు ఇలా అడగకూడదనీ, తానేం చేసినా నీ కోసమేననీ మంజుడు చెప్పడంతో, తన కోసం సకల గుణ సంపన్నుడైన అన్న బలైనందుకు, మంజుణ్ణే సొంత తండ్రిగా భావించే భోజుడు దూరమైనందుకు జయంతుడు విలపించాడు. తనకు ఆప్యాయంగా చూసుకుంటూ, రాజ్యాన్ని కూడా తనకే అప్పగిస్తానన్న సహృదయుడైన సోదరుణ్ణి కోల్పోయినందుకు విచారిస్తున్న జయంతుడు బాధతో మూర్ఛపోయాడు. అప్పుడు జయంతుణ్ణి, అతడి తల్లి శోభావతి ఓదార్చి సేద తీర్చింది.

అంతలో బాహ్లీకుడనే రాజు నుంచి నలుగురు బ్రాహ్మణ పండితులు తన దర్శనం కోసం వచ్చి సభలో ఎదురు చూస్తున్నారన్న విషయం భటుడి ద్వారా తెలుసుకున్న మంజుడు వేగంగా సభకి వెళ్లాడు. అప్పుడా బ్రాహ్మణులు అతడిని ఆశీర్వదించి బాహ్లీకుడు ఇచ్చి పంపించిన శుభలేఖని అందించారు.

నేను పంపిన నా పుత్రుడి చిత్రపటం చూసి, బాహ్లీకుడు తన కుమార్తె లీలావతిని నా పుత్రుడికిచ్చి వివాహం చేయడానికి సంకల్పించినట్టు ఆ లేఖ ద్వారా మంజుడు తెలుసుకున్నాడు. అయితే నాకు ఇంతకుముందు ఎవరి చిత్రపటం పంపాడో అతడికి గుర్తురాలేదు. అది భోజుడిదే అయినా బాహ్లీకుడు అతని పేరు ప్రస్తావించలేదు కాబట్టి జయంతుడికే లీలావతినిచ్చి వివాహం చేస్తానని నిర్ణయించుకున్నాడు.

బాహ్లీకుడు పంపించిన శుభలేఖను తన భార్య శోభావతికి చూపించి నిర్ణయించిన ముహూర్తాన్ని కూడా తెలియజేశాడు మంజుడు. అయితే భోజుణ్ణి చంపించినందుకు రాజ్యమంతా అసహనంగా ఉందనీ, జయంతుడు కూడా ఆ బాధ నుంచి ఇంకా తేరుకోలేదు కాబట్టి వివాహానికి ఒప్పుకోకపోవచ్చనీ, కొంతకాలమాగితే బాగుంటుందనీ శోభావతి చెప్పింది.

ఆ రోజు సాయంత్రం వత్సరాజు, భోజుడి తలను తీసుకొని వచ్చి మంజుడికి చూపించి, ఆ రోజు జరిగిన వృత్తాంతమంతా వివరించాడు. 'తాను వేదపాఠశాలకు వెళ్లి రాజశాసనం చూపించగానే భోజుడు తనతో రావడానికి అంగీకరించాడనీ, కొంతమంది ప్రజలు రథానికి అడ్డుపడి వెళ్లిద్దని వారించగా భోజుడే స్వయంగా వాళ్లకి నచ్చచెప్పాడనీ, అడవికి చేరుకున్న తర్వాత రెండో శాసనం చూపించి తన తలను నరకమని రాజు ఆజ్ఞాపించినట్టు చెప్పడంతో ఆనందంగా ప్రాణత్యాగానికి సిద్ధపడ్డాడని, తన వారికి చివరిసారిగా ఈ సందేశాలు పంపమంటూ తన రక్తంతో మర్రి ఆకుల మీద ఈ రెండు పద్యాలూ రాసిచ్చాడనీ, ఆ తర్వాత తాము కర్కశంగా అతణ్ణి వధించామనీ' వత్సరాజు తెలిపి, పద్యాలున్న ఆకులను మంజుడికి

అందజేశాడు. అవి ఒకటి మంజుడికీ, రెండోది జయంతుడికీ ఉద్దేశించబడ్డాయి. భోజుడు, తన కోసం బాధపడొద్దనీ, చక్కగా చదువుకోమనీ తమ్ముడికి పద్యంలో ఉపదేశించాడు. రెండవ పద్యంలో "ప్రతీ యుగంలోనూ గొప్ప గొప్ప చక్రవర్తులు చాలా కాలం భూమిని పరిపాలించినా వారు మరణించినప్పుడు మాత్రం భూమిని కూడా నీతో తీసుకెళ్లిపోతావు. అంత శాశ్వతమైనది కాబట్టి నీ ఆశచావక నన్ను చంపుతోంది" అని రాశాడు. అది చదువుకున్న మంజుడికి జ్ఞానోదయమై, తాను చేసిన పని ఎంత తప్పో అర్థమయ్యింది. తన పాపానికి పరిహారం లేదని దుఃఖించాడు. మంజుడికి పశ్చాత్తాపం కలిగినందుకు ఆనందించినా, భోజుడు దూరమైనందుకు శోభావతి, జయంతుడు బాధపడ్డారు.

పుత్రుణ్ణి చంపించినందుకు నిష్కృతిగా పండితుల సూచనల మేరకు మంజుడు అగ్నిప్రవేశం చేయడానికి నిశ్చయించుకున్నాడు.



# కాశీ మజిలీ కథలు

## 24వ మజిలీ

### లీలావతి కథ

చామంతిక అనే లీలావతి సుఖురాలు ధారా నగరానికి వెళ్లి, రాజ్యకాంక్షతో పినతండ్రి భోజుడిని చంపించాడని పురప్రజల మాటల ద్వారా తెలుసుకొని వచ్చి ఆ విషయం లీలావతికి చెప్పింది. అది విన్న లీలావతి ఎంతో బాధపడింది. ఇంతలో ఆమె తల్లి వచ్చి 'లీలావతి కోరిన వరుడితోనే వివాహం జరుగబోతోందనీ, ముహూర్తం కూడా నిర్ణయించేశారనీ' చెప్పి శుభలేఖలు చూపించింది.

లీలావతి శుభలేఖ చదివి - తాను కోరుకున్న వరుడు భోజుడి పేరు ఇందులో లేదనీ, స్వార్ధంతో ఆ రాజు భోజుణ్ణి చంపించాడనీ, ఇక్కడున్న పేరు అతడి మరొక కుమారుడిదై ఉండవచ్చనీ, భోజుణ్ణి తప్ప మరెవరినీ వివాహం చేసుకోవడానికి తాను సిద్ధంగా లేననీ లీలావతి స్పష్టంగా చెప్పింది.

ఈ సంగతి తెలుసుకున్న బాహ్లీకుడు, తన కుమార్తె చెప్పింది నిజమా కాదా? అని తేల్చుకోవడానికి ధారానగరానికి వేగులను పంపించాడు. వేగులు తిరిగి వచ్చి - అది నిజమేననీ, చేసిన తప్పుకు పశ్చాత్తాపపడుతూ మంజుడు అగ్ని ప్రవేశం చేయబోతున్నాడనీ తెలియజేశారు. దాంతో బాహ్లీకుడు ఆ

సంబంధం వద్దనుకొని, అదే ముహూర్తానికి మరొక వరుడితో వివాహం నిశ్చయించాడు.

చెలికత్తె ద్వారా ఇది తెలుసుకున్న లీలావతి, పెళ్లి చేసుకోవడం ఇష్టం లేక ముహూర్తం దగ్గరపడటంతో అంతఃపురం నుంచి రహస్యంగా బయటపడి గుర్రమెక్కి వెళ్లిపోయింది. ఆమె అన్ని విద్యాల్లోనూ ఆరితేరిన పరాక్రమవంతురాలు. అడవిలోకి చేరిన లీలావతి దారి తెలియక ఎటు వెళ్లాలో ఆలోచిస్తూ చెట్టెక్కి చుట్టూ చూసింది. దూరంగా కొండ పక్కన సరస్సు కనిపించడంతో గుర్రాన్ని అక్కడాపి సరస్సు దగ్గరకెళ్లింది.

అందులో నీళ్లు తాగి దాహం తీర్చుకున్నాక అక్కడొక ఆలయం కనిపించడంతో లోపలికి వెళ్లి చూసింది. దాన్ని సంరక్షించే - వాళ్లెవ్వరూ లేకపోయినా అప్పుడప్పుడూ ఒకరిద్దరు వస్తుంటారనీ అక్కడి పదార్థాలను బట్టి గ్రహించింది. మళ్లీ సరస్సు దగ్గరికి వెళ్లి అందులో స్నానం చేస్తూండగా 'తాను వర్తకుడిననీ, దొంగల బారి నుండి రక్షించమనీ' ఒక గొంతు వినబడింది. నగ్నంగా ఉన్న ఆమె, తల మాత్రమే బయటపెట్టి మిగిలిన శరీరమంతా నీటిలో ఉండేలా కూర్చొంది. అటువైపుగా వచ్చిన దొంగలు గట్టుమీద పడేసి ఉన్న లీలావతి వస్త్రాలు తీసుకెళ్లిపోయారు. దాంతో బట్టలు లేకుండా బయటికి ఎలా రావాలో, వచ్చినా ఎలా ముందుకెళ్లాలో తెలియక బాధపడింది. అయినా ఆలోచించి అక్కడున్న తామరాకులతో శరీరాన్ని కప్పుకొని ఒడ్డున కూర్చొంది.

సూర్యాస్తమయం కావడంతో గంధర్వకాంతలు అక్కడికి జలకాలాటకి రావడంతో, వాళ్లలో ఒకరి వస్త్రాలు జాగ్రత్తగా తీసుకొని లీలావతి అక్కడ్నుంచి వెళ్లిపోయి ఆలయం చేరి విగ్రహం వెనుక కూర్చొంది.

కొంతసేపటికి ఒక మాంత్రికుడు గుళ్లోకి ప్రవేశించి హోమగుండం దగ్గర కూర్చొని మంత్రాలు చదవసాగాడు. అప్పుడు భైరవుడు ప్రత్యక్షమై ఏం కావాలో కోరుకోమనగా ఆ మాంత్రికుడు తనకు చిత్రాంగదుడి కుమార్తె చంద్రముఖి కావాలని అడిగాడు. ఆమెని తెచ్చిచ్చి భైరవుడు అదృశ్యమైపోయాడు. మాంత్రికుడు చంద్రముఖిని 'పెళ్లాడమనీ, లేదంటే బలవంతం చేస్తాననీ' భయపెట్టడంతో ఆమె పెద్దగా ఏడవసాగింది. విగ్రహం వెనుకే వుండి ఇదంతా గమనిస్తోన్న లీలావతి ఒక్కవేటుతో తల ఎగిరిపడేలా తన కత్తితో ఆ మాంత్రికుడు కాపాలికుణ్ణి నరికింది. ఆమె ధైర్యానికి మెచ్చుకున్న భైరవుడు ఆమె చెప్పడంతో చంద్రముఖిని ఇంటికి చేర్చేశాడు.

తెల్లవారాక గుర్రాన్ని చేరి బయలుదేరింది. దొంగలు వర్తకుణ్ణి రత్నాల కోసం కొట్టడం చూసి అక్కడికెళ్లి లీలావతి వాళ్లందరినీ తరిమేసింది. తాను ధారాపురంలో రత్నాల వ్యాపారం చేస్తానని ఆ వర్తకుడు చెప్పడతో, ఆమె రాజు గురించి అడిగింది. అతడు భోజుణ్ణి చంపించాడనీ, పశ్చాత్తాపంతో అగ్నిప్రవేశం చేయబోతూంటే ఒక యోగి ఆపి, ఆరునెలల్లో భోజుణ్ణి సజీవంగా తీసుకొస్తానని చెప్పడంతో ఆశగా ఎదురుచూస్తున్నాడనీ' చెప్పాడు. మాట్లాడుకుంటూ నడిచి ఒక గ్రామం చేరిన వాళ్ళిద్దరూ రాత్రికి ఒకింట్లో బసచేశారు. తెల్లారేసరికి గుర్రానెవరో దొంగిలించడంతో తమ మూటలు మోసుకురావడానకి కొందరిని ఏర్పాటు చేసుకున్నారు. మార్గమధ్యంలో కోయవాళ్లు ఎదురై ధనం ఇవ్వమని బెదిరించడంతో లీలావతి వాళ్లని సంహరించి, ఎటు వెళ్లాలో ఆలోచించసాగింది.



## ౨౯ వ మజిలీ

రాజపుత్రా! వత్సరాజు నీ తండ్రి సింధుడికి ప్రాణ సఖుడవ్వడం వల్లనే నిన్ను చంపడం ఇష్టంలేక నేను చెప్పినట్టు రక్షించి ఇలా తీసుకొచ్చాడు. ఈ ఇద్దరు సేవకులతో కలిసి నువ్వు మీ మేనమామ కుంతలేశ్వరుడి దగ్గరకు వెళ్లు. మంజుడి మీద ప్రజా వ్యతిరేకత కనబడగానే నిన్ను రప్పిస్తాను" అని మంత్రి బుద్ధిసాగరుడు భోజుడికి చెప్పి పంపించగా వారు అలకాపురానికి పయనమయ్యారు. అడవిమార్గంలో వెళుతూ ఆ రాత్రికి అక్కడే ఒక చెట్టు దగ్గర విశ్రమించారు. దూరంగా ఒక కాంతి కనిపించడంతో సేవకులిద్దరూ అది కొరివిదెయ్యమని భయపడ్డారు. దెయ్యాలనేవి లేవనీ, అదంతా మన భ్రమేననీ చెబుతూ భోజుడు ఒక కథ చెప్పాడు.

### భోజకుమారుని కథ

కాళిందినదీ తీరంలో బుంజిక అనే నగరముండేది. అక్కడ ప్రజ్ఞావంతుడనే పండిత పుత్రుడు భార్య సులోచనతో కాపురముండేవాడు. ఎంతో అందంగా ఉండే సులోచన ఏ ప్రతిభా లేని ప్రజ్ఞావంతుడితో కలిసి లోకం కోసం కాపురం చేసేది. ఒక రోజు నీళ్లు తెచ్చుకోవడానికి బిందెతో చెరువు దగ్గరికి వెళ్లిన సులోచనకి అందమైన, ధనవంతుడైన వర్తకుడు కనిపించడంతో ఆమె మనసు చలించింది. అతడు కూడా ఆమెని మోహించి

తనతో వచ్చెయ్యమనీ, తన భార్య మరణించింది కాబట్టి నిన్ను పెళ్లి చేసుకుంటాననీ, సుఖసంపదలతో ముంచెత్తుతాననీ నచ్చచెప్పడంతో సులోచన అంగీకరించి అతడితోపాటు గుర్రమెక్కి వెళ్లిపోయింది.

అక్కడ బిందె మాత్రమే ఉండి ఎవ్వరూ కనిపించకపోవడంతో ఎవరో చెరువులో మునిగిపోయారనే పుకారు పుట్టింది. తన భార్య కనిపించకపోవడం, బిందె కూడా తమదే అవడం గమనించిన ప్రజ్ఞావంతుడు సులోచనే మునిగిపోయిందని భావించాడు. కానీ చెరువంతా వెతికించినా అతడికే ఆధారమూ లభించలేదు.

కొంతకాలానికి బంధువులు చెప్పడంతో ప్రజ్ఞావంతుడు, రాధికను వివాహం చేసుకున్నాడు. తొందర్లోనే ఆమె గర్భవతి అయ్యింది. అంతలో ఒక రోజు పక్కింటావిడ వచ్చి రాధికతో - నీ సవతి చచ్చి దెయ్యమై తిరుగుతూ గర్భవతులందరినీ హింసిస్తోందనీ, సోది చెప్పేదాని దగ్గరకెళ్లి ఏం చేయాలో అడగమనీ చెప్పింది. అప్పుడు రాధిక - తనకి కూడా అలాంటి అనుభవం కలిగిందనీ, సోది దాని దగ్గరి కెళ్లేందుకు తన భర్తని ఒప్పించమని ఆవిణ్ణి బ్రతిమాలింది. దాంతో ఆవిడ ప్రజ్ఞావంతుడు రాగానే ఈ విషయం చెప్పి ఒప్పించింది. ముగ్గురూ కలిసి అక్కడికెళ్లారు. తనకి ముడుపు చెల్లించి, పుట్టబోయే బిడ్డకి తన పేరే పెడితే రాధికను ఏమీ చేయనని సులోచన సోది దాని రూపంలో చెప్పడంతో ప్రజ్ఞావంతుడు అందుకు సమ్మతించాడు.

అయినా రాధిక జన్మనిచ్చిన బిడ్డ వెంటనే చనిపోవడంతో ఆమె సులోచననీ, ఆమె వైపు వాళ్లనీ తిట్టుకొంది. అప్పుడప్పుడూ ఆమె ఆవహించినట్లు రాధిక అరిచేది. ఆమెని అదుపులోకి తీసుకురావడానికి ప్రజ్ఞావంతుడు అనేక

తంటాలుపడేవాడు. రెండోసారి ఆమె గర్భవతైనా అదీ నిలవలేదు. రాధికను చంపేస్తానంటూ సులోచన ఆవహించి చెబుతూండడంతో భయపడిన ప్రజ్ఞావంతుడు ఆమె ఒంటినిండా తాయెత్తులు, రక్షరేకులూ కట్టించాడు. తీర్థయాత్రలు చేస్తే ఫలితముంటుందని భావించి, బయలుదేరారు. కొన్ని రోజులకి కుంభకోణం చేరుకున్నారు. ఆ రాత్రికి వారు ఒక సత్రంలో బస చేయగా ఒకడు వాళ్ల మూటను అపహరించుకుపోయాడు.

ప్రయాణానికి ధనం లేకపోవడంతో అక్కడ విత్తకర్మ అనే ధర్మాత్ముడైన వర్తకుడు యాత్రికులను ఆదుకుంటాడని తెలిసి అతని దగ్గరకెళ్లారు. ఒంటినిండా తాయెత్తులున్న రాధికను చూసి ఆశ్చర్యపోయిన ఆ వర్తకుడి భార్య కారణమేమిటని అడుగగా ఆ దంపతులిద్దరూ కలిసి సులోచన పోయిన దగ్గర్నుంచి ఇప్పటి వరకు జరిగిన వృత్తాంతమంతా వివరించారు. అప్పుడు వర్తకుడి భార్య, తన ఆభరణాలు, అలంకారాలు అన్నీ తీసేసి ప్రజ్ఞావంతుడి ముందు నిలబడగా ఆమె తన మొదటి భార్య సులోచనే అని ప్రజ్ఞావంతుడు గుర్తుపట్టాడు.

తనను క్షమించమనీ, కావలసినంత ధనమిచ్చి, రాధికను ఆరోగ్యవంతురాలిగా మారుస్తాననీ సులోచన అంది. దాంతో రాధిక - ఇంతకాలం నువ్వే దెయ్యం రూపంలో నన్ను బాధిస్తున్నావనే భ్రమలో ఉన్నాను. నిన్ను అనరాని మాటలన్నాను. నన్నూ క్షమించు. దెయ్యాలనేవి లేవని ఇప్పుడే అర్థమయ్యింది" అంది. తర్వాత విత్తవర్మ ప్రజ్ఞావంతుడికి చక్కని ఇల్లు ఇవ్వగా, ఆరోగ్యం కుదుటపడిన రాధికతో కలిసి ప్రజ్ఞావంతుడు అక్కడే నివసించాడు.

ఈ కథను వివరించిన భోజుడు, తన సేవకులతో – పిశాచాలు ఉండవనీ, అంతగా భయమేస్తే మీరు పడుకోండి, తాను అండగా ఉంటాననీ చెప్పాడు. తెల్లవారగానే ఆ చెట్టు దగ్గరకెళ్లి చూసిన భోజుడికి అక్కడ ఒక మహర్షి తలక్రిందులుగా వేలాడుతూ తపస్సు చేసుకోవడం కనిపించింది. ఇతని ఆత్మ దీపమే తపశ్శక్తితో వెలుగుతూంటే అది చూసిన సేవకులు కొరివి దెయ్యమనుకొని భయపడ్డారని భోజుడు గ్రహించాడు.

అంతలో కళ్లు తెరిచిన మహర్షి భోజుణ్ణి చూపి "ఎవరునువ్వు? అని అడుగగా తన వృత్తాంతమంతా అతడు వివరించాడు. అప్పుడు ఆ తపస్వి "రాజకుమారా! నీ రూపమే నీ సుగుణాలను వెల్లడిస్తున్నాయి. దైవజ్ఞుడు చెప్పిన విధంగానే నువ్వు భూమిని దిగ్విజయంగా పరిపాలిస్తావు' అని, తన పేరు 'సర్పటి' అనీ చెప్పి, భోజుడికి 'ధూమవేది' అనే విద్యను ఉపదేశించాడు. దాని ప్రకారం ఒక ఔషధాన్ని దీపం మీద వేస్తే దాని కాంతి సోకిన లోహాలన్నీ స్వర్ణమైపోతాయి. ఈ విద్య వల్ల భోజుడు ఎంతో కీర్తి ప్రతిష్టలు సంపాదిస్తాడని సర్పటి చెప్పి, తిరిగి తపస్సు చేసుకోవడానికి ఉపక్రమించాడు.

తనకి లభించిన ఆ విద్యతో భూమ్మీద దారిద్ర్యాన్ని నిర్మూలించాలనుకుంటూన్న భోజుడికి 'కోయవాళ్ల నుండి రక్షించండి' అంటూ ఆర్తనాదం వినబడింది. ఆ దిక్కుగా భోజుడు తన ఇద్దరు సేవకులతో సహా వెళ్లాడు. అక్కడొక ఆలయం ముందున్న చెట్టుకి ఇద్దరు మనుషుల్ని తాళ్లతో కట్టి బంధించి కొందరు కోయవాళ్లు బలివ్వడానికి సమాయత్తమవుతున్నారు.

భోజుడినీ, మరో ఇద్దర్నీ ఆయుధాలతో చూసిన ఆ కొండజాతి వ్యక్తులు భయంతో అక్కడ్నుంచి పారిపోయారు.

వాళ్ల కట్లు విప్పించిన భోజుడు వారి వృత్తాంతమేమిటని అడుగగా ఒక వ్యక్తి తాను ధారానగరపు రత్నాల వర్తకుడిననీ, అడవిలో వెళుతున్న తనను దొంగల బారి నుండి రక్షించిన ఈమె పూర్తి వివరాలు మాత్రం తనకు తెలియవనీ, మా దేశరాజు గురించి అడిగి భోజుడు చనిపోయాడని తెలిసి చాలా బాధపడిందనీ, ఇక అనేకమంది ఆటవికులు మమ్మల్ని చుట్టు ముట్టి ఆయుధాలు లాక్కొని బంధించి ఇలా బలివ్వడానికి సిద్ధపడ్డారనీ చెప్పాడు.

భోజుడి గురించే పలవరిస్తోన్న ఆమె స్పృహలోకి రాగానే వర్తకుడి ద్వారా జరిగింది తెలుసుకొంది "నువ్వెవరు?" అని భోజుడు అడగడంతో ఆమె దాపరికం లేకుండా తన గురించి మొత్తం వివరించింది. అది విన్న భోజుడు తన చిత్రపటాన్ని మంత్రి బుద్ధిసాగరుడే పంపించి ఉంటాడనీ, తన కోసం ఇన్ని కష్టాలు పడుతున్న లీలావతిని వివాహం చేసుకోకపోతే పాపమనీ అనుకున్నాడు. అయినా తల్లిదండ్రులు చూసిన సంబంధం చేసుకోమని లీలావతికి చెప్పినా, ఆమె తిరస్కరించి తనకి మనసు నిండా భోజుడే ఉన్నాడని చెప్పడంతో ఆమెకి తన మీద ఉన్న ప్రేమ తీవ్రతను అర్థం చేసుకున్నాడు.

అందరూ తిరిగి మళ్లీ అదే గ్రామానికి చేరుకొని అదే సత్రంలో బసచేశారు. యోధులను చూసి భయపడి అక్కడివాళ్లు వెళ్లిపోగా, లీలావతి గుర్రం మళ్లీ కనబడింది. దాన్నెక్కి పుట్టింటికి వెళ్లిపొమ్మని భోజుడు చెప్పినా లీలావతి

వినిపించుకోలేదు. "మిమ్మల్ని భోజుడనే అనుకుంటున్నాను. మీతోనే వస్తాను" అనడంతో భోజుడు - ఆమె నిజం గ్రహించినందుకు అభినందించాడు. ఇక మిమ్మల్ని వదిలి నిమిషం కూడా ఉండలేను, నన్నూ మీతోనే తీసుకెళ్లండి" అని వేడుకోవడంతో భోజుడు లీలావతితో సహా అలకాపురికి ప్రయాణమయ్యాడు.



# కాశీ మజిలీ కథలు

## ౨౬ వ మజిలీ

### చంద్రముఖి కథ

"అమ్మా! అది కల కాదు. ఆ వీరుణ్ణి నేను స్వయంగా చూశాను. ఆ నాడు యాచకుడిగా వచ్చిన కాపాలికుడు నన్ను పెళ్లి చేసుకోమని అడుగగా భటులతో వెళ్లగొట్టించాను. వాడు నిన్న నన్ను భైరవాలయంలో తీసుకెళ్లి బలవంతం చేస్తుండగా ఆ వీరుడు ఒక్క వేటుతో వాడి తల నరికి సంహరించాడు. భైరవుడు ప్రత్యక్షమై అతడి శౌర్యానికి మెచ్చి వరం కోరుకోమనగా – నన్ను ఇంటి దగ్గర దించెయ్యమని కోరుకున్నాడు. అతడి చిత్రపటం కూడా గీయగలను. అతణ్ణి తప్ప ఇంకెవ్వరినీ పెళ్లి చేసుకోను" అని లీలావతిని పురుషవేషంలో చూసి పురుషుడిగానే భ్రమపడిన చంద్రముఖి, తన తల్లితో చెప్పింది.

ఎంత చెప్పినా ఆమె తల్లి అది నిజమని నమ్మలేదు. "మీ తండ్రి నీకు స్వయంవరం ఏర్పాటుచేసి, ఎక్కువ బంగారం తెచ్చిన రాజకుమారుడికి నిన్నిచ్చి వివాహం చేస్తానన్నారు" అందావిడ. స్వయంవరానికి అది పద్ధతి కాదనీ, తాను అడిగిన ప్రశ్నకి ఎవరు సరిగ్గా సమాధానం చెబితే వారినే పెళ్లి చేసుకుంటాననీ చంద్రముఖి చెప్పి, తండ్రి చిత్రాంగదునికి కబురుపెట్టింది. పది గుర్రాల నిండా స్వర్ణం తీసుకువచ్చే రాజపుత్రులను

ఆ ప్రశ్న అడిగి నీకు నచ్చినవాడిని వరించు" అని చిత్రాంగదుడు చంద్రముఖికి తెలియజేశాడు.

అడిగినంత బంగారం తీసుకువచ్చిన యువరాజులను మంత్రులు చిత్రాంగదుడి దగ్గరకు పంపిస్తూండగా అలకాపురికి వెళుతున్న భోజుడు, లీలావతి ఈ స్వయంవరం గురించి తెలుసుకొని తాము కూడా వెళదామనుకున్నారు. తన ఇంటి నుంచి కావలసినంత బంగారం తెప్పించడానికి కొంత వ్యవధి అవసరమవుతుందని లీలావతి చెప్పగా అంతవరకూ ఉండనవసంర లేదంటూ దగ్గర్లో ఉన్న స్వర్ణకారుల దగ్గరకెళ్లి వాళ్ల వద్ద నున్న అన్ని స్వర్ణేతర లోహాలనూ తీసుకొచ్చి గుట్టగా పోసి దీపం వెలుగులో ఔషధాన్ని వేశాడు. దాంతో ఆ గుట్టంతా బంగారంగా మారిపోయింది. కత్తులు, గునపాలు, గొడ్డళ్ల వంటివి కూడా బంగారంగా మారిపోవడం చూసి ఆశ్చర్యపోయన మంత్రులు వాటి విలువను అంచనా వెయ్యలేక చిత్రాంగదుడికి తెలియజేశారు. అతడు వచ్చి భోజుణ్ణి చూసి "ఇంత అందమైన రా కోరుకోవాలే గానీ స్వయంవరం కూడా అవసరం లేకుండా నా కుమార్తెనిస్తాను" అనుకుంటూ అతణ్ణి ఆహ్వానించాడు. తమ రాజ్యంలో బంగారం గనులు అధికంగా ఉండడం వల్లే ఇంత తీసుకురాగలిగాడని భోజుడు చెప్పాడు. పురుషుడంటే నమ్మే విధమైన ఆహార్యంతో లీలావతి కూడా సభకి వెళ్లింది.

భోజుడి తేజస్సు, అందమైన రూపం చూసిన చంద్రముఖి, తాను సరైన సమాధానం చెప్పినవారినే వరిస్తా' నన్నందుకు చింతించింది. శ్లోకం రూపంలో తాను తయారుచేసుకున్న ప్రశ్న భైరవాలయంలో జరిగిందేమిటో

నీకు తెలుసా!" అని అందర్నీ అడిగింది. ఎవ్వరూ చెప్పలేకపోయినా, ముందే లీలావతి ద్వారా జరిగిందేమిటో తెలుసుకొని ఉన్న భోజుడు సమాధానం చెప్పబోతూండగా లీలావతి మెడలో మాల వేయబోతున్న చంద్రముఖిని వారించి ఇదేమి న్యాయమంటూ ప్రశ్నించాడు. భోజుడు సరైన సమాధానం కూడా చెప్పేయడంతో సందిగ్ధంలో పడ్డ చంద్రముఖి "ఆ రోజు ఆలయంలో నన్ను రక్షించిన ఈ వీరుణ్ణే భర్తగా భావించాను. కాబట్టి ఇలాంటి ప్రశ్న అడిగాను. అని భోజుడికి చెప్పింది. లీలావతి పురుషుడు కాదని చెప్పడంతో ఆమె భోజుణ్ణి వరించింది. ఇందుకు వ్యతిరేకించిన మిగిలిన రాజపుత్రుల్ని తగిన విధంగా బుద్ధి చెప్పి పంపిచేశాడు భోజుడు. తర్వాత వైభవోపేతంగా చంద్రముఖిని వివాహం చేసుకొని, అక్కడే ఉండి, కొంతకాలం తర్వాత లీలావతితో అలకాపురం చేరాడు. అప్పటికే బుద్ధిసాగరుడి వల్ల అక్కడికి వెళ్లిన భోజుడి తల్లి సావిత్రి, తన కుమారుడి రాకకి సంతోషించి, తన మేనకోడలు పద్మావతిని కూడా భోజుడికిచ్చి వివాహం చేసింది. ఇంతలో రాజ్యానికి తిరిగి రమ్మంటూ బుద్ధిసాగరుడి నుంచి పిలుపు రావడంతో భోజుడు అందరితో కలిసి ధారానగరం వెళ్లాడు.



# కాశీ మజిలీ కథలు

## 97 వ మజిలీ

### కమల కథ

"అమ్మా! మొన్నీ మధ్య నేను చెలులతో జలకాలాటకి భూలోకం వెళ్లినప్పుడు ఒడ్డున పెట్టిన వస్త్రాలెవరో అపహరించుకుపోయారు. చీరనెత్తుకెళ్లిన ఆ చోరుడికే భార్యవౌతానంటూ' సఖురాళ్లు పరిహాసమాడారు.అది నిజం కాదు కదా?" అని కమల అనే గంధర్వ కాంత తన తల్లిని ప్రజ్ఞావతిని అడిగింది. తాను మహాలక్ష్మిని సేవించుకోవడానికి వైకుంఠం వెళుతున్నాననీ, నువ్వూ వస్తే ఆమెనే అడిగి సందేహనివృత్తి చేసుకుందామనీ ప్రజ్ఞావతి చెప్పడంతో కమల ఆమె వెంట వైకుంఠపురానికి వెళ్లింది.

శ్రీమహాలక్ష్మిని సేవించుకున్న ప్రజ్ఞావతి, భూలోకంలో ఆ రోజు జరిగిన విషయం ఆమెకి చెప్పి, తన కూతురు మానవుణ్ణి వివాహం చేసుకోవలసిందేనా? అని అడిగింది. అందుకు నవ్విన లక్ష్మీదేవి 'ఇందుకు బాధపడనవసరం లేదనీ, మానవుడే అయినా - దైవాంశసంభూతుడైన బృహస్పతినే నీ కూతురు వివాహం చేసుకుంటుందనీ, అతడు ఇప్పటికే సరస్వతీ దేవీ శాపం వల్ల భూలోకంలో జన్మించి ఉన్నాడనీ' చెప్పింది.

బృహస్పతి సరస్వతీ దేవి ఎందుకు శపించిందని ప్రజ్ఞావతి అడగటంతో లక్ష్మీదేవి ఇలా చెప్పసాగాంది.

ఒకరోజు బృహస్పతి, ఇతర ముప్పై మూడు కోట్ల దేవతలతో కలిసి వెళ్లి ఇంద్రుడు బ్రహ్మను దర్శించుకున్నాడు. బ్రహ్మ వారందరినీ కూర్చోబెట్టి పలకరిస్తూండగా, శారదుడనే సేవకుడు వీణ పట్టుకొని వెంటరాగా సరస్వతి

ఆ సభలోకి ప్రవేశించింది. అందరూ నిలబడి ఆమెకి నమస్కరించగా బృహస్పతి మాత్రం కూర్చొనే ఆమెని అభినందించాడు. అందుకు కోపగించుకున్న సరస్వతి తమకు సేవచేసుకునే ఇంద్రుడి కుటుంబసభ్యుడై ఉండి ఇంత అహంకారం ప్రదర్శించినందుకు 'భూలోకంలో మానవుడిగా పుట్ట'మని బృహస్పతిని శపించింది.

అందుకు ఆగ్రహించిన బృహస్పతి – బ్రహ్మ భార్యవైనంత మాత్రాన ఇంత అహంభావమా? పెద్దా చిన్నా తారతమ్యం లేదా? త్రిలోక పూజ్యులైన బ్రాహ్మణులు లేచి నిలబడి నీకు వందనం చెయ్యాలా? నేనూ నీకు శాపమిస్తున్నాను. మనుష్య యోని నందు జన్మించు" అని తపోజలం ఆమె మీద జల్లబోతూంటే బ్రహ్మ అడ్డుపడి "స్త్రీల తప్పులు పదిదాకా క్షమించవచ్చు, నువ్వు భూమ్మీద ఎన్నో సుఖాలు అనుభవించి, గొప్ప కీర్తిప్రతిష్టలు సంపాదిస్తావు. నీ శాపం ఉపసంహరించు" అన్నాడు. అప్పుడు శాంతించిన బృహస్పతి తన శాపానికి తిరుగులేదనీ, దాన్ని భరించేవాళ్లెవరైనా ఉంటే చెప్పమనీ అడగ్గా శారదుడు ముందుకొచ్చి ఆ శాపాన్ని భరించేందుకు అంగీకరించాడు. అప్పుడు బ్రహ్మ శారదుణ్ణి భూలోకంలో పుట్టి మహాకవిగా ప్రఖ్యాతి చెందుతావు. ఇద్దరూ ఒకచోటే ఉంటూ, ఒకేసారి శాపవిముక్తులవుతారు" అని దీవించాడు.

ఆ విధంగా బృహస్పతే భూమ్మీద భోజుడిగా జన్మించాడు. అతడే కమల వరించదగ్గ వీరుడు. ఇక శారదుడు మహాకవి కాళిదాసుగా అదే రాజు ఆస్థానంలో పండితుడిగా ఉంటున్నాడు – అని లక్ష్మీదేవి చెప్పి వాళ్లని పంపించింది.

భూలోకానికి చేరిన కమల ధారానగరంలోని ఒక ఉద్యానవనంలో దిగి అది అలంకరించబడి ఉండడంతో వనమాలి నడిగి కారణం తెలుసుకొంది. భోజమహారాజు ఇక్కడ విహరించడానికి తన ముగ్గురు భార్యలతో వస్తున్నారని విన్న కమల అతడికి నాలుగోభార్య అవ్వడం ఇష్టంలేక తిరిగి వెళ్లిపోదామనుకొంది. ఇంతదూరం వచ్చాం కాబట్టి కనీసం అతణ్ణి చూసైనా వెళ్లిపోదామని ప్రజ్ఞావతి చెప్పడంతో అదృశ్యరూపంలో అక్కడ నిలబడ్డారు. కొంతసేపటికి అక్కడికి వచ్చిన భోజుణ్ణి చూసి అతడి సుందరరూపానికి

దాసోహమైపోయింది కమల. తన మనసు మార్చుకున్నాననీ, తనని అతడికిచ్చి వివాహం చేయమనీ, అతడి భార్యగా ఒక్క నిమిషం సుఖించినా చాలనీ కమల తన తల్లితో చెప్పింది.

ఇద్దరినీ ఎలా కలపాలని ఆలోచించిన ప్రజ్ఞావతి ఉపాయం ప్రకారం "దుష్టులు హింసిస్తున్నారు వీరులెవరైనా ఉంటే రక్షించండి" అని అరిచింది. అక్కడికి దగ్గర్లో ఉన్న భోజుడు అది విని వేగంగా కత్తి తీసుకొని వెళ్లాడు. కమల అతణ్ణే గమనిస్తోంది, ఓరకంటితో! అప్పుడు ప్రజ్ఞావతి భోజుడికి నమస్కరించి "రక్షించారు. మిమ్మల్ని చూసి భయపడి వాళ్లు పారిపోయారు" అనడంతో "ఎవరు మీరు?" అని భోజుడు ప్రశ్నించాడు.

అందుకు ప్రజ్ఞావతి తన కూతుర్ని పరిచయం చేసి, ఈమెకి తగిన వరుణ్ణి వెతుక్కుంటూ తిరుగుతున్నామని చెప్పింది. అప్పుడు కమలని పరిశీలనగా చూసిన భోజుడు ఆమె సౌందర్యానికి మోహపరవశుడైపోయి మా రాజ్యానికి అతిథులుగా వచ్చారు కాబట్టి రాజ్యాధినేతగా మిమ్మల్ని మా గృహానికి ఆహ్వానిస్తున్నాను. మా ఆతిథ్యం స్వీకరించండి" అన్నాడు.

"భోజమహారాజు మీరేనా?! మీ కీర్తి లోకమంతా వ్యాపించింది. ఈమెను వివాహం చేసుకోవడానికి మీరే అర్హులు. దీనిని భార్యగా అంగీకరిస్తానంటేనే మీ ఆతిథ్యం స్వీకరిస్తాం" - ప్రజ్ఞావతి చెప్పడంతో భోజుడు వెంటనే ఒప్పుకున్నాడు. రాజమందిరం చేరాక అంతమందిలో ఈ విషయం మరచిపోతాడేమోనని కమల సందేహం వ్యక్తపరచడంతో భోజుడు ఆమె చేయినందుకొని మన్మధుని సాక్షిగా గంధర్వవివాహం చేసుకున్నాడు. కమల తల్లి ఆనందించి తాము గంధర్వులమేనంట మొత్తం విషయమంతా చెప్పింది. భోజుడు, తన ముగ్గురు భార్యలకు మిగిలిన పరివారానికి కూడా కమలని చూపించి ఆమె వృత్తాంతమంతా వివరించాడు.

లీలావతి, తాను ఆ రోజు అపహరించిన చీర కమలదని తెలుసుకొని విధి విచిత్రానికి ఆశ్చర్యపోయింది.

ఆ విధంగా భోజుడు నలుగురు అందమైన భార్యలతో వైభవంగా కాలం గడిపాడు.

అంతవరకు చెప్పిన మణిసిద్ధుడు, తర్వాతి కథను ఆపై మజిలీలో ఇలా కొనసాగించాడు.

# కాశీ మజిలీ కథలు

## ౨౭౫ వ మజిలీ

### భోజుని రాజ్యపాలనము కథ

ఒకరోజు ఉదయం వేళ భోజుడు క్రీడావనానికి వెళ్తూంటే, కళ్లు మూసుకు నడుస్తున్న పండితుడొకడు ఎదురుపడ్డాడు. అది చూసిన భోజరాజు, అలా ఎందుకు నడుస్తున్నావని ఆయనను ప్రశ్నించాడు.

"ఏం చెప్పమంటావు దేవా? నువ్వు విప్రులకు అపకారం చెయ్యని విష్ణుభక్తుడివే! నువ్వు లోభివి. దాత కాని వానికి దాక్షిణ్యం ఉండదు. నువ్వు పట్టాభిషిక్తుడైనాక ఎన్నడూ దానగుణం ప్రదర్శించలేదు. పండితుల్ని ఆదరించలేదు. స్త్రీలోలుడివైపోయావు. భూమ్మీద నిలిచేది కీర్తి మాత్రమే! శిబి, దధీచి వంటి వారి పేర్లే నిలిచాయి" అని చెప్పాడు.

భోజుడాయన్ని కౌగలించుకుని "అప్రియమైనవీ - అయినా హితవు కలిగించేవిగా ఉండే మాటలు చెప్పేవారు దొరకడం దుర్లభం. ఆర్యా! తమరు నాకు హితోపదేశం చేశారు. అక్షరలక్ష లిచ్చే గొప్ప పండితపోషకుడు ధారానగరంలో వెలిశాడని, పండితులంతా రాజదర్శనానికి రాసాగారు. దండి, భవభూతి, శంకరులను పరీక్షకులుగా నియమించి వారు పరీక్షించి

పంపిన వారినే రాజదర్శనానికి అనుమతిస్తూ, ఆ పండితుల్ని సత్కరిస్తూ సత్సంప్రదాయం నెలకొల్పాడు భోజరాజు.

కొన్నాళ్లకు దేశంలో పండితులంతా అయిపోయేసరికి, తనను చూడవచ్చేవారి సంఖ్య పలచబడిందని, భోజమహారాజు విచారించసాగాడు. భూ మండలం అంతా వెతికి మంచి విద్వాంసుడిని ఎవరినైనా తీసుకురమ్మన్నాడు.

అటువంటి వారెవరా? అని ఆలోచిస్తూన్న తరుణంలో దైవికంగా వారి దగ్గరకే ఒక తేజో పురుషుడొచ్చి రాజదర్శనం చేయించమని కోరాడు.

## కాళిదాసు కథ

విశాలనేత్రాలు, చక్కని ముఖ వర్చస్సుతో వెలిగిపోతున్న ఆ విద్వాంసుని - అతడు రాజదర్శనం కోరడానికి కారణం ఏమిటో తెలుసుకోదలచారు పరీక్షకులు. తాను భోజుని మీద ఒక శ్లోకం రెండు భాషల్లోనూ కలిపి రచించానని చెపుతూ ఇలా అన్నాడు.

**శ్లో ॥ అస్తివద్బక వచ్ఛేవ చల్లవ ద్వెల్ల కుక్కవత్।**

**రాజ తే భోజ తే కీర్తిః పున స్సన్యాసి దంతవత్ ॥**

దానికి అర్థంగా "ఓ భోజుడా! నీ కీర్తి ఎముకవలె, కొంగవలె, మజ్జిగవలె, తెల్లకుక్కవలె, సన్యాసి దంతాల వలె ప్రకాశిస్తోంది" అని చెప్పాడు.

వాళ్లు పకపకా నవ్వేసి "ఇదీ మంచిదే! పండితుల్ని వెతికి పట్టుకొచ్చే పని తాత్కాలికంగా అయినా తప్పింది. అనుకుంటూ, అతడ్ని పైకి బోధపడని రీతిలో పరిహసిస్తూ, పొగడ్తల మధ్య రాజదర్శనం చేయించారు.

అక్కడ మాత్రం భోజుడు మెచ్చేలా, సంస్కృత ధారాపాతమైన నాలుగు శ్లోకాలను వినయంగా అలవోకగా చెప్పేసరికి, అందులో భావాలకు ముగ్ధుడైన భోజుడు కవిరాజా! ఈ రాజ్యాన్నే నీకు కానుకగా చేస్తున్నాను. పాలించుకో! నేను అడవికి పోతాను" అన్నాడు.

దానికి పండితుడు "నీ రాజ్యాన్ని ఆశించి నేను రాలేదు భోజరాజా! పరిపాలించే సామర్ధ్యం కూడా నాకు లేదు. నీ దయ చాలు!" అని మాత్రం కోరగా, అతడి పేరే కాళిదాసు అని తెలుసుకుని, ఆస్థాన పండితుడిగా ఉండమన్నాడు.

అతడ్ని రాజు ఆ విధంగా గౌరవించి, తమకే పోటీగా తీసుకొస్తాడని ఊహించిన పరీక్షకులు ముగ్గురూ ఖంగుతిని, మాటమార్చేసి తామే అతడికి ఆ శ్లోకాలు రచించి ఇచ్చామని బొంకేశారు. అప్పటికి సభ చాలించిన భోజుడు, "ఇతని సంగతి రేపు చూస్తా" నన్నాడు.

ముగ్గురు కవులూ కాళిదాసు దగ్గరకెళ్లి "మాతో వికటకవిత్వం చెప్పి, అక్కడ అంత గొప్ప కవిత్వం చెబుతావా? మేం గాని తల్చుకుంటేనే నీకు నిజంగా విలువైన కానుకలు రావు. అంచేత మేం చెప్పినట్లుగా చెప్పు" అని బెదిరించారు.

మర్నాడు భోజుడు - ముందురోజు కాళిదాసు చదివిన శ్లోకాల సంగతి ఎత్తకుండా 'అప్రతిపత్తిమూఢమనసా ద్విత్రాస్థితా నాడికాః' అని ఒక శ్లోకపాదం ఇచ్చి దండి, భవభూతి, శంకరుల వంక చూడగా, వారికా శ్లోకపాదమే అర్ధం కాలేదు. కాళిదాసు మాత్రం అలవోకగా ఇలా చెప్పాడు.

**శ్లో ॥ స్నాతా తిష్ఠతి కుంతలేశ్వర సుతావారాంగ రాజస్వసుః**
**ద్యూతే రాత్రి రియంజితా కమలయా దేవీప్రహద్యాధునా**
**ఇత్యంతఃపుర సుందరీ జనగుణేమ్యానాధికం ద్యాయతా**
**దేవేనా ప్రతిపత్తి మూఢ మనసా ద్విత్రాస్థితా నాడికాః॥**

(కుంతలేశ్వరుని కూతురైన పద్మావతి మూడోభార్య, ఋతుస్నానం చేసి ఉంది. అదేరోజు అంగరాజపుత్రి చంద్రముఖి రెండోభార్య ఇంటికి వెళ్లవలసిన వంతు. భోజుడు కమలతో జూదం ఆడి, నాటి రాత్రి ఓడిపోవడం వల్ల కమల ఇంటికి వెళ్లాలి. దైవజ్ఞుల చేత ముహూర్తం నిర్ణయింపజేసుకుని పెద్ద భార్య లీలావతి కూడా అదే రోజు రమ్మని కబురంపింది. ఇలా ఒకే రోజు నలుగురు భార్యల దగ్గరకూ వెళ్లవలసిన పరిస్థితి రావడంతో, ఎవరినీ తక్కువ చేయలేక, భోజుడు తన ఇంట్లోనే పడుకొని నిద్రపోయాడు)

ఇదీ కాళిదాసు పూరణ. ఇది అంతఃపురంలోని విషయం. రవి కాంచని వైనా కవి ఊహించగలడానికి ఇంతకంటే నిదర్శనం ఏం కావాలి? అచ్చంగా చూసినట్లు చెప్పడంతో కాళిదాసు కవితాశక్తి భోజుడి అంచానకు అందింది. ఆస్థాన పరీక్షకులు దండి, భవభూతి, శంకరుల కంటే ఎన్నో రెట్లు పై మెట్టుమీద ఉన్నాడని గ్రహించాడు. ముందురోజు శ్లోకాలు కాళిదాసు కృతమైనవనీ - ఆ ముగ్గురూ అబద్ధం ఆడారని తెలిసినా వారి పరువు నిలబడడం కోసమే వారినేమీ అనలేదు భోజుడు.

అది మొదలు కాళిదాసు భోజుడికి అత్యంత ఆప్తుడై భార్యాపిల్లలు లేనందున విలాసవతి అనే వేశ్య ఇంట ఉంటూండేవాడు.

రాజదర్శనానికి వచ్చే పండితులను పరీక్షించే భారం, అటుపైన కాళిదాసు మీద పడింది. ఎందరెందరో చిన్నా చితకా పండితులు సైతం తమ దారిద్ర్య బాధ చెప్పుకొని కాళిదాసును కలసి రాజదర్శనం ఇప్పించమని కోరి, అతడి దయకు పాత్రులై రాజదర్శనం పొందేవారు. అలా వచ్చినవారిని, తన పాండిత్యంతో ఆదుకొని, వారివైపు సమర్థిస్తూ, తనను ఆశ్రయించినందుకు ప్రభువు వల్ల తృణమో - పణమో వారికి లభించేలా చెయ్యగలిగేవాడు కాళిదాసు. ఎందరికో అలా ఉపకారాలు చేసి భోజుడంతటి ప్రసిద్ధినీ కాళిదాసు పొందాడు".

అని చెప్పి, మణిసిద్ధుడు తదుపరి మజిలీలో తరువాత కథ చెప్పసాగాడు......

# కాశీ మజిలీ కథలు

## ౨౨ వ మజిలీ

### యజ్ఞశర్మ కథ

"ఈ దుర్భర దారిద్ర్యం ఇంకా ఎన్నాళ్లు? మీతోటివాళ్లంతా రాజదర్శనం చేసుకుని గజారోహణాది సన్మానాలు అందుకుంటూ ఉంటే, మేడలూ - మిద్దెలూ కట్టుకొని సుఖంగా సంసారాలు చేసుకుంటూ ఉంటే........బాగా పాండిత్యం ఉండి కూడా మీరు సభకు పోవడం లేదే! ఇంత పిరికితనమా? మీరు తప్ప ఈ నగరంలో పేదరికం అనుభవిస్తున్న వాళ్లెవరైనా బ్రాహ్మణుల్లో ఉన్నారేమో వెళ్లి చూడండి" అని ఆ పండితుని భార్య సోమిదేవి తన పతిదేవుని రోజూ పోరుపెట్టసాగింది.

అతడి దృష్టిలో రాజద్రవ్యం పాపంతో సమానం! అది అకార్యం అని అతని ఉద్దేశం. రాజు దగ్గరకు వెళ్లమని తనను వేధించవద్దంటాడు అతడు. ప్రతిరోజూ ఎన్నెన్నో పాట్లు పడి, ఇల్లు గడుపుతున్నదా మహాసాధ్వి.

ఒకరోజున, ఆమె సాధింపు అధికం కావడంతో, ఏం చెయ్యాడానికీ తోచక చిరుగుల శాలువాని భుజం మీద వేసుకుని భోజదర్శనానికి, బయలుదేరాడు. ఎంత జాగ్రత్తగా ఎన్ని మడతలు పెట్టినా ఆ శాలువాకున్న చిరుగులు కనిపిస్తూనే ఉన్నాయి.

సరే! రాజదర్శనమైంది. పండితుడు సత్కరించబడాలనే సదుద్దేశంతో భోజరాజు కోశాధికారిని పిలిచి, కోరినంత ధనం ఇమ్మన్నాడు. " ఈ పాపపు

సొమ్ము నీది కాదు. నీ కష్టార్జితం విత్తం ఏదైతే ఉందో అదిస్తే పుచ్చుకుంటాను" అన్నాడు పండితుడు.

భోజుడిటువంటి పండితుడని చూడటం అదే ప్రథమం! అంతవరకు అలా అడిగిన వాళ్లెవరూ లేరు. ఈ పండితుని దారిద్ర్యం ఎలా పోగొట్టాలా? అని ఆలోచించసాగాడు భోజరాజు.

రాజకీయ ద్రవ్యం అతడు ముట్టడని తెలిసి, ఆ రాత్రి రహస్యంగా ఒక కూలివాని వేషం ధరించి, సమ్మెట కొట్టేపనికి కుదిరాడు భోజుడు. ఆ లోహకారుడి చేత చివాట్లు తింటూ – పనికిరాని వాడికి ఇంతకంటే రోజు కూలి ఏమిస్తాం? అని అతడు ఇచ్చిన అది స్వల్పద్రవ్యం పుచ్చుకున్నాడు. కాని ఇది ఆ పండితుని ఆకలిబాధ ఒక్క పూట అయినా తీర్చదు కదా!ఎలా? అనుకున్నాడు ఏం చేస్తాం? అతడికిదే ప్రాప్తం' అనుకుని అదే ఇచ్చి రాత్రంతా తాను పడిన కష్టం వివరించాడు. ప్రభువుకు కష్టం కలిగించాను. అయినా మీ ఔదార్యం మెచ్చదగింది" అని అదే పట్టుకుపోయాడు పండితుడు.

గుర్రాల మీద – ఏనుగుల మీద ధనం వస్తోంది కాబోలుననుకున్న సోమిదేవి, భర్త తన చేత ఉంచిన రాగిడబ్బులు నాలుగు కాసులూ చూసి ఒళ్లు మండి, అక్కడే ఉన్న అగ్నిహోత్రంలో గిరివాటు వేసింది.

చిత్రంగా అవి బంగారునాణాలైనాయి. అప్పుడా పండితుడు అన్నాడు. దానానికి ద్రవ్యశుద్ధీ – పాత్రశుద్ధీ ఉంటే అది నిజంగానే బంగారమవుతుంది......పైగా అవి అక్షయంలా తరగక ఉన్నాయి. ఆ పండితునికి అపారసంపద చేకూరింది వాటితోనే!

భోజుడికి ఆ విషయం తెలిసి,తాను ఇచ్చిన రాగిడబ్బులతో అతడెలా సంపన్నుడయ్యాడో తెలుసుకుందామని, అతడి ఇంటికి వెళ్లగా తాను ఆనాడు ఇచ్చిన కాసులు అదే అగ్నిహోత్రంలోంచి తీసి చూపించాడు పండితుడు. రాజముద్ర కలిగిన ఆ నాణాలు బంగారంలో ఉన్నాయి. ఏ నాణాన్ని ఖండించినా, అవి ఎప్పటిలాగే ఉండేసరికి, పాత్రశుద్ధి ఫలితం ఆ ప్రభువుకు బోధపడింది.

భోజుడు అక్కడ్నుంచి బయలుదేరి, వెళ్తూండగా, దారిలో ఒక యోగిని ఒక పిల్లవాడిని ముద్దు చేస్తూ కనిపించింది.

## దుర్గ కథ

**భో**జుడు అక్కడే నిలబడిపోయి "ఓహో! ఈ యోగిని, అన్ని బంధాలూ తెంచుకున్నదా? సర్వసంగ పరిత్యాగిని అయితే ఈ మమకారం ఏమిటి? అని ఆశ్చర్యపోయాడు. అదేదో తెలుసుకుందామని పిలిచి - ఆమెను "దేవీ! ఈ బాలుడు నీకేం అవుతాడు?" అని ప్రశ్నించాడు.

ఆమె "దేవా! ఈ పిల్లవాడు నాకు సోదరుడు, మేనల్లుడు, మామ కొడుకు, మనుమడు,పినతండ్రి, మరిది అవుతాడు" అంది.

భోజుడు ఇంకా ఆశ్చర్యపోయి "ఇన్ని వరుసలెలా కలిగాయి?" అని అడిగాడు.

"నా నోటితో చెప్పడానికి నాకు చెప్పడానికి నోరు రాదు. దైవమే చెప్పాలి" అంది.

భోజుడు మర్నాడు సభలో పండితుల వద్ద ఆ వావివరసలన్నీ ఒక శ్లోకపాదంలో ఇమిడ్చి "భ్రాతః ధ్రాతృవ్య, పౌత్ర, శ్వశుర, సుత, పితృ వ్యేతితం దేవరేతి" అని చెప్పి, మిగిలిన పాదాలు పూర్తిచేయమన్నాడు. దుర్గ అనే స్త్రీ కథ తెలిస్తే తప్ప, ఆ సమస్య పూరించడం కష్టం! అయితే సరస్వతీ వరప్రసాది కాళిదాసు అంతర్నేత్రంలో ఆ కథ అవలోకించినందువల్ల, ఆ సమస్యను అవలీలగా పూరించాడు.

**శ్లో॥ జారో త్పన్నొ విసృస్టొ తనయ దుహిత రోదం పతీ దైవయోగాత్**
**యోగినాగహిన్ తాసా తదను గమన శా ద్యోగినీత్వం ప్రసీదే**
**పశ్చాద్భార్యా కృతాంబా జనిత మధ శింశులాయంత్య బ్రవీత్సా**
**భ్రాతః ధ్రాతృవ్య పౌత్ర శ్వశుర సుత పిత'వ్యేతితం దేవరేతి ॥**

ఒక వూళ్లో దుర్గ అనే స్త్రీ ఉంది. ఆమె చాలా బాల్యదశలోనే జారిణి అయింది. భర్తనొదిలి ప్రియుడ్ని మరిగింది. వాడివల్ల ఒక కొడుకుని కన్నది. ఆ పిల్లవాడ్ని పాలిచ్చి పెంచితే యవ్వనం తరిగిపోతుందని అనాధగా వదిలేసి, ఇంకో ఊరు వెళ్లి ఇంకొక ప్రియుడ్ని పట్టుకుంది. అక్కడొక స్త్రీ శిశువుకుజన్మనిచ్చింది. అక్కడ్నుంచి మరో ప్రాంతానికి వెళ్లి వేశ్యావృత్తి అవలంబించింది.

ఈ అనాధ పిల్లలిద్దర్నీ పెంచిన వారికి ఈ పిల్లల వావివరుస తెలిసే అవకాశం లేనందున వారిద్దరికే వివాహం చేశారు. ఆ ప్రకారం అన్నా చెల్లెళ్లు జంట అయిపోయారు. ఓ రోజు ఓ త్రికాల వేది వల్ల వారి వావివరుస తెలిసింది. అప్పుడా జంటలోని స్త్రీ, త్రికాల వేదికి శిష్యురాలై సన్యసించింది. ఆ జంటలోని పురుషుడు - దుర్గ కొడుకు, దుర్వ్యసనాలపాలై యవ్వన మదంలో ఎక్కడో తారసిల్లిన వేశ్యావాటికలో తల్లి అని తెలీక దుర్గతో సంగమించేసరికి ఆమెకో పిల్లవాడు జన్మించాడు. బయటపారవేసి - ఎప్పటిలాగే ఆమె ఆ బాలుడినీ వదిలించుకుంది. సన్యసించిన స్త్రీ ఆ బాలుడ్ని

చేరదీసి, త్రికాలవేది ప్రసాదించిన దివ్యదృష్టితో ఆ పిల్లవాడి చరిత్ర తెలుసుకుని, అతడికీ – తనకూ ఉన్న సంబంధాన్ని బట్టి ఆ బాలుడ్ని ముద్దు చేయసాగింది. అదే భోజరాజు కంటపడింది.

ఆ యోగిని పేరు కపర్ధి. సన్యసించినప్పటికీ విధివైచిత్రం వల్ల ఆ బాలుడు ఆమె చెంతకే చేరాడు. అందువల్లనే ఆమె చెప్పిన వరుసలన్నీ ఆ బాలునికీ – ఆమెకు వర్తిస్తాయి.

తన తల్లి అయిన దుర్గ కొడుకు గనుక – సోదరుడవుతాడు.

తన అన్నకు పుట్టినందున – మేనల్లుడవుతాడు.

తన భర్తకు భార్యగా వుండి సవతి అయినందున, సవతికొడుకు తనకీ కొడుకే గనుక, వాడికి కొడుకు కావడం వల్ల పౌత్రుడు.

తన భర్తకు తల్లి అయినా, తనకు తల్లి. అందువల్ల ఆ వరస రీత్యా దుర్గ తనకు అత్త గనుక, ఆమె మగనికి తమ్ముడు అయినందువల్ల – మాకు.

తన భర్తకు పుత్రుడు గనుక – తనకూ పుత్రుని వరుస.

తన తల్లి మగని తమ్ముడు కనుక – పినతండ్రి. మగని తమ్ముడు కావడం వల్ల మరిది వరుస

ఇంత కథనీ మూడుపాదాల్లో ఇమిడ్చి చెప్పిన కాళిదాసు కవిత్వం ప్రతిభ ఇలాంటిది అని చెప్పడానికి ఆ సహస్రముఖునికైనా శక్యం కాదు" అని పొగిడి భోజరాజు, ఆ మహాకవిని అందలమెక్కించి ఊరేగించాడు.

గోపాలా! భోజరాజు ఆ ప్రకారంగా కాళిదాసాది మహాకవులతో విద్యాగోష్ఠిలో కాలక్షేపం చేస్తూ, ఇంద్ర వైభవంతో చాలాకాలం రాజ్యం చేశాడు. ఈ ఉపాఖ్యానం వినడం ఇహపరసాధనం" అని మణిసిద్ధుడు చెప్పగా, శిష్యుడు అపరిమితానందం చెందుతూ - గురువుతో కలిసి తరువాతి మజిలీ చేరుకున్నాడు.

క. మంగళమగు గో బ్రాహ్మణ
పుంగవులకు సర్వసస్య పూర్ణంబైయొ
ప్పు గాత ధాత్రి ప్రజలు
పొంగుచు దనరారుదురు ప్రపూర్ణసుఖ ములన్





"తింటే గారెలే తినాలి
వింటే భారతమే వినాలి
ఇది పాత నానుడి

"చదివితే 'పురిపండా'
భారతమే చదవాలి
ఇది కొత్త న్యానుడి"

వ్యాస మహర్షి సంస్కృత భారతానికీ - కవిత్రయం వారి ఆంధ్ర భారతానికీ

# దీటైన తెలుగు వచన భారతం

వ్రాయగల్గడం యింతవరకు ఇంకొకరి వల్లకాలేదు.
అది కవి పండితశేఖర 'పురిపండా'కే సాధ్యం

మూల భారతాల్లోని సారాన్ని తన వచనంలోకి అద్భుతంగా తెచ్చి జటిలమైన కథా ఘట్టాల్ని సైతం - ద్రాక్షాపాకంలా పాఠకులకు అందించ గలిగిన శైలీ - శిల్పం శ్రీ పురిపండా అప్పలస్వామిగారి స్వంతం!

**అందుకే**

'శ్రీపురిపండా భారతం'గా నేటికీ సాహిత్య ప్రియుల నాల్కలపై అజరామరంగా ఈ విశిష్ట వచన రచన నిల్చిందనడం సత్యం!!

ముచ్చటైన ముద్రణం ★ అందమైన ముఖచిత్రంతో పదికాలాలపాటు భద్రంగా దాచుకోడానికి వీలుగా సగర్వంగా మీకు సమర్పిస్తున్నవారు

పబ్లిషింగ్ రంగంలో & ఆధ్యాత్మిక పుస్తక రంగంలో తొలి ISO సర్టిఫికేట్ అందుకున్న మా "గొల్లపూడి" సంస్థ

**ISO 9001 : 2015** Certificate No. Q9186414519



Scan this QR Code for APP



Bhakti PUSTAKALU

Download bhaktipustakalu App. for free From Play store 

Visit : www.bhaktipustakalu.in

పబ్లిషింగ్ రంగంలో తొలి తెలుగు భక్తి పుస్తకాలు యాప్ మీ చేతిలో




 like us : www.Facebook.com/bhaktipustakalu

 Follow us : www.twitter.com/bhaktipustakalu




Since 1926

# గొల్లపూడి వీరాస్వామి సన్

కోటగుమ్మం, రాజమహేంద్రవరం - 533 101. ☎ 0883 - 2465253

e-mail : gollapudibooks1920@gmail.com

మీ కరకమలాలను అలంకరించడానికి అతి త్వరలో మీకందుబాటులో

★ శ్రీ పురిపండా ★ వ్యవహారికాంధ్ర

# మహాభారతం

✣ మా వద్ద శ్రీ పురిపండా అప్పలస్వామిగారి వచన రచనలు- రామాయణం, భాగవతం, శ్రీదేవీభాగవతం కూడా లభించును.